శ్రీ

# మహాభారతము

## వచనము

## ఉద్యోగపర్వము



ఇది

శ్రీ మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రిగారిచే

వ్రాయబడి

శ్రీ జయంతి జగన్నాథశాస్త్రిగారిచే

సంస్కరింపఁబడినది



పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రీ.

1956

[వెల 8—0—0

# విషయసూచిక





# మహాభారతము

## వచనము

## ఉద్యోగపర్వము

ఓ దేవా! హరిహరనాథా! వైశంపాయన మునీంద్రుడు జనమేజయ మహారాజును జూచి యిట్లనెను. ఓ జనమేజయ మహారాజా! పాండవులు విరాటుని పట్టణమునందుండి అభిమన్యునకు వివాహము చేసిరి. నాలుగుదినములట్లు జరిగినపిమ్మట ధర్మరాజు తన సహోదరులను, పుత్రులను వెంటబెట్టుకొని వారిచే సేవింపబడుచు మనోహరమై విశాలముగా దనరారు విరాటుని సభాస్థానమునకు వచ్చెను. ఆ సభాస్థానమునందు విరాట, ద్రుపద, కృష్ణ, బలరామ, సాత్యకి, మొదలగువారును వారి సహోదర పుత్రులును వివాహమునకు వచ్చిన సకలరాజులును ధర్మరాజును సేవింపుచుండిరి. ఆ సభయందుండు రాజులు అనేక విధములుగా కృష్ణధర్మరాజులతో మాటలాడుచుండిరి. అప్పుడు పాండవులకు మేలుకోరు కృష్ణుడు రాజుల సంభాషణములను నివారణజేసి ఆ రాజులనందరిని కలియ జూచి యిట్లనెను.

రాజులారా! మాయాజూదమునందు పాండవులు శకునిచేత రాజ్యమును పోగొట్టుకొనిరి. పాండవులు సమర్థులైయుండియు సత్యవ్రతమును ధరించి కోపించుకొనక యేర్పాటుప్రకారము వనవాస అజ్ఞాతవాసములను జరిపిరి. పాండవులు సత్యముచేత పదమూడు సంవత్సరములవరకు వనవాసఅజ్ఞాతవాసములనుజరుపుట గొప్ప కార్యమే గదా! అయ్యో! పాండవులు తలచిన ప్రకారము పన్నెండు సంవత్స

రముల పర్యంతము ఘోరారణ్యములయందుండి క్రూరమృగ రాక్షస సమూహములతో కలసి బ్రతికిరి. పిమ్మట మిక్కిలి దుస్తరమైన యీ పదమూడవ సంవత్సరమందు అజ్ఞాతవాసమును జరిపిరి. ఈ పదమూడవ సంవత్సరమును గడపుట మిక్కిలి అసాధ్యకార్యము. తమను పరులు యెరుగకుండ నుండవలయును. ఇట్లు ప్రవర్తించుట కడుంగడు అసాధ్యము. ఈ అజ్ఞాతవాస కాలమునందు యెన్ని ఆపదలు కలిగినను వాని నన్నిటిని సహించియుండుట మిక్కిలి కష్టము. మీరందరును ధర్మరాజు యొక్క గౌరవ ప్రవర్తనలను యెరిగియే యున్నారు. గనుక ఆ దుర్యోధనాది కౌరవులకును యీ పాండవులకును మేలుకలుగునట్లుగా మీరందరు ధర్మమార్గమును యోచించి చెప్పవలయును. ధర్మమార్గమునకు విరుద్ధముగా ఆ దేవేంద్ర పదము లభించినను అందుకు ధర్మరాజు సమ్మతింపడు. ధర్మమార్గముచేత కొంచెము లభించినను ధర్మరాజు తృప్తిబొందును. గనుక పాండవుల పితృధనమగు రాజ్యమును మాయాజూదముచేత దుర్యోధనుడు అపహరించెను. ఆ రాజ్యమును యీ పాండవులు దిగ్విజయముచేసి అభివృద్ధి స్థిరత్వములను కలిగించుకొనిరి. ధర్మరాజుయొక్క మహానుభావత్వమునుతలచక దుర్యోధనాదులు ధర్మరాజును అవమానించిరి. ధర్మరాజు మిక్కిలి అవమాన కష్టదుఃఖములను పొందియు దుర్యోధనాదులకు కీడుకలిగించుటకు సమ్మతింపడు. ఈ విషయమును మీరందరును యెరిగియే యున్నారు. ఈ రెండుపక్షముల వారును రాజ్యమును పంచుకొని అనుభవించుటకు యోగ్యులగుదురు. ఈ విషయమును మీరు యోచించి తగినధర్మమార్గమును జెప్పుటకు మీరందరు అర్హులగుదురు. అయినను నాకు తెలిసినంత చెప్పెదను వినుడు.

రాజులారా! యీ పాండవులు వనవాస అజ్ఞాతవాసములను జరిపి యిప్పుడు కోపముచేత తమ భుజాబలమును చూపదలచి

యున్నారు. పాండవుల తలంపును దుర్యోధనుడు యెరిగినయెడల పాండవులకు సైన్యసహాయములు కొంచెముగా నున్నవని తలచి తన స్నేహితులగు రాజులను చేర్చుకొని యుద్ధమునకు వచ్చును. ఎంత బలవంతులైనను సహాయములేక మితిలేని శత్రుసైన్యములను గెలుచుట నిక్కిలి అసాధ్యము. గనుక పాండవపక్షముగానుండు రాజులందరును యిక్కడ పాండవపక్షముగా సైన్యములను చేర్చగలరు. పిమ్మట రెండుపక్షములవారును దేవరాక్షసులవలె యుద్ధముచేసి ఆ ఘోరయుద్ధమందు చత్తురు. ఈ ప్రకారముగా ఘోరయుద్ధముచేసి రాజ్యమును తీసికొనవలయును. ఇక్కడ పాండవులు చేయదగిన కార్యము యిదియేనని నాకు తోచుచున్నది. దుర్యోధనాదుల చిత్తవృత్తు లెటువంటివో మనము యెరుగలేము. పరులతలంపును యెరుగక యీకార్యమును యిట్లుచేయవలెనని నిశ్చయింపరాదు. గనుక యీకాలమునకు తగిన మనుష్యుని ఆ దుర్యోధనాదులదగ్గరకు పంపించవలయును. దుర్యోధనుడు యీపాండవులకు రాజ్యభాగమును పంచి యిచ్చినయెడల రెండుపక్షములవారికిని మేలగును. దుర్యోధనుడు యీ పాండవులకు రాజ్యభాగమును పంచియివ్వనియెడల అప్పటికి తగిన పనిని నూచుకొందము. అని కృష్ణదేవుడు సభయందుగల రాజులతో చెప్పెను. ఆమాటలను బలరాముడు సమ్మతించి సకల రాజులను కలయజూచి యిట్లనెను. రాజులారా! యిప్పుడు కృష్ణుడు చెప్పినమాటను వింటిరికదా! కృష్ణునిమాట రెండుపక్షములవారికిని మేలు కలిగించును పరమధర్మయుక్తముగా నున్నది. కృష్ణుడు చెప్పినప్రకారము చేయించి పాండవుల యుద్ధప్రయత్నము మాన్పుటను మనకు సాధ్యముగాదు. పాండవులు తమ సగము రాజ్యమును జూదమందు పోగొట్టుకొని మరల యిప్పుడు రాజ్యమును గోరుచున్నారు. దుర్యోధనుడు వీరిరాజ్యమును వీరికిచ్చి తన సగము

రాజ్యమును తాను అనుభవించినయెడల యుక్తముగా నుండును. అట్లు దుర్యోధనుడు చేసినయెడల అపాయము లేకయుండును. అట్లు రాజ్యము పంచియిచ్చినయెడల పాండవులును ఆ దుర్యోధనునితో బంధుభావము గలిగియుందురు. అందుచేత సకలజనులకును సౌఖ్యము కలుగును. గనుక యీకార్యమునకు ఆలస్యముచేయక తగినమనుష్యు నొకని యిప్పుడే దుర్యోధనుని దగ్గరకు పంపవలయును. అట్లు వెళ్ళు మనుష్యుడు కార్యము సాధించునప్పుడు మాటలపొందు యెరిగి దుర్యోధనుని చిత్తవృత్తికి అనుకూలముగా మాటలాడవలయును. వినయపూర్వకముగా దుర్యోధనుని ప్రార్థించి పాండవులకు రాజ్య భాగమునిమ్మని యడగవలయును. అట్లుగానియెడల కార్యమను కూలింపదు. అది యెట్లనగా చెప్పెదనువినుడు. ధర్మరాజు ఆదుర్యో ధనునకు భయపడుచు ప్రవర్తించుచుండియు, దుర్యోధనునితో జూదమాడి మోసపోయి చిక్కుపడెను. దుర్యోధనునకు జూదవిద్యయందు నేర్పరితనము లేనందున బంధుజనులందరును జూదమాడవద్దని దుర్యో ధనుని వారించిరి. అంతట దుర్యోధనుడు మానుకొని ధర్మరాజుతో జూదమాడుటకు శకునిని నియమించెను. శకుని జూదవిద్యయందు సమర్థుడగుటవలన ధర్మరాజు ఒడ్డినపందెముల నన్నిటిని గెలుచుచు వచ్చెను. అందుచేత దుర్యోధనుని యందును దోషములేదు. ఈ ప్రకారముగా దుర్యోధనాదులు అధర్మపరులు గానందున వారలను నిందింపరాదు. ఆకారణమువలన పాండవులు పంపెడి మనుష్యుడు దుర్యోధనుని వినయపూర్వకముగా ప్రార్థించి యీకార్యమును అను కూలింపజేసికొని రావలయును. అని బలరాముడు సభయందు గల సకలరాజులతో చెప్పెను.

## సాత్యకి దుర్యోధనునికడకు దూతనుపంపగూడదని చెప్పుట

బలరాముని మాటలకు సాత్యకి కోపించుకొని అందరు వినునట్లుగా బలరామునితో యిట్లనెను. బలరామా! నీవిట్టుచెప్పరాదు.

ఇట్లుచెప్పుట నీకేతగును. నిన్ను నే నేమనవచ్చును? అట్లుచెప్పుట ధర్మమని నీవు పూనుకొని చెప్పుచుండగా నీమాటలను వినుచు ఆదరించెడి యీ రాజులందరును దూషించవలయునుగాని నిన్ను దూషింపరాదు. ధర్మరాజు వేడుకకలవాడై జూదమాడెనేమో చెప్పుము. దుర్యోధనాదులందరును సభలోగూర్చుండి ధర్మరాజును పిలిపించి బలాత్కారముగా ధర్మరాజుచేత జూదమాడించిరి. ఆ జూదమందు కపటముచేత ధర్మరాజును వోడించి జయమును పొందిరి. ఇది ధర్మమగునేమో చెప్పుము. ఈ ధర్మరాజుయందు దోషముకలదని సభయందు జెప్పినవాడు యెంతటివాడైనను సరియే గౌరవమును దక్కించుకొని పోజాలడు. ఈ ధర్మరాజువంటి ధర్మాత్ములు యింకనెవరు గలరో తెలియకున్నది. ముఖ్యముగా నితడు ధర్మాత్ముడు. పాండవులు తాముచెప్పిన ప్రకారము పదమూడు సంవత్సరములు అరణ్యవాసము అజ్ఞాతవాసముకూడ క్రమముగా జరిపిరి. ఇప్పుడు తమ పితృధనమైన రాజ్యమును పొందుటకు తమభుజాబల శౌర్యములను జూపదలచియున్నారు. ఇటువంటి పాండవులు యితరుని వేడుటకు పోజాలరు. శత్రువులను సాధువులను మెచ్చరు. గాన యీ పాండవులు సాధుభావముతో దుర్యోధనుని ప్రార్థించినను దుర్యోధనుడు వీరలను మెచ్చుకొనడు. ఇదిగాక యుద్ధమందు జయలక్ష్మిని పొందుటకంటె అధికమగు రాజధర్మము మరియొకటి కనబడలేదు. ఆకుత్సితుడగు దుర్యోధనుడు తగినమాటలవలన చక్కబడనియెడల నాక్రూరబాణములచేత ఆ దుర్యోధనుని సమ్మతింపజేసి పాండవులకు రాజ్యభాగమును పంచి యిప్పించెను. యుద్ధమందు భీమార్జునుల యెదుట దేవతలైనను నిలువజాలరు. ఈ భీమార్జునులును నేనును సైన్యములను చేర్చుకొని యుద్ధమునకు నడచినయెడల సమ్ముఖులను యెదిరించిన దేవరాజులైనను బ్రతికిపోజాలడు. నకులసహదేవులును అభిమ

న్యుడు మొదలగు కుమారులును ద్రుపదుడు మొదలగు పాంచాలు రును యాదవులును వీరందరును యుద్ధమునకు వచ్చినయెడల దుర్యో ధనాదులను నూరుగురను ఒక్కసారే చంపగలరు. ఈ విరాటరాజు మాకుసహాయుడైయుండగా మాకసాధ్యముకాని కార్యములేదు. ఈవిరాటరాజు సామదానభేద దండోపాయములను తెలిసినవాడు. మహాభయంకర భుజాబలవంతుడు. గనుక యీవిరాటరాజు సామా న్యరాజమాత్రుడుగాడు. యుద్ధముచేయుటయే శ్రేష్ఠమని నాకుతోచు యున్నది. యుద్ధముచేయుటయే మంచిది. ఈలోపల శాంతివాక్యము లను చెప్పుటకు ఆ దుర్యోధనుని దగ్గరకు మనుష్యుని పంపించుపద్ధతిని ఆమనుష్యుడు దూతగావెళ్ళి దైన్యభావమునువిడిచి దుర్యోధనునితో మాటాడవలయును. పాండురాజుయొక్క రాజ్యభాగమును తీసికొను టకు ధర్మరాజు అపేక్షించి యున్నాడని దుర్యోధనునితో ఆదూత చెప్పవలయును. అట్లుచెప్పగా దుర్యోధనుడు న్యాయవిధిప్రకారము రాజ్యభాగమును ధర్మరాజునకు పంచిపెట్టినయెడల తీసికొందము. దుర్యోధనుడు జర్యాభాగమును పంచిపెట్టక విరుద్ధముగా మాటలా డినయెడల ఆఫలమునుయుద్ధమందు దుర్యోధనుడు అనుభవింపగలడు. అని యిట్లు రాజులందరును వినుచుండగా సాత్యకి బలరాముని ఆక్షే పించుచు చెప్పెను. ఆమాటలను ద్రుపదరాజువిని సభయందు రాజు లతో యిట్లనెను.

రాజులారా! సాత్యకి చెప్పినమాటలు ధర్మయుక్తములుగా నున్నవి. బలరాముడు చెప్పినమాట సరికాదు. దుర్యోధనుడు బలప రాక్రమ సంపన్నుడు. దుర్మార్గుడు. అటువంటి దుర్యోధనుడు మంచి మాటలచేత రాజ్యభాగమును పంచిపెట్టుటకు సమ్మతింపడు. ఇది సిద్ధము. యుద్ధమువలన దుర్యోధనుడు చక్కబడునేగాని ప్రియవాక్య ములచేత చక్కబడడు. అని ద్రుపదరాజుసభలోగల రాజులందరి

తోను చెప్పి మరల యిట్లనెను. రాజులారా! మృదువాక్యములచేత దుర్జనుని మనస్సు మెత్తపడజాలదు. అదిగాక దుర్జనునకు మృదువాక్యములను చెప్పినయెడల యెగతాళి చేయుచు దురభిమానముచేత దుర్జనునకు మదముఅధికమగును. భీష్మద్రోణు లిద్దరును పొట్టకూటికి ఆశపడి దుర్యోధనుని దూషింపక అనుసరించియున్నారు. ధృతరాష్ట్రుడును దుర్యోధనునియందుగల పుత్రస్నేహముచేత దుర్యోధనుని దూషింపకున్నాడు. కర్ణుడు మొదలగు తులువలందరును దుర్యోధనుని బుద్ధిమంతునిగా పొగడుకొందురు. గనుక ఆ దుర్యోధనుడు చెడుబుద్ధి గలిగియున్నాడు. సర్వవిధములచేతను యుద్ధముజరుగగలదు. ఈ సమయమందు మనము బలములను చేర్చుకుని యుద్ధసహాయమునకు పిలువదగిన రాజులనుపిలిపించి యుద్ధసన్నద్ధులమై యుండవలయును. దుర్యోధనుడును సహాయమునకు ఆశపడి రాజులనుపిలిపించును. యోగ్యులగురాజులు మొదటపిలిచినవారికే సహాయముచేయుటకు ప్రయత్నింతురు. ఇప్పుడు మనము వేగముగా నడచుజనులను పంపించి, శల్య, కేకయ, మాగధ, సహదేవ ధృష్టకేతు మొదలగు రాజులకును వారివారి బంధుమిత్ర జనులకును యెరిగించి సహాయమును కోరవలయును. ఇట్లుచేయుట మంచిదిగా తోచుచున్నది. అని ద్రుపదుడు సభయందుండు రాజులతో చెప్పి తనప్రక్కయందు తగినపీఠమందు కూర్చుండియున్న బ్రాహ్మణోత్తమునిజూపి మరల యిట్లనెను.

రాజులారా! యీ బ్రాహ్మణోత్తముడు నాకు ముఖ్యపురోహితుడు. ఈ బ్రాహ్మణునకు సకల విషయములను విపులముగా బోధించి ధృతరాష్ట్రుని దగ్గరకు బంపుడు. ఆ ధృతరాష్ట్రుని దగ్గర మాటలాడుటకు దగిన చాతుర్య వాక్య పద్ధతినంతయు యీ బ్రాహ్మణునకు నేర్పుడు. ధృతరాష్ట్ర దుర్యోధన భీష్మ ద్రోణులవద్ద క్రమముగా యే యే ప్రకారముగా సంభాషింపవలెనో ఆయా సంభాషణ

క్రమములన్నిటిని యీ బ్రాహ్మణునకు నేర్పి పంపుడు. అట్లు పంపిన యెడల బ్రాహ్మణుడు తగిన నీతిప్రకారము మాటలాడి రెండుపక్షములవారికిని స్నేహము, సంధియు కలుగునట్లు చేయును. అని ద్రుపదుడు సభయందుండు రాజులతో చెప్పెను. ఆ ద్రుపదుని మాటలను కృష్ణుడు విని సభయందుండు రాజులతో యిట్లనెను.

రాజులారా! ద్రుపదరాజు చెప్పిన మాటలు బాగుగానున్నవి. ఈ ద్రుపదరాజు చెప్పినట్లే చేయవలయును. కౌరవులును పాండవులును నాకు ఒక్కరూపమే యగును. అందుచేత ఆ కౌరవులును యీ పాండవులును తమతమ రాజ్యభాగములను అనుభవింపుచు స్నేహము గలిగియుండవలెనని జూచుచున్నాను. వివాహనిమిత్తమై పిలిపించగా యిక్కడికి ప్రీతిపూర్వకముగా వచ్చితిమి. ఇన్నిదినముల పర్యంతము వుల్లాసముగా వేడుకలను జూచితిమి. ఇక నిక్కడ ఆలస్యము చేయరాదు. మా పట్టణమగు ద్వారకకు మేము వెళ్ళిరావలయును. అని యిట్లు కృష్ణుడు సభయందుండు విరాటుడు మొదలగు రాజులతో చెప్పి ద్రుపదుని జూచి యిట్లనెను.

ద్రుపదమహారాజుగారూ! మీరు మాకందరికిని గురుస్థానము. మీ మాటలు అని చెప్పినయెడల మీ మాటలను ధృతరాష్ట్రుడు బహుమానించును. మిమ్మును భీష్ముడు పొగడును. ద్రోణాచార్య కృపాచార్యాదులు మీయందు స్నేహమును కోరియుందురు. అందుచేత పాండవ కార్యార్థమై ధృతరాష్ట్రుని దగ్గరకు ఒక మనుష్యుని మీరే పంపవలయును. ఆ భారము మీదియగును. మీమాట అందరికిని సమ్మతము. మీ మాటను అతిక్రమించినవారు చెడిపోవుదురు. మీరు ధృతరాష్ట్రుని దగ్గిరకు సంధినిమిత్తమై మనుష్యుని పంపగా, సంధిగలిగినయెడల మేలేయగును. సంధికలుగక జరిగెడి పక్షమున రాజుల నందరను యుద్ధమునకు సహాయముగా మీరే పిలిపింపుడు.

పిమ్మట మమ్ములను పిలిపింపుడు. మీ ఆజ్ఞప్రకారము దుర్యోధనుడు పాండవులకు రాజ్యభాగమును పంచి యివ్వనియెడల అర్జునుని కోపాగ్ని హోత్రము ఆకౌరవులను దహించగలదు. అని కృష్ణుడు ద్రుపదరాజుతో జెప్పి ద్వారకకు వెళ్ళుటకు ప్రయత్నించెను. అప్పుడు ద్రుపద ధర్మరాజ భీమార్జున నకుల సహదేవ విరాటరాజులుకృష్ణుని వెంబడి నడచుచు కృష్ణుని పంపించిరి. బలరాము సాత్యకి మొదలగు యాదవు లందరును తనతో వచ్చుచుండగా కృష్ణదేవుడు పరమ సంతోష మహావిభవములతో ద్వారకాపట్టణమునకు వెళ్ళెను. ఆ అభిమన్యుని వివాహ మహోత్సవమునకు వచ్చిన తక్కిన రాజు లందరును యుద్ధసన్నాహములను చేసెడి నిమిత్తమై తమతమ పట్టణములకు వెళ్ళిరి. అటుపిమ్మట పాండవులు యుద్ధవిషయములైన ప్రయత్నములను చేయుచుండిరి. విరాటరాజు యుద్ధముచేయుటయందు ప్రయత్నముగలవాడై వుత్సాహముగలిగి యుండెను. ద్రుపదరాజు సకల యుద్ధప్రయత్నములను చేసి సిద్ధముగా నుండెను. ద్రుపదుడు మొదలగు పాండవ పక్షపు రాజులందరును యుద్ధసన్నద్ధులై బయలుదేరి వుపప్లావ్య పట్టణమునకువచ్చి సేనాసమూహములను నిలిపిరి. అట్లు వచ్చిన పాండవపక్షపు ద్రుపదుడు మొదలగు రాజులందరును తమ స్నేహితులగు రాజులదగ్గిరకు తగిన దూతలను పంపించిరి. ఈ పాండవుల యుద్ధప్రయత్న మంతయు దుర్యోధనుడు విని తన మిత్రులగు రాజులందరిని పిలిపించి హస్తినాపట్టణమునకు రప్పించెను. ఆరాజులు నానాదేశములనుంచి చతురంగసైన్యములతో వచ్చుచుండగా భూమి అదరుచుండెను. ఆ సైన్యములయందుగల గుర్రములను యేనుగులను రథములను భటులను జూడగా లోకభయంకరముగా నుండెను. ఈ ప్రకారముగా నాలుగు దిక్కులయందుండు నానాదేశపు రాజులు సైన్యసమేతముగా వచ్చి హస్తినాపట్టణమందును వుపప్లావ్య పట్టణ

మందును దిగిరి. (దుర్యోధనుని పక్షపురాజులు హస్తినాపట్టణ మం దును, ధర్మరాజు పక్షపు రాజులు వుపప్లావ్య పట్టణమందును దిగిరని తెలియవలెను) పిమ్మట ద్రుపదరాజు ధర్మరాజుయొక్క అనుమతిని పొంది తన పురోహితుని దుర్యోధనుని దగ్గరకు పంపదలచి పురోహి తుని రప్పించి యిట్లనెను.

## ద్రుపదుడు తన పురోహితుని దుర్యోధనుని వద్దకు దూతగా పంపుట

ఓ బ్రాహ్మణోత్తమా! నీవు వయస్సుచేతను జ్ఞానముచేతను పెద్దవాడవు. నాకు హితుడవు. గొప్ప బుద్ధిమంతుడవు. చాతుర్య ముగా మాటలాడుటయందు సమర్థుడవు. సమయమును తెలిసిన వాడవు. గొప్ప వంశస్థుడవు పరుల అభిప్రాయమును యెరుగుదువు. పుణ్యాత్ముడవు. నాకు స్నేహితుడవు. గనుక నేను చేయదగిన కార్య మును నీవు చేయగలవు. నీవు సర్వవిధములచేతను పాండవుల కార్య ముకొరకు ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళవలయును. అట్లు వెళ్ళి నీ నేర్పరితనముచేత ఆ కౌరవులకును యీ పాండవులకును సంధికలి గించి కార్యానుకూలము చేసి రావలయును. అని ద్రుపదుడు తన పురోహితునితో చెప్పి పురోహితుని సమ్మతింపజేసి యిట్లనెను.

బ్రాహ్మణశ్రేష్ఠుడా! ఆధృతరాష్ట్రరాజు కుటిలుడు. లంచ పోతు. తన కొడుకగు దుర్యోధనునకు గల వెర్రిని అవలంబించి దుర్యోధనుని యిష్టప్రకారము ప్రవర్తింపుచుండును. ఆదుర్యోధనుని చెడుబుద్ధి యంతయు యెరుగుదువుగదా! ధర్మరాజుయొక్క సత్య ప్రవర్తనమంతయు నీవు యెరిగియేయున్నావు. ఆ విషయము నట్లుండ నిమ్ము. నీవు పాండవుల రాజ్యభాగమును అడుగబోయి నప్పుడు ధర్మయుక్తములైన తగినమాటలను ధృతరాష్ట్రునితో చెప్పుము.

అట్లు చెప్పగా ఆ ధృతరాష్ట్రుని దగ్గరనుండు వారి మనస్సులు తిరుగబడును. భీష్మద్రోణుల మనస్సులు యుద్ధమునకు సమ్మతింపవు. దుర్యోధనుడు తొందరపడుచు భీష్మ ద్రోణులను యుద్ధమునకు పురి కొల్పుచుండును. నీవు వెళ్ళి మంచి మాటలను చెప్పగా కౌరవబలము లన్నియు యుద్ధప్రయత్నములను చాలించును.

నీవు ఆధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళి సంధివాక్యములను చెప్పి నప్పుడు పాండవులు పడిన కష్టములనన్నిటిని అక్కడి బంధువుల కందరికిని చెప్పుము. పండిత వృద్ధసజ్జనుల దగ్గరకు పోవుచు పాండవు లకు రాజ్యభాగము నియ్యకుండుట కులోచితముగాదని చెప్పుము. ప్రియవాక్యములచేత తక్కినవారి నందరిని బోధించి సంధివలన తప్ప మరియొక విధముగా మేలుకలుగదని వారికందరికిని తోచునట్లు చేయుము. సకలజనుల మనస్సులకును ప్రియవాక్యములచేత బోధించి యిక్కడజరిగెడి విషయములను అన్నిటిని తగిన వుపాయముచేత యెట్లుచెప్పవలెనో ఆప్రకారమే అక్కడ చెప్పుము. ఇక్కడ విరాటుని సభయందు కృష్ణాదులు సంభాషించిన పద్ధతియంతయు మనమెరిగియే యున్నాము. సంభాషణలకు అనుకూలముగా నీవు అక్కడ హస్తినా పట్టణమందు ధృతరాష్ట్రాదులతో చెప్పి పాండవులకు తేజోలాభ మును కలుగ జేయుము. నీవు హస్తినా పట్టణమందు కొంతకాలము వరకుండి ధృతరాష్ట్ర భీష్మ ద్రోణ విదుర కృపాచార్యుల గృహము లకు వెళ్ళి ప్రతిదినము వారివారి చిత్తవృత్తులను తెలిసికొని ప్రవర్తిం పుము. దైవానుగ్రహమువలన నీవు చెప్పిన మాటలకు దుర్యో ధనుడు సమ్మతించినయెడల అదియే అందరికి సమ్మతము.

అట్లు సంధిగలిగినయెడల ధర్మరాజు సంతోషించును. కనుక నీవు హస్తినాపట్టణమునకు పాండవ కార్యార్థిగా వెళ్ళిరమ్ము. అని ద్రుపదరాజు తన పురోహితునితో చెప్పెను. ఆ బ్రాహ్మణుడంతట

మొదట ద్రుపదుని అనుమతినిబొంది పిమ్మట ధర్మరాజ నకుల భీమార్జున సహదేవులతో చెప్పి వారి యనుమతినిబొంది సన్మానింపబడెను. అంతట వారందరు పంపగా ఆబ్రాహ్మణుడు ప్రీతిపూర్వకముగా హస్తినాపురమునకు వెళ్ళెను. ఇక నక్కడ దుర్యోధనుని సమాచారమును చెప్పెదను వినుము. ఆ దుర్యోధనుడు తనహితులగు సకలరాజులను యుద్ధసహాయముగా పిలుచుటకు ఆయాదేశములకు దూతలనుపంపించెను. కాని శ్రీకృష్ణునిదగ్గరకు సామాన్యరాజుదగ్గరవలె దూతను పంపరాదని తలంచెను. ఇట్లు దుర్యోధనుడు తలచి తానే కొంతపరిజనముతో ద్వారకాపట్టణమునందున్నకృష్ణుని దగ్గరకు వెళ్ళెను. అతిశీఘ్ర ప్రయాణములచేత కొన్నిదినములకు దుర్యోధనుడు ద్వారకాపట్టణము చేరెను. ఆదినముననే అర్జునుడు కృష్ణుని జూచునిమిత్తము ద్వారకకు వచ్చెను. ఆ సమయమున కృష్ణుడు పండుకొనియుండెను. దుర్యోధనుడు కృష్ణుని శిరస్సుగలవైపున యెత్తైన పీఠమందు కూర్చుండెను. అర్జునుడు తిన్నగావచ్చి కష్ణుని పాదములున్నవైపు నిలిచియుండి వినయపూర్వకముగా నుండెను. అంతట కృష్ణుడు మేల్కొని మొదట అర్జునుని జూచి పిమ్మట దుర్యోధనునిజూచెను. ఇట్లు కృష్ణుడు అర్జున దుర్యోధనులను జూచి వారిద్దరియందును గొప్పబుద్ధిగలవాడై అనుగ్రహము గలవానివలె కనబడెను. కృష్ణుడు అర్జున దుర్యోధనులను కలయజూచి మీరిక్కడకు వచ్చినకార్యమేమో చెప్పుడని యడిగెను. అప్పుడు దుర్యోధనుడు కృష్ణునితో నిట్లనియెను. కృష్ణా! నేను పాండవులతో యుద్ధముచేయదలచి నీసహాయముగోరి యిప్పుడు నీదగ్గరకు వచ్చితిని. మేము యీపాండవులును బంధుసంబంధమువలన నీకుసమానులమే యగుదుము. నిన్నుజూచుటకు మొదట నేను వచ్చితిని సత్పురుషులగువారు మొదటజూచినవారిని గ్రహింతురు. నీవును సత్పురుష

శ్రేష్ఠుడవు. గనుక నీవు లోకధర్మమును విచారించి నాకు సహాయము కావలయును. అని యిట్లు దుర్యోధనుడు కృష్ణునితో చెప్పగా కృష్ణు డిట్లనెను. దుర్యోధనా! నీవు నన్ను జూచుటకు యిక్కడికి ముందు వచ్చినది నిశ్చయమేయగును. కాని నేను మొదట అర్జునుని జూచి తిని గనుక గౌరవపూర్వకముగా నేను మీ యిద్దరికిని సహాయము చేసెదను. రెండు విధములైన సహాయములను సరిగా యేర్పరచెదను. ఆ రెండు విధములలో మీయిద్దరును మీకు యిష్టములైన సహాయము లను కోరుకొనుడు. ఆ రెండు విధములైన సహాయములను చెప్పెదను వినుము. నారాయణ గోపాలురను పదివేలమంది యుద్ధశూరులు గలరు. ఆపదివేలమంది నాతో సమానులగుదురు. యుద్ధములయందు మహాభయంకర శూరులు. భుజాబల శౌర్యవంతులు. ధనుర్విద్యాది యుద్ధవిద్యలయందు పండితులు. అటువంటి నారాయణ గోపాలుర పదివేలమంది యుద్ధసంధొక పక్షమందుందురు. నే నొక్కడనే యుద్ధముచేయక నిరాయుధుడనై మరియొక పక్షమందు పరమాప్తు డనై యుండెదను. ఈ రెండువిధములైన సహాయములలో మీ యిద్దరికి యేయేసహాయము యిష్టమో చెప్పికోరుకొనుచు బాలుడగువాడు మొదట కోరుకొనవలయును. గనుక నీకంటె అర్జునుడు చిన్నవాడు అందుచేత మొదట అర్జునుడు కోరుకొనుట ధర్మము.

## అర్జునుడు శ్రీకృష్ణుని దనకుసహాయునిగా గోరుట

అని కృష్ణుడు దుర్యోధనునితో చెప్పి అర్జుననిజూచి యిట్లు పలికెను. అర్జునా! నీవు దుర్యోధనునకంటె చిన్నవాడవు, గనుక యీ చెప్పిన రెండు సహాయములలో నీకిష్టమైన సహాయమును కోరుము. అని కృష్ణుడు అర్జునునితో చెప్పెను. అర్జునుడు పరమ సంతోషముగలవాడై కృష్ణునసహాయముగాగోరెను. అందుకు దుర్యో

ధనుడు సంతోషముచేతవుప్పొంగి నారాయణగోపాలురను తానపహ
రించినవాని వలె తలంచెను. అట్లుతలచి ఆనారాయణ గోపాలురను
దుర్యోధనుడు తీసికొని ప్రీతిపూర్వకముగా బలరాముని గృహమును
జేరెను. అచ్చట బలరామునిచేత సన్మానింపబడి యుద్ధసహాయమును
కోరకు వచ్చితినని చెప్పెను. అట్లుచెప్పగా బలరాముడు దుర్యోధను
నితో యిట్లనెను. దుర్యోధనా! అభిమన్యుని వివాహమునకు అనేక
రాజులు విరాటుని పట్టణమునకువచ్చిరి. ఆసభయందు నీపక్షముగా
నేను మాటలాడితిని. నేను మాటలాడిన విధము హస్తినాపురమునను
తెలిసియేయుండును. విరాటుని సభయందు నీపక్షమును నేను మాట
లాడినందుకు ఆసభయందు కొందరు అసహ్యపడి పాండవపక్షపాత
ముచే నామాటలకు ప్రతికూలముగా పలికిరి. ఆపాండవపక్షపాత
వాక్యములు కృష్ణునకు ప్రియములై యుండెను. అందుచేత అప్పుడు
నేను మరల సరసముగా మాటలాడకుంటిని. మరియు ఆ కృష్ణుని
విడిచి కొంచెము సేపైనను నేను నిలువజాలను. ఆకారణముచేత నే
నావిరాటుని సభయందు సరసముగా మాటలాడలేదు. అప్పటినుండి
నేనొక నిశ్చయమును చేసికొనియున్నాను. నానిశ్చయమును చెప్పె
దను వినుము. మీరును పాండవులును మీమీ బలపరాక్రమముల
చేత యుద్ధములు చేయునప్పుడు మీలో యెవ్వరెవ్వరెట్లు పోయినను
నేనూరకుండెదను. నేనెవ్వరికిని సహాయముచేయను. ఈమాటసత్యము
అని బలరాముడు దుర్యోధనునితో చెప్పెను. అందుకు దుర్యోధనుడు
సమ్మతించి వినయపూర్వకముగా బలరాముని అనుమతిబొంది కృష్ణుని
పంపించి కృతవర్మదగ్గరకు వెళ్ళెను. అప్పుడు కృతవర్మ ఒక అక్షౌ
హిణీ సైన్యముతోవచ్చి నీకు సహాయమయ్యెదనని దుర్యోధనునితో
చెప్పెను. అందుకు దుర్యోధనుడు సంతోషించి తన హస్తినాపురము
నకు వెళ్లెను. అటుపిమ్మట అర్జునునకు కృష్ణుడు యిట్లనెను. అర్జునా!

మహాపరాక్రమ వంతులగు పదివేలమంది నారాయణ గోపాలురను దుర్యోధనుడు తీసికొనిపోయెను. యుద్ధముచేయబూనని నన్ను నీవు కోరుకొంటివి. ఇందుచేత నీకు మేలగునా అని యిట్లు కృష్ణుడు అర్జునునితో చెప్పగా అర్జును డిట్లనెను.

మహాత్మా! కృష్ణా! నేను యుద్ధమందు సహాయముకోరను. నీవు సర్వలోక ప్రసిద్ధ పరాక్రమ శౌర్యవంతుడవు. నీవు యుద్ధము చేసినయెడల కీర్తి నీకేకలుగును. మరియు నీవు శత్రు పక్షమందుం డినయెడల జయమును పొందుటకు శక్యముగాదు. అందుచేత విజయ మూలకమైన నీ సహాయము కావలయును. నీవు యుద్ధము చేయ కుండుట నాకు మిగుల యిష్టముగనుక నిన్ను నేను కోరియుంటిని. అని అర్జునుడు కృష్ణునితో చెప్పి మహాత్మా! కృష్ణదేవా! నీవు నాయం దపారమైన కృపజూపి నాకు సారధ్యము చేయుము. నేను బహుకాల మునుండి నీ సారధ్యమును కోరియున్నాను. గాన నాకు సారధ్యము చేయున ట్లనుగ్రహింపుము. అని అర్జునుడు కృష్ణునితో చెప్పి వేడు కొనగా కృష్ణుడిట్లనెను. అర్జునా! నీ కోరికను తీర్చుటయే నాకు సువ్రతము. గనుక నేను నీకు భారతయుద్ధమందు సారధ్యము చేసె దను. అని కృష్ణుడు అర్జునునకు సంతోషము కలుగునట్లుగా చెప్పి అర్జునుని వెంటపెట్టుకొని కార్యాలోచనము జేయుటకొరకు వుపప్లావ్య పట్టణమందుండు ధర్మరాజు దగ్గరకు వచ్చెను.

అంతట శల్యునిదగ్గరకు పోయిన పాండవపక్షపు దూతలు శల్యునిజూచి తగినమాటలచేత యుద్ధసహాయమునుగోరి పిలిచిరి. అందుకు శల్యుడు సంతోషించి పుత్రమిత్ర సమేతముగా అనేక సైన్య సంకులములతో సర్వదా ప్రయాణములచేత ధర్మరాజుదగ్గరకు వచ్చు చుండెను. ఆ సమయమున యీ వృత్తాంతమంతయు దుర్యోధనుడు విని సమర్థులగు ఆప్తజనులను ఆక్షణమందే పంపించి శల్యుడు వెళ్ళుమార్గ

మందు అక్కడక్కడ మహావిభవముతో పందిళ్ళు వేయించెను. ఆ పందిళ్ళయందు మంచి విచిత్రములైన చాందినిగుడ్డలచేత మనోహరమైన అలంకారము చేయబడి యుండెను. ఆ మార్గమందు స్థలవిశాలములుగల పెద్దబావులను త్రవ్వించెను. ఆ బావులయందు తియ్యని తెల్లని మనోహరములైన జలములుగలవు. ఏనుగులును, గుఱ్ఱములను నిలుపుటకు తగిన మంచికొట్టములను యేర్పరచిరి. ముందరివైపు బయలుగల మిక్కిలిచాతుర్యముగానుండు ఆ స్థానమంటపములను నిర్మించిరి. బియ్యము, నేయి, పెరుగు, కూరగాయలు, వంటకట్టెలు, గడ్డియు మొదలగునవి విశేషముగా చేర్చిరి. ఈరీతిగా శల్యుడు ఉపప్లావ్య పట్టణమందుండు ధర్మరాజు దగ్గరకు వెళ్ళుచుండగా ఆ మార్గమందు దుర్యోధనుడు యీ ముందుచెప్పిన ప్రకారము సకలసామగ్రులను సిద్ధము చేయించెను. పిమ్మట దుర్యోధనుడు మారువేషమును ధరించి యెవ్వరికి తెలియకుండునట్లుగా శల్యుని వెంబడి నడచివచ్చుచుండెను. ఆ విడిదిస్థలములయందు సకలవస్తు సౌఖ్యములను కలిగించినందుకు శల్యుడు సంతోషించి తనదగ్గరగల పరిచారకులతో యిట్లనెను.

పరిచారకులారా! ఇట్లు మనకు మార్గమందు కావలసిన సకలవస్తువులను సంపాదించి యుంచినవారు ధర్మరాజుయొక్క మంత్రులై యుందురు. మనకిట్టి సౌఖ్యములను చేకూర్చిన ధర్మరాజు మంత్రులెవ్వరో వారినిటకు తీసికొనిరండు. అనుగ్రహముతో వారిని చూడదగును. వారందుల కర్హులు. అని శల్యుడాపరిచారకులతో చెప్పెను. ఆ సమయమున దుర్యోధను డదివరకే శల్యునిపరిచారకులతో చేరి పనులు జేయుచుండెను. అప్పుడు శల్యునిమాటలను దుర్యోధనుడువిని శల్యునకు కనబడుటకు యిదిమంచిసమయమనితలచి తగిన ప్రకారము తనను శల్యునకు తెలిపికొనెను. అంతట శల్యుడు పరమసంతోష

చిత్తముగలవాడై గాఢముగా దుర్యోధనుని కౌగిలించుకొనెను. అంతట శల్యుడు బంగారుపీఠమందు దుర్యోధనుని కూర్చుండబెట్టుకొని యీ మహాత్ముడైన దుర్యోధనుని ప్రయత్నమువలన యీవస్తుసామగ్రియంతయు యేర్పడియుండవచ్చునని నిశ్చయించెను. అట్లు నిశ్చయించిన శల్యుడు వినయపూర్వకముగా దుర్యోధనునితో యిట్లనెను. దుర్యోధనమహారాజా! నీకిష్టమెద్దియో చెప్పినయెడల నీయిష్టమును నేను యిచ్చెదను. కోరుము అని యిట్లు శల్యుడనగగా ఆ మాటలకు దుర్యోధను డపరిమితానందమును బొంది యిట్లనెను.

మహాత్మా! శల్యుడా! నీవు సత్యవాక్యవంతుడ వగుదువు. నీచిత్తము సర్వదా సత్యమందు ప్రవర్తించుచుండును. నీవు వుదారమనస్సుగలవాడవు. నాకోరిక యేదియనగా చెప్పెదను వినుము. నీవు నాకు మంత్రివై నాసైన్యమును నడుపుము. ఆ పాండవులును కౌరవులను బాంధవరీతిచేత సమానులేయగుదురు. నీయందు నాకుగలభక్తి వలన నన్ను నీవానినిగా గ్రహించవలయును. అని దుర్యోధనుడు శల్యునితో చెప్పెను. దుర్యోధనుని మాటలకు శల్యుడు సమ్మతించి యిట్లనెను. దుర్యోధనా! నీవు చెప్పినప్రకారము మీయందును పాండవులయందును నాకుసమబుద్ధి కలిగియున్నదేగాని భేదబుద్ధిలేదు. మీరును పాండవులును నాకు సమానులే, గనుక నీవు చెప్పినమాట మంచిది. నీవు ముందుగావచ్చి ప్రీతిపూర్వకముగా నన్నుజూచినందున నీపక్షముగా నేను సహాయుడనయ్యెదను ఆవిషయమై కొరతలేదు. నీకు మరియొకకోరిక యున్నయెడల చెప్పుము. చెప్పినయెడల నేను పూనుకొని నీయిష్టమును ఫలింపజేసెదను. అని శల్యుడు దుర్యోధనునితో చెప్పెను. ఆ మాటలకు దుర్యోధను డుప్పొంగి యిట్లనెను. మహాత్ముడగు మామా! శల్యుడా! నీవునన్ను సన్మానించి నాకు మంత్రివైన విధముకంటె అధికమైన కోరిక మరియొకటిలేదు. అని దుర్యోధను డనగా శల్యుడు సప్రసన్నముఖము గలవాడై యిట్లనెను.

అల్లుడా ! దుర్యోధనా ! నీవికను నీ రాజధానియగు హస్తినాపురమునకు వెళ్ళుము. నేను వుపప్లావ్యమునకు వెళ్ళి పాండవులను జూచి అక్కడనుండి నేను హస్తినాపురమునకు వచ్చెదను. నేను అవశ్యముగా పాండవులను చూడవలయును. ఆ పాండవులనుజూచి అక్కడనుండి నేను హస్తినాపురమునకు సైన్యసమేతముగా వచ్చి నీతో కలిసెదను. అని శల్యుడు దుర్యోధనునితో చెప్పగా దుర్యోధను డిట్లనెను.

మామా ! శల్యుడా ! నీ యిష్టప్రకారము పాండవులనుజూచి శీఘ్రముగా మరలిరమ్ము. నాకు మీరు యిచ్చిన వరమును మరువకుండవలయును. మిమ్ములను ఆశ్రయించి నేను విజయమును పొందవలెనని కోరియున్నాను. గనుక మీరు కృపచేత నన్ను విచారించుచుండవలయును. అని దుర్యోధనుడు చెప్పగా వానిమాటలకు శల్యుడు నవ్వుచు దుర్యోధనుని కౌగిలించుకొని నీవు సంశయింపక వెళ్ళుమని చెప్పెను. అంతట దుర్యోధనుడు పరమసంతోషము గలవాడై హస్తినాపురమునకు వెళ్లెను. శల్యుడు ఉపప్లావ్యమునకు వెళ్ళి శిబిర ప్రదేశములను దాటి ధర్మరాజుయొక్క నివాసస్థలమునకు వెళ్లెను.

## శల్యుడు పాండవులను జూచుటకు ఉపప్లావ్యమునకు వచ్చుట

అప్పుడు ధర్మరాజ భీమార్జున నకుల సహదేవులును అభిమన్యుడు మొదలగువారి పుత్రులును ద్రౌపదీ సుభద్రలును ఆ శల్యునకు యెదురుగా వెళ్ళి సాగిలపడి నమస్కరించిరి. అంతట ధర్మరాజు మొదలగు వారందరును శల్యుని తీసికొనిపోయి బంగారు పీఠమందు కూర్చుండబెట్టి అర్ఘ్యపాద్యాది విధులచేత శల్యుని పూజించి కుశల మడిగిరి. శల్యుడు సర్వము కుశలమేనని వారితో చెప్పి వారినందరిని ఆదరించెను. శల్యుడు మరల ధర్మరాజును కౌగిలించుకొని యిట్లు అనెను.

అల్లుడా ! ధర్మరాజా ! జనశూన్యమైన వనములయందు నీవును, నీ తమ్ములును ద్రౌపదీ సహితముగా పన్నెండు సంవత్సరముల పర్యంతము వసించియుంటిరి. ఇట్టి వనవాసము సేయుట బహు దుష్కరము, ఆ వనవాసముకంటె అజ్ఞాతవాసముచేయుట గడుంగడు దుర్లభము. మీకుగల సత్యదయాది సుగుణములు మిమ్ములను కాపాడెను. నీ మనస్సునకు దుఃఖము కలిగినప్పుడు యీభూలోకమున గల సమస్త ప్రాణులకును దుఃఖము కలిగెను. ఇప్పుడు నీవు సమస్త కష్టములను తప్పించుకుని యీభూమియందుగల సకల ప్రాణులకును పరమానందము కలిగించితివి. అని యిట్లు తగు సంభాషణలచేత ధర్మరాజుతో సంభాషించి శల్యు డిట్లనెను.

ధర్మరాజా ! నేను యిక్కడికి వచ్చుచుండగా దుర్యోధనుడు సకల సామగ్రులను మార్గమందు నాకు సిద్ధముచేయించి సకలసౌఖ్యములను కలిగించెను. అంతట నాకు కనబడి దుర్యోధనుడు యుద్ధమునకు సహాయము చేయుమని నన్ను ప్రార్థించెను. అందుకు నేను సమ్మతించి సహాయము చేయుదునని దుర్యోధనునితో చెప్పితిని. అని శల్యుడు ధర్మరాజుతో చెప్పగా ధర్మరాజు యిట్లనెను.

మామా ! శల్యుడా ! ఒకనిని మెచ్చుకొని వాని కోరికను తీర్చుట పెద్దల గుణము. మీరా దుర్యోధనుని మెచ్చుకొని వాని కోరిక తీర్చి మేలుచేసితిరి. అందుకు నాచిత్తము సంతోషించెను. నేను ఒక్కవిషయమును వేడుకొనెదను. చిత్తగింపుము. కృష్ణుడు అర్జునునకు సారథ్యము చేయుటకు పూనియున్నాడు. సర్వదా కర్ణుడు అర్జునునియందు మాత్సర్యము కలిగియుండును. ఈ అర్జున కర్ణులకు యుద్ధము జరుగునప్పుడు కృష్ణునితో సమానముగా సారథ్యముచేయుటకు నీవే సమర్థుడ వగుదువు గాని మరియొకడు సమర్థుడుగాడు. గనుక మీరు అవశ్యముగా కర్ణునకు సారథ్యము చేయవలసివచ్చును.

మీరు యుద్ధకాలమందు కర్ణుని నిరాకరించి పలికి కర్ణుని చిత్తమునకు కలంకము కలిగించి అర్జునుని రక్షింపవలయును. ఈ కార్యము చేయ రాదని తలచక నా ప్రార్థనను అంగీకరించి సర్వవిధములచేతను నేను చెప్పినట్లు చేయవలెను. అని ధర్మరాజు శల్యునితో చెప్పి ప్రార్థింపగా నందుకు శల్యుడు సమ్మతించి ధర్మరాజుతో యిట్లనెను.

ధర్మరాజా! నీవు చెప్పినదంతయు నిశ్చయము. నేను కర్ణునకు సారథ్యము చేయుమని దుర్యోధనుడు నన్ను ప్రార్థించిన యెడల దుర్యోధనుని ప్రార్థనను నేను జరుపవలయును. నేను కర్ణునకు సారథి నైనను నిశ్చయముగా నేను కఠోరముగా కర్ణుని దూషించి వాని చిత్తమును చెదరునట్లు చేసి అర్జునుని రక్షించెదను. ఆకర్ణుని గర్వ తేజోత్సాహము లణగునట్లుగా నేను కర్ణుని దూషింపుచు కర్ణుని చిక్కుపరచెదను. నామాటలవలన కర్ణుడు చిక్కుపడి బాణములను వేయజాలకున్నప్పుడు అర్జునుడు క్రూరబాణములచేత కర్ణుని జంపగ గలడు. ఈవిషయము మాత్రమేగాక నీ మనస్సునందేమి కోరినను నీకోరినప్రకారము నేను చేసెదను. అయ్యో! పూర్వము ఆ సభ యందు కర్ణుడు నిర్దయుడై మాటలచేత మిమ్ముల నవమానించెను. అప్పుడు కర్ణుడాడిన మాటలకు మా మనస్సును నొచ్చుకొని నీ మన మందు చేరియున్నవి. అదిగాక మీరు పడిన ఆపదలను అందరి మన స్సులు బహుకష్టమును పొందినవి. ఇట్లు కష్టపడితినని నీవు మనస్సు నందు చింతింపకుము. నీకోరిక అవశ్యముగా ఫలింపగలదు. ఒక్కొక్క సమయమందు దేవతలకైనను ఆపదలు గలుగుచుండును. పూర్వమును దేవేంద్రుడు తన భార్యయగు శచీదేవి సహితముగా మిక్కిలి హీనస్థితిని పొందెను. దేవేంద్రుని సంపదకంటె మీ సంపద అధికము కాదు. విధివశము వలన కలిగిన ఫలములను తప్పించుకొనుటకు ఆ శివునకైనను సాధ్యముగాదు అని యిట్లు శల్యుడు ధర్మరాజుతో చెప్పగా ధర్మరాజు యిట్లనెను

మహాత్మా ! శల్యుడా! దేవేంద్రుడు తనభార్యయగు శచీదేవి సహితముగా యేకారణమువలన అట్టిహీనస్థితిని పొందెనో, ఆహీన స్థితి యెటువంటిదో చెప్పుము. అనియిట్లు ధర్మరాజు అడుగగా శల్యు డిట్లనెను. ధర్మరాజా! ఆవిషయమై పూర్వపు యితిహాస మొకటి గలదు. ఆయితిహాసమును చెప్పెదను వినుము. దేవతలయందు త్వష్ట యను వాడొకడు గలడు. (త్వష్టయనగా విశ్వకర్మ) ఆత్వష్ట దేవేం ద్రునకు కీడుచేయదలచి మూడుశిరస్సులు కలవానిని ఒకనిని సృష్టిం చెను. అట్లు సృష్టించి ఆ పురుషునకు విశ్వరూపుడని పేరుపెట్టెను. ఆ విశ్వరూపుడు యింద్రపదవినిగోరి ఘోరతపస్సు చేయుచుండెను, ఆత పస్సునకు దేవేంద్రుడు భయపడి వానితపస్సునకు భంగముకలుగు నట్లుగా అప్సరస్త్రీలను నియమించెను. ఆ స్త్రీలవిలాసములను, విహా రములను, చూపులను,సంభాషణములను, ఆవిశ్వరూపుడు చూచియు కామముపొందలేదు. అందుకు దేవేంద్రుడు సిగ్గుపడెను. దేవేంద్రుడు పాపబుద్ధికలవాడై విశ్వరూపుడను మునినిచంపి తానుచంపినట్లు యెవరికిని దెలియకుండ ఒకసంవత్సర కాలముగడపెను. అంతట సకల భూతములును యెరిగి ఆపాపకర్మము చేసినందుకు దేవేంద్రుని దూషిం చెను. దేవేంద్రుడు తానుచేసిన పాపకర్మము బయలుపడినందుకు దుఃఖించి ఒక్కవిధమ వ్రతమును ఆచరించెను. అట్లు ఆచరించి తన బ్రహ్మహత్యాదోషమును సముద్రమునందును, వృక్షములయం దును, భూమియందును, స్త్రీజనములయందును విభాగించి పెట్టెను. ఇట్లు దేవేంద్రుడు బ్రహ్మహత్యాదోషమును పోగొట్టుకొని ముని జనములతో గూడుకొని వుల్లాసముగా నుండెను. అందుకు త్వష్ట కోపించుకొని సకలభూతములతో యిట్లనెను.

భూతములారా! ఆవిశ్వరూప మునీంద్రుడు దేవేంద్రునకు కొం చెమైనను అపరాధము చేయలేదు. విశ్వరూపు డధికతపస్సంపన్నుడు

అధిక శాంతచిత్తుడు. అట్టి విశ్వరూపుని దేవేంద్రుడే చంపెను. దేవేంద్రుడు పాపాత్ముడు. ఆ పాపియగు దేవేంద్రుని పట్టుకొని మ్రింగుటకు సమర్థుడైన మహాదేహావంతు నొక్కని యీ క్షణమందే సృష్టించెదను. మీరు చూచుచుండుడు అని త్వష్ట చెప్పుచు అప్పుడే అగ్ని యందు హోమముచేసి ఒకపుత్రుని సృష్టించెను. ఆసృష్టింపబడిన పుత్రునకు వృత్రుడని పేరుపెట్టెను అట్లుపేరుపెట్టి ఆవృత్రునితో యిట్లనెను. పుత్రా! వృత్రుడా! నాతపోబలమువలన నీవు మహాతేజోవంతుడవై నీవు యుద్ధమందు దేవేంద్రుని జయింపుము. శీఘ్రముగా వెళ్ళి దేవేంద్రునితో యుద్ధముచేయుము. అని త్వష్ట వృత్రునితో చెప్పెను.

## ఇంద్రుడు వృత్రాసురునితో యుద్ధముచేయుట

వృత్రాసురుడు దేవేంద్రునితో యుద్ధముచేయుటకు వచ్చెను. దేవేంద్రుడును వృత్రాసురునితో యుద్ధముచేయుటకు వచ్చెను. అంతట దేవేంద్ర వృత్రాసురులకు అద్భుతమైన యుద్ధము జరిగెను. ఆయుద్ధమందు వృత్రాసురుడు దేవేంద్రుని పట్టుకొని మ్రింగెను. అందుకు దేవతలు తల్లడిల్లిరి. ఆ క్షణమందే దేవతలు వృత్రాసురునకు ఆవులింత కలుగ జేసిరి. వృత్రాసురుడు బడలిక కలవాడై నీలిగి ఆవులించెను. అట్టిసమయమందు దేవేంద్రుడు తన శరీరమును సూక్ష్మముగా జేసికొని వృత్రాసురుని నోటిలోనుండి మిక్కిలి వేగముగా యెగిరి బయటికి దూకెను. అట్లు వెడలివచ్చిన దేవేంద్రుడు మరల వృత్రాసురునితో యుద్ధముచేసెను. త్వష్టయొక్క తపోబలము వలన వృత్రాసురున కపరిమితమైన బలము కలిగెను. అందులకు దేవతలకు భయము కలిగెను. ఇట్లు మహాబలవంతుడైన వృత్రాసురునితో దేవేంద్రుడు యుద్ధము చేయజాలక మరలి పారిపోయి

మంథర పర్వత శిఖరమునకు వెళ్ళెను. దేవగణములు దేవేంద్రుని వద్దకు పోయి వృత్రాసురుని చంపు వుపాయము నాలోచించు చుండిరి. దేవేంద్రుడు తన మనస్సులో నిశ్చయించిన అభిప్రాయ మును దేవతలతో యిట్లనెను.

దేవతలారా! మన మందరము విష్ణుదేవుని దగ్గరకు వెళ్ళి విష్ణుదేవుడు చెప్పు పరమోపాయమును చేసి బ్రతుకుదము. అట్లు చేయుట మంచిది. అని దేవేంద్రుడు దేవతలతో చెప్పగా అట్లు చేయుటయే మంచిదని దేవతలు చెప్పిరి. అంతట దేవతలును మును లును దేవేంద్రుని ముందుంచుకొని విష్ణుదేవుని దగ్గరకు వెళ్ళి వృత్రా సురుని పరాక్రమమును జెప్పి యిట్లని ప్రార్థించిరి. మహాత్మా! విష్ణు దేవా! నీవు సర్వదా అపరిమిత ఉత్సాహము చేత రాక్షసులను చంపి దేవేంద్రుని లక్ష్మిని అభివృద్ధి చేయుచుందువు. దేవేంద్రుని రక్షించుట నీకు సహజమగును. భయంకరుడగు వృత్రాసురుని చంపి లోకములకు పరమానందము గలిగింపుము. అని యిట్లు దేవగణము లందరును విష్ణుదేవునితో చెప్పుకొని ప్రార్థించిరి. అప్పుడువిష్ణు దేవుడు దేవగణములను జూచి యిట్లనెను.

దేవతలారా! నేనొక వుపాయమును చెప్పెదను వినుడు. ఆ వృత్రాసురునితో దేవేంద్రునకు స్నేహము గలిగింపుడు. కొంత కాలము జరిగిన పిమ్మట ఒకానొక సమయమందు నేను దేవేంద్రుని వజ్రాయుధమునందు ప్రవేశించెదను. అంతట దేవేంద్రునకు నా తేజో విశేషముచేత వుత్సాహము కలుగగలదు. అప్పుడు దేవేంద్రు డనా యాసముగా వృత్రాసురుని గెలుచును. అని విష్ణుదేవుడు దేవతలతో చెప్పి ఆదరించెను. విష్ణుదేవుని మాటలకు దేవేంద్రుడు మొదలగు సకల దేవతలును సంతోషించి మరలివచ్చి వృత్రాసురునితో స్నేహము చేయుటకు మునులను పంపించిరి. వృత్రాసురుని వద్దకు

మునులందరును పోయి యిట్లనిరి. వృత్రాసురుడా! దేవేంద్రుడు మహాభుజ బలవంతుడు. నీవు మూడులోకములందును జయింపబడని వాడవు. నీకును ఆ దేవేంద్రునకును యుద్ధమందు విజయము కలుగదు. లోకభయంకరముగా మీ యిద్దరును యుద్ధముచేయుట వలన ప్రయోజనములేదు. ఏ విధముచేత జూచినను శత్రుభావము స్నేహ సౌఖ్యము గలిగియుండి దేవేంద్రుని రాజ్యలక్ష్మిని అనుభవించుటకు యోగ్యుడవు కమ్ము. దేవేంద్రునికి స్నేహితుడ వగుము. ఇట్లు చేసిన యెడల మీ యిద్దరికిని మేలుకలుగును. అని మునులు చెప్పగా వృత్రాసురు డిట్లనెను.

మునులారా! దేవేంద్రుని తేజస్సును తీసికొన వలెనని నేను ఆశపడి యున్నాను. నాకును ఆ దేవేంద్రునకును స్నేహము కలుగ జాలదు. అని వృత్రాసురుడు మునులతో చెప్పెను. అప్పుడు మునులు మరల వృత్రాసురునితో యిట్లనిరి. వృత్రాసురుడా! దేవేంద్రుడు సర్వలోకముల చేతను పూజింపదగిన సత్పురుషుడగును. దేవేంద్రుని వలన స్నేహము కలుగుట చేత మేలుకలుగును. సత్పురుషునితో స్నేహము కలిగిన యెడల అట్టిస్నేహమునకు సమ్మతింపకుండుట నీతి గాదు. అని మునులు వృత్రాసురునితో చెప్పి సమ్మతింప జేసిరి. వృత్రాసురుడు దేవేంద్రునితో స్నేహమునకు సమ్మతించి మునులతో యిట్లనెను.

మునులారా! నేనొక పద్ధతిని చెప్పెదను. ఆ పద్ధతిని మీరుకాదనక నేను అడుగుపద్ధతికి మీరుసమ్మతించి నాకును యింద్రునకును స్నేహమును దృఢముగా కలిగింపుడు. తడివస్తువులవలనను పొడివస్తువులవలనను వృక్షములవలనను రాయివలనను శస్త్రాస్త్రముల వలనను పగటి కాలమందును రాత్రి కాలమందును నాకు చావు కలుగకుండ వలయును. ఇట్లు నాకు వరమిచ్చి నాకును యింద్రు

నకును దృఢముగా స్నేహమును కలిగింపుడు. అని వృత్రాసురుడా మునులతో చెప్పెను. అందుకు మునులు సమ్మతించి వాడుకోరిన ప్రకారము వరములిచ్చి వృత్రాసుర దేవేంద్రులకు స్నేహముకలిగించిరి. అంతట మునులు యింద్రునిదగ్గరకు మరలివచ్చి వృత్రాసురునితో జరిగినసంభాషణ స్నేహక్రమమంతయు యింద్రునితో చెప్పిరి. అంతట మునులందరును తమతమ నివాసములకు వెళ్ళిరి. ఇంద్రుడా వృత్రాసురునితో స్నేహము గలిగి సుఖముగా నుండెను. అట్లు బహుకాలము జరిగినపిమ్మట యింద్రుడు తనమనస్సునందుగల విరోధమును సహింపజాలక విష్ణువుచెప్పిన పూనికనుతలచి మునులు వృత్రాసురునితో చేసినసంధి విధమునంతను యోచించెను. అట్లు యింద్రుడు యోచించి తనశత్రువైన వృత్రాసురుని అవమానించుటకు సమయము వెదకుచుండెను. అంజట ఒకానొకదినమందు యింద్రుడు సముద్రతీరమందు వృత్రాసురునిజూచి తనమనస్సులోయిట్లనితలంచెను. ఇప్పుడు నావజ్రాయుధముచేత యీ వృత్రాసురుని చంపెదను. ఇది రాత్రికాలముగాదు, పగటికాలముగాదు. ఇదిసంధ్యాకాలము. నాబల పరాక్రమముచేత యీ వృత్రాసురుని చంపుటకు తగినసాధనమేదియో తెలియలేదు అని యింద్రుడు తనమనస్సులో ఆలోచించుచు అక్కడ సముద్రపు నురుగునుజూచి మరల యిట్లనియోచించెను. ఈ నురుగుతడినవస్తువుగాదు. శుష్కించిన వస్తువుగాదు. వృక్షముగాదు. రాయిగాదు. శస్త్రాస్త్రముకాదు. కనుక యీనురుగుచేత వృత్రాసురుని చంపెదను. అని యింద్రు డిట్లుతనమనస్సులో నిశ్చయించి ఆనురుగును వజ్రాయుధమందుగూర్చి అతివేగముగా వృత్రాసురునిమీద ప్రయోగించెను. అప్పుడా నురుగుయందు విష్ణువు సూక్ష్మరూపమున ప్రవేశించియుండి వృత్రాసురుని చంపెను. ఇంద్రుడు సంతోషించి అధికమైన భక్తితో విష్ణుమూర్తిని స్తుతించెను. సర్వలోకములును

పరమానందము నొందెను. ధర్మరాజా! యీప్రకారముగా యింద్రుడా వృత్రాసురునిజంపి తనపట్టణమగు అమరావతికి వెళ్ళెను. అంతట భూతసంఘములన్నియు యింద్రుడిట్లు బ్రహ్మహత్యను చేయరాదని దూషించెను. అదూషణవలన యింద్రునకు ప్రభుత్వసంపద చెడిపోయెను. వృత్రాసురుని అన్యాయముగా జంపిన బ్రహ్మహత్యాదోషము చేత యింద్రుడట్లు నీచస్థితికివచ్చి నిషధపర్వతమునకు వెళ్ళి అక్కడ దాగియుండెను. దేవరాజగు యింద్రుడు లేనందుకు దేవతలందరును ఒకరినొకరు బాధించుచు భయపడిరి. అట్లు దేవతలు భయపడి యిట్లుచెప్పుకొనిరి. దేవతలారా! మనలను కాపాడుచు దేవరాజ్యలక్ష్మిని పరిపాలించుటకు నహుషమహారాజు తగినవాడగును. ఆ నహుషుని దగ్గరకుపోయి మనము ప్రార్థింతము. అని దేవతలు చెప్పుకొని మునులను వెంటబెట్టుకొని నహుషునిదగ్గరకుపోయి యిట్లనిరి.

## దేవతలు నహుషుని దేవరాజ్యాభిషిక్తుని జేయుట

నహుషమహారాజా! దేవేంద్రుడు వృత్రాసురునిచంపిన బ్రహ్మహత్యాదోషముచేతదూషింపబడి ప్రభుత్వసంపదను విడిచిపోయెను. నీవు దేవేంద్రపదవిని తీసికొని మమ్ములనందరిని పరిపాలింపుము. అని దేవతలు నహుషునితో చెప్పిరి. అప్పుడా నహుషుడా దేవతలతో యిట్లనెను. దేవతలారా! ఇంద్రపదవిని పరిపాలించుటకు తగినమాహాత్మ్యము నాకులేదు. ఆ విషయమై నన్ను తొందరపెట్టుటవలన ప్రయోజనములేదు. అని నహుషుడా దేవతలతో చెప్పెను. అయినను దేవతలు విడువక మరల మిక్కిలి అధికముగా నహుషుని ప్రార్థించిరి. అంతట యమ వరుణ అగ్ని దేవాది దేవశ్రేష్ఠులందరును తమతమశక్తి ప్రభావ గర్వములను ఆ నహుషునకు పంచియిచ్చిరి. ఇట్లు మహాముల సభామధ్యమందు దేవతలందరును తమతమ ప్రభావమును నహు

షునకు పంచియిచ్చి అధికబలవంతునిచేసిరి. దేవతలందరును నహుషుని స్వర్గమునకు తీసికొనిపోయి పూజ్యమగు దేవరాజ్యమున నభిషేకముచేసిరి. అట్లు నహుషుడా దేవేంద్రపదవినిపొంది పరమధర్మాత్ముండై కిన్నర కింపురుష గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాది సమస్త దేవయోనులవలన తేజోభాగములను తీసికొనెను. ఇట్లు నహుషుడు మహానుభావుండై దివ్యమునులచేత సేవింపబడు ఆ యింద్రపదవిని పొందెను. అంతట నహుషుడు తుంబుర నారదాది మునులయొక్క వీణాధ్వనులచేత ఆనందించుచు రంభాదిఅప్సరస్త్రీలచేత వినోదముగా సేవింపబడుచు యిష్టభోగముల ననుభవింపుచుండెను. నహుషుడట్లు ముదముగలవాడై స్త్రీలోలుండై అధికమైన కామయుగలిగి ప్రవర్తింపుచుండెను.

అట్టిసమయమందు ఒకనాడు యింద్రుని భార్యయగు శచీదేవి నహుషునకు కనబడెను. ఆమె మిక్కిలి సౌందర్య రూపవంతురాలు. ఆమెను నహుషుడు చూడగానే అతనికి అధికకామముగలిగి ధైర్యము లేనివాడాయెను. నహుషు డధికముగా మన్మథబాణములచేత బాధింపబడి యిట్లుపలచెను. నేను దేవలోకరాజ్యమును అనుభవింపుచు యింద్రపదవిని వహించి యింతగొప్పవాడనై యుంటిని. ఈచాతుర్యముగల చిన్నది నన్నుపొందుటకు రాకుండుటకు కారణమేమో తెలియకున్నది. అని నహుషుడు తన మనస్సులో తలచి శచీదేవిని పిలిపించెను. ఆమె భయపడి శీఘ్రముగా బృహస్పతి యింటికివెళ్ళి బృహస్పతిని శరణుజొచ్చెను. బృహస్పతి మిక్కిలి ఆదరణపూర్వకముగా శచీదేవిని గారవించి యిట్లనెను. శచీదేవీ! ఆ నహుషుని వలన నీకాపదకలుగకుండునట్లు నేను నిన్నుకాపాడెదను. నాప్రయత్నమువలన నీభర్తయగు దేవేంద్రుడు నిశ్చయముగా రాగలడు అని బృహస్పతి శచీదేవితోచెప్పి ప్రార్థించెను. ఈసమాచారమంతయు నహుషు డెరింగి కోపించుకొని దేవమునులతో యిట్లనెను.

దేవమునులారా! నేను శచీదేవిని పిలిపించగా దానిని బృహస్పతి తనయింటియందుంచుకొని రానివ్వలేదు. ఇట్లుచేయుట బృహస్పతికి తగునా! అని కోపముతో నహుషుడు చెప్పెను. అంతట దేవతలును మునులును నహుషునితో యిట్లనిరి. మహాత్మా! నహుషా అయ్యా! నీవు యింద్రపదవియందుండి మహాగౌరవమును పొందియున్నావు. ఇటువంటి నీకు పరస్త్రీయందు బుద్ధికలుగుట ధర్మముగాదు. ఆచిన్నది యింద్రునిభార్య. ఆస్త్రీపేరు శచీదేవి. ఆమెను నీవుకోరరాదు. అని యిట్లు దేవమునులందరును నహుషునితో చెప్పిరి. అప్పుడు నహుషుడా దేవమునులతో మరల యిట్లుపలికెను. దేవమునులారా! పూర్వము యింద్రుడు గౌతమ మునీంద్రుని భార్యయగు అహల్యాదేవిని కోరెను. అప్పుడు మీరు యిటువంటి వివేకమును యింద్రునకు చెప్పజాలకపోతిరి. అందుకు కారణమేమో చెప్పుడు. అని నహుషుడామునులతో పలుకుచు కోపించుకొనెను. ఆకోపమునకు దేవమునులు భయపడి శచీదేవిని నహుషునివద్దకు తీసికొనివచ్చుటకు పూనుకొనిరి. మునులంతట బృహస్పతి దగ్గరకువెళ్ళి శచీదేవి వినుచుండగా బృహస్పతితో యిట్లనిరి.

బృహస్పతీ! నహుషుడు ఇంద్రపదవిని పొందియున్నాడు. ఆ నహుషుని శచీదేవి వరియింపదగును. లోకహితార్థ మీ శచీదేవిని నహుషునివద్దకు పంపుము. శచీదేవిని పంపినయెడల నహుషునకు కోపము అణగును. అని దేవమునులు బృహస్పతితో చెప్పిరి. ఆ మాటలను శచీదేవి విని బృహస్పతితో యిట్లనెను. మహాత్మా బృహస్పతీ! మీరు నన్ను నహుషునిదగ్గరకు పంపినయెడల నింద గలుగును. ఇదివరకు నన్ను పరిశుద్ధురాలునిగా మీరు భావించుచుంటిరి, అట్టిభావన యిప్పుడసత్యము కాగలదు. అని శచీదేవి దుఃఖించుచు బృహస్పతితో చెప్పెను. ఆమాటలకు బృహస్పతి నవ్వు

ముఖముగలవాడై శచీదేవితో యిట్లనెను. ఆ నహుషుడు వీరిని పంపి నాడట. నీవు విహితానుష్ఠాన పరులట. నీ వా నహుషుని వరియిం చుటవలన లోకహితమగునట. గనుక మనకీ కార్యము గొప్పది. మానుటకు సాధ్యము గాదేమో తెలియదు. అని బృహస్పతి ఆ దేవ మునులను గురించి యెత్తిపోటుమాటలను శచీదేవితో చెప్పి దేవత లను మునులను జూచి యిట్లనెను.

దేవమునులారా! పూర్వము బ్రహ్మదేవుడు చెప్పిన వాక్య మును వినుడు. శరణుకొచ్చినవానిని విడిపించుటకు సమర్థుడై యుం డియు రక్షించక విడిచినవానికి పుణ్యలోకములు కలుగవు. అట్టివానికి పుణ్యకర్మములు ఫలింపవు. అని బ్రహ్మదేవుడు చెప్పగా మనము వింటిమి. గనుక యీ శచీదేవి నన్ను శరణుకొచ్చెను. ఈమెను నేను విడిపింపను. అని బృహస్పతి దేవమునులతో చెప్పెను. అంత దేవత లును మునులును యిట్లనిరి.

బృహస్పతీ! అట్లయినయెడల యికమీదట యెట్లు చేయ వలెనో ఆ విషయమును మీరు వూహించి చెప్పుడు. అని యిట్లు దేవమునులు అడుగగా బృహస్పతి యిట్లనెను. దేవమునులారా! యిప్పుడు యీ శచీదేవి నహుషునిదగ్గరకు వెళ్ళి తగినట్లు మాట్లాడి నహుషుని వరియించుటకు కొంతకాలము గడువు తీసికొనవలయును. అట్లు గడువుతీసికొని రావలయును. పిమ్మట మనమందరము ఇంద్రున కభివృద్ధిగలుగు విధానమును గనుగొనవలయును. అని బృహస్పతి దేవమునులతో చెప్పెను. బృహస్పతి వాక్యములకు దేవమునులు సంతోషించి వెళ్ళిరి. పిమ్మట శచీదేవి నహుషునిదగ్గరకు వెళ్ళెను. ఆ నహుషుడు శచీదేవిని జూచి మన్మథ వికారముగలవాడాయెను. అప్పు శచీదేవి నహుషుని జూచి వానియందు ఇంద్రుని తేజోవిశే షము లేదనియు, రాజ్యలక్ష్మి లేదనియు యెరింగి యిట్లనెను.

నహుషుడా! యిప్పుడు నిన్ను వరియించుటకు నా మనస్సు నందు కొంత సంశయము గలదు. గాన యిప్పుడు నీవు తొందరపడుట మేలుగాదు. నీవు సర్వమును యెరిగియే యున్నావు. గనుక యిక నన్ను వరియించుటకు కొంతకాలము నాకు గడువు యిమ్ము. అని శచీదేవి నహుషునితో చెప్పి వానిని సమ్మతింపజేసి కొంతకాలము వరకు గడువు తీసికొనెను. పిమ్మట శచీదేవి మరల బృహస్పతి గృహమునకు వచ్చెను. అంతట సురలందరును మునిజన సహిత ముగా రహస్యముగా విష్ణువునిదగ్గరకు వెళ్ళి ఇంద్రుని పాపకర్మను పోగొట్టుమని ప్రార్థించిరి. అప్పుడు విష్ణువు కరుణగలవాడై సురలతో యిట్లనెను. సురలారా! ఇంద్రు డశ్వమేధ యజ్ఞముచేసి నాకు సంతోషము కలిగించినయెడల బ్రహ్మహత్యాదోషము నశించి పుణ్యాత్ముడగును. కనుక ఆ ఇంద్రునిచేత అశ్వమేధ యజ్ఞమును చేయింపుడు. అని విష్ణువు సురలతో చెప్పెను. ఆ మాటలకు సురలు సంతోషించి అతివేగముగా నందరును ఇంద్రుడు దాగియున్న స్థలము నకు పోయిరి.

## ఇంద్రుడు నహుషుని తేజోవిశేషమును జూచి మరుగుపడుట

అంత సురలు ఇంద్రునిచేత అశ్వమేధ యజ్ఞమును చేయించి అతని పాపమును పోగొట్టిరి. ఇంద్రుడు తన పాపమును పోగొట్టుకొని తన పట్టణమగు అమరావతికి వచ్చెను. ఇంద్రుడు తన పదవిని పొంది యున్న నహుషుని జూచి అతని తేజోవిశేషమునకు మిగుల భయ పడెను. ఇంద్రుడు తన బ్రహ్మహత్యాదోషమును పోగొట్టుకొనెనే గాని నహుషునియంత బలము లేనందున భయ వ్యాకులచిత్తుడై ఎక్కడికో పారిపోయెను. అప్పుడు ఇంద్రుని భార్యయగు శచీదేవి మిక్కిలి గొప్ప దుఃఖముగలదై నాభర్త వెళ్ళిన స్థలము నా కెట్లు

తెలియనగును అని చింతించెను. అట్లు చింతించి శచీదేవి రాత్రి కాలమందు వుపశ్రుతిని ఆరాధించెను. ఆ వుపశ్రుతియొక్క అదిదేవత శచీదేవితో యిట్లనెను. శచీదేవీ! నీ సత్యమువలన నీవు నీ భర్తయగు ఇంద్రునిజూడగలవు. అని ఆ అధిదేవత శచీదేవితో చెప్పెను. అప్పుడు శచీదేవి నీ వెవ్వరని యడిగెను. ఆ అధిదేవత శచీదేవితో యిట్లనెను.

శచీదేవీ ! నీ పాతివ్రత్య పారిశుధ్యమునకు నేను సంతోషించి వచ్చితిని, నేను వుపశ్రుతిని. నీ భర్తయగు దేవేంద్రుని నీకు జూపెదను. నావెంబడి రమ్ము అని వుపశ్రుతి శచీదేవితో చెప్పి ఆమెను వెంటబెట్టుకొని హిమవత్పరమందు గల మంజుల పర్వతమునకు వెళ్ళెను. ఆమంజుల పర్వతమందు నూరామడ పొడవుగల సరస్సుండెను. ఆసరస్సునందు అయిదు వర్ణములుగల మనోహరములైన కమలములలో ఒక కాడను భేదించుకొని ఆకాడలోపలికి ముందుగా వుపశ్రుతి ప్రవేశించెను. అప్పుడా కాడలో సూక్ష్మరూపముతో దేవేంద్రుడు దాగియుండెను. అట్టి దేవేంద్రుని శచీదేవి చూచెను. అంతట వుపశ్రుతి అంతర్ధానమై పోయెను. శచీదేవి తనభర్త దగ్గరనేయుండి తన పూర్వజన్మ పుణ్యమును మహాద్భుతముగా కొనియాడు కొనుచునుండెను. అంత నాసూక్ష్మ రూపియగు దేవేంద్రుడు తన భార్యయగు శచీదేవిని జూచి సంతోషము గలవాడై యిట్లనెను.

భార్యామణీ! శచీదేవీ! ఈ తామర కాడయందు నేను వున్నట్లు నీ వెట్లెరిగితివో చెప్పుము. నన్ను జూచుటకు నీ వెందుకు వచ్చితివో చెప్పుము. అని ఇంద్రుడడుగగా శచీదేవి యిట్లు చెప్పెను. ప్రాణనాథా ! నహుషుడు పాపబుద్ధి గలవాడై నన్ను కోరెను. నేను కాలము జరుపుట కొరకు నహుషునివద్ద కొంత కాలము గడువు తీసికొంటిని. నేను వుపశ్రుతిని ఆరాధించుటవలన ఆ వుపశ్రుతినాకు ప్రత్య

క్షమై నన్ను యిక్కడకు తీసికొనివచ్చి నిన్ను నాకు చూపించెను. నీవు యీ సమయమందు ప్రకాశించి నీ ప్రతాపమువలన నహుషు నకు అవమానము కలిగింపుము. నీవట్లు నహుషుని అవమానించి నన్ను రక్షింపని యెడల పాపాత్ముడగు నహుషుని వలన ఆపద వచ్చును. అని శచీదేవి ఇంద్రునితో చెప్పగా ఇంద్రు డిట్లనెను. శచీదేవీ! ఆనహుషునకు భుజాబల మధికముగా నున్నది. ఆ నహు షుడు మిక్కిలి అభివృద్ధిని గలిగియున్నాడు. అందులకు నహుషుని జయించుటకు సమయమును వెదకుచు కాలమును గడపుచున్నాను. సమయము వచ్చువరకు శత్రువుని ఆధిక్యతను సహించుటనీతియగును. నేను చెప్పినట్లు చేయుము. నీవా నహుషుని దగ్గరకు వెళ్ళి యిట్ల నుము. నహుషుడా! నీవు నన్ను పొందదలచినయెడల మునిగణము లను వాహనముగా గలవాడవు కమ్ము. నీవు మునులచేత మోయ బడుచురమ్ము అని నీవు నహుషునితో చెప్పుము. ఆనహుషుడు మును లను వాహనముగా గలిగినయెడల ఆనహుషునకు చేటు గలుగును. అని ఇంద్రుడు శచీదేవితో చెప్పెను. అందుకు శచీదేవి సమ్మతించి అట్లు చేసెదనని చెప్పి ఇంద్రుని అనుమతినిబొంది నహుషుని దగ్గరకు వచ్చెను. అంత నహుషుడు మిక్కిలి సంతోషించి ఆదరించి నా యిష్టమును తీర్చుమని శచీదేవిని అడిగెను. అప్పుడు శచీదేవి నహు షునితో నిట్లనెను.

నహుషుడా! మనము యేర్పాటుచేసికొనిన గడువు కాలము యింకను కొంచెము కలదు. ఆకాలము పూర్తికాగానే నేను నిన్ను వరించెదను. నీవు మహామునులను వాహనముగా గలవాడవు కావల యును. అది నాకు మిగుల ప్రియమగును. అన్యులకు సాధ్యముగాని మహాముని వాహనము చేత నీకు అపారమైన తేజస్సు కలుగును. కావున నీవు మహామునులచేత మోయబడుము. అని శచీదేవి నహుషు

నితో చెప్పెను. ఆమాటలకు నహుషుడు సంతోష చిత్తముగలవాడై శచీదేవితో యిట్లనెను. శచీదేవీ! ఆముని వాహనమును యెక్కుటకు నేను దప్ప అన్యులకు సాధ్యముగాదు. నీకానందమును చేకూర్చు నిమిత్తము నాయందలమును సప్తమహర్షులచేత మోయించుకొని నీకడకు వచ్చెదను. అని నహుషుడు శచీదేవితో చెప్పి పంపించెను. అప్పుడే నహుషుడు మహాముని సంఘములను పిలిచి మూర్ఖత్వము చేత తన అందలమును మోయించెను. ఇట్లు మునులచేత మోయ బడిన వాహనమగు తన అందలమును యెక్కి నహుషుడు కొంచెమైనను సంశయమును బూనక అన్నిదిక్కులయందును తిరిగెను. ఆసమయమున శచీదేవి బృహస్పతి దగ్గరకు వెళ్ళి యిట్లనెను. బృహస్పతీ! నహుషుని వలన నేను గడువుపొందిన కాలము పూర్తియైనది. గాన నాభర్తయగు ఇంద్రునకు మేలుకలుగునట్లు మీరు అనుగ్రహింపవలయును. నిన్ను శరణుబొందిన నన్ను రక్షింపవలెను. అని చెప్పగా శచీదేవితో బృహస్పతి యిట్లనెను. తల్లీ! శచీదేవీ! ఆ నహుషుని వలన నీకు కొంచెమైనను ఆపదను రానివ్వను. మరియు ఆ నహుషునకు చేటువాటిల్లునట్లు హోమము చేసెదను. ఆహోమము వలన నహుషుడు చెడిపోగలడు. నీ భర్తయగు ఇంద్రుడున్న స్థలమును కనుగొనెదను. అని బృహస్పతి శచీదేవితో చెప్పి పూరడించెను. వెంటనే బృహస్పతి అగ్నిహోత్రుని పూజించి ఇంద్రుని పద్ధతి నంతయు అగ్నిహోత్రునకు బోధించి ఇంద్రుని వెదుకుటకు పంపించెను.

## అగ్నిదేవుడింద్రుని వెదకి బృహస్పతికి దెలుపుట

అప్పుడగ్నిదేవుడు స్త్రీరూపముచేత వెళ్ళి మనోగమనము వలన సర్వదిక్కుల యందును, భూమ్యాకాశముల యందును, పర్వతారణ్యముల యందును వెదకి కొంతసేపటికి అంతటను కలియ

జూచెను. ఎంతజూచి వెదకినను అగ్నిహోత్రునకు ఇంద్రుడు కనబడ లేదు. అంతట అగ్నిహోత్రుడు మరల వచ్చి బృహస్పతితో నిట్లు చెప్పెను. బృహస్పతీ! నేనుసకల భూమిపర్వతారణ్యములయం దంతటను వెదకితిని. ఇంద్రుడు నాకు కనబడ లేదు నేను జలముల యందు ప్రవేశింపజాలను. గాన అందుమాత్రము వెదుక లేదు. నీళ్ళ వలన అగ్నిపుట్టెను. బ్రాహ్మణులవలన క్షత్రియజాతిపుట్టెను. రాళ్ళ వలన యినుము మొదలగు లోహములు పుట్టెను. ఇట్లు పుట్టిన అగ్ని క్షత్రియలోహములను తీక్ష్ణభావములతో అంతటను ప్రకాశింప జేయును. తమ జన్మస్థానములగు జల బ్రాహ్మణ పాషాణములయందు అగ్నిహోత్ర క్షత్రియ లోహముల తీక్ష్ణభావములు అణగును. గనుక నీళ్ళు నన్ను నశింపజేయుట లోకప్రసిద్ధము. అందువలన నేను జల ములయందు ప్రవేశించి ఇంద్రుని వెదక లేదు. అని అగ్నిహోత్రుడు బృహస్పతితో చెప్పెను. ఆమాటలను బృహస్పతి విని అగ్నిహోత్రుని జూచి మిక్కిలి గౌరవముగా యిట్లనెను.

అగ్నిహోత్రా! నీ సాన్నిధ్య మాత్రముచేత పరాపర ప్రపంచమంతయు ప్రకాశించుచున్నవి. నాలుగువేదములను, ఆ వేద ములయందు చెప్పబడిన సకల యజ్ఞములును నీవే యగుచున్నవు. నీ యందే జలములు పుట్టును. నీవు సర్వలోకములును వ్యాపించియుం డగా నీవు పొందరాని జలప్రదేశమెట్లు కలదో తెలియకున్నది. నీ వెటువంటివాడవో, నిన్ను నీ వూహించి నీ గొప్పతనమును నీవు తెలిసికొనుము. నేనును వేదమంత్రములచేత నిన్ను మెక్కువగా అభివృద్ధి పరతును గనుక నీవుకొంచెమైనను సంశయింపక జలము లతో ప్రవేశించి ఇంద్రుని వెదకుము. అని బృహస్పతి అగ్నిహోత్రు నితో చెప్పి పంపించెను. అగ్నిహోత్రుడు పూనికతో వెళ్ళి జలము లలో ప్రవేశించి సకల సముద్రమహానదీ తటాక సరస్సుల నన్నిటిని

వెదకుచు ఇంద్రుడున్న సరస్సునకు వెళ్ళెను. అగ్నిహోత్రుడాసరస్సునందుండు కమలములయందు కలియజూచెను. అట్లు వెదకి ఒక తామరకాడయందు దారములో అణగియున్న ఇంద్రుని జూచెను. వెంటనే అగ్నిహోత్రుడు బృహస్పతికడకు వేగముగావచ్చి ఇంద్రుడున్న స్థితిని చెప్పెను. బృహస్పతి సంతోషించి సకల సుర మునులను తీసికొని ఇంద్రుని దగ్గరకు పోయెను. బృహస్పతి నానావిధ వాక్యములచేత స్తుతించి ఇంద్రుని సంతోషింప జేసెను. బృహస్పతి ఇంద్రునితో నిట్లనెను.

దేవేంద్రా! మిక్కిలి శ్రేష్ఠమగు దేవరాజ్యమును అనుభవించుటకు నీ వుత్సహించుటలేదు. నీకు యెద్దియు కొరత కనబడలేదు. నీవు వృత్రాసురుని చంపినందువలన నీకుపాపముకలిగినదని దలచితివేమో తెలియలేదు. సముద్రపు నురుగునందు విష్ణువు ప్రవేశించి లోకకంటకుడైన వృత్రాసురునిచంపి నీకు విజయము కలిగించెను. ఇందువలన నీకుపాపములేదు. అని బృహస్పతి తగిన ప్రకారము యింద్రునితో చెప్పి బోధించెను. ఆ బృహస్పతియొక్క సంభాషణము చేత యింద్రుడు పాపములేనివాడై తనరూపమునుపొంది దేవమునుల సహితముగా బృహస్పతిని గౌరవించెను. ఇంద్రుడిప్పుడేమి చేయవలెనో చెప్పుమని బృహస్పతి అడిగెను. ఇంద్రుడెరిగియున్నను నహుషుని వృత్తాంతమంతయు స్పష్టముగా చెప్పడని బృహస్పతి తలచి యిట్లనెను.

ఇంద్రా! పూర్వము నీవు రాజ్యవిభవమును విడిచి దాగియుంటివి. సురగణములును మునిగణములునైన మేము లోకములను రక్షించుటకు ఇంద్రపదవిని పొందదగిన వాడెవడోయని సూచించితిమి. ప్రభువులేనియెడల ఒకరివలన మరియొకరికి బాధ కలుగునని తలచి ఇంద్రునితో సమానుడెవడని తలచుచుంటిమి.

అప్పుడు సురలలో ఒకడైనను నీ ప్రభుత్వ సంపదను పొంది లోకములను రక్షించుటకు సమ్మతింపలేదు. ఆ సమయమున సురలందరును మునిగణములను వెంటబెట్టుకొని నహుషునిదగ్గరకు వెళ్ళి వానిని మనుష్యుడను అనుమానము లేక ఇంద్రలోకమును పాలింపుమని ఆనహుషుని ప్రార్థించిరి. అప్పుడు నహుషుడు నేను బలహీనుడనని యు, ఇంద్రపదవికి అర్హుడను గానని యు సురలతో జెప్పెను. అప్పుడు సురలందరును తమతమ తేజోభాగములను ఆ నహుషునకు నిచ్చి వానిని బలవంతునిగా జేసిరి.

అంతట సురలును మునులును నహుషునకు ఇంద్రపదవినిచ్చి దేవరాజ్యమునకు అభిషేకము జేసిరి. అంతట నహుషుడు నీ పదవిని పొంది గర్వించి యిప్పుడు దురహంకారముచేత ధర్మమార్గమును తప్పి తనను మోయుటకు మహామునిగణములను నియమించి యున్నాడు. ఇదియునుగాక నహుషునియందు అనేక పాపకార్యములు గలిగియున్నవి. నహుషుని పాపకర్మములకు మేము భయపడి యిప్పుడు నిన్ను వెదుక వచ్చితిమి. నహుషుడు వివేకహీనుడు. నహుషుని చెఱచుటకు యిది మంచిసమయము అది యెట్లనగా చెప్పెద వినుము. పూర్వము విష్ణువుని ఆజ్ఞాప్రకారము నీవు అశ్వమేధ యజ్ఞమును చేసి పాపమును పోగొట్టుకొంటివి. అయినను అప్పుడు నహుషునకు తేజోహాని కలుగనందున అతనిని నీవు ఆక్రమించలేదు. నహుషుడు మహామునులచేత మోయబడుచు మహామునులను అవమానించినందున తేజోహీనుడై యున్నాడు. కనుక యిప్పుడు నీవు నహుషుని చెఱపుము. నీ అశ్వమేధ యజ్ఞఫల పరిపక్వమువలననే నహుషునకు తేజోహాని కలిగెను. నీవు నహుషుని చెరచుటకు ప్రయత్నింపుము. అని బృహస్పతి ఇంద్రునితో చెప్పుచుండగా ఆ సమయమందు యమధర్మరాజు వరుణకుబేరులు సోముని వెంటబెట్టుకొని

వచ్చి ఇంద్రునిజూచిరి. అప్పుడు ఇంద్రుడు సంతోషించి అప్పటికార్య పద్ధతిని వారికి తెలిపి తగిన సంభాషణములచేత యముడు మొదలగు వారలను సంతోషము కలిగించి యిట్లనెను.

ఓ యమవరుణకుబేరసోములారా! నహుషుని తేజోవిశేష మును చూచుటకు నాకు సాధ్యముకాలేదు. ఆ నహుషుని గెలుచు టకు వుపాయమెద్దియును తోచలేదు. అని ఇంద్రుడు యముడు మొదలగు వారితో చెప్పి నహుషుని గెలుచు నుపాయమును యోచింపుచుండెను. అప్పుడు యమ వరుణ కుబేరులు ఇంద్రునితో నిట్లనిరి. మహాత్మా! ఇంద్రా! దుర్మార్గుడైన నహుషుడు చెడి నశించెను. ఇకను నీవు నీ దేవరాజ్యమును పొంది దేవతలకు తృప్తి గలిగించి శచీదేవితో సుఖముగ నుండుము. నీ దేవరాజ్య మును నీవు పొందుము. అని యిట్లు యమవరుణ కుబే రులు ఇంద్రునితో జెప్పి ప్రార్థించి దీవించిరి. అంతట ముని శ్రేష్ఠుడైన అగస్త్యుడు ఇంద్రునిదగ్గరకు వచ్చెను. ఇంద్రుడు ప్రీతిపూర్వకముగా అగస్త్యునకు తగిన పీఠమిచ్చి అర్ఘ్యపాద్యములచేత పూజించి వినయ పూర్వకముగా యిట్లనెను. మహాత్మా! అగస్త్యమునీంద్రా! నహు షుడు అధికశక్తి తేజస్సులు గలవాడై ప్రకాశించుచు దేవరాజ్యమును పాలింపుచుండెను. అటువంటి నహుషుడు యిప్పుడే యేకారణము వలన భాగ్యహీనుడై రాజ్యలక్ష్మిని పోగొట్టుకొనెనో చెప్పుము. అని యిట్లు ఇంద్రుడు అడుగగా ఆమాటలను అగస్త్యుడు విని యిట్లనెను.

## అగస్త్యు డింద్రునకు నహుషుని పదభ్రష్టత దెలుపుట

ఇంద్రుడా! మునిసంఘములు నహుషుని మోచి శ్రమజెంది నహుషుని దగ్గర గోష్ఠిచేత వినోదము గలిగియుండిరి. అప్పుడా మహా మునుల సంఘము నహుషునితో యిట్లనిరి. బ్రహ్మణ్యములైన

మంత్రములు గోసంప్రోక్షణమందు చెప్పబడియున్నవి. అట్టి మంత్రములు నీకు ప్రమాణ రూపములగునేని నా కెప్పుము. అని యిట్లు మహామును లడుగగా నహుషుడు పాపబుద్ధిగలవాడై మంత్రములు ప్రమాణములుగావని మునులకు చెప్పెను. అప్పుడు నేను నహుషుని మాటలను నిషేధించియిట్లంటిని. నహుషుడా! పూర్వాచార్యుల చేత ప్రమాణములుగా అంగీకరింపబడిన మంత్రములను నిందించుట అజ్ఞానము. ఆ మంత్రములను నిందింపరాదు. అని నేను నహుషునితో వాదము చేసితిని. అందుకు నహుషుడు కోపించుకొని నాశిరస్సును తన్నెను. అప్పుడు నేను నహుషుని చూడగా వాడు పుణ్యహీనుడై దీనుడుగా కనబడెను. అట్టి నహుషునితో నేను యిట్లంటిని

ఓరీ ! నహుషుడా ! పూజింపదగిన మహామునులను నిన్ను మోయునట్లుగా చేసితివి. ఆ మహామునులు కొనియాడెడి మంత్రములను దూషించితివి. అదిగాక నన్నవమానించితివి. గనుక నీవు ఇంద్రపద భ్రష్టుడవై బహుసంవత్సరముల పర్యంతము భూలోకమందు సర్పరూపమును ధరించి యుందువు. అని యిట్లు నేను నహుషునకు శాపమిచ్చి పిమ్మట అనుగ్రహించి మరల యిట్లంటిని. నహుషుడా! ఇకముందు జరుగబోవు కాలమందు నీవంశమందు ధర్మరాజను నొక సత్పురుషుడు పుట్టును. ధర్మరాజు శత్రువులు లేనివాడైనందున అతనికి అజాతశత్రువను పేరుగలుగును. ఆ ధర్మరాజుయొక్క దర్శనము చేత నీపాపములు నశించును. అప్పుడు నీవుపుణ్యలోకములను పొందగలవు. అని నేను నహుషునకు శాపవిముక్తి కాలమును చెప్పితిని. తత్క్షణమందే నహుషుడుస్వర్గపదభ్రష్టుడై దుర్గతికిపోయెను. దుర్మార్గులకు పాపగతి గలుగును. పుణ్యాత్ములకు పుణ్యగతి కలుగును. యీ విషయమున ఆశ్చర్యము లేదు. అని అగస్త్య మునీంద్రుడు ఇంద్రునితో [illegible] అప్పుడు దేవతలును మునులును బహుమ సంతోషమును

పొంది అగస్త్యమునీంద్రుని పొగడిరి. అప్పుడు ఇంద్రుడు పరమ సంతోషము గలవాడై యుండెను. ఇంద్రుడు సంతోషించుటచేత చరాచర ప్రపంచమంతయు సంతోషించెను. అప్సరస్త్రీ గణము లన్నియు ఇంద్రుని దర్శనము చేయవచ్చెను. అప్పుడు ఇంద్రుడు మహాదైశ్వర్యము చేత ప్రకాశించుచుండెను.

అంతట అగ్ని దేవుడు మొదలగు దిక్పాలకులును, బృహస్పతియు, కిన్నెర, సిద్ధ, సాధ్యులును, సేవింపుచు వచ్చుచుండగా ఇంద్రుడు ఐరావతమను తన ఏనుగుమీద ఎక్కెను. ఇంద్రుడు శచీ దేవి సహితముగా ఐరావత గజము మీద యెక్కి అమరావతీ పట్టణమునకు వెళ్ళెను. అచ్చట ఇంద్రుడు తన భార్యయగు శచీదేవితో కలసి యిష్ట సుఖముల ననుభవించుచుండెను. ఈరీతిగా మహానుభావుడగు ఇంద్రుడు రాజ్యమును విడిచి హీనునివలె దుఃఖపడి పిమ్మట సౌఖ్యమును పొందెను. ఇంద్రుడు బహుకాలము నరకు అజ్ఞాతవాసమును జరిపి పిమ్మట ఎప్పటివలె సౌఖ్యమును పొందెను. అటువంటి ఇంద్రుడే యిట్టి కష్టములను అనుభవించినప్పుడు యితరుల విషయమై చెప్పవలసిన పనిలేదు. అని శల్యుడు ధర్మరాజుతో జెప్పెను.

ధర్మరాజా! మీరు వనవాస అజ్ఞాతవాసములను జరిపి కష్టపడినందుకు చింతింపవద్దు. విధివశమువలన ఎంతగొప్పవారికైనను సుఖదుఃఖములు గలుగుచుండును. అని శల్యుడు ధర్మరాజుతో చెప్పి సభప్రవేశమందుండు వారినందరిని కలయజూచి యిట్లనెను. సభికులారా! దుర్యోధనుడు ఆ నహుషునివలె నాశము జెందును. ఇంద్రునివలెనే ధర్మరాజు సకలరాజ్యలక్ష్మినిపొంది తనతమ్ములతో గూడుకొని సకల రాజ్యభోగములను అనుభవింపగలడు. అని శల్యుడు సభికులతో జెప్పి మరల నతడు ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! యీ ముందు చెప్పిన

నకు వచ్చిచేరెను. అంతట కేకయ దేశపురాజులు ఐదుగురును ఒక అక్షౌహిణీ సైన్యమును నడిపించుకొనివచ్చి పాండవపక్షమును చేరిరి. మరియు ద్రుపదరాజు తనకుమారునితోగూడి గుఱ్ఱపుదండులను, ఏనుగు గుంపులును, భటసమూహములను, రథములగుంపులనుచేర్చు కొనివచ్చి పాండవపక్షముగా చేరియుండిరి. ద్రుపదుని సైన్యము ఒక అక్షౌహిణీ సంఖ్యగలిగియుండెను. ఆసమయమున విరాటరాజు తన పుత్ర సహోదర సహితముగా పర్వతరాజులను చేర్చుకొని ఒకఅక్షౌ హిణీ సైన్యముతో పాండవులకు సహాయుడై వచ్చెను.విరాటుని సైన్య ముల యందుగల శంఖధ్వనులు శత్రువులకు భయంకరముగానుండెను. పాండ్యదేశము మొదలగు కొన్ని దేశములరాజులు పాండవపక్షముగా వచ్చిచేరిరి. ఆ నానావిధ దేశముల సైన్యములును ఒకక్షౌహిణీ వుండును. ఈరీతిగా పాండవులకు యుద్ధమందు సహాయముచేయు నిమిత్తము పాండవపక్షమంతట ఏడక్షౌహిణీల సైన్యముచేరెను. ఈ ప్రకారముచేరిన ధర్మరాజుయొక్క ఏడక్షౌహిణీల సైన్యము అధికో త్సాహముగలదై చెలరేగి యుద్ధమునకు కాలుద్రవ్వుచుండెను. ఇక దుర్యోధనుని పక్షమునచేరిన సైన్యములను చెప్పెదను వినుము.

ప్రాగ్జ్యోతిషపట్టణ రాజగు భగదత్తుడు కిరాత, కాంచన సైన్యములను చేర్చుకొని యుద్ధసన్నద్ధుడై ఒక అక్షౌహిణీసైన్యముతో వచ్చి దుర్యోధనుని పక్షమందు చేరెను. మహాబలవంతులగు భూరి శ్రవుడును, శల్యుడును, ఒక ఒక అక్షౌహిణీసైన్యముతో వచ్చిదుర్యో ధనుని పక్షమందు చేరిరి. కాంభోజదేశపు రాజగు సుదక్షిణుడును, యవనదేశపు రాజును యుద్ధసన్నద్ధులై తమతమ సైన్యములను నడి పించుకొని వచ్చి దుర్యోధనుని పక్షమందు చేరిరి. ఆ రీతిగనే సైంధ వుడు మొదలగు సింధు సౌవీర దేశముల రాజులు తమతమ సైన్య ములను నడిపించుకొనివచ్చి దుర్యోధనుని పక్షమందు చేరిరి. మాహి

ష్మతీరాజగు నీలుడును, యాదవ వీరశ్రేష్ఠుండగు కృతవర్మయు, అవంతీదేశపు రాజులగు విందానువిందులును నలుగురునుకలిసినాలుగు అక్షౌహిణుల సైన్యమును చేర్చుకొని వచ్చి దుర్యోధనుని పక్షమందు చేరిరి. అదిగాక నానావిధ దేశములనుండి వచ్చిదుర్యోధనుని పక్షమందు మూడు అక్షౌహిణుల సైన్యము చేరెను. ఈరీతిగా దుర్యోధనునకు సహాయముగా వచ్చిన సైన్యమంతయు పదునొకండక్షౌహిణులాయెను.

జనమేజయ మహారాజా! యీరీతిగా దుర్యోధనునకు సహాయము చేయుటకు పదునొకం డక్షౌహిణుల సైన్యము హస్తినాపురమునకు వచ్చి చేరెను. దుర్యోధనునివద్ద చేరిన పదునొకం డక్షౌహిణుల సైన్యములును హస్తినాపురమందు నిలుచుటకు అవకాశము లేదు. అందువలన దుర్యోధను డతిశయించిన సంతోషము గలవాడై ఆ సైన్యములను నానావిధ స్థలముల యందును నిలుచునట్లుగా నియమించెను. ఆ దుర్యోధనుని ఆజ్ఞాప్రకారము అతని పక్షపు సైన్యములన్నియు కురుజాంగలమందును, కామ్యకవనమందును, మరుదేశమందును, అహిచ్ఛత్రమందును, కాలకూటపర్వత మందును, గంగా తీరమందును, వారణావతమందును, వటస్థానమందును నిలిచియుండెను. ఆ సైన్యములకు ధన ధాన్యాది సమస్తవస్తు సంచయముగలిగి యున్నందున ఆయా స్థలములందు దిగి విచ్చలవిడిగా సంచరించుచుండెను.

జనమేజయ మహారాజా! పూర్వము ద్రుపదరాజు పంపగించిన పురోహితుడు, తగినరీతిగా హస్తినాపురమునకు వచ్చి ధృతరాష్ట్రుని [illegible] ఆ పురోహితుడు భీష్మ, ద్రోణ, కృపాచార్య, అశ్వత్థామ [illegible]లను [illegible]. ఆ పురోహితుడు భీష్మాదుల గృహములకు [illegible]. వారితో తగురీతిని మాటలాడి వారిని సంతోషింప

జేసెను. పురోహితుడు దుర్యోధనుని చూచెను. పురోహితుడు తన నేర్పరితనముచేత ప్రతినిత్యము ధృతరాష్ట్రుని సేవింపుచు అతనికి ప్రీతికలిగించెను. అంతట ఒకనాడు ధృతరాష్ట్రుని మహాసభయందు సకల సేనాధిపతులను కలయజూచి పురోహితు డిట్లనెను.

రాజులారా ! ధృతరాష్ట్ర మహారాజు పాండుమహారాజు ఇద్దరును సహోదరులుగదా ! ఆ ధృతరాష్ట్ర పాండురాజులయొక్క కుమారులగు కౌరవులును పాండవులును, తమ తండ్రుల ధనములను తీసికొనుట మీ కందరికిని యిష్టమేకదా ! ఆ విషయమును అటు లుండనిండు. ఇదివరకు జరిగిన విషయము లన్నియు అందరికి విస్పష్టముగా తెలిసియే యున్నవి. ఆ పాండవులను చెరచుటకు దుర్యోధన మహారాజు ప్రాణాపాయములైన పనులను చేయించెను. పాండవులు వారి పుణ్యవశమువలన సకల ఆపదలను తప్పించుకొనిరి. పాండవులు తమ భుజాబలమువలన తమ రాజ్యపదవిని పొంది అభివృద్ధిగలిగి దిగ్విజయముచేసి ప్రకాశించి యుండిరి. అంతట దుర్యోధనుడు మాయాజూదమందు వంచనచేసి ఆ పాండవుల రాజ్యలక్ష్మిని హరించెను. ఈ విషయములన్నియు మీరా రెరుగుదురుకదా ! ఈ విషయముల నన్నిటిని ధృతరాష్ట్ర మహారాజు సమ్మతించి యూరకున్నాడు. ఇక నేనేమి చెప్పగలను? పాండవుల భార్యయగు ద్రౌపది సభకు రప్పించి పాండవులు చూచుచుండగా కట్టిన వస్త్రములను యీ దుర్యోధను డొలిపించెను. పాండవుల రాజ్యలక్ష్మిని అపహరించెను. పాండవులను ఘోరారణ్యములకు పంపించి పండ్రెండు సంవత్సరముల పర్యంతము వనవాసము చేయించెను. ఒక సంవత్సర పర్యంతము అజ్ఞాతవాసము చేయించెను. దుర్యోధనుడు పాండవులకు సమస్తమైన కష్టములను అవమానములను కలుగజేసి దైన్యముగా అవమాన వాక్యములను మాటలాడెను. ఈకష్టముల నన్నిటిని పాండవులు

సహించి వనవాస అజ్ఞాతవాసములను చేసివచ్చి యిప్పుడు సంధి గోరుచున్నారు. ఈ ధృతరాష్ట్ర మహారాజు మాత్సర్యము లేనివాడై సూరందరును యీ కౌరవ పాండవుల ప్రవర్తనను యెరిగి బుద్ధి చెప్పవలయును. ఆ పాండవులు యీ కౌరవుల కోపవిరోధములను సమ్మతించుటలేదు. యుద్ధము చేసినయెడల భూమియందుండు ప్రజలకు నాశము కలుగునని తలచుచున్నారు. అట్టి ప్రజానాశనమునకు పాండవులు సమ్మతింపక సంధిని కోరుచున్నారు. పాండవులు ధర్మాత్ములగుటవలన ప్రజానాశనమునకు సంశయించుచున్నారు. కనుక పాండవులను బలహీనులని తలచవద్దు. పాండవుల పక్షమున స్వల్ప అక్షౌహిణుల సైన్యము లున్నవనియు మీరు తలతురేమో చెప్పెదను వినుడు.

భీము డపరిమితభుజాబలవంతుడు. సాత్యకి మిక్కిలి సాహసవంతుడు. భీమసాత్యకు లిద్దరును ఘోరయుద్ధములయందు పదియు అక్షౌహిణుల సైన్యములతో సమానులగుదురు. వారి పరాక్రమములను మీరెరిగియేయుందురు. గాండీవమును ధరించిన అర్జునునితో యుద్ధము చేయబూనినవానిని జూచినా కొండను ఢీకొనదలచిన మేకపోతుచందమగును. అర్జునుని అపరిమిత భుజబల శౌర్యధనుర్విద్యాసమర్థత్వములను చెప్పుటకు సాధ్యముగాదు. పూర్వము అడవి పందినిమిత్తమై రుద్రదేవుడు అర్జునునితో యుద్ధముచేసెను. అర్జునుని భుజాబలశౌర్య ధనుర్విద్యాతిశయములను రుద్రుడే యెరుగును గాని మరియొకడు యెరుగజాలడు. పరమేశ్వరుడగు కృష్ణుడు సకలఉపాయములను యెరిగినవాడు. శత్రువుల భుజాబలశౌర్య దివ్యాస్త్రములను అపహరించుటకు సకలప్రయత్నములను చేయగలడు. తగినట్లు ఆలోచన చెప్పువాడగును. వివేకధైర్యాది సకలసమగ్రగుణసంపన్నుడగును. సకలవిద్యలను సమగ్రముగా యెరిగినవాడు. అట్టి కృష్ణుడు పాండవుల

పక్షమందు చేరియున్నాడు. కృష్ణుడు సహాయుడై యున్నప్పుడు పాండవుల కసాధ్యకార్య మెద్దియును లేదు. ఇప్పుడు సంధి చేయుటకు మంచి సమయము. ఈ సమయమందు మహాత్ములైన పాండవులను ప్రీతి పూర్వకముగా పిలిపించి వారి భూమిని వారికి పంచియిచ్చి కౌరవులకును పాండవులకును స్నేహము కలిగింపుడు. ఇట్లు సంధిచేసి మీ రందరును సుఖముగా బ్రతుకుడు. ఈ సమయము తప్పిన యెడల వెనుక సంధికలుగదు. ఈరీతిగా కౌరవులు కొంతభూమిని పాండవులకు యిచ్చి వారితో స్నేహము కలిగియుండుట మిక్కిలి మంచిది. అని ప్రుపదుని పురోహితుడు అందరు వినునట్లుగా కౌరవసభయందుండు సేనాపతులతో చెప్పెను. ఆ బ్రాహ్మణుని మాటలు సన్నిగిని భీష్ముడు విని పురోహితునితో యిట్లనెను.

మహాత్మా! బ్రాహ్మణోత్తమా! పాండవులు సకల ఆపదలను తప్పించుకుని తన బంధువులతో కలిసి కృష్ణునితో చేరియున్నారు. పాండవులు సుఖముగానుండుట మన భాగ్యమేయగును. అయ్యో! పాండవులు సకలకష్టములను పొంది, పరమశాంతులై విరోధములను విడిచి సంధిని కోరుచున్నారు. ఇది మిక్కిలి మంచిమార్గము. నీ వాక్యము బ్రాహ్మణస్వాభావికమై చెవికి కఠినముగా నున్నను మంచి నీతిని తెలుపుచున్నది. నీవాక్యము యీసభవారి కందరికిని మాధుర్యముగా తోచుచున్నది. పాండవులు బలహీనులవలె వనవాసమును జరిపిరి. పూర్వము సభయందు పాండవులు మిక్కిలి అవమానపడి పిమ్మట వనమునకు వెళ్ళి బహుకష్టములనుపొందిరి. పిమ్మట విరాటుని పట్టణమందుండి దీనులై అజ్ఞాతవాసమును జరిపిరి. ఇట్లు పాండవులు పొందినదుఃఖముల సన్నిగిని లోకమంతయు నెరుగును. అపుణ్యాత్ములగు పాండవులను కష్టపెట్టరాదు. ధృతరాష్ట్రమహారాజు పిత్రార్జితమైన రాజ్యభాగమును పాండవులకు పంచిపెట్టవలెను. తన పుత్రులవలె

సహించి వనవాస అజ్ఞాతవాసములను చేసివచ్చి యిప్పుడు సంధి గోరు చున్నారు. ఈ ధృతరాష్ట్ర మహారాజు మాత్సర్యము లేనివాడై వారందరును యీ కౌరవ పాండవుల ప్రవర్తనను నెరిగి బుద్ధి చెప్పవలయును. ఆ పాండవులు యీ కౌరవుల కోరిన విరోధమును సమ్మతించుట లేదు. యుద్ధము చేసిన యెడల భూమియందుగల ప్రజలకు నాశము కలుగునని తలచుచున్నారు. అట్టి ప్రజానాశనమును పాండవులు సమ్మతింపక సంధిని కోరుచున్నారు. పాండవులు ధర్మాత్ములగుటవలన ప్రజానాశనమునకు సంశయింపుచున్నారు. కనుక పాండవులను బలహీనులని తలచవద్దు. పాండవుల పక్షమున స్వల్ప అక్షౌహిణుల సైన్యము లున్నవనియు మీరు తలతురేమో చెప్పెదను వినుడు.

భీముడపరిమితభుజాబలవంతుడు. సాత్యకి మిక్కిలి సాహసవంతుడు. భీమసాత్యకు లిద్దరును ఘోరయుద్ధములయందు వేయి అక్షౌహిణుల సైన్యములతో సమానులగుదురు. వారి పరాక్రమములను మీరెరిగియేయుందురు. గాండీవమును ధరించిన అర్జునునితో యుద్ధము చేయబూనినవానిని జూచిన సింహమును యెదిరింపబూనిన మేకపోతుచందమగును. అర్జునుని అపరిమిత భుజబలశౌర్యధనుర్విద్యాసమర్థత్వములను చెప్పుటకు సాధ్యముగాదు. పూర్వము అడవి పందినిమిత్తమై రుద్రదేవుడు అర్జునునితో యుద్ధము చేసెను. అర్జునుని భుజాబలశౌర్య ధనుర్విద్యాతిశయములను రుద్రుడే యెరుగును గాని మరియొకడు యెరుగజాలడు. పరమేశ్వరుడగు కృష్ణుడు సకలధర్మములను యెరిగినవాడు. శత్రువుల భుజాబలశౌర్య దివ్యాస్త్రములను అపహరించుటకు సకలప్రయత్నములను చేయగలడు. హితసత్యము ఆలోచన చెప్పువాడగును. వివేకధైర్యాది సకలసమగ్రగుణసంపన్నుడగును. సకలవిద్యలను సమగ్రముగా యెరిగినవాడు. అట్టి కృష్ణుడు పాండవుల

పక్షమును చేరియున్నాడు. కృష్ణుడు సహాయుడై యున్నప్పుడు పాండవుల కసాధ్యకార్య మెద్దియును లేదు. ఇప్పుడు సంధిచేయుటకు మంచి సమయము. ఈ సమయమందు మహాత్ములైన పాండవులను ప్రీతి పూర్వకముగా పిలిపించి వారి భూమిని వారికి పంచియిచ్చి కౌరవులకును పాండవులకును స్నేహము కలిగింపుడు. ఇట్లు సంధిచేసి మీరందరును సుఖముగా బ్రతుకుడు. ఈ సమయము తప్పినయెడల వెనుక సంధికలుగదు. ఈరీతిగా కౌరవులు కొంతభూమిని పాండవులకు యిచ్చి వారితో స్నేహము కలిగియుండుట మిక్కిలి మంచిది. అని ద్రుపదుని పురోహితుడు అందరు వినునట్లుగా కౌరవసభయందుండు సేనాపతులతో చెప్పెను. ఆ బ్రాహ్మణుని మాటలు నన్నిటిని భీష్ముడు విని పురోహితునితో యిట్లనెను.

మహాత్మా! బ్రాహ్మణోత్తమా! పాండవులు సకల ఆపదలను తప్పించుకుని తమ బంధువులతో కలిసి కృష్ణునితో చేరియున్నారు. పాండవులు సుఖముగానుండుట మన భాగ్యమేయగును. ఆర్యా! పాండవులు సకలకష్టములను పొంది, పరమశాంతులై విరోధములను విడిచి సంధిని కోరుచున్నారు. ఇది మిక్కిలి మంచిమార్గము. నీ వాక్యము బ్రాహ్మణస్వాభావికమై చెవికి కఠినముగా నున్నను మంచి నీతిని తెలుపుచున్నది. నీవాక్యము యీసభవారి కందరికిని యథార్థ్యముగా తోచుచున్నది. పాండవులు బలహీనులవలె వనవాసమును జరిపిరి. పూర్వము సభయందు పాండవులు మిక్కిలి అవమానపడి పిమ్మట వనమునకు వెళ్ళి బహుకష్టములనుపొందిరి. పిమ్మట విరాటుని పట్టణమునందు దీనులై అజ్ఞాతవాసమును జరిపిరి. ఇట్లు పాండవులు పొందినదుఃఖముల నన్నిటిని తోచినయంతయు నెరుగుదును. ఆపుణ్యాత్ములగు పాండవులను కష్టపెట్టరాదు. ధృతరాష్ట్రమహారాజు పిత్రార్జితమైన రాజ్యభాగమును పాండవులకు పంచిపెట్టవలెను. తన పుత్రులవలె

చూడవలయును. ఇట్లు చేసినయెడల లోకమంతయు ధృతరాష్ట్రుని మెచ్చుకొనగలదు. ధర్మరాజు పిలిపించబడి జూద మాడరాదని చెప్పక సత్యవాక్యమునకు కట్టుబడెను. ధర్మరాజు సత్యవాక్య ధర్మమును తప్పుటకు భయపడి రాజ్యమును విడుచుటకు సమ్మతించెను. అటువంటి ధర్మరాజు ఆజ్ఞాపింపగా అర్జునుడు సహించెనే గాని అర్జునునకు కోపముగలిగినప్పుడు యెంతటి మొనగాండ్రైనను యీలోకమందు అర్జునుని యెదిరింపజాలరు. అని యిట్లు సభయందు అందరు విను చుండగా భీష్ముడు ద్రుపదుని పురోహితునితో చెప్పెను. భీష్ముని మాటలకు కర్ణుడు కోపించుకొని భీష్మునితో యిట్లనెను.

భీష్మా! యీ కార్యమును జనులందరును యెరిగియే యున్నారు. ఈ విషయమై నీవు పలుమారు చెప్పవలసిన పనిలేదు. దుర్యోధనునికై ధర్మరాజుతో శకుని జూదమాడి అతని రాజ్యమును గెలిచెను. ధర్మరాజు తన రాజ్యమును శకునికి ఓడెను. ఇందుననేమి తప్పులేదు. ధర్మరాజు తాను ఓడిన ఏర్పాటు ప్రకారము అడవికి వెళ్ళి వనవాసము చేసెను. అట్లు ఓడిపోయిన ధర్మరాజు తనరాజ్యమిప్పుడు తమకు తగునని తలచి యిప్పుడు వచ్చెను. ధర్మరాజు కోరుట వెర్రి తనమగును. ధర్మరాజు విరాటద్రుపదరాజులను సహాయముగా జేసి కొని బలవంతుడై యుద్ధమునకు ప్రయత్నించి రాజ్యమును అడుగు చున్నాడు. దుర్యోధన మహారాజు భయపడి ధర్మరాజునకు రాజ్య భాగమును యివ్వడు. లోకమందు యిటువంటి న్యాయములు యెక్కడను కనబడలేదు. అని కర్ణుడు భీష్మునితో చెప్పగా ఆ మాటలను భీష్ముడు కటకటబడి కర్ణునితో యిట్లనెను. ఓరీ! కర్ణా! నీవు చక్కగా కొట్టబడి పెద్ద మొనగాడవగుదువు. ఛీఛీ ఆపాండవులు నవ్వునట్లుగా మాటలాడెదవు. నీవు అధిక ప్రసంగమును చేయకుము. అర్జును డపరిమిత పరాక్రమశాలి. అతడొక్కడే గడచినదినమందు ఉత్తరగోగ్ర

హాణములో మనలను ఆరుగురిని గెలిచెను. ఇక్కడ నేటిదినమందు నీవు మాటలచేత అర్జునుని గెలుచుచున్నావు. మాటలచేత మన రాజుసభయందు నీవు అర్జునుని గెలిచెదవేగాని వాస్తవముగా యుద్ధమం దర్జునుని గెలువజాలవు. అతడు విరాటుని గోవుల వెనుకకువచ్చి నప్పుడు పాండవుల అజ్ఞాతవాస కాలవిషయమై దుర్యోధనుడు నన్ను అడిగెను. నీవును ద్రోణాచార్య కృపాచార్య అశ్వత్థామలును విను చుండగా ఆపాండవులకు అజ్ఞాతవాసము పూర్ణమాయెనని నేను దుర్యోధనునితో తెలియజెప్పితిని అని భీష్ముడు కర్ణునితో చెప్పెను. అంతట ధృతరాష్ట్రుడు భక్తిపూర్వకముగా భీష్ముని ఆదరించి కర్ణుని నిందించెను. అంతట ధృతరాష్ట్రుడు ప్రీతిపూర్వకముగా ద్రుపదుని పురోహితునితో యిట్లనెను.

మహాత్మా! బ్రాహ్మణోత్తమా! నేనును నా బంధుమిత్ర పుత్రులును, పెద్దలును ఆలోచించుకొని యిప్పుడే తగినమనుష్యుని నాపుత్రులగు పాండవుల దగ్గరకుసంపించెదను. నామనస్సున ఆపాండవులతోకలసి వర్తించుటయే యీ కౌరవ కులమునకు మేలగును అని తోచుచున్నది గనుక నేను తగినమనుష్యుని పాండవులదగ్గరకు పంపించెదను. నీవుముందుగా పాండవులదగ్గరకు వెళ్లుము. అనియిట్లు ధృతరాష్ట్రుడు ద్రుపదుని పురోహితునితో చెప్పెను. అతనికి భూషణ వస్త్రసహితమైన తాంబూలమును యిచ్చెను అంతట బ్రాహ్మణుడు డాపాండవులుండెడి వుపప్లావ్య పట్టణమునకు వెళ్ళి పాండవులనుజూచి తాను హస్తినాపట్టణమునకువెళ్ళి సభయందు మాటలాడిన విషయ మునంతయు పాండవులతో జెప్పెను. జనమేజయమహారాజా! అంతట హస్తినాపట్టణమందుండు ధృతరాష్ట్రుడు తనపుత్ర మిత్ర మంత్రి వృద్ధ జనసహితుడై యుండి ఆస్థానమంటపమందు కూర్చుండి సంజయుని రప్పించి ఆసంజయునితో ధృతరాష్ట్రు డిట్లనెను.

## ధృతరాష్ట్రుడు సంజయుని పాండవులయొద్దకు పంపుటను

సంజయా ! మన పాండవులు ఉపప్లావ్యపట్టణమునకు వచ్చియున్నారు. పాండవులు కృష్ణునితో కూడియున్నారు. పాండవుల దగ్గరకువెళ్ళి వారిముఖము యెట్లునివర్తించునో అప్రయత్నముగా పాండవులతో మాటలాడుము. నీవు పాండవులదగ్గరకు వెళ్ళి నావిన్నపముగా మొదట చెప్పవలసిన మాటలను చెప్పెదను వినుము. [illegible] ధృతరాష్ట్రుడు మీరువనవాసమునుజరిపి వచ్చినందుకు సంతోషించెను. ధృతరాష్ట్రుడు వట్లుసంతోషించి నన్నుమీదగ్గరకు పంపెను అని మొదట చెప్పుము అని ధృతరాష్ట్రుడు సంజయునితో చెప్పి తన చుట్టునుండెడి వారలతో యిట్లనెను.

సభికులారా ! నాకొడుకగు దుర్యోధనుడు కార్యాకార్య విషయములను యెరుగడు. అందుచేత పాండవులకును కౌరవులకును యిట్లు విరోధము కలిగెను. పాండవులు మహాత్ములు. దృఢధైర్య వంతులు. యుద్ధశూరులు. పాండవులయందు దోషములేదు. మనము పాండవులును పాలలో నీళ్ళు కలిసియున్నట్లు కలిసి బ్రతుకవలయును. పాండవులు కష్టములను పొందవలసినవారు కారు. వారి తండ్రి సొత్తగు భూమిని వారు పరిపాలించుటకు అర్హులగుదురు. [illegible]లను అబద్ధము పలుకు వారనియు, అన్యాయపరులనియు, గర్వమును కలవారనియు, తలచి పాండవులు నమ్మరు. మనతో కలిసియుండుటను పాండవులు సమ్మతింపజాలరు. అయినను స్నేహముగా వర్తించుటకు ధర్మరాజు గలడు. అని ధృతరాష్ట్రుడు తన చుట్టునుండు సభికులతో చెప్పెను.

సభికులారా ! మనము దురహంకారముచేత పాండవులకు రాజ్యభాగమునుపంచిపెట్టకుండనుండరాదు. మనము పాండవులకు రాజ్య

భాగమును పంచి యివ్వక గర్వముగా మాటలాడిన యెడల అర్జునుడు కృష్ణుని సారథ్యముగలవాడై గాండీవమును యెక్కుపెట్టి మూడు లోకములను సంక్షోభింప జేయగలడు. భీముడు గొప్ప గదాయుధమును దీసికొని కోపవేగముచేత కురుకుమారులమీదకు వచ్చును. ఆ భీముని తలచినయెడల నా మనస్సునకు భయము గలుగుచున్నది. నిశ్చయముగా భీముని యెదిరించుటకు యెవ్వరును సమర్థులుగారు. నకుల సహదేవులు తమఅన్నలకంటె తక్కువైనవారు కారు. ద్రుపద రాజు అల్పుడు కాడు. ద్రుపదుని కొడుకులు సమగ్రమైన భుజబలసంపన్నులు. విరాటుడును అతని తమ్ములును, కొడుకులును తక్కువైన వారు కారు. సాత్యకి సాధారణమైనవాడు కాడు. సాత్యకివెంబడిగల యాదవకుమారులు గొప్పయోధులు. పాండవపక్షమునందుండు పాండ్య రాజు, కేకయరాజు, వారివారి బంధుమిత్రులును తక్కువైనవారు కారు. వారి నందరను మనము గెలుచుటకు సమర్థులమైనను ధర్మరాజు కోపమునకు మనము భయపడవలయును. ధర్మరాజుయొక్క కోపమును రుద్రుడైనను సహింపజాలడు. అని యిట్లు ధృతరాష్ట్రుడు తన చుట్టుప్రక్కల నుండిన సభికులతో చెప్పి సంజయుని వైపు ముఖముంచి అందరు వినుచుండగా మరల యిట్లనెను.

సంజయుడా! నీవు ధర్మరాజుదగ్గిరకు తిన్నగా వెళ్ళుము. ధర్మరాజు పెద్ద సభదీరి యున్నప్పుడతనికి నీవు కనిపించుము. ఆ సభయందు ధర్మరాజునకు అతని తమ్ములకును అతని బంధువర్గమునకును సంతోషము కలుగునట్లుగా మాటలు చెప్పుము. ఆ ధర్మరాజునకు స్నేహభావము కలుగునట్లు తియ్యని కమ్మని మాటలను చెప్పుము. సకల కోపములు నశించునట్లుగా మాటలు చెప్పుము. యుద్ధము మొదలగు కోపకార్యములను మానునట్లుగా ధర్మరాజుదగ్గిర మాధుర్యముగా మాటలు చెప్పుము. నీవు శాంతవాక్యములను చెప్పి

కార్యము చక్కచేసికొని యీ కౌరవులును, పాండవులును, ఒక్కటిగా చేరి బ్రతుకునట్లు సమ్మతింపజేసి రమ్ము. శీఘ్రముగా రథమెక్కి పొమ్ము అని ధృతరాష్ట్రుడు సంజయునితో చెప్పి సగౌరవప్రకారముగ పంపించెను.

## సంజయుడు ఉపప్లావ్యమున నున్న పాండవుల యొద్దకు వచ్చుట

అంతట సంజయుడు వాయువేగముతో సహాసముగా పోగల గుర్రములను పూన్చిన రథమెక్కి ఉపప్లావ్య పట్టణమునకు పోయెను. సంజయుడు కృష్ణుని గృహమునకు వెళ్ళెను. కృష్ణు డర్జునునితో గూడి యుండి రహస్య వినోదములయందుండెను. సంజయుడు వారిని రాకను కృష్ణున కెరింగించి తగురీతిని కృష్ణుని గృహములో ప్రవేశించెను. సంజయు డతివినయ భక్తులచేత ప్రకాశించుచు కృష్ణార్జునులను జూచెను. ఆ కృష్ణార్జునులిద్దరును సంజయుని గౌరవించిరి. అందుకు సంజయుడు సంతోషించి మరునాడు ధర్మరాజు పెద్ద సభదీర్చి యుండగా ఆ సభకువచ్చి తగిన ప్రకారము ధర్మరాజునుజూచి సాష్టాంగ దండప్రణామము చేసెను. ధర్మరాజు ప్రీతిపూర్వకముగా సంజయుని ఆదరించి తన సమీపమందు కూర్చుండబెట్టుకొనెను. అప్పుడు సంజయుడు ధర్మరాజును సేవింపుచుండి అతనితో యిట్లు అనెను.

మహాత్మా! ధర్మరాజా! నా భాగ్యవశమున నిన్ను జూచినందున నా నేత్రములు కృతార్థములాయెను. మీ తండ్రియగు ధృతరాష్ట్రమహారాజు యిక్కడ మీరున్న సమాచారమును తెలిసి ప్రీతిపూర్వకముగా యిక్కడికి నన్ను పంపెను. మీయందు గల పుత్రస్నేహముచేత ధృతరాష్ట్ర మహారాజు నీ యొక్కయు నీ సహోదర పుత్రులయొక్కయు ద్రౌపది యొక్కయు యోగక్షేమ

ప్రకారమంతయు విచారించి తెలియుటకొరకు నన్ను పంపించెను. అని సంజయుడు ధర్మరాజుతో చెప్పగా ధర్మరాజు యిట్లనెను.

సంజయుడా! మాతండ్రియగు ధృతరాష్ట్ర మహారాజు మా యందుగల కృపచేత యిట్లు సుఖముగానున్నాము. ఆ ధృతరాష్ట్ర మహారాజు నిన్ను పంపించినందున నాకు మిగుల సంతోషమయ్యెను. ఆ ధృతరాష్ట్ర మహారాజునకు క్షేమమేకదా? అతని కొడుకులగు దుర్యోధన దుశ్శాసనాదులందరును సుఖముగా నున్నారుగదా! ధృతరాష్ట్ర మహారాజు యొక్క మనుమలందరును పరమసంతోష ముగా పెరుగుచున్నారుగదా! హస్తినాపురమందలి జనులందరును పరమ సంతోషముగా పెరుగుచున్నారుగదా! ద్రోణాచార్యుడు కృపాచార్య అశ్వత్థాములును సుఖముగా నున్నారుగదా! పుణ్యాత్ముడైన భీష్ముడు కుశలమేగదా! కౌరవులందరును భీష్మునకు పెద్దతన మిచ్చి అతనిని అనుసరించి ప్రవర్తింతురుగదా! బ్రాహ్మణులకు గౌరవము కలిగియున్నదిగదా! మేము బ్రాహ్మణులకు యిచ్చిన మాన్యములను, అగ్రహారాది వృత్తులును చెల్లుచున్నవి గదా! శత్రురాజులుదండెత్తివచ్చిభయమును కలిగింపరుకదా! యుద్ధకలహ ప్రస్తావకాలములయందు ఆ కౌరవులు అర్జునుని భుజాబలమును తలచుచుందురుకదా! భీముని గదాయుధ విహారములను చెప్పు కొందురుగదా! నకుల సహదేవులు శత్రురాజుల భూములను ఆక్ర మించుటను తలచి పొగడుచుందురుగదా! పూర్వము ఆ కౌరవులు చూచుచుండగా భీమార్జున నకులసహదేవులు అనేక పర్యాయములు శత్రురాజుల భూములను తీసికొనిరి. అనేక యుద్ధములందు శత్రు రాజులను భీమార్జునులు గెలిచిరి. భీమార్జునుల పరాక్రమములను కౌర వులు స్పష్టముగా చూచియున్నారు. అట్టి పాండవులను ఒకనాడైనను కౌరవులు పొగడుచుందురుగదా! కౌరవులు ఘోషయాత్రకు వచ్చి

నప్పుడు గంధర్వులచేత పట్టినయాపదను మఱచెను. సంజయా! మనము మధ్యస్థులుగా మాటలాడుదము. యుద్ధమందు అర్జునుని యెదురించి యెంతవాడైనను ప్రాణమానములను దక్కించుకొని పోజాలడు. అట్లు దక్కించుకొని పోజాలినవానిని కనుగొనుము. కర్ణుడు దుర్యోధనుని గృహమందుండి తగిన కార్యములకును, యితర వ్యవహారములకును, చాతుర్యముగా మెలయుచు పెత్తనము చేయుచున్నాడుగదా! అని ధర్మరాజు సంజయునితో చెప్పి అడిగెను. అప్పుడు సంజయుడు వినయపూర్వకముగా యిట్లనెను.

మహాత్మా! ధర్మరాజా! ఆదుర్యోధనునిదగ్గర అనేకులును, నీతిమంతులును, బలవంతులును, దురహంకారులును, మరి యనేక విధములుగా నుండువారు, అనేకులు గలరు. వారందరును ఒకరొకరు ఒకరి మాటప్రకారము ప్రవర్తింపరు గనుక వారి నంతగా గౌరవింపరాదు. నావిన్నపమును వినుము. నీవు సంధిని కోరుచున్నావు. నీవు శాంతమగు చల్లని మనస్సును గలిగియున్నావు. ఇదివరకు కౌరవులకు క్షేమము లేకున్నను యిప్పుడు నీవు శాంతచిత్తము కలిగియున్నందున యికమీదట కౌరవులకు క్షేమము కలుగ గలదు. ధృతరాష్ట్రుడు ముసలివాడైనందున అతని చిత్తము ఒకవిధముగా నుండజాలదు. అందువలన అతని కుమారుడగు దుర్యోధనుని దుర్బుద్ధిని మాన్పజాలడు. ఇప్పుడా ధృతరాష్ట్రుడు మంచి మనస్సుతో శాంతుడైయున్నాడు. ఈవిషయములన్నియు నీ పుణ్య చిత్తవృత్తిచేత సహించిన యెడల మంచిదై చెల్లెను. నీవు పరమ ధర్మబుద్ధి గలవాడవు. నీవు శత్రువు లేనందున అజాతశత్రుడని పేరుకలిగెను. ఆ పేరుచేత నీవు సర్వలోకములందును కీర్తిని పొందియున్నావు. పూర్వము బ్రహ్మదేవుడు జగత్తులయందుగల పాపమును అంధకారమును జయింపదలచి బ్రాహ్మణులను వెలుగును సృష్టించెను. అటు

వంటి బ్రాహ్మణులకు మీవంటి సత్పురుషులు జీవనముల నివ్వగా అట్టి జీవనములను యెంత దుర్మార్గులైనను పోగొట్టరు. బ్రాహ్మణ జీవనములను పోగొట్టిన పాపాత్ములకు ఆయురైశ్వర్యములు నశింపగలవు. ఒక్కొకచోట శత్రురాజుల భటులు కౌరవులను యెదిరించి యుద్ధము చేయునప్పుడు జనులు దుఃఖము గలవారై యుండిరి. అప్పుడు మన భీమార్జున నకుల సహదేవులలో ఒక్కడైనను లేకపోయెను. పాండవులలో నొక్కడైనను అప్పుడిక్కడున్న యెడల యీ శత్రువుల పొగరణచియుందురు. అని జనులు చెప్పుకొనుచుందురు. పాండవులు మహా బలవంతులైనను, శాంతచిత్తులనియు, కోపముచేత అధర్మకార్యమును చేయరనియు జనులందరును మిమ్ములను తలంచుకొని పొగడుకొను చుందురు. అని సంజయుడు ధర్మరాజుతో చెప్పెను.

ధర్మరాజా! నీనలుగురు తమ్ములును, కృష్ణదేవుడును వినుచుండగా నేను మీతో విన్నవింపవలసిన వాక్యములు కొన్నిగలవు. ఆవాక్యములను క్రమముగా చిత్తగింపుము. అని సంజయుడు చెప్పగా ధర్మరాజు యిట్లనెను. సంజయా! ఇదిగో నాతమ్ములందరును యిక్కడనేయున్నారు. నా స్నేహితులందరును యిదిగో యిక్కడనే యున్నారు. కృష్ణుడును యిదిగో యిక్కడనేయున్నాడు. ఈ సభయందుగల సర్వజనులు వినుచుండగా నీమాటలను చెప్పుటకు ఆ ధృతరాష్ట్రుడు నిన్ను పంపించెనో ఆమాటలనన్నిటిని చెప్పుము. అని ధర్మరాజు సంజయుని అడిగెను. ఆధర్మరాజుయొక్క ధర్మమైన వచన సరణికి సంజయుడు మనస్సులో భయపడుచు కృష్ణభీమార్జున నకుల సహదేవ ధృష్టద్యుమ్న ద్రుపద విరాటరాజులను భక్తివినయ పూర్వకముగా జూచి సావధానులై వినుడని చెప్పెను. సంజయుడు వినయమర్యాదలు మూర్తీభవింప రెండుచేతులను జోడించుకొని

ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! మీతండ్రియగు ధృతరాష్ట్ర మహారాజు శాంతచిత్తము గలవాఁడు కార్యనిశ్చయమును శ్రద్ధతో గమనించి ప్రీతిపూర్వకముగా యిక్కడికి నన్ను పంపెను. అందువలన ఆమహారాజెనాకు రథమును పంపించెను. ఆ మహారాజు చెప్పుమన్న మాటలను విన్నవించుకొనెదను. చిత్తగించుము. ఈసమయమున మనము తెలివిగలవారమై సంధి సేయవలయును. యుద్ధమునకు గడంగుట బహుచులకనగు కార్యము. మీరు సర్వధర్మములు తెలిసిన వారు. శాంతులు, పెద్దలు, ఇటువంటి మీరు కౌరవులతో యుద్ధము చేయరాదు. సర్వవిధములచేతను యుద్ధమును తొలగింపవలెను. మడలచీరయందు మసిగలిగినట్లు మీభరతకులమందు మనోవ్యథనుని నిమిత్తమువలన పాపము కలిగెను. ధర్మరాజా! యీ పాపమును పోగొట్టుటకు నీవే సమర్థుడవు. యుద్ధము చేసినయెడల సకలజన క్షయము సంభవించును. తుదకు యుద్ధమందు జయము కలిగినను అపజయము కలిగినను గూడ సుఖములేదు. సౌఖ్యములేని యిటువంటి యుద్ధకార్యమును చేయుటకు మీవంటి వుత్తములు ప్రయత్నింపరు. నీవు యుద్ధమందు సకలవృద్ధగురు బాలమిత్రబంధువుల నందరిని చంపి సర్వసౌఖ్యములను పొందిననుకూడ ప్రయోజనములేదు. ధర్మ రాజా! శ్రీకృష్ణదేవుడు నీకు పెట్టనికోటవంటివాడు. భీమార్జునులిద్దరును యుద్ధమందు నిప్పుమంటలవంటివారు. సాత్యకి ప్రముఖవీరాదులు యుద్ధమందగ్నుల బోలియుందురు. ఇటువంటి వారందరు నీకు సహాయులై యుందురు. నీవు యుద్ధము చేయుటకు సమ్మతింపవుగాని యుద్ధమునకే సమ్మతించిన దేవతలైనను నిన్ను గెలువజాలరు. ఏవిధముచేతనైనను యుద్ధముచేయక సంధిచేసుకొనుట మంచిది. అని యీ విధముగా ధృతరాష్ట్రమహారాజు నీతో చెప్పుమని నన్ను పంపించెనని సంజయుడు ధర్మరాజుతో చెప్పెను.

ధర్మరాజా! ఇకను కౌరవుల పక్షమందుండు వారిని చెప్పెద నవధరింపుము. భీష్మ, ద్రోణ కృపాచార్య, అశ్వత్థామ, కర్ణ, శల్యులు దుర్యోధనునకు ప్రాణములవంటి వారని చెప్పెదను. దుర్యోధనుని తమ్ములందరును మహాపరాక్రమవంతులు. దుర్యోధనుని కుమారులు యితరులచే జయింపబడనివారు. బాహ్లిక సోమదత్తు లిరువురును రుద్రునికైన భయపడని మహాధైర్యవంతులు. కౌరవులను జయించుటకు యెవ్వరికిని సాధ్యముగాదు. ధర్మరాజా! ఆ కౌరవులును మీరును అన్నదమ్ములు. మీ అన్యోన్యకలహము నాకు చూడగా మేలుగాతోచలేదు. రెండుపక్షములవారికి మేలు కోరు వారిని యీ విషయమై అడిగిచూడుము. అని సంజయుడు ధర్మరాజుతో చెప్పి సభయందుండు వారిని కలియజూచి యిట్లుచెప్పెను.

సభికులారా! కృష్ణదేవునకు నమస్కరించెదను. అర్జునునకు నమస్కరించెదను సొక్కంగల సకలబంధుమిత్రాదిరాజుల కందరకును నా నమస్కారము. నా విన్నపమును చిత్తగింపుడు. విన్నవించెదను. మీరందరును యీ ధర్మరాజునకు శమనమగునట్లు అనుజ్ఞనీయుడు. ఈ కృపాసముద్రుడగు ధర్మరాజునకు యిదిగో శరణు వేడుచున్నాను. అని చెప్పిన సంజయుడు దండప్రణామము పూర్వకముగా ధర్మరాజుయొక్క ముఖముజూచి యిట్లనెను. ధర్మరాజా! మీరు శాంతమును పొందుట మంచిది. మీరు శాంతినిపొందిన భీష్ముడు సంతోషించును. భీష్ముడు సమ్మతించిన విషయము సర్వలోకసమ్మతము. అని సంజయుడు ధర్మరాజుతో చెప్పగా ఆమాటలను ధర్మరాజు విని సంజయునితో నిట్లనెను సంజయా! యుద్ధము జరుగునని నీవు భయపడి యీ ప్రకారముగా చెప్పుచున్నావు. నేను చెప్పిన మాటలలో యిప్పటికైన స్నేహవిషయముతప్ప మరియొకవిషయము నీ చెవినుండు పోకనేమో తెలియలేదు. కౌరవులతో కలహము లేక

మేముండుట మాకు తగిన కార్యము. కలహము లేకనే కార్యసిద్ధి యగు పక్షమందు, అట్టి కార్యసిద్ధిని పొందక నేరవాడైనను నాని యొక కార్యమును చేయడు. భీమార్జునులిద్దరును మంచి కార్యములను చేయువారనియు, ధర్మయుక్తమగు పనులను గావించుదురనియు జనుల చేత పొగడబడుచుందురు. అటువంటి భీమార్జునులు పాపకార్యమును చేయుటకు సమ్మతింపరు. ఆలోచన లేని జనులు మిక్కిలి ఆశగల వారై సుఖమును గోరి దుఃఖముగలుగు కార్యములను చేయుటకు పూనుదురు. యోగ్యమైన ఆశనుగలిగి తగినప్రకారము నడచువారు అనుకూలముగా కార్యమును చక్కబడనియెడల పిమ్మట కలహింతురు. అట్లు కలహించినను దుఃఖకరమేయగును. గనుక యుద్ధముల వలన సుఖము లేదు. భోగములు మీకు అక్కర లేదా! యుక్తి తెలియజేసి చెప్పెదను వినుడు. వస్త్రమాల్యగంధములను అనుభవించునప్పుడును, నానావిధములగు వాద్యములను ప్రయోగించునపుడును, మాతండ్రి యగు ధృతరాష్ట్రుడు మమ్ములను విడిచి దుర్యోధనాదులకు మాత్రము యివ్వజాలడు. తనపుత్రులగు దుర్యోధనాదులను దగ్గర తీసి మమ్ముల నేమాత్రమును తొలగించుటకు కారణము లేదు. సంజయా! అయినను నే నొకమాటను చెప్పెదను. సమచిత్తుడవై వినుము. సంజయా! పూర్వము దుర్యోధనుడు మమ్ముల నవమానించి వక్రబుద్ధిగలవాడై నీతిమార్గమును విడిచెను. అయ్యో! ఆధృతరాష్ట్రమహారాజు యిప్పుడు మమ్ములను చక్కనిమార్గమందు ప్రవర్తింపుడని పూనికతో బుద్ధులు చెప్పుచున్నాడు. ఇంతమాత్రము చాలును. తమవలెనే యెదుటి వారిని జూచినయెడల మైత్రి కలిగియుండును. గాని భేదముగా జూచిన యెడల మనస్సు కలిసియుండదు. మాకు పూర్ణమగు కుడుమును యుండనియు మీరొకతునుకనుమాత్రమే తీసికొనుడనియు చాతుర్యముగా చెప్పినయెడల, యెప్పటికిని మనస్సు కలిసియుండదు. అని యీ విధముగా ధర్మరాజు చూపి చెప్పెను.

సంజయా ! మేము రాజ్యసంపదలను పీడయున్నందున అశక్తులముగా దోచుచున్నాము. ఇటువంటి మమ్ములనుపిలిపించి పూజించుటకు దుర్యోధను డంత వ్యర్థుడుగాడు. దుర్యోధనుడు మమ్ములను పిలిచి పూజింపదలచినయెడల పూర్వము బుద్ధిచెప్పినవారి మాటలను వినియేయుండునుగదా ! అటు లా దుర్యోధనుడు బుద్ధిచెప్పువారి మాటలను విననేరడు. నీవు మంచిమాటలచేత వ్యర్థముగా నామనస్సులను బాధింపకుము. దుర్యోధనుని నడవడిక మాకును నీకును వింతకలిగింపదు. దుర్యోధనుని చరిత్రను చెప్పుట మానుము. ధృతరాష్ట్రుడును తగునట్లు చెప్పువారి మాటల నాదరింపకుండును. తన కుమారుడగు దుర్యోధనుడు విషము మ్రింగినను వాడు పౌరుషము గలవాడని నమ్మి చూచుచుండును. పూర్వము జూదమందు గెలిచిన రాజ్యలక్ష్మికి ఆశపడరాదని విదురుడు చెప్పిన దుర్యోధనుడు కర్ణుడు మొదలగువారి మాటలు విని విదురుని మాటల నాదరింపలేదు. అంతటితో నా కార్యము ముగిసెను. ఇకమీదటగూడ, తనకొడుకులగు దుర్యోధనాదులును, శకుని కర్ణులును, యేరీతిగా నడిపించెదరో, ఆ రీతిగానే ధృతరాష్ట్రుడు ప్రవర్తించును గాని వేరుగా నుండడు. యీ కార్యపద్ధతి యీరీతిగా నున్నది. నీవు పెద్దల చరిత్రములో ప్రవేశించి మాటలాడుచున్నావు. దుర్యోధనుని దుర్మార్గస్వభావము నివారించుటకు సాధ్యముగాదని యెరుగనందుననో, వెర్రితనమువలననో నీవు యిట్లు చెప్పుచున్నావు. దుర్యోధనుడు చక్రాయుధమును ధరించియుండు కృష్ణదేవుని లక్ష్యముచేయడు. అర్జునుడు అపరిమిత పరాక్రమ వంతుడు. అర్జునునకు కర్ణుని భుజాబలమును యెదిరింప జేయదలచి దుర్యోధనుడు సకలరాజ్యమును లోబరచుకొని యున్నాడు. అని ధర్మరాజు సంజయునితో చెప్పుచు కొంచెము కోపముగలవాడై మరల యిట్లనెను.

సంజయా ! ద్రోణ భీష్మ కృపాచార్య అశ్వత్థామను కర్ణ దుర్యోధనులు యిదివరకు యుద్ధములయందు అర్జునుని యెరుగనట్లు తోచుచున్నది. వారందరును అర్జునుని యుద్ధములను యెరిగియుందురు. భీష్మాదులందరును ఆశలను త్రాడుచేత కట్టబడి బలా బలములను యెరుగక చచ్చుటకై అర్జునుని యెదిరింతురు. అర్జునుని కపిధ్వజ కాంతులచేత భీష్మ ద్రోణాదులందరును నశింపగలరు. నీవు నాయొద్ద ముందుగా మమ్ములను పొగడి పిమ్మట యుద్ధమందు కౌరవులను గెలుచుట కష్టమని సంధికలుగునట్లుగా చెప్పితివి. నీవు చెప్పిన సంధి మాటలకు నేను సమ్మతింపను. సంజయా ! నీవు పరిహాసమును విడువుము. అర్జునుని గాండీవధ్వనికి కౌరవులు నిలువకయుందురు. ఆధ్వని యెక్కువగా చుట్టుముట్టుకొని యుండును. భీముని గదాదండము రౌద్రాకారముగా విసరబడినప్పుడు కౌరవులు పారిపోక మానరు. నకుల సహదేవులు మదపుటేనుగులవలె తాకినప్పుడు కౌరవులు మూర్ఛిల్లక మానరు. గనుక కౌరవులను యుద్ధమందు జయింపజాలమను మాట యటుంచనిమ్ము. సంజయా ! నాయొద్దకు నెందుకు వచ్చితివో, నీవు యిచ్చుటకివచ్చితివి. మా కోపము శాంతించునట్లు మాటలాడితివి. ఇక మేము శాంతము వహింతుము. పూర్వము మేము కౌరవుల అవమానమును, దుర్గుణములను సహించితిమి. ఈ విషయము నీవును కొంతయెరిగియే యుందువు. గనుక ఆ కౌరవుల దుర్మార్గత్వమును మేము సహించుట వింతగాదు. ఇకమీదట ఆ ప్రకారమే సహించెదమని తలంపుము. మేమే యపకృతియు చేయుటకు ప్రారంభింపము. ఆ సంశయములను విడువుము. మాయయ్యయగు ధృతరాష్ట్రుడు విచారమును పొందిన యెడల మమ్ములను రండని పిలిపించి మాకు రాజ్య భాగము నిచ్చునట్లుగా తనకొడుకులగు దుర్యోధనాదులకు చెప్ప వచ్చును. అట్లు చెప్పి యింద్రప్రస్థ పట్టణమైనను, మరియొక పట్టణ

మైనను మాకుయిచ్చి పంపించుట యుక్తమగును. ఇట్లు ధృతరాష్ట్ర మహారాజు చేసిన యెడల కౌరవులకును మాకును బాంధవ్యము వృద్ధియగును. మేము మరియొక మార్గమును ఆలోచింపకుందుము. లోకమందు ధృతరాష్ట్రమహారాజు కీర్తినిబొందును. అని ఈరీతిగా ధర్మరాజు సంజయునితో చెప్పగా ఆ మాటలను సంజయుడు విని యిట్లనెను.

ధర్మరాజా! నీవు యెంతటి గొప్ప కష్టదశలనైనను సహించి శాంతగుణమునే పూనియుందువు. నీవు వినినట్లు నేను యిన్ని సంగతులను చెప్పినను నాకు తృప్తి కలుగలేదు గాన మరల విన్నవించుకొనెదను. చిత్తగింపుము ధర్మరాజా! అహింసయు, మంచినడవడికయు నీ సొత్తగును. అందువలన నీ భాగ్యము అల్పముకాదు. కౌరవులు మీకు రాజ్యభాగమును యివ్వక దుర్మార్గులై చెడదలచినను మీరు యుద్ధముచేయరాదు. మీరు యుద్ధముచేసి రాజ్యమునుపొంది రక్తమయమైన అన్నము తినుటకంటె మీ నడవడికకు భిక్షాన్నము మిక్కిలిమేలు. అది యెట్లనగా విన్నవించెద నాలింపుము. పూర్వము నీవు మహావిభవముతో రాజసూయమను మహాయజ్ఞమును చేసి బ్రాహ్మణోత్తములకును దేవతలకును తృప్తి కలిగించితివి. నీ మనోనిగ్రహ ఇంద్రియ నిగ్రహములను సర్వలోకములు పొగడుచుందును. నీవు పుణ్యమూర్తివి. అటువంటి నీ చరిత్రను అహింసా ధర్మముచేత మిక్కిలిగా మాయాజూదమును కలిగించి సకలరాజ్య సంపదలను అపహరించి మిమ్ములను బహుకష్టపెట్టిరి. ఆ దుర్మార్గుల గర్వమును యుద్ధమున చెల్లింపజేసితివి? లోకమున ఆ కౌరవులకు మొదటనే సంపదను ఎట్లు చేసితివి? ఎందుకు మహాత్ములను బాధ జేసితివి? నీవు అట్టి భోగములను పోయితివి? అప్పుడు అరణ్యములయందు యిడుములనేల పడితివి? కష్టములనేల పొందితివి?

శాంతమే పరమ ధనముగాగల నీవు, యిన్ని కష్టనిష్ఠూరములు నెందుకు బొందితివి ? ఇటువంటినీవు తనకు క్రూరధర్మ మార్గమునను బోయి యుద్ధమందు బంధుగురు జనులను వెదకి చంపుటకు పూను రాదు. అట్లుచంపగా వచ్చెడి ఫలితము వలన కలుగు సౌఖ్యమును, ప్రయోజనమును కూడ లేవు. అట్టి సౌఖ్యము పెద్దలవలన నిందింప బడును. అస్థిర మనదగును. సామాన్య మానవులును, అల్పగుణ వంతులునగు వారు మ్రింగజాలని చేదైన హాలాహల విషమును వలె సామాన్యమానవు లణచుకొని సహింపజాలని కోపావేశమును, వుప్పొంగి వచ్చు దురాగ్రహమును నీవు అణచుకొని సహించి నిగ్ర హించుటచేతగదా శివునివలె కడుంగడు కీర్తిమంతుడవై పొగడ బడుచున్నావు. నీకోపమును నీవణచుకొనిన యెడ నీవు మహాకీర్తి వంతుడ వగుదువు. అని యీవిధముగా సంజయుడు ధర్మరాజుతో చెప్పెను. ఆ మాటలను ధర్మరాజు విని సంజయుని ముఖముచూచి యిట్లనెను.

సంజయా! నీవు యిట్లు చెప్పుటవలన ప్రయోజనము లేదు. కొన్ని కార్యములు మొదట ధర్మములవలె తోచును. పిమ్మట పెద్దలు విచారించి చూచిన అధర్మములుగా పరిక్రమించి చెడి పోవును. మరికొన్ని కార్యములు మొదట అధర్మములుగా దోచును పిమ్మట పెద్దలవలన విమర్శింపబడి ధర్మము లగుచున్నవి. గనుక సంజయా ! నీవు నన్ను దూషింపతలచిన యెడల నేనుచేసినది అధ ర్మమని నిరూపించి పిమ్మట నన్ను నీవు దూషింప వలయును. నీవు మాకోపమును నివారింపదగును. అహింసయే పరమధర్మము. వంశ దూషకులను లోక కంటకులను అగు పాపాత్ములను నిర్మూల ముగా జంపుటధర్మమని పెద్దలచేత వింటిమి. ఆవిషయ మట్లుండ నిమ్ము. రాజులకు యుద్ధము ధర్మము. అట్లు రాజులకు యుద్ధము

దును. ఒకనిచేత రక్షింపబడి వారిచేతనే పోషింపబడి సంపూర్ణసంపద లను పొందినవాడు తనకు మేలుచేసినవానికి కీడుచేసినాడల కృతఘ్నుడు అగును. అట్టి కృతఘ్నుడైన వాని శవమును కుక్కలైనను అసహ్యపడకుండా భక్షింప నేరవు. గనుక చేసిన మేలు మరచుట పాపము. పాండురాజు నీకు పరమభక్తుడు. ఆ పాండవులును దిగ్విజయము మొదలగు కార్యములచే నీకు తేజోలాభములు గలిగించిరి. నీవు పాండవులను ఆదరింపుము. అని విదురుడు ధృతరాష్ట్రునితో చెప్పెను.

ధృతరాష్ట్రమహారాజా! కాలకర్మవశమున ప్రాణములకు జీవనములు చెడుటయు, పొగడబడుటయు, దూషింపబడుటయు, దానముచేయుటయు, పరులను వేడుకొనుటయు యీ మొదలగుసుఖ దుఃఖము లన్నియు అప్పుడప్పుడు గలుగును. వానివిషయమై నీవిట్లు చింతింపరాదు. ఇట్లు చింతించుటవలన ప్రయోజనములేదు. వ్యసనము వలన దేహబలము తగ్గిపోవును. రూపము చెడును. బుద్ధిచెడిపోవును. రోగమువచ్చును. దుఃఖించినను భయపడినను గూడ శత్రువులకు సంతోషము గలుగును. వ్యసనమువలన యిన్నిచేటులు గలుగును. గనుక నీవు వ్యసనమును విడువుము. అని విదురుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను.

విదురుడా! నేను వ్యర్థములగు ఉపచారములచేత పుణ్యాత్ము డగు ధర్మరాజును ఆదరించితిని. దుర్మార్గులగు నాపుత్రులగుదుర్యోధనాదులు అందరును యుద్ధమునకు చన్నారు. అందువలన నాకు దుఃఖములు అనేకముగా కలుగక మానవు. అట్టి దుఃఖము లనేకము గాకుండునట్లు నిలుపునటువంటి దానిని చెప్పుము. అని ధృతరాష్ట్రుడడుగగా విదురు డిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! 1 నియమముగల తపస్సు. 2 ఇంద్రియనిగ్రహము. 3 గొప్పవిద్య. ఈ మూడును

శాంతికి కారణములు. వీని యన్నిటికంటె లోభగుణము విడచుట పరమశాంతికి ముఖ్యకారణము అని విదురుడిట్లు ధృతరాష్ట్రునితో చెప్పెను. మరియు ఓ మహారాజా! 1 జ్ఞాతులకలహము, 2 గొప్పు లను ఆక్రమించుట, 3 బ్రాహ్మణులయందు అసూయ. 4 స్త్రీలను బాధింపకుండుట యీ నాలుగు విషయములను ప్రీతిపూర్వకముగా జరుగనిచ్చినవానికి గౌరవము కలుగును. అనేకులగు జ్ఞాతులుకలసి ఒకరికొకరు సహాయులై, ఒకరినొకరు రక్షించుచును పోషించుచు స్నేహముగలిగి వర్తించినయెడల అట్టివారు మహాకీర్తిసంపన్నులై పొగడబడుచుందురు. ఒకవృక్షము ఒంటరిగా నున్నయెడల వ్యాఘ్రములు, ఏనుగులు రాపిడిచేత అట్టివృక్షము నశింపగలదు. పెద్దగాలి చేతనైనను ఒంటరిగానున్న వృక్షము నశించును. ఆ వృక్షము అనేకమగు వృక్షములతో గలసి దట్టముగా నున్నయెడల అట్టి వృక్షమును చెరుచుట కెవ్వరికిని సాధ్యముకాదు. అటులనే ఒకవంశమందు జన్మించిన అన్నదమ్ము లందరును కలసి యున్నయెడల అట్టివారిని సాధించుటకు యెవ్వరికిని సాధ్యముకాదు. అన్నదమ్ములు కలిసియుండక ప్రత్యేకముగా నున్నయెడల పరులకు చులకనగానుండి సులభముగా సాధింపబడుదురు. గనుక కౌరవులును, పాండవులును ఒకరికొకరు సహాయులై కలహమును మానినయెడల శత్రువులచేత గెలువబడరు. శత్రువుల బాధలేని రాజ్యము గొప్ప మహిమనుపొందును. పాండవులు వనవాస దుఃఖమును అనుభవించి వచ్చియున్నారు. నీవు ఆ పాండవులను రప్పించి వారికి తగిన రాజ్యభాగమునిచ్చి నిలుపుచో నీ పుత్రులగు దుర్యోధనాదులకు బ్రతుకు గలుగును. అని విదురుడు ధృతరాష్ట్రునితో చెప్పెను.

ధృతరాష్ట్రమహారాజా! లోకమందు సంతోషము గలుగునట్లు మాటాడువారు అంతటను కలరు. ఇష్టములు గాకున్నను కాని

వ్వని మేలుకలుగు మాటలను చెప్పువారు లేరు. పూర్వము కౌరవ పాండవులు జూదమాడినప్పుడు నేను అడ్డుపడి నీకిష్టము లేదని సంశ యింపక జూదమాడరాదని మీకు మంచిని గలిగించు మాటను చెప్పితిని. రోగికి పథ్యముగా నిడిన ఆహారము విరోధముగా తోచి నట్లు అప్పుడు నామాట మీకు తలనొప్పిగా నుండెను. ఏమాత్ర మును రుచింపలేదు. అయినను యిప్పుడు మరల చెప్పెదను వినుడు.

ధృతరాష్ట్రమహారాజా! కాకులను బట్టుకొని నెమళులను విడుచునట్లును, పిల్లులను గ్రహించి, సింహము నాదరించనట్లును నీవు దుర్యోధనాదుల దగ్గరచేసి ధర్మరాజు మొదలగు పాండవులను విడిచి తివి. ఇప్పుడు గార్యము ముగింపునకు రాగా అగ్నికణము సోకినట్లుగా నీవు తల్లడిల్లుచున్నావు. కులమును రక్షించుటకై ఒకనిని విడుచు టయే నీతియని పెద్దలు చెప్పుచుదురు. మంచిబుద్ధి చెప్పినను దుర్యోధనుడు వినక చెడుమార్గమందు ప్రవర్తింపుచున్నాడు. అట్టి దుర్యోధనుని దండించి వనము విడుచుటవలన మేలుకలుగునేకాని కీడుగలుగదు. ఆవిషయమును అటుండనిమ్ము. సంపద సహాయము నపేక్షించి యుం డును. సహాయము సంపద నపేక్షించి యుండును. ఇట్లు సంపద సహా ములు రెండును ఒకటి నొకటి ఆశ్రయించి అభివృద్ధి స్థితులను పొందుచుండును. గనుక నీ సంపదను పాండవులకు యిమ్ము. ఆపాండ వుల సహాయమును పొందుము. అట్లు చేయుటవలన మీరు ఒకరి కొకరు సంతోషముతో కలసిమెలసి స్నేహము గలిగియుందురు. అట్లుండుట మంచిది. అట్లుగాక మన సంసార బలమును బయల్పర చుట మేలుగాదు. ఆ పాండవులును మీరును స్నేహము గలిగి యున్న యెడల కురువంశ పావనులగు భీష్మ ధర్మరాజులును మహా పరాక్రమవంతులగు కర్ణార్జునులును, మహా ప్రతాపవంతులగు భీమ

దుర్యోధనులును సకల శస్త్రాస్త్రసంపన్నులగు అభిమన్యు ప్రముఖ కుమారులును, శాపానుగ్రహ సమర్థులగు బ్రాహ్మణులును రాజులును స్నేహితులును. వీరందరును వారివారి బంధుమిత్రులతో సహాయులై ఏక-గుంపుగా నీ యాజ్ఞాప్రకారము పనులు చేయుచుందురు. ఇట్లున్నందువలన నీ నీతిపరాక్రమముల కెదురులేక యీ సకల భూమండలమును నీచేత పరిపాలింపబడును. నీ ఐశ్వర్యవిభవములు దేదీప్యమానముగా ప్రకాశించుచు యితరులకు సాధ్యముగాక యుండును. ఈపద్ధతి యెంత లెస్సగానుండునో నీవే యోచింపుము. పాండవులు ధైర్యవంతులై యుద్ధమునకు రాక యూరక తొలగియుండినను కొన్ని దినములలో మీరాజ్యము చీకాకుపడునేమో దుర్యోధనునిచేత నిలిచి పోకుండా రాజ్యభారము నిర్వహింపబడ నేరదు. అని విదురుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను.

తమ్ముడా! విదురా! నీవు చెప్పినమాటలు అతినిర్మలములు మంచి నిపుణులకు సమ్మతములు. రాజనీతి పద్ధతులను బోధించుచున్నవి. అయినను నాకొడుకైన దుర్యోధనుని విడువజాలను. ఎక్కడ ధర్మ ముండునో అక్కడజయము కలుగునని చెప్పు ధర్మోజయతి యను వాక్యమును దలచెదను. అని ధృతరాష్ట్రుడు విదురునితో చెప్పగా మరల విదురు డిట్లనెను.

ధృతరాష్ట్ర మహారాజా! జ్ఞాతులు గుణహీనులైనను వారిని విడువరాదని శాస్త్రమందు చెప్పియున్నది అందువలన పాండవులు సకలగుణ సంపన్నులై నీయనుగ్రహమును గోరుచున్నప్పుడు అట్టి మహాత్ములను నీవు విడువరాదు నేను నీకు మేలుకొరకే చెప్పుచున్నాను. నీవట్లు నన్ను నిశ్చయముగా తెలుసుకొని నేను చెప్పు బుద్ధిని వినుము. దుర్యోధనుని సమ్మతింపజేసి పాండవులకు జీవనము కొరకు కొన్ని చిన్నగ్రామములను యిచ్చుట మంచిది. అని నేను

తలచెదను. దుర్యోధనుని విడువవలెనని చెప్పితిని. కలహమును కోర రాదు. కలహముచేత యుద్ధము జరుగును. యుద్ధమునకు తరువాత పశ్చాత్తాపమును పొంది దుఃఖించెదవు. అట్టి దుఃఖము నశించుటకు వేరుపాయము లేదు. గనుక యిప్పుడే సమస్తవిధములచేతను సమ్మతించి పాండవులతో సంధిచేయవలయును. శరీరములు మనోవ్యాధిచేతను, దేహపీడలచేతను కూడకొని ముదిమి చావుగలవై సహజముగా నశించు స్వభావము గలిగియున్నవి. అట్టి దేహములకు రాజ్యభాగ విషయమగు యుద్ధమువలననే మరణము వచ్చుననియు మరియొకవిధముగా చావు కలగదనియు చెప్పజాలరు. గనుక కాల వశమునవచ్చు మరణమునకు సహించి యుండవలయును. పూర్వపు రాజులందరును ఏనుగులు గుఱ్ఱములు మొదలగు సంపదలను అనుభవించిరి. స్త్రీలతో వివిధరీతుల విహార లీలాసౌఖ్యములను అనుభవించిరి. ప్రజలకు అనుకూలముగా అనురాగముకలుగునట్లు రాజ్యమును పాలించిరి. యుద్ధములయందు విజయమునుపొంది ప్రకాశించిరి. మంచి భూషణ వస్త్ర సుగంధాది సౌఖ్య విభవములను అనుభవించిరి. అట్టి రాజులందరును చనిపోయిరేగాని నిలిచియుండలేదుగదా! గనుక యీ వాక్యము నీచెవికి నిష్ఠురముగా నున్నను వినుటయే చాలును. నేనిప్పుడు చెప్పినమాటలు యీ లోకమందుగల సౌఖ్య లక్ష్మీవిభవములకు కీర్తికిని మూలముగా నుండును. ఇది నిశ్చయము. నీవు నీమనస్సులో చక్కగా నాలోచింపుము. ధర్మరాజునువిడువకుము. నీవు దృఢబుద్ధి కలవాడవై నీ పుత్రులకును, మంత్రులకును చెప్పి పాండవులతో సంధియగునట్లు చేయుము. అయ్యో! నిను మేలుకోరి యింతదూరమువరకు చెప్పుచుంటిని. నామాటలను వినుము. అని యీరీతిగా విదురుడు చెప్పగా ధృతరాష్ట్రుడిట్లనెను.

తమ్ముడా! వినురా! నీ మాటలవలన నా మనస్సునందుగల విచారము నశించెను. నా బుద్ధికి తెలివిగలిగెను. నీవు చెప్పినట్లు

పాండవులతో సంధిచేసినను. అట్లు చేయుటవలన న్యాయము, ధర్మము, కీర్తి, లాభము గలుగును. అని ధృతరాష్ట్రుడు చెప్పగా నామాటలకు విదురుడు సంతోషించి మిక్కిలి స్నేహభావముతో ధృతరాష్ట్రునితో యిట్లనెను. అన్నా! ధృతరాష్ట్రమహారాజా! అయ్యో! యింతసారము చెప్పక చాలాకాలమునకు చేయదగిన కార్యమును నీ మనస్సున కిపుడు తోచెను. నీవు సుయోధనుని గాంచినప్పుడు వాని యిష్టమునకు సమ్మతింపక యీ కార్యనిశ్చయమును వదలనియెడల మావంటివారలకు సంతోషము గలుగును. ఈ కార్యమును నిర్వహించుటకు నేను నేర్తును, నేను నేర్వను అని చెప్పుటకు మనుష్యులు సమర్థులుకారు. ఆదైవ మెట్లు తలచెనో అట్లు జరుగును. గనుక పురుషప్రయత్నముకంటె దైవబలము మిక్కిలియెక్కువ. అన్ని కార్యములను జేయుటకు ఆదైవమే సమర్థుడు. అని యీ విధముగా విదురుడు ధృతరాష్ట్రునితో చెప్పి నిట్టూర్పు విడచెను.

అప్పుడు ధృతరాష్ట్రుడు విదురునితో యిట్లనెను. తమ్ముడా! విదురా! యిప్పుడు నీవు నిర్మలమగు వాక్యములచేత నీతి ధర్మమార్గ స్వరూపములను నాకు చక్కగా తెలియజెప్పితివి. ఏ వాక్యములచేత నాకు తత్వజ్ఞానము కలుగునో అట్టివి నాకు చెప్పుము. అని ధృతరాష్ట్రు డడుగగా విదురు డిట్లనెను. ఓ ధృతరాష్ట్రమహారాజా! సనత్కుమారుడను మహామునీంద్రుడు గలడు. ఆ సనత్కుమారుడు దివ్యజ్ఞాని. బ్రహ్మదేవుని కుమారుడు. అతడు మిక్కిలి వయస్సుగలవాడైనను సర్వదా కుమార వయోరూపవంతుడై యుండును. అట్టి మహాత్ముడైన సనత్కుమారుడు మృత్యువు లేదని తన శిష్యులకు ఉపదేశించెను. ఆ సనత్కుమారుడే అయినయెడల సకల తత్వరహస్యములను చెప్పి నీ బుద్ధియందుగల సకల సంశయములను పోగొట్టగలడు. అని యీవిధముగా విదురుడు ధృతరాష్ట్రునితో చెప్పగా ధృతరాష్ట్రుడు తిరిగి విదురున కిట్లనెను.

# సనత్కుమారగీత

## విదురుని ప్రార్థనము

విదురుడా! నీవు చెప్పిన సనత్కుమారుని నేను యెఱుగను గనుక తత్వజ్ఞానమును చెప్పుటకు నీవు సమర్థుడవైన యెడల నీవే నాకు చెప్పుము. అని ధృతరాష్ట్రుడు అడుగగా విదురుడిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! నేను శూద్రయోనియందు బుట్టితిని అందు వలన వేదాంత వాక్యములను జెప్పుటకు నేను సమ్మతింపను. ఆ సనత్కుమారుని యొక్క బుద్ధిని నేను యెఱుగుదును. సనత్కుమారుడే నీకు వేదాంతవాక్యములను చెప్పి నీ సకల సంశయములను పోగొట్ట వలయును. ఆ బ్రాహ్మణుడే వేదాంత రహస్యములను చెప్పవలయును. శూద్రుడు చెప్పరాదు. వేదాంతములను బ్రాహ్మణుడు చెప్పిన యెడల దేవతలు సమ్మతింతురు. శూద్రుడు చెప్పిన యెడల దేవతలకు సమ్మతముకాదు. అందుచేత సనత్కుమారుడే నీకు చెప్పవలయును కాని నేను చెప్పరాదు. అని విదురుడు చెప్పగా ధృతరాష్ట్రుడు యిట్లనెను.

విదురుడా! సనాతనుడైన సనత్కుమారుని నీవు చెప్పుచున్నావు. సనత్కుమారుడు బ్రహ్మలోకమందుండును. గనుక నేను యీ దేహముతో ఆ సనత్కుమారుని యెట్లుచూచెదనో తోచకున్నది. అని ధృతరాష్ట్రుడు విదురునితో చెప్పెను. విదురుడు మిక్కిలి భక్తిపూర్వకముగా సనత్కుమారుని తలచెను. విదురుని తలంపును దివ్యజ్ఞానియగు సనత్కుమారుడు తెలిసికొని విదురుని దగ్గరకు వచ్చి విదురునకు కనబడెను. విదురుడు యెదురుగా వెళ్ళి శాస్త్రవిధి ప్రకారము సనత్కుమారుని పూజించి తగిన పీఠమందు కూర్చుండ బెట్టెను ఆ సనత్కుమారుడును విదురుడు వేసిన పీఠ

మందు కూర్చుండి విశ్రమించెను. సనత్సుజాతుడు సనత్కుమారునితో యిట్లనెను. భగవంతుడా! సనత్కుమార మునీంద్రా! యీ ధృతరాష్ట్ర మహారాజు మనస్సునందు సంశయము గలదు. ఆ సంశయమును దీర్చుటకు నేను సమర్థుడను గాను. గనుక నీవు యీ ధృతరాష్ట్రునకు చెప్పి యితని సంశయమును దీర్చవలెను. పరమాత్మ తత్వమును వినిన మోక్షల లాభ... లాభ... దయు ద్వేషము... ఈర్ష్య కామ క్రోధాదులను విడిచి యీ ... సముద్రములను దాటగలడు. అట్టి పరమాత్మ తత్వమును యీ ధృతరాష్ట్ర మహా రాజునకు నుపదేశింపుము.

## సనత్సుజాతుడు ధృతరాష్ట్రునకు అధ్యాత్మతత్వము నుపదేశించుట

జనమేజయ మహారాజా! ధృతరాష్ట్రుడు సనత్కుమారుని పూజించి ఆ విద్యచేత అపహరింపబడిన ఆత్మను పొందుటకు యిచ్ఛ గలవాడై సనత్కుమారునితో యిట్లనెను. మహాత్మా! సనత్కుమార మునీంద్రా! మృత్యువు లేదని నీవు నీ శిష్యులకు నుపదేశించి నట్లు విదురుడు నాకు చెప్పెను. ఆ నుపదేశమును నేను వింటిని. దేవ రాక్షసులు మృత్యువును తప్పించుకొనుట కొరకు మారు... బ్రహ్మచర్యమును చేయుచుందురు. గనుక దేవరాక్షసుల మతమునందు మృత్యువుగలదు. నీ మతమందు మృత్యువు లేదు. మృత్యువు గలదు, లేదు అను రెండు పక్షములలో యే మాట నిశ్చయమో అదియునను ...ను నాకు చెప్పుము. అని యిట్లు ధృతరాష్ట్రుడు అడుగగా సన త్కుమారుడిట్లనెను ధృతరాష్ట్ర మహారాజా! వేదోక్తమైన కర్మము చేత అమృతత్వము కలుగునని కొందరు చెప్పుదురు. అద్వైతజ్ఞాను లగువారు ఆత్మకంటె అన్యమైన వస్తువును జూడనందున మృత్యువు లేదని చెప్పుదురు. ఈ రెండుపక్షములకును విరోధము లేకుండునట్లు యీ భగవంతుడు యెట్లు చెప్పెనో యని నీవు శంకింపకుము.

ధృతరాష్ట్రుడా! సృష్టి మొదలుకొని యింతవరకు ఆ రెండు పక్షములును సత్యములుగా నున్నవి. మృత్యువు కలదు లేదు అను యీ రెండుపక్షములును యెట్లు సత్యమగునని యంటివేని చెప్పెదను వినుము. ఆ నాత్మరూపమగు దేహేంద్రియాదులయందు ఆత్మాభిమానము మోహమనబడును. అట్టి మోహమే మృత్యువని కొందరు పండితులు చెప్పెదరు. ముందుచెప్పిన రెండుపక్షములకును యీ పక్షము విరోధమగును. అట్లు నేను చెప్పను. ప్రమాదమును మృత్యువని నేను చెప్పను. స్వాభావికమైన పరబ్రహ్మ భావమును విడుచుటయే ప్రమాదము. జనన మరణాది సర్వదుఃఖములకు బీజమైన అజ్ఞానము ప్రమాదమని చెప్పబడును. అట్టి అజ్ఞానమునే మృత్యువని నేను చెప్పెదను. ఆ ప్రమాదమును అమృతమని చెప్పుదును. స్వాభావికమైన బ్రహ్మముగానుండుటయే ప్రమాదమనబడును. ఆప్రమాదమే మోక్షమగును. మృత్యువనగా అజ్ఞానమును, బ్రహ్మజ్ఞానమే అమృతమైన మోక్షమును అగును. అజ్ఞానమువలననే విరోచనుడు మొదలగు రాక్షసులు మూఢులై మృతులైరి. బ్రహ్మజ్ఞానమువలననే ఆత్మవేత్తలగు ఇంద్రాది దేవతలు బ్రహ్మస్వరూపులై అమృతరూపులైయుండిరి. మృత్యువు వున్నయెడల పెద్దపులివలె ప్రాణులను భక్షింపవలెను. అట్లు భక్షింపదగు మృత్యురూపము లేనందున మృత్యువు లేదని తెలుసుకొనుము. సంసారులగు జనులు యమధర్మరాజును మృత్యువందురు. ఆ యమధర్మరాజు అమృతస్వరూపుడు. బ్రహ్మచర్యవ్రత నియమము గలవాడు. ఆ యముడు ప్రాణుల బుద్ధియందుండును. పితృలోకమందు ప్రాణుల పుణ్యపాపములను. విచారించుచు, పుణ్యాత్ములకు సుఖము గలిగించుచుండును. పాపాత్ములకు దుఃఖము గలిగించుచుండును. మనోనిగ్రహము లేని అజ్ఞానులను ఆ యముడు శిక్షించును గాని మనోనిగ్రహముగల జ్ఞానులను యమ

ధర్మరాజు యేమియు చేయజాలడు. గనుక ఆ యముడు మృత్యువు గాదు. అజ్ఞానులగు ప్రాణులకు మృత్యువుఅజ్ఞానము. అజ్ఞానమనునది ప్రథమ మృత్యువు. అజ్ఞానము అహంకార రూపముగా పరిణమిం చెను. అహంకారమునకు మోహము గుణమగును. అజ్ఞానము అహంకారమువలన పుట్టిన కామమగును. పిమ్మట ఆ కామమువలన విషయములందు ప్రవర్తింపుచు విషయానుకూలము లేనియెడల క్రోధ, మోహ, రూపములుగా పరిణమించును. ఇట్లహంకార రూప ముగాయుండు అజ్ఞానము ఆత్మగాదలచిన పురుషుడు నేను బ్రాహ్మణు డననియు నేను క్షత్రియుడననియు ఇట్లభిమానింపుచున్నాడు. అట్టి అజ్ఞానపురుషుడు రాగద్వేషములు గలవాడై సంచరించుచు, పుణ్య, పాప, కర్మమార్గములయందు ప్రవర్తింపుచున్నాడు. అందువలన, అట్టి అజ్ఞానపురుషుడు. ఒక్కడైనను, సమాధిరూపమైన పరమాత్మయోగ మును పొందలేడు. ఇట్లు, అజ్ఞానముచేత, మోహింపబడి, దేహేంద్రి యములందు ఆత్మభావము గలవారు, అజ్ఞానమను మృత్యువశమునందు వర్తింపుచుందురు. అవివేకులు మృతినొందిన బొంట, ధూమమార్గము చేత పరలోకమునకు బోవుదురు. ఆ పరలోకమందు, పుణ్య పాప కర్మలను ఫలరూపమున, అనుభవించి, మరల దేహమును పొందుట కు ఈ భూలోకమందు పడుచుందురు. అట్లు పడిన జీవిని అనుస రించి, ఇంద్రియ కర్మములు, అంతటను ప్రవర్తింపుచుండును. ఈ కారణమువలన ఇంద్రియ గుణములను అనుసరించిన మరణమును జీవుడు పొందుచుండును. పిమ్మట, మరల జన్మమునుపొందుచుండును. ఇట్లు జన్మ, మరణ, మహా బంధములను పొందినవాడు ఎప్పటికి సంసార బంధవిముక్తుడు కాజాలడు. గనుక సంసార బంధమునకు కారణము అజ్ఞానము. కర్మఫలములు గలుగుచుండగా, కర్మఫల మందపేక్ష గలవాడు, ఆకర్మఫలముల ననుసరించి, మృత్యువును

పొందుచున్నాడు. ఇట్లు పరమాత్మ స్వరూప జ్ఞానము లేనందున పురుషుడు వివేక హీనుడై విషయ సుఖాపేక్షచేత, పరిభవించుచు జనన, మరణ, రూప, సంసారమందు ప్రవర్తింపుచుండును. విషయ సుఖాపేక్షగల వాని యింద్రియములకు సర్వదా విషయములయందు ప్రవృత్తిగలిగియుండును. అది మహామోహమనదగును. అట్టిమోహముగలవాడు తానైన ప్రత్యగ్రూప పరమాత్మను సాక్షాత్తుగా ఎరుగజాలడు. అట్టి యోగికి, సంసారగమనము నిత్యముగానుండును. విషయ సుఖాపేక్షగల యోగి స్త్రీలు, మొదలగు, విషయములను స్మరింపుచు ధ్యానింపుచుండునేగాని, పరమాత్మను ధ్యానింపడు. ఇట్లు విషయచింతనము. మొదట పురుషుని బాధింపుచున్నది. స్వాభావిక బ్రహ్మస్వరూప భావమును విడుచుటయే బాధయని తెలియదగును అట్టి విషయ ధ్యానముగల పురుషునకు శీఘ్రముగ, విషయసామీప్యమును గలిగించి, కామము బాధింపుచున్నది. అట్లు కామబాధ నొందినవాడు పిమ్మట క్రోధముచే బాధింపబడుచున్నాడు. ఇట్లు విషయాపేక్ష, కామము, క్రోధము, మొదలగునవన్నియు పురుషుని బాధించి, పిమ్మట అట్టి మూఢపురుషుని, మృత్యువునకు సమర్పించుచున్నవి. వివేకధైర్య వంతులగు పురుషులు ధైర్యముచేత విషయాపేక్షను, కామ, క్రోధాదులను జయించి, పరమాత్మను తెలిసికొని. మృత్యువును దప్పించుకొను చున్నారు. అట్టి వివేక పురుషులు విషయములను అమేధ్యముతో తులజూచి, వానిని స్మరింపక విడచుచున్నారు. వివేకపురుషుడు మృత్యువునకు, మృత్యువు వంటివాడై, మృత్యువును, మృత్యువువలె భక్షింపు చున్నాడు. పురుషుడు సర్వకాలములను బంధించి, విడుచును, కామగుణములు అనిత్యములై ప్రతిక్షణమందును నశింపుచుండును. కామములను అనుసరించిన పురుషుడు ఆ కామ విషయములు, నశించిన వెంటనే

ధర్మరాజు యేమియు చేయజాలడు. గనుక ఆ యముడు మృత్యువు గాడు. అజ్ఞానులగు ప్రాణులకు మృత్యువు అజ్ఞానము. అజ్ఞానమనునది ప్రథమ మృత్యువు. అజ్ఞానము అహంకార రూపముగా పరిణమించెను. అహంకారమునకు మోహము గుణమాయెను. అజ్ఞానము అహంకారమువలన పుట్టిన కామమాయెను. పిమ్మట ఆ కామమువలన విషయములందు ప్రవర్తింపుచు విషయానుకూలము లేనప్పుడు క్రోధ, మోహ, రూపములుగా పరిణమించుచు ఇట్లహంకార రూపముగాయుండు అజ్ఞానము ఆత్మగాదలచిన పురుషుడు నేను బ్రాహ్మణుడనని యు నేను క్షత్రియుడననియు ఇట్లభిమానింపుచున్నాడు. అట్టి అజ్ఞానపురుషుడు రాగద్వేషములు గలవాడై సంచరించుచు, పుణ్య పాప, కర్మమార్గములయందు ప్రవర్తించుచున్నాడు. అందువలన, అట్టి అజ్ఞానపురుషుడు. ఒక్కడైనను, సమాధియోగ్యమైన పరమాత్మయోగమును పొందలేడు. ఇట్లు, అజ్ఞానముచేత, మోహింపబడి, దేహేంద్రియములందు ఆత్మభావము గలవారు, అజ్ఞానమును మృత్యువశమందు వర్తింపుచుందురు. అవివేకులు మృతినిబొంది, ఘోరమార్గమును చేత పరలోకమునకు బోవుదురు. ఆ పరలోకమందు, పుణ్య పాప కర్మలను ఫలరూపమున, అనుభవించి, మరల దేహమును పొందుటకు ఈ భూలోకమందు పడుచుందురు. అట్లు పడిన జీవిని అనుసరించి, ఇంద్రియ కర్మములు, అంతటను ప్రవర్తింపుచుండును. ఈ కారణమువలన ఇంద్రియ గుణములను అనుసరించిన మరణమును జీవుడు పొందుచుండును. పిమ్మట, మరల జన్మమునుపొందుచుండును. ఇట్లు జన్మ, మరణ, మహా బంధములను పొందినవాడు ఎప్పటికి సంసార బంధవిముక్తుడు కాజాలడు. గనుక సంసార బంధమునకు కారణము అజ్ఞానము. కర్మఫలములు గలుగుచుండగా, కర్మఫల మందపేక్ష గలవాడు. ఆకర్మఫలముల ననుసరించి, మృత్యువును

పొందుచున్నాడు. ఇట్లు పరమాత్మ స్వరూప జ్ఞానము లేనందున పురుషుడు వివేక హీనుడై విషయ సుఖాపేక్షచేత, పరిభవించుచు జనన, మరణ, రూప, సంసారమందు ప్రవర్తింపుచుండును. విషయ సుఖాపేక్షగల వాని యింద్రియములకు సర్వదా విషయములయందు ప్రవృత్తి గలిగియుండును. అది మహామోహ మనదగును. అట్టి మోహముగలవాడు తానైన ప్రత్యగ్రూప పరమాత్మను సాక్షాత్తుగా ఎరుగజాలడు. అట్టి యోగికి, సంసారగమనము నిత్యముగానుండును. విషయ సుఖాపేక్షగల యోగి స్త్రీలు, మొదలగు, విషయములను స్మరింపుచు ధ్యానింపుచుండు నేగాని, పరమాత్మను ధ్యానింపడు. ఇట్లు విషయచింతనము, మొదట పురుషుని బాధింపుచున్నది. స్వాభావిక బ్రహ్మస్వరూప భావమును విడుచుటయే బాధయని తెలియదగును అట్టి విషయ ధ్యానముగల పురుషునకు శీఘ్రముగ, విషయసామీప్యమును గలిగించి, కామము బాధింపుచున్నది. అట్లు కామబాధ నొందనవాడు పిమ్మట క్రోధముచే బాధింపబడుచున్నాడు. ఇట్లు విషయాపేక్ష, కామము, క్రోధము, మొదలగునవన్నియు పురుషుని బాధించి, పిమ్మట అట్టి మూఢపురుషుని, మృత్యువునకు సమర్పించుచున్నవి. వివేకధైర్య వంతులగు పురుషులు ధైర్యముచేత విషయాపేక్షను, కామ, క్రోధాదులను జయించి, పరమాత్మను తెలిసికొని. మృత్యువును దప్పించుకొను చున్నారు. అట్టి వివేక పురుషులు విషయములను అమేధ్యముతో తులజూచి, వానిని స్మరింపక విడచుచున్నాడు. వివేకపురుషుడు మృత్యువునకు, మృత్యువు వంటివాడై, మృత్యువును, మృత్యువువలె భక్షింపు చున్నాడు. పురుషుడు సర్వకాలములను బంధించి, విడుచును, కామగుణములు అనిత్యములై ప్రతిక్షణమందును నశింపుచుండును. కామములను అనుసరించిన పురుషుడు ఆ కామ విషయములు, నశించిన వెంటనే

నశింపుచుండును. విషయములయందుగల దోష దర్శనరూపమైన వైరాగ్యముచేత కామములను విడిచినవాడు ఈ జన్మమందును గత జన్మములందును చేసిన పుణ్యపాప కర్మములు, వివేకబుద్ధిచేత నశింపజేయును. ఆ విద్యవలన కలిగిన ప్రాణులకుగల. ఈ మనుష్య దేహము శీత, పైత్య,. శ్లేష్మ, రక్త, మూత్ర, పురీషాదుల చేత పరిపూర్ణముగా నిండియున్నది. గనుక, ఈ దేహము కేవలము నరకము అటువంటి స్త్రీల దేహములను మనోహరముగా నుండునని దలచి, కోరినవాడు గ్రుడ్డివాడు తెలియక బావిలో పడినట్లు నరకమందు పడును. పురుషుడు సకల వేద వేదాంగములను జదివినను, విషయ సుఖములందు ఆసక్తుడై పరమాత్మను యెరుగక, వేదాంత శాస్త్రమును చదువని యెడల అట్టివాని శరీరము గడ్డిచేత, నిండ బడిన పెద్దపులిబొమ్మవలె వ్యర్థమైనదగును. క్రోధ, లోభ, మోహాదుల వలన నీమనస్సునకు మోహాభయము కలిగియున్నది. ఇదియే నీకు మృత్యువు అగును. ఇంద్రియములను, జయించనివాని మనస్సు విషములయందు వ్యాపించుచుండును. ఆమనస్సే అట్టివానికి మృత్యువు. గాన ఓ ధృతరాష్ట్రమహారాజా ! ఇట్లు కామక్రోధాది రూపముగ పరిణమించిన అజ్ఞానమును మృత్యువును ఎరిగి కామ, క్రోధాదులను విడిపించి, పరమశాంత చిత్తుడై సచ్చిదానంద స్వరూప బ్రహ్మమందున్న వాడు మృత్యువువలన భేదింపబడడు. పరమాత్మను సాక్షాత్కారమును చేసికొనిన జ్ఞానికి అజ్ఞానమును, మృత్యువు నశించుచున్నది. అని ఈరీతిగా భగవంతుడైన సనత్కుమార మునీంద్రుడు ధృతరాష్ట్రునితో చెప్పగా. అతనితో ధృతరాష్ట్రుడిట్లనెను. ఓ భగవంతుడా ! సనత్కుమారమునీంద్రా ! కర్మములకు సంసారబంధ కారణమును చెప్పితిరి. జ్యోతిష్టోమాది యజ్ఞకారణములచేత ధార్మికులకు పరిశుద్ధములైన పుణ్యలోకములు కలుగుచున్నవి.

అట్టుకలుగు బ్రహ్మలోక పర్యంతము గల పుణ్యలోకములు పరమ పురుషార్థమని వేదములు చెప్పుచున్నవి. సాధన భూతమైన పుణ్య కర్మమువలన బ్రహ్మలోక పర్యంతముగల పుణ్యలోకములు కలుగు చున్నవి. అటువంటి పుణ్యకర్మలు జ్ఞానియగువాడు అనుష్ఠింపకుండు టకు కారణమేమో చెప్పుము. బ్రహ్మలోకాది పుణ్యలోకములను పరమ పురుషార్థమని జ్ఞానియగువాడు అనుష్ఠింపకుండుటకు హేతు వేమో చెప్పుము అని ధృతరాష్ట్రు డడుగగా సనత్కుమారు డిట్లనెను.

ధృతరాష్ట్ర మహారాజా! నీవు చెప్పినది సత్యమే. అజ్ఞాని యగు వాడు బ్రహ్మలోకాది సౌఖ్యములను పురుషార్థముగా తలచి అందుకు సాధన భూతమైన కర్మను జేయుచున్నాడు. ఆ ప్రకారమే కర్మఫల ప్రయోజనములు వేదములు అజ్ఞానికి చెప్పుచున్నవి. జ్ఞాని యగువాడు బ్రహ్మలోకాది అనిత్య సుఖమందైనను దానికి సాధన భూతమైన కర్మమందైనను ఆశవుంచి ప్రవర్తింపడు. అట్టి వివేకియగు వాడు సకల ధర్మాధర్మ రూపకర్మములను విడిచి తనను పరమా త్మగా తెలిసికొని బ్రహ్మమై పరమానందమును పొందుచున్నాడు. వివేకియగువాడు సగుణ బ్రహ్మోపాసనమువలన బ్రహ్మలోకమందు వుపాసనా ఫలమును అనుభవించును. అట్టి వుపాసకుడు కర్మవలె మొదట యీ సంసారమందు పుట్టడు. బ్రహ్మోపాసనచేత సంసార హేతు భూతములైన మార్గములను నశింపజేసికొని పరబ్రహ్మ స్వరూపుడై కొంతకాలమునకు మోక్షమును పొందుచున్నాడు. గనుక బ్రహ్మలోకాది సుఖము అనిత్యమే కాని పరమపురుషార్థము కాదు. అందుచేత జ్ఞానియగు వాడు ఆ బ్రహ్మలోకాది సుఖమం దైనను అందుకు సాధనభూతమైన కర్మమందైనను ప్రవర్తింపడని తెలిసికొనుము. అని యిట్లు సనత్కుమారుడు చెప్పగా ధృతరాష్ట్రుడు యిట్లనెను.

భగవంతుడా! సనత్కుమార మునీంద్రా! ఆ సర్వజ్ఞానానంద పరమాత్మయే పంచభూతములు ప్రపంచమును సృష్టించి అన్నమయాది పంచకోశములను ప్రవేశించి సంసారమును పొందినట్లు నీ వాక్యముల వలన స్పష్టమగును. ఎట్లయిన పరమాత్మను సంసారమందు ప్రవేశింప జేసి ప్రేరేపించువాడు యెవడో చెప్పుము. అన్యునిచేత ప్రేరేపింపబడునో లేక తనను తానే ప్రేరేపించుకొనునో చెప్పుము. తనను తాను ప్రేరేపించుకొను పక్షమున ఆ పరమాత్మ నానా యోనులయందు ప్రవర్తింపుట వలన ప్రయోజనమేమో చెప్పుము. మరియు ఆ పరమాత్మ సంసారమందు ప్రవేశింపనియెడల అతనికి కలుగు కష్టము లేమో? ఆత్మయన్న ఈ విషయములన్నియును నాకు తెలియునట్లు చెప్పుము. అని యిట్లు ధృతరాష్ట్రుడు అడుగగా సనత్కుమారుడు యిట్లనెను.

ధృతరాష్ట్ర మహారాజా! బ్రహ్మమునకు నానా విధత్వము చెప్పినయెడల మహాదోషము గలుగును. అట్లు చెప్పుటకు శ్రుతి ప్రమాణము లేదు. నేను అద్వైతవాదిని. నేను బ్రహ్మమునకు నానావిధత్వము చెప్పను. జీవాత్మ పరమాత్మలకు భేదము చెప్పినను మహాదోషము గలుగును. అనాదియైన అవిద్యయను మాయా ప్రకృతితో సంబంధమువలన జనప్రకృత్యాదులు నిత్యములగును. అద్వితీయుడగు పరమాత్మకు మాయచేత బహురూపత్వము గలిగి యున్నది. ఆ కారణము వలన కారణరూపుడైన పరమేశ్వరుడు కార్యరూపుడైన జీవుని నియమించు చున్నాడు. ఆ పరమాత్మయే అవిద్యా మాయోపాధివలన జీవేశ్వరరూపములను పొందుచున్నాడు. సంసారము జీవునియందే యుండును. ఆ పరమాత్మ మాయచేత కార్యరూపముగా నున్నను కొంచెమైనను ఆధిపత్యమును పొందడు. గనుక అనాదియైన అవిద్యా సంబంధమునలన జీవులు అనేకులైరి.

పూర్ణుడైన పరమాత్మకును మాయోపాధి వలన అనేకత్వము కలిగెను. మరియు ఆ భగవంతుడైన పరమేశ్వరుడు మాయతోగూడినవాడై సకల ప్రపంచమును సృష్టించుచున్నాడు. ఆ ప్రపంచము నంతయు పరమాత్మయందుగల మాయయే కల్పించుచున్నది. గాని పరమాత్మ కలిగించలేదు. అద్వితీయ చిదానంద రూపుడగు పరమాత్మ మాయతోగూడి జగత్కారణుడాయెనేగాని స్వయముగా కారణుడు కాడని తెలిసికొనుము. ఇట్లని వేదములు చెప్పుచున్నవి. అని యిట్లు సనత్కుమార మునీంద్రుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను.

భగవంతుడా! సనత్కుమారమునీంద్రా! యీ లోకమందు కొందరు అగ్నిష్టోమాది పుణ్యకర్మలను జేయుచున్నారు. మరికొందరు కల్లు గంజాయి మొదలగు వానిని త్రాగుటయను పాపకర్మములను జేయుచున్నారు. అట్టి జనులకు గల పాపములచేత పుణ్యములు నశించునేమో తెలియదు. లేక పుణ్యము పాపమును నశింపజేయు నేమో చెప్పుము. అట్లుగాక ఆ పుణ్యపాపములకు సమానబలము గలిగి యున్నయెడల మొదటి దానివలెనే రెండవ దానికి వినాశము కలుగునేమోయని జెప్పుము. అని ధృతరాష్ట్రు డడుగగా సనత్కుమారుడు యిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! జ్ఞానములేని వారికి ఆ పుణ్యపాప కర్మముల అనుభవముచేత ఒకదాని వలన మరి యొకటికి వినాశము కలుగును. జ్ఞానియగు వాడు ప్రారబ్ధమువలన పుణ్యపాప కర్మములను చేయుచున్నను జ్ఞానముచేత ఆపుణ్యపాపములను నియమముగా నశింపజేయుచున్నాడు. ఇట్లు శ్రుతియందు సిద్ధాంతముగా చెప్పబడియున్నది. జ్ఞానములేని వాడైన యెడల పుణ్యమునుచేసి ఆ పుణ్యఫలమువలన సుఖము ననుభవించును. ఇట్లు శ్రుతులు చెప్పుచున్నవి. ధృతరాష్ట్ర మహారాజా! జ్ఞానము

లేనివాడు కాలవశము వలన పరలోకమును పొంది పుణ్య పాప కర్మముచేత పుణ్య పాప ఫలమును అనుభవింపుచున్నాడు. ఆ కర్మ ఫలభోగము స్థిరముగా నుండదు. వివేకియగు వాడు ముందు చెప్పబోయెడి ప్రకారము యీ లోకమునందు యీశ్వరార్థముగా కర్మచేయుచు పుణ్యకర్మముచేత పాపకర్మమును నశింప జేయుచున్నాడు. గనుక పాపముకంటె పుణ్యము మిక్కిలి బలముగలదియగును. అని సనత్కుమారుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను. మహాత్మా సనత్కుమార మునీంద్రా! పుణ్యాత్ములగు ద్విజాతులకు ఏపుణ్యలోకములు కలుగునని చెప్పెదవో వానిక్రమమును చెప్పుము. మరికొన్ని విశేషములను కూడ వినగోరెదను. చెప్పుము అని ఈ రీతిగా అడిగిన ధృతరాష్ట్ర మహారాజునకు సనత్కుమారు డిట్లని చెప్పెను.

ధృతరాష్ట్ర మహారాజా! బలిష్ఠుడైన రాజును జూచి వీనికంటె నధికబలవంతుడనై వీనిని గెలిచి వీనికంటె సుఖినై యుండెదనని తలచుచున్నాడు. అటువలెనే జ్ఞానహీనుడు జ్యోతిష్టోమాదికర్మల వలన ఊర్వశీమొదలగు స్త్రీలతో స్వర్గాదులయందు భోగము కలుగునని వినినవాడై వీనికంటె నేను అధికపుణ్యమును చేసి మిక్కిలి సుఖవంతుడనయ్యెదనని పుణ్యమందు స్పర్థను పొందుచున్నాడు. అట్టిఫలాపేక్షగల యజ్ఞాధికారులు యిక్కడ దేహమును విడిచి ధూమాదిమార్గముచేత స్వర్గమునుపొందుదురు. ఆస్వర్గమందు నక్షత్రరూపము వివేకులగువారు స్వర్గాది విషయసుఖములను కోరనందున జ్యోతిష్టోమాదిపుణ్యకర్మలయందు స్పర్థ కలిగియుండరు. అట్టి వివేకులు ఫలమును కోరక ఈశ్వరార్థముగా యజ్ఞాదిపుణ్యకర్మములను చేయుచుందురు. అట్లు ఈశ్వరార్థముగా కర్మములను చేయుటవలన చిత్తశుద్ధిద్వారా ఆకర్మము జ్ఞానసాధనమగును. ఇట్లు యజ్ఞాదికర్మలచేత చిత్తశుద్ధిగలవారు పరమాత్మను తనస్వరూపముగా నెరిగిపొందుచున్నారు

అట్టిజ్ఞానులు కాలవశమువలన దేహమును విడిచి పూర్ణానందస్వరూపమైన పరబ్రహ్మమును పొందుచున్నారు ధృతరాష్ట్రమహారాజా! వేదవేత్తలగు జనులు అట్టిజ్ఞానియొక్క సమాచారమును విశేషముగ జెప్పుదురు. అదియెట్లనగా చెప్పెద వినుము. అజ్ఞానియొక్క పుత్రమిత్రకళత్రాదులును, యితరజనులును యెరుగకుండునట్లుగా అజ్ఞాని ప్రవర్తించుచుండును. మృగములుదొంగలు లేని ఉపద్రవరహితమగు ప్రదేశమందు అన్నపానాదులు విశేషముగా నున్నట్లు అజ్ఞాని తలచును. తృణోదకములు సమృద్ధిగా నున్నస్థలమందు జ్ఞానియగువాడు నివసించును. అటువంటి ప్రదేశమందు జ్ఞానియుండి లభించిన అన్నపానాదులచేత జీవింపుచు మనఃపరితాపమును పొందకుండును. అట్టి బ్రహ్మవేత్త తనమహాత్మ్యమును బయలుపరచక ఎక్కడనైన ఒకానొకప్రదేశమున పండుకొని లోకమందంతటను తానే యున్నట్లు జూచుచుండును. పిచ్చివానివలెను, మూగవానివలెను, పిశాచమువలెను తిరుగుచుండును. అప్పుడు తనను బ్రహ్మవేత్త యని మరియొకడు యీశ్వరబుద్ధిచేత పూజించినను ఆబ్రహ్మవేత్తసని సంతోషవికారమును పొందడు. మరియొకడాజ్ఞానిని బ్రహ్మవేత్తయని యెరుగక సామాన్యబ్రాహ్మణునిగా పూజించి అవమానించినయెడల అట్టివానిని ఆబ్రహ్మవేత్త సకలఇంద్రియ మనోవ్యాపారములను ఉపసంహరించి పరిపూర్ణానందరూపుడై యుండును. మనస్సును పరితపింపజేయడు. బ్రహ్మనిష్ఠాసాధనరూపములైనదర్భాసనవస్త్రకృష్ణాజినము మొదలగువానిని నశింపజేయడు. అదియే ఆయోగికి పెద్దలకు సమ్మతమైన అన్నము. ఆ బ్రహ్మవేత్తతాను యెవరికిని తెలియకుండ వర్తించుచుంటిసని తలచుచుండును. అట్టి బ్రహ్మవేత్త పుత్రభార్యాదుల సమీపమందున్నను వారిని విడిచి కేవలము ఆత్మనిష్ఠాగరిష్ఠుడై తన మహాత్మ్యమును బయల్పరచక రహస్యముగా సంచరింపుచుండును.

సర్వదా యింద్రియములకు అగోచరమైన పరమాత్మయందు సమాధి
యోగము కలిగియుండెడువాడనియు, దేహేంద్రియమనోబుద్ధులయందు అహం
కారమమకారములనువిడిచెడువాడనియుబ్రహ్మవేత్త తలంచుచుండును.
ధృతరాష్ట్రమహారాజా! ఆపరమాత్మ ప్రాణాపానాదివ్యాపారములు లేని
వాడు. క్రియాకర్తృత్వములు లేనివాడగుటవలన నిశ్చలుడగును.
అవిద్యాదిదోషరహితుడైనందున శుద్ధుడగును. ఆకలిదప్పులు మొద
లగు ద్వంద్వములు లేనివాడు కాగలడు. సర్వాంతర్యామిత్వకార్యములను
అంతరుడగును. చిదాభాసత్వములేని సాక్షియగును అట్టి
ఆత్మయందు దేహాద్వయధర్మములు నారోపించి నేను ప్రాణములను విడుచు
నేను కృశించినవాడననియు బ్రాహ్మణుడు చెప్పరాదు. అట్లు దేహ
మునగల ఆత్మయందు దేహవికారములు నారోపించి బ్రాహ్మణుడు
తలంచినయెడల అట్టి బ్రాహ్మణునియొక్క బ్రాహ్మణత్వము నశించిపో
వును. సచ్చిదానందస్వరూపముగా నుండెడు తనను దేహవంతునిగా
తలచరాదు. అట్లు తలచి నేను కర్తననియు భోక్తననియు అభిమా
నించినయెడల రోగంచేత తాను అపహరింపబడినవాడగును. అట్టి
మూఢుడు సర్వపాపములను చేసినవాడేయగును. కనుక దేహేంద్రి
యాదులయందు ఆత్మబుద్ధిని విడిచి పరమాత్మయందు నిష్ఠ గలిగి
యుండవలెను. దేహేంద్రియధర్మములందు ఆత్మబుద్ధి లేనివాడు సంసారక్లేశము
లేనివాడు. అందుచేత ఉపద్రవమును లేనివాడగును. ఆకలిదప్పులచేత
ను పీడింపబడడు. కామక్రోధాదులచేత బాధింపబడడు. అట్టివాడు
పండితులకు సమ్మతుడు. బ్రహ్మవేత్త. బ్రహ్మవేత్త లగువారు తమ
మాహాత్మ్యమును పరులకు తెలిసినయెడల అట్టివారు మూఢులనబడు
దురు. అట్టిమూఢులు తమను బ్రహ్మవేత్తలని చెప్పుకొనుచు కుక్కలు
కక్కిన అన్నమును భక్షించినట్లు జీవింతురు. అట్టిమూఢులు కుక్కల
వంటివారేయగుదురు. తమమాహాత్మ్యమును ప్రకటించుకొను బ్రహ్మ

వేత్తలకు కీడు కలుగునుగనుక బ్రహ్మవేత్తలగువారు తను మాహాత్మ్యమును బయలుపరుపక రహస్యముగా వర్తింపుచుండవలయును. సన్మానగౌరవబహుమానములను కోరనివారును భార్యాపుత్రధనాదులయందు ఆసక్తిలేనివారును వేదప్రతిపాద్యములైన అహింసయు, సత్యము, చోరగుణము లేకుండుటయు బ్రహ్మచర్యశమదమాదిసాధనములును యీగుణములయందు ఆసక్తులగు బ్రాహ్మణులను బ్రహ్మవేత్తలని యెరుగవలెను. మరియు యీలోకమందు అగ్ని ఇంద్రాది సర్వదేవతలను యజ్ఞాదికర్మములచేత పూర్ణముగా తృప్తిబొందించినవాడైనను బ్రహ్మవేత్తతో సమానుడుకాడు. ఫలముకొరకు ఆయాదేవతాదివిశేషములకు హవిస్సును పంచిపెట్టు హవిష్య నియోగిదేవతావిశేషియైనను బ్రహ్మవేత్తతో సమానుడు కాడు. కొంతమంది విద్వాంసులు బ్రహ్మవేత్తను బ్రహ్మవేత్తనుగా యెరిగి పూజించినయెడల బ్రహ్మవేత్త నేను పూజింపబడితినని సంతోషింపడు. మరి కొందరు మూఢులు పిచ్చివానినిగా దలచి ఆబ్రహ్మవేత్తను అవమానించినయెడల నేను అవమానింపబడితిననిపరితపింపడు. విద్వాంసులు ఆబ్రహ్మవేత్తను పూజించినయెడల స్వభావసిద్ధముగా కన్నుమూయుట. తెరచుటవలె పూజించుట స్వభావమని ఆబ్రహ్మవేత్తతలచుచుండును. మూఢులగు జనులు తనను పిచ్చివానినిగా దలచి అవమానించినయెడల ఆఅవమానము నిమిత్తమైన దుఃఖమును బ్రహ్మవేత్త పొందడు. మూఢులగు జనులు పూజింపదగినవానిని పూజింపరనియు పూజింపదగనివానిని పూజింతురనియు. ఇట్లు చేయుట మూఢులకు స్వభావమనియు ఆబ్రహ్మవేత్త తలచుచుండును. మానము, మౌనము యివి రెండును యేకీభవించి వర్తింపవు. ఈప్రత్యక్షాది గోచరమైన లోకము మానమునకు విషయము పరలోకమునకు మౌనము విషయము. మానమువలన సంసారప్రాప్తికలుగును. మౌనమువలన

బ్రహ్మప్రాప్తికలుగును. స్త్రీ అన్నపానాదులయందు గల భోగేచ్ఛ మానమని చెప్పబడును. మానవిషయమైన బుద్ధిగలవాడు స్వర్గపశు అన్నాదిసాధనభూతమైన కర్మములను చేయుచుండును. అట్టివానికి సంపద గలుగును. ఆసంపద మోక్షమార్గమునకు విరోధి యగును. అట్టిసంపదచేత మూఢుడు మోహించి విషయసుఖములయందు ప్రవర్తించును. అట్టిమూఢునకు వివేకములేనందున బ్రహ్మానంద మను మోక్షలక్ష్మి వానికి లభింపదు. ఆ బ్రహ్మానందలక్ష్మియందు ప్రవేశించుటకు కొన్ని ద్వారములు గలవు. వానిని చెప్పెదను వినుము. ఆ ద్వారములను పొందుట కష్టసాధ్యమగును. 1 సత్యముగా సంభాషించుట 2 సకలప్రాణులయందుదయగలిగియుండుట 3 కుటిలస్వభావము లేకుండుట 4 చేయరాని కార్యమును చేయుటయందు సిగ్గుగలిగియుండుట 5 మనోనిగ్రహఇంద్రియనిగ్రహములను గలిగియుండుట 6 మనస్సునందును దేహమందును పరిశుద్ధి గలిగియుండుట. బ్రహ్మవిద్యయీ ఆరును బ్రహ్మానంద లక్ష్మియందు ప్రవేశించుటకు ద్వారములగును. ఈఆరును మానమోహములను నశింపజేయునవి యగును.

(ఇది సనత్సుజాతపర్వమున ఏకచత్వారింశోఽధ్యాయము)

ఈవిధమున సనత్కుమారుడు చెప్పగా ధృతరాష్ట్రుడు యిట్లనెను. భగవంతుడా! సనత్కుమార మునీంద్రా! వాక్కు మొదలగు యింద్రియ నిగ్రహలక్షణ రూపమైన మౌనము యెటువంటి దానికి గలుగునో చెప్పుము. మౌన సంభాషణ ఆత్మస్వరూపములలో మౌనమెద్దియో జెప్పుము. ఇక్కడ మౌనస్వభావమును చెప్పుము సమాధిలక్షణమైన మౌనముచేత బ్రహ్మమును పొందెడువిధమును చెప్పుము. ఇతరులు మౌనమును యెట్లుఆచరింతురో చెప్పుము. అని ధృతరాష్ట్రుడడుగగా సనత్కుమారు డిట్లనెను.

ధృతరాష్ట్ర మహారాజా! వేదములును మనస్సు యీ పరమాత్మయందు ప్రవేశింపజాలవు. ఆకారణమువలన అవాఙ్మానసగోచరమైన పరమాత్మయే మౌనమని తెలిసికొనుము. ఋగ్వేదాది శాస్త్రములన్నియు ఆపరమాత్మయందే పుట్టెను. అట్టి వేదములు యీపరమాత్మను చిదానందరూపుడని ప్రతిపాదించుచున్నవి. ఆ పరమాత్మ అవాఙ్మానస గోచరుడైనను పరంజ్యోతి స్వరూపముచేత ప్రకాశించుచున్నాడు. ఆపరమాత్మ జ్యోతిస్వరూపముగా మాకు అనుభవము గలదు. ఈవిషయమై నీవు సంశయింపవద్దు. శ్రుతిస్మృతి పురాణాదులయందును ఆపరమాత్మపరంజ్యోతి స్వరూపుడనియే చెప్పబడుచున్నది. అని యిట్లు సనత్కుమారుడు చెప్పగా ధృతరాష్ట్రుడు యిట్లనెను. ఓభగవంతుడా! సనత్కుమారమునీంద్రా! ఒకానొకడు పాపకర్మములను జేయుచు ఋగ్వేదాది వేదములను చదివివయెడల అట్టివేదాధ్యయనముచేత వానిపాపములు నశించునో నశింపవో చెప్పుము. ఈవిషయమును చెప్పుటకు నీవేతగుదువు అని ధృతరాష్ట్రుడు అడుగగా సనత్కుమారు డిట్లనెను. ఓ ధృతరాష్ట్రమహారాజా! ఒకడు పాపకర్మములను జేయుచు ఋగ్వేదాది వేదములను చదివినను. ఆవేదములు వానిపాపములను నశింపజేయజాలవు. నేను అసత్యమును చెప్పను. నామాటను నీవు నమ్ముము. పాపములు చేయుచు మాయావంతుడై ప్రవర్తించుచు సకలవేదవేదార్థములను చదివి యెరిగినను ఆవేదములు అట్టిపాపాత్ముని రక్షింపజాలవు. పక్షులకు రెక్కలువచ్చినప్పుడు ఆపక్షులు తమఆశ్రయస్థలమును విడిచి వెళ్ళినట్లు వేదములును మరణకాలమందు ఆ పాపపురుషుని విడిచి పోవుచున్నవి. అని సనత్కుమారుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను.

భగవంతుడా! సనత్కుమారా! వేద వేత్తను వేదములు రక్షించని యెడల వేదములను చదువుటచేతను, ఆవేదార్థ విచార

ణముచేతను ఆ వేదార్థమును అనుష్ఠించుటచేతను బ్రాహ్మణులకు వ్యర్థమైన ప్రయాస కలుగుచున్నది. ఇట్టి స్వర్గాదులను ప్రయాసవలన ప్రయోజనము లేదుకదా ! అని ధృతరాష్ట్రుఁడడుగగా సనత్సుజాతుఁ డిట్లనెను. ఓ ధృతరాష్ట్రమహారాజా ! స్వర్గాదిలోకములకంటె అన్యమైన మోక్షమును పరమపురుషార్థమొంది కల[illegible] సిద్ధించును. వేదోక్తమైన ఉపాసముల వలనను ఈశ్వరార్థముగా కర్మములను చేయుటవలనను జ్ఞానప్రాప్తిసాధనమైన అంతఃకరణ శుద్ధికలుగుచున్నవి. తద్వారా మోక్షపురుషార్థము కలుగును గనుక ఇట్లు వేదము వేదవేత్తకు సంసారబంధముతప్పించి అతని రక్షించుచున్నది. ఈకారణమువలన వేదములు వేదవేత్తను రక్షించుటకు శక్తిసంగతములే యగును. ఆపరమాత్మకు మాయచేత అనేకరూపములు గలిగినవనియు అట్టినామరూపములచేత యీజగత్తు ప్రకాశించుచున్నదనియు వేదములు చెప్పుచున్నవి. అట్టి పరమాత్మ అఖండ సచ్చిదానంద స్వరూపుఁడై అద్వితీయుఁడై సజాతీయ విజాతీయ స్వగతభేదరహితుఁడై పరిపూర్ణుఁడై యున్నట్లు ఆ వేదములు సిద్ధాంతముచేయుచున్నవి. మునులును ఆ పరబ్రహ్మము విశ్వరూపముగా ప్రకాశించుచున్నదని చెప్పియున్నారు. వేదముచేత కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులును జ్యోతిష్టోమాది యజ్ఞములును చెప్పబడియున్నవి. ఆ తపోయజ్ఞములను చేయుచు విశ్వరూపుఁడైన పరమేశ్వరునకు అర్పణముచేయవలెను. అట్లు యీశ్వరార్పణముగా కర్మములను చేసినవాఁడు పుణ్యమును పొందును. అట్టిపుణ్యముచేత పాపమును పోగొట్టుకొని పిమ్మట మరియొక జన్మమందు జ్ఞానవంతుఁడై సకలపాపవిముక్తుఁడై సత్యజ్ఞానానంద బ్రహ్మస్వరూపుఁడగుచున్నాఁడు. ఇట్లు జ్ఞానవంతుఁడు పరమాత్మను పొందుచున్నాఁడు. ఈశ్వరార్పణముగా కర్మములనుచేయక కర్మఫలములను గోరువాఁడు అజ్ఞాని యగును. అట్టి అజ్ఞాని స్వర్గాదిఫలము

లను కోరుచు యీలోకమందు యజ్ఞాదికర్మములను చేసి ఫలమునం తయు పరలోకమందు అనుభవించుచున్నాడు. అనుభవించి కర్మశేష ముచేత మరల యీలోకమందు పుట్టుచున్నాడు. ఈలోకమందు చేసిన తపోఫలమును బరలోకమందు అనుభవించుట అందరికిని సమానమే యగును. బ్రహ్మవేత్తలకు మాత్రము భేదము గలదు. యెట్లనగా చెప్పెద వినుము. బ్రహ్మవేత్తలగువారు చేసినతపస్సునకు మిక్కిలి అధికమైన ఫలవృద్ధి గలుగును. విషయసుఖములను కోరు అజ్ఞానులు చేసినకర్మములకు శాస్త్రమందు చెప్పినంత ఫలమే గలు గును గాని అధికము గలుగదు అని యిట్లు సనత్కుమారుడు చెప్పగా ధృతరాష్ట్రుడు యిట్లనెను.

భగవంతుడా! సనత్కుమారా! జ్ఞానియగువాడు చేసిన తప స్సునకు మిక్కిలి అధికమైన సమగ్రఫలము యెట్లుకలుగునో చెప్పుము. అని ధృతరాష్ట్రుడడుగగా సనత్కుమారు డిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! బ్రహ్మవేత్తయగువాడు చేసినతపస్సునిష్కల్మషతపస్సు అగును. ఆతపస్సే జగత్తుపుట్టుటకు కారణము. ఆతపస్సునకే మిక్కిలి అధికమైన ఫలవృద్ధి కలుగును. నిష్కల్మషముగాని తపస్సుకు ముందు చెప్పినరీతిగా ఫలసమృద్ధి కలుగదు. ఈలోకమంతయు అట్టి నిష్కల్మ షతపస్సువలననే పుట్టెను. ఆతపస్సువలననే మోక్షమును పొందిరి. అని సనత్కుమారమునీంద్రుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను. సన త్కుమారమునీంద్రా! తపస్సుయొక్క కల్మషము యెటువంటిదో చెప్పుము. తపోకల్మషమును చెప్పినయెడల నిష్కల్మష తపస్సుచేత పరబ్రహ్మమును పొందెదను. అని ధృతరాష్ట్రుడు అడుగగా సనత్కు మారుడిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! క్రోధము మొదలగు పన్నెండు గుణములును తపోదోషములగును. నృశంసాదు లగు ఏడు గుణములును తపోదోషములగును. జ్ఞానాదులగు పన్నెండు గుణము

లును జ్ఞానసాధనములని వేదము చెప్పియున్నది. ఈగుణములు లన్నిటిని యెరిగి యుండవలయును. గనుక క్రమముగా చెప్పెద వినుము 1. క్రోధము 2. కామము 3. లోభము 4. మోహము 5. విధిత్స 6. అకృప 7. అసూయ 8. మానము 9. శోకము 10. స్పృహ 11. ఈర్ష్య 12. జుగుప్సా యీపన్నెండుగుణములు తపోదోషము లగును. 1. క్రోధమనగా కామము ప్రతికూల మైనప్పుడు కలుగు కోపము క్రోధమనబడును. అభిమానమునకును, తిట్టుటకును, కొట్టుటకును, దుఃఖించుటకును యీక్రోధము హేతువగును. క్రోధముగలిగినప్పుడు మనస్సునకు విక్షేపము కలుగును. దేహమందు చెమట బిందువులు కలుగును. దేహము వడకును. ఈవిశేషములుగలది క్రోధమని తెలియ వలెను 2. కామమనగా స్త్రీలు మొదలగు విషయములయందు గల అభిలాషను కలిగియుండుట 4. పరుల ద్రవ్యమందు గల అపేక్షను లోభమందురు. న్యాయమార్గమున సంపాదించిన ధనమును పుణ్య కార్యమందు వినియోగింపకుండు సామర్థ్యమునుగూడ లోభమందురు. 4. కార్యాకార్యములయందు వివేకము లేకుండుటను మోహమందురు. 5. విషయరసములను యెరుగుటకు యిచ్ఛయించుటవిధిత్సయందురు. 6. క్రూరస్వభావముకలిగియుండుట అకృపయందురు 7. మంచిగుణ ములయందు దోషమును వెదకుట అసూయయందురు. పరులగుణము లను సహింపకుండుటయు గూడ అసూయ యనదగును. 8. తనకు గౌరవసన్మానములను కోరుట మానమందురు 9. ఇష్టపదార్థమును విడుచుటవలన కలిగిన మహాక్షోభము శోకమని చెప్పబడును. ఏడ్చు టయు చింతించుటయు విచారమునకు చిహ్నములు. 10. విషయ భోగములయందుగలయిచ్ఛ స్పృహయగును. 11. పరులశ్రేయస్సు లను సహింపకుండుట యీర్ష్య యందురు. 12. పరుల గుణములను చెరుచుటకు యిచ్ఛయించుట జుగుప్సయని చెప్పబడు ఈపన్నెండును

ధర్మముకానియెడల నీవేకాదని నిరూపింపుము. అదిగాక యీరీతిగా యీకార్యమును చేయదగునని మనలను శిక్షించుటకు శ్రీకృష్ణదేవు డున్నాడు. గనుక యీవివాదముతో మనకు ప్రయోజనము లేదు. ధర్మా ధర్మవేత్తలగు పెద్దలకు యీకృష్ణుడు గురువు వంటివాడు. కార్యాకార్యములను నిరూపించువారికి యీ శ్రీకృష్ణుడు శిక్షకుని వంటివాడు. ఉచితానుచితముల నెరుంగువారికి యీ కృష్ణ దేవుడు ప్రదర్శకుని వంటివాడు. మరియు యీకృష్ణుని యాజ్ఞవలననే యదు వృష్ణి, భోజ, అంధక, సృంజయ, కేకయులు మొదలగు రాజు లందరును ప్రసిద్ధమైన ధర్మమార్గమందు సంచరించుచున్నారు. గాన యీకృష్ణుని యాజ్ఞయేమాకు సర్వార్థసాధనము. సకలపురుషార్థ ప్రదము. మేముయీకృష్ణుని మాటల ప్రకారము తప్పక ప్రవర్తింతుము. అని యిట్లు ధర్మరాజు సంజయునితో చెప్పెను. ఆమాటలను కృష్ణుడు విని సంజయునితో యిట్లనెను.

సంజయా ! నేను సర్వదా పాండవులకు శుభమును కోరుచుం దును. ధృతరాష్ట్రుడు పుత్రులను పౌత్రులను పొంది మహామహి మతో ప్రకాశించుచున్నాడు. అట్టి కౌరవ కులమునకు చేటుగలిగిన యెడల మరల మేలు కలుగదని నేను తలంచుచుందును. గనుక ధృతరాష్ట్రుడు యిప్పుడు తెలివిగలవాడై పాండవుల కోపమును మాన్పుటకు పూర్తియైన మనోనిశ్చయముతో నిన్ను యిక్కడకు పంపించెను. ఇందుకు నేను సంతోషించితిని. నీవును యిక్కడికి వచ్చి తగిన ప్రకారము వినయముచేత స్నేహధర్మములను తెలిసి వీరికి శాంతము గలుగునట్టుగా మాటలాడితివి. ఇందుకు నాకు యిప్పుడు సంతోషము కలిగెను. ఈ విషయము లన్నియు విచారించి చూడగా పూర్వము కౌరవులు పాండవులు కలిసియుండునట్లు తోచి నను, యిప్పుడు ధర్మరాజు చెప్పిన పద్ధతినిబట్టి సంధిలేని విధము

తోచుచున్నది. అది నిశ్చయము, ఈపాండవులకు కౌరవులకు సంధి స్నేహములు తుదకు కలుగజాలవు. అదియెట్లనగా చెప్పెదను వినుము. దుర్యోధనుడు పరమహంకారి. ధృతరాష్ట్రుని చిత్తవృత్తి పద్ధతి మనము కొంతవరకు యెరిగియే యున్నాముగదా ! అందువలన సంధిస్నేహములు పొసగనేరవు. ధృతరాష్ట్రుడు చేయబోవు స్నేహభావమును నీవు యిప్పుడు మాధుర్యములగు మాటలచేత చెప్పుచున్నావు. ఈ పాండవులు తమ రాజ్యభాగమును పొందకుండ తీయనగు నీ నేర్పరి మాటలచేత శాంతులు కాజాలరు. సంజయా ! పాండవులు సకల కష్టములను మరచి విశేషముగా కలహమును త్రవ్వక ఒకానొక మార్గముగా సమ్మతించి శాంతులై కౌరవులతో కలసి బ్రతుకుట మంచిదే యగును. అట్లు చేయుటవలన పాండవుల యొక్క శాంత గౌరవ కృపాధర్మ స్వభావములు మిక్కిలి ప్రకాశించును. ఇది లోకధర్మ న్యాయము.

కౌరవులు రాజ్యభాగమును పంచి యివ్వలేదని పాండవులు తెంపువహించి కౌరవులమీదకు యుద్ధమునకు వచ్చినను రావచ్చును. అట్లు యుద్ధమునకు వచ్చుట ద్రోహముకాదు. పాండవులు అవమానమును పొందిరి. పాండవులు శాంతులై జనులచేత పొగడబడుటకంటె తమభుజాబలముచేత కౌరవులను యెదిరించినయెడల అది మిక్కిలి శ్రేష్ఠమగును. అట్లు యుద్ధముచేయుటయే పాండవులకు తగిన పని యని తోచుచున్నది. సంజయా! రాజులకు యుద్ధము ధర్మముగాదని నీవనగలవేమో చెప్పుమని నిన్ను ధర్మరాజడిగెనుగదా ! బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు ధర్మశాస్త్రాచార్యులు యజ్ఞాది కర్మసాధనములను విధించునప్పుడు రాజులు యిచ్చువారేగాని పరులను వేడరాదని చెప్పిరి. ఇది సర్వలోక ప్రసిద్ధము. రాజులగువారు సర్వ వర్ణాశ్రమ ధర్మములను పరిపాలింపుచుందురు. అటువంటి రాజులు తమ కులధర్మ

మైన యుద్ధమును విడువరాదు. అదిగాక న్యాయయుక్తమైన ధర్మ సంపాదనముచేత తమకు లభించిన సంపదలను అనుభవింపుచు ధర్మ మార్గమందు రాజులు ప్రవర్తించుచుందురు. అట్టిరాజులను యితరు లన్యాయముచేసిన యెడల వారిని శిక్షించుటకు దేవేంద్రాదులగు పెద్దలు యీ శస్త్రాస్త్రములను యేర్పరచిరి. సంజయా! ఇప్పుడు నీవు పాండవులకు చెప్పిన నీతిధర్మములు కౌరవులకు చెప్పరాదేమో తెలియకున్నది. ఆ కౌరవులే ముందు జరుగబోవు విషయములను తెలియనేరక అవివేకులై చెడుమార్గమందు ప్రవర్తింపుచున్నారు. అటువంటికౌరవులకు నీవు ధర్మమును చెప్పనికారణము తెలియదు. అని కృష్ణుడు సంజయునితో చెప్పెను.

సంజయా! పూర్వము సభయందు కౌరవులు పాపాత్ములై పాండవులయెదుట వారిభార్యయగు ద్రౌపదిని ఆ ప్రకారముగా అవ మానించిరి. లోకమందు యితరు లనేకులు జూదమాడి గెలిచినవారు కలరు. యీకౌరవులవంటి తులువలు లోకమం దెచ్చటను గనుపింప లేదు. అని కృష్ణుడు సంజయునితో చెప్పగా సంజయు డిట్లనెను. ఓ మహాత్మా! కృష్ణా! యీ విషయమును మీ మనస్సులయందుంచు కొని యింత కొనియాడిన యెడల సంధి కలుగునా? అని సంజయుడు చెప్పగా కృష్ణదేవు డిట్లనెను. సంజయా! ఆ సభయందు దుర్యోధన దుశ్శాసనాదులు ద్రౌపదిని అవమానించుచుండగా భీష్మాదులగు పెద్ద లందరును నోరెత్తక యూరకుండిరి. అయ్యో! అప్పుడు ధృతరాష్ట్రుడు దుర్యోధనుని చిత్తవృత్తి యెరుగనందున తనకొడుకులగు దుర్యో ధనాదులను వారించి నిగ్రహించుటకు శక్తిచాలకపోయెను. అప్పుడు ధృతరాష్ట్రుడు ద్రౌపదికి కలిగిన అవమానమును నిగ్రహించి దుర్యో ధనాదులను వారించి శిక్షించినయెడల నాచిత్తమేగాక లోకులచిత్త ములన్నియు సంతోషించును. అంతట దుశ్శాసనుడు నిర్దయుడై నిర్భయముగా ద్రౌపదియొక్క శిఖపట్టుకొని సభలోనికి యీడ్చి

తెచ్చెను. ఆ విషయమును ద్రౌపదికి మామయగు ధృతరాష్ట్రుడు యెట్లు సహించెనో తెలియదు. ధృతరాష్ట్రుడు తనకోడలగు ద్రౌపది యేడ్చుచుండగా ఆయేడ్పు ధ్వనిని విని యెట్లు వోర్చెనో తెలియలేదు. ఇప్పుడు నీవలన పాండవుల క్షేమమును యెరుంగుటకు ధృతరాష్ట్రు డింతశీఘ్రముగా యెట్లు తలంచెనో తెలియకున్నది. ఆనాడు కౌరవులు నిండుసభయందు ద్రౌపదిని అవమానించునప్పుడు సభలోనివారందరును నిశ్శబ్దముగా వూరకుండిరేగాని ఒక్కరైనను యిది తగదని మాటాడినవారు లేరు. అట్టి సమయమున తనను తాను రక్షించుకొను యుపాయము ద్రౌపదికి దైవానుగ్రహమువలన కలిగెను. అందువలన ద్రౌపదికి మానభంగముయొక్క అవమానము తప్పిపోయెను. పాండవులంతట బ్రతికిరేగాని నిశ్చయమునకు అట్టి అపాయమగు అవమానమునకు రాచకుమారులు సహింపనేరరు. సంజయా! ఆ సభయందు సభికుల చెవులకు శూలాయుధములుగా నుండునట్లు ద్రౌపదితో కర్ణుడు యిట్లుపలికెను.

ద్రౌపదీ! ఇక్కడ నీకు మగలులేరు. నీ మగలైన యీపాండవులు నిన్ను జూదమందు ఓడి విడచిరి. గాన నీయందు కామముగల మరియొక మగనిని జూదమందు ఓడనివానినిగా జూచి వెదకికొనుము. అని యిట్లు చెవులకు కఠోరముగా కర్ణుడు సభయందు ద్రౌపదితో జెప్పెను. ఈమాటల నన్నిటిని నీవును వినియే యున్నావు. ఆ కర్ణుని మాటలు వాఙ్మయమైన బాణములై అర్జునుని హృదయంబునందు నాటుకొని చలింపక భరింపరాని బాధను కలిగించెను. ఆ బాధకు బహుకాలముగా అర్జునుడు చికిత్స చేసెనేమో చెప్పుము. అప్పుడు దుశ్శాసను డిట్లనెను.

ఈ పాండవులందరును గొడ్డుబోయినవారు. పాండవులలో పౌరుషముగల మానవుడొక్కడును లేడని దుశ్శాసనుడు సభ

యందు చెప్పెను. అతడు చెప్పినట్లు పాండవులు ..ష్టబోయిరే కాని వారివలన కౌరవులకు యేమియు ఫలింపలేదు. ఆ సమయమందు కౌరవ సభలో కొన్ని మాటలు జరిగెను. ఆ మాటల నిచ్చట జెప్పుట కిష్టములేదు. అవి చెప్పదగినవి కావు. గనుక యీ పాండవులకు ఆ కౌరవులతో సంధికలుగుట గుర్ఘటము. ఈ సంధిని ఘటింపజేయు టకు శక్యముగాదని తలంచెదను. పాండవులను తగినట్లు ప్రార్థించి కౌరవులదగ్గరకు నేనైనను వచ్చి కౌరవులకు బుద్ధిని జెప్పెదను. కౌరవులు రాజ్యభాగమును పంచి యిచ్చినయెడల మృత్యువు వాతపడక తప్పుదురు. కౌరవులు కార్యవిషయమైన కలహము నావలన జరుగు నని నామీద పెట్టిరి. అది నాకు చెరుపుగాదు. అన్యాయముగాని నా మాటకు యీ పాండవులు నన్ను సన్మానింతురు. కౌరవులు నా మాటకు సమ్మతింపకుందురు. కౌరవులు నామాట వినక యెగతాళి చేసినయెడల పాండవుల బాణాగ్నివలననే గాక తమ లోభమను చిచ్చుచేత కౌరవులు నశింతురు. ఈ మాట నిశ్చయము. అని యీ విధముగా కృష్ణుడు సంజయునితో చెప్పెను.

సంజయా! దుర్యోధనుడు రోషపూరితమైన వృక్షమువంటి వాడు. అటువంటి రోషపూరిత వృక్షమునకు మొదలున గల ప్రమాను వంటివాడు కర్ణుడు. అట్టి వృక్షమునకు కొమ్మవంటివాడు శకుని. ఆ వృక్షమునకుగల పుష్ప ఫలములవంటివాడు దుశ్శాసనుడు. అటు వంటి వృక్షమునకు మూలాధారమగు శక్తిధృతరాష్ట్రుడు. ధర్మరాజు ధర్మభూజమువంటివాడు ఆ ధర్మభూజమునకు అర్జునుడు బోదివంటి వాడు. దానికి భీముడు బలమైన శాఖవంటివాడు. నకుల సహదేవులు పుష్ప ఫలమువంటివారు నేనును. బ్రాహ్మణులు, వేదములును, ఆ ధర్మభూజమునకు వేరులవంటి వార మగుదుము. సంజయా! యీ రెండు వృక్షములయందును, సారమేదియో, అసారమేదియో విచా

రించి యెరుంగవలయును. అదిగాక యేది యెట్లున్నను విరోధము వహించుటకు కారణమేమై యుండునో తెలియకున్నది. ధృతరాష్ట్రుడును. అతని కుమారులగు దుర్యోధనాదులును కాననమునంటివారు. పాండవులు సింహముల సంటివారు. సింహములు లేని వనములను పరులు పాడుచేయుదురు. వనమును చేరి విహరింపని సింహములకు సౌఖ్యము లేకపోవుటయేగాక చేటువాటిల్లును. గాన యీ పాండవ కౌరవులు స్నేహము కలిగియుండుట ఉభయులకును మేలగును. ధృతరాష్ట్రుడు తన కొడుకులను వలెనే యీ పాండవులను దగ్గరకుతీసి ఆదరింపవలెను. పాండవులు ధృతరాష్ట్రునకు పరిచారకులై పనులు జేయుచుందురు. శత్రువులను కొట్టువారుగా నుందురు. సంజయా! పాండవ కౌరవులకు సంధికలిగించు నిమిత్తము, నేను హస్తినాపట్టణమునకు వచ్చెదను. నేను వచ్చి చెప్పగా నామాటకు ధృతరాష్ట్రుడు సమ్మతించినయెడల మేలు అగును. నామాటను విననియెడల అప్పుడు మేము యుద్ధముచేయుటకు పూనెదము. ఈ విధముగా మేమునీతో చెప్పిన మా యభిప్రాయము లన్నియు నీవు ధృతరాష్ట్రునితో చెప్పుము, అని కృష్ణదేవుడు సంజయునితో చెప్పెను. ఆ మాటల నన్నిటిని విని సంజయుడు ధర్మరాజ కృష్ణులను చూచి యిట్లు అనెను.

మహాత్ములగు కృష్ణ ధర్మరాజులారా! అట్లయినయెడల మిక్కిలి బాగుగా నుండునుగదా! నేను వచ్చిన కార్యము సఫలమయ్యెను. తరువాత కార్యమును వినెదను అని సంజయుడు కృష్ణ ధర్మరాజులతో చెప్పెను. అప్పుడు భీమార్జున నకుల సహదేవ సాత్యకి విరాట ద్రుపదులను చూచి యిట్లనెను. భీమాదులారా! నేను వెళ్ళివచ్చుటకు మీ అందరిచేతను అనుజ్ఞ పొందినవాడనే గదా! పోయివచ్చెదను. ఈ సభయందు నేను చెప్పిన మాటలలో

చెప్పదగిన మాటలేవియు లేవుగదా! అని సంజయుడు భీమాదుల నడిగి చెప్పెను. ఆ మాటలను ధర్మరాజువిని సంజయునితో యిట్లు అనెను.

సంజయా! పోయి వచ్చెదవుగాక. ఈ సభయందుండువారంద రును వినునట్లుగా నీవు స్పష్టముగా చెప్పితివి. నీవు చెప్పినమాటలలో ఒక్కమాటయైనను చెప్పదగనిమాట లేదు. నీవటు లెందుల కడిగితివో తెలియకున్నది? ఆ దుర్యోధనాదుల చెడుగుణములను గురించి చెప్పి నను నీవు తుదకు కటకటపడవు. వివేకశూన్యమగు వాక్యమునగాని కఠినమగు వాక్యముగాని, చులుకనిమాటనైనను నీవు చెప్పనేరవు. ఇటువంటి సంధికార్యములకు నీవైనను ఆవిదురుడైనను, మీయిద్దరి లో యేయొక్కరుగాని కావలయును. నీకుగల వినయనేర్పరితనములు యితరుల కుండనేరవు. గాన యిటువంటి సంధినేరములకు మీయిద్దరి కంటె యితరులు సమర్థులు కాజాలరు. సంజయా! నీవు హస్తినాపురికి వెళ్ళినపుడు కౌరవసభలో నుండు పెద్దలనందరను నేను అడిగినట్లుగా వారి క్షేమములను విచారింపుము. భీష్మద్రోణకృపాచార్యులు ముగ్గు రును నాయందు కరుణ కలిగియుందురు. వారిముగ్గురికి భక్తివినయ పూర్వకముగా నమస్కరించి నానమస్కారమని చెప్పుము. మాతం డ్రియగు ధృతరాష్ట్ర మహారాజును జూచి ప్రీతిపూర్వకముగా నమ స్కరించినట్లు నీవు దండప్రణామము చేయుము. దుర్మార్గుడైన దుర్యో ధనుని క్షేమమునుఅడిగితినని ఆదుర్యోధనునితో చెప్పుము. ఆదుర్యో ధనునితమ్ముడగుటకు తగియున్న దుశ్శాసనుని క్షేమమును విచారిం పుము స్త్రీజనులనందరిని వారివారి క్షేమములను తగురీతిని అడుగుము. విదురశల్యులను జూచి వినయపూర్వకముగా వారికుశలములను విచా రింపుము. అశ్వత్థామ నాలింగనముచేసికొంటినని చెప్పుము. బాహ్లీక సోమదత్తభూరిశ్రవులను జూచి ప్రీతిపూర్వకముగా వారి క్షేమములను

అడిగి వారికి నానమస్కారములని చెప్పవలయును. మరియు హస్తి నాపురమందు గుణవృద్ధులును, వయోవృద్ధులు నగు రాజు లనేకులు గలరు. కృతవర్మ, కర్ణ శకుని సైంధవుడు మొదలగు అనేక రాజులు గలరు. యుద్ధమునకు సహాయముగా దుర్యోధనునిపక్షముగా వచ్చిన సకలదేశమునరాజులు కలరు. వారినందరిని జూచి యెవ్వారె వ్వరితో యేయేవిధముగా నమస్కారములను, వినయమును, బాంధవ మును, వాత్సల్యమును జూపవలెనో ఆయావిధములచేత నానమస్కా రాదులను వారికందజేయుము. అందరికిని నాకు మారుగా నీవు తగు రీతిని నేజెప్పినట్లు చెప్పి ఉపచార మర్యాదలను జరుపుచు మరియు హస్తినాపురమందు మాయొక్క దాసదాసీజనులతో, వారిని జూచి యిట్లని చెప్పుము. దాస దాసీజనులారా ! ధర్మరాజు మిత్రుల తో జేరి శత్రువులను జంపి సర్వత్ర మిమ్ములను విచారింపగలడు. అని యిట్లు నేను చెప్పినట్లు ఆ దాసదాసీజనులతో చెప్పుము. అని ధర్మరాజు సంజయునితో చెప్పెను.

సంజయా ! నీవు హస్తినాపురమునకు వెళ్ళినవెంటనే చేయ దగిని కార్యక్రమమును చెప్పితిని. నేను చెప్పినప్రకారము అందరి యోగక్షేమములను తగురీతిని విచారించి తెలుసుకొని సభదీరియున్న ప్పుడు నీవు భయపడక యీవిధముగా మాతండ్రియగు ధృతరాష్ట్రు నితో చెప్పవలయునుసుమా! అతనితో చెప్పవలసిన మాటలను వినుము. ధృతరాష్ట్రమహారాజా ! నీబలమువలన పాండవులు సకలఆపద లను తప్పించుకొని తమబంధుమిత్రులతో కలిసి సుఖముగానుందురు. పాండవులకు బాల్యదశయందు వారితండ్రి రాజ్యభాగమందు వారిని నీవు నిలిపితివి. ఆ పాండవులకు నీవు ప్రభుత్వసంపదను యిచ్చితివి. ఇప్పుడు నీవు ఆపాండవులయందు కృపలేనివాడవై ఉపేక్షించితివి. పాండవులు కడుహీనమగు వృత్తిని గలిగియుండగా నీవు చూచి

సహింపరాదు. ఇంతమాత్రముచేత నీవు సంతోషింపరాదు. పాండవు లును కౌరవులును కలిసి మెలసియున్నయెడల మన శత్రువులగర్వ మణగును. అని యీరీతిగా ధృతరాష్ట్రమహారాజుతో చెప్పి పిమ్మట భీష్మునితోకూడ యీప్రకారముగా చెప్పెను. మహాత్మా! భీష్మా! మీతండ్రియగు శంతనుమహారాజుయొక్క వంశ మంతరించకుండునట్లుగా, శంతనునివంశము స్థిరతరంబు నిలుపుటకు నీవే తగుదువు. ఇప్పుడు నీ మనుమలకు అందరికిని నీవు బోధించి వారికి అధర్మ ప్రవృత్తిచే గలుగు మరణములను తప్పింపుము. యుద్ధము జరుగకుండునట్లు సంధిచేయుము. నీవు యిట్లు సంధిని పొసగించి నీ మనుమల నందరిని బ్రతికించినయెడల భూమియందుగల సకల రాజులును బ్రాహ్మణులును నిన్ను విశేషముగా స్తుతింతురు. భీష్మా! యిన్నివింతలు కలిగినను ఆధర్మరాజు శాంతపరుడై యుద్ధము చేయుటకు సమ్మతింపలేదు. అని యిట్లు భీష్మునితో చెప్పెను. ఆ సమయమందే అందరును వినుచుండగా దుర్యోధనునితో యిట్లు చెప్పెను. దుర్యోధనా! పాండవులు గొప్ప భుజాబలవంతులు. ఆ పాండవులను నీయొక్క వెర్రితనముచేత అడవులకు పంపించితివి. పర్వతారణ్యముల యందు బహుకాల పర్యంతము నీకఠిన స్వభావముచేత ఆపాండవులకు అనేక బాధలను కలిగించితివి. నీ తులువ తనముచేత సభలో నా ద్రౌపది తలపట్టి యీడ్పించి అవమానించితివి. నీవుచేసిన మీ తప్పి దములనన్నిటిని సత్యధర్మపరుడై ధర్మరాజు సహించి మన్నించెను. కురుకుమారులను నీవు యుద్ధమందు ద్రుంగకుము. ఇతరుల సొత్తునకు నీ వాశపడరాదు. ఆ పాండవుల సొత్తును పాండవులకు పంచియిమ్ము. నీవును పాండవులతోగూడి సుఖముగా బ్రతుకుము. అని యిట్లు దుర్యోధనునితో జెప్పెను. అని యీ రీతిగా ధర్మరాజు సంజయునితో చెప్పెను.

సంజయా! క్షేమము యుద్ధమునకు సమ్మతింపక సంధికోరుట ఆ కౌరవులకే మేలగును. దుర్యోధనుని మనస్సును బట్టిన పేరా

శయను అగ్నిహోత్రమునను నల్లార్పుటకు యత్నము చేసెను [illegible] పడవేరు. అందువలన దుర్యోధనునకు నేను బుద్ధి చెప్పవలసి యున్నది. దుర్యోధనునియొద్ద గల దుష్టబుద్ధులు లోకమునకు తెలియును గదా. ఆ విషయము స్పష్టముగా తెలియును. అయినను మాకు [illegible] సహాయమగును. అదిగాక సర్వలోకములకును ప్రభువగు శ్రీకృష్ణదేవుడు మాకు మిక్కిలిగా అంతరంగుడై యున్నాడు. గనుక ఆ కౌరవులు మమ్ములను గెలుచుటకు శక్యము కాదు. ఆ విషయ మట్లుండనిండు. భీమార్జునులకును, దుర్యోధనాది కౌరవులకును నేను పెద్దవాడనైనందున వీరును వారును నా ప్రాణసమును స్పర్థము చేయక సంధిగలిగియుండిరేని నా మనస్సు సంతుష్టినొందును. కౌరవులును మాభీమాదులును, స్నేహముగలవారై తమ తమ పిత్ర్యధనములను అనుభవించుచున్నయెడల మన పెద్దలకును బుద్ధిమంతులకును అందరి కిని సంతోషము కలుగును. నా శాంతమును చెల్లించి నన్ను తొందర పెట్టక, కలహము మాని వీరును వారును కలిసి సుఖముగా నున్న యెడల అందరికిని సంతోషము కలుగును. దుర్యోధనుడు మాకు క్రమముగా భూమిని పంచియిచ్చుటకు సమ్మతింపకున్నను 1. కుశస్థలము 2. వృకస్థలము 3. మాకంది 4. వారణావతము 5. ఇంద్రప్రస్థము యీ అయిదు పట్టణములతో చేరిన రాజ్యమును మాకిచ్చినయెడల అంతమాత్రమే చాలును. అదియును దుర్యోధనుడు సమ్మతించనియెడల తన సహోదరులకు మా అయిదుగురికిని ఎక్కడైనను ఒక్కచోటనే నిలుచుటకు అయిదు ప్రదేశముల నిచ్చినను చాలును. ఇట్లు చేసిన యెడల అందరికిని శాంతము కలుగును ఇట్లు యిచ్చినయెడల అక్కడ బంధుమిత్ర సహాయ జనులందరును కలసి నవ్వుచు కలిసిమెలసి వుల్లాసముగా నుందురు. అట్లు వారందరు వుల్లాసముగానుండిన యెడల మనమనస్సులకు సంతోషముగానుండును. కౌరవ పాంచాల యాదవ మాత్స్యులందరును అన్యోన్య స్నేహభాం

ధన్యములుగలవారై బ్రతుకుటయే నాకోరికయగును. ఈ విష యములన్నియు ఆమహాపురుషుడైన దుర్యోధనునికి తెలియజెప్పుము. అని యిట్లు ధర్మరాజుతో చెప్పెను. అప్పుడు సంజయుడు ధర్మ రాజుతో యిట్లనెను.

దేవా! ధర్మరాజా! నీవు చెప్పిన మార్గమునందయు నడి పెదను. నీకును, నీతమ్ములకును, కృష్ణదేవునకును యెట్లు సంతోషము కలుగునో ఆ ప్రకారము మీతండ్రియగు ధృతరాష్ట్ర మహారాజు జరుపగలడు. అని యీ రీతిగా సంజయుడు ధర్మరాజుతో చెప్పుచు దండప్రణామము చేసెను అప్పుడర్జునుడు సంజయునితో యిట్లనెను. సంజయా! నీవు నాకు బాల్యస్నేహితుడవు. నీమంచి స్వభావమును మే మెరుగుదుము. మేము బాల్యము మొదలుకొని చెడుబుద్ధిగల వారమైనదియు లేనిదియు, యిదివరకు నీకు తెలిసియే యుండును. భీముడు మదపుటేనుగు వంటివాడు. ధర్మరాజు తన యాజ్ఞయను అంకుశముచేత భీముని మదమును పూర్వమందును తుదకు యిప్పు డును అణచుచున్నాడు. ఆ ధర్మరాజుయొక్క కృపావిశేషమే కౌరవు లకు సహాయమై యున్నది. అదియే ఆకౌరవులకు చాలును. గనుక కౌరవులకు నీతిపరాక్రమాది విచార దుఃఖములతో పనిలేదు. అని యీ విధముగా అర్జునుడు సంజయునితో చెప్పి ధర్మరాజుయొక్క అనుమతివలన పరిజన సహితముగా సంజయునకు స్నానభోజనము లను నేర్పాటుగావించెను. పుష్పమాలికా సుగంధాద్యుపచారములను కల్పించి రత్నభూషణ చిత్రవస్త్రములను యిచ్చెను. అంతట సంజ యుడు శ్రీకృష్ణ పాండవుల అనుమతినిబొంది వారితో చెప్పి వెళ్ళెను. అని యిట్లు వైశంపాయనుడు జనమేజయునితో చెప్పెను.

ఇది శ్రీ మహాభారతము వచనకావ్యమందు ఉద్యోగ
పర్వమునందు ప్రథమాశ్వాసము

---

# ద్వితీయాశ్వాసము

దేవా! హరిహరనాథా! వైశంపాయన మునీంద్రుడు జనమేజయమహారాజును జూచి యిట్లనెను. జనమేజయమహారాజా! ముందు చెప్పిన ప్రకారము సంజయుడు కృష్ణ పాండవులతో చెప్పిన రథమెక్కి గుర్రములను తరుము కొనుచు సూర్యాస్తమయ కాలమునకు హస్తినాపురమునకు చేరెను. అంతట సంజయుడు నగరిలోనికి వెళ్ళి అంతఃపురమందు ధృతరాష్ట్రునకు తన రాకను యెరిగించెను. అంతట సంజయు డంతఃపురములోనికి వెళ్ళి ధృతరాష్ట్రుని జూచి అతని పాదములకు నమస్కరించెను. ధృతరాష్ట్ర మహారాజును అధిక ప్రీతిపూర్వకముగా సంజయుని లేవనెత్తి తన సమీపమునందు నిలిపెను. అంత సంజయుడు నిలిచియుండి ధృతరాష్ట్రుని సేవింపుచు రెండుచేతులను జోడించి యిట్లనెను.

ధృతరాష్ట్ర మహారాజా! దేవరవారి ఆజ్ఞప్రకారము నేను ధర్మరాజుదగ్గరకు వెళ్ళి ధర్మరాజును జూచి వచ్చితిని. మహాసద్గుణవంతుడగు ధర్మరాజు నీకు నమస్కరించి గౌరవించెను. నన్ను గౌరవించి సన్మానించెను. ఇక్కడ బంధువుల నందరను ధర్మరాజు తలంచి యడిగెను. ఆ ధర్మరాజు కరుణాచిత్తుడై మీ సౌఖ్య విభవైశ్వర్యములకు సంతోషించి నీ కొడుకుల క్షేమము నడిగెను. అని యిట్లు సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను. సంజయా! ధర్మరాజునకు క్షేమమేగదా! అతని తమ్ములందరును సుఖముగా నున్నారు కదా! మరియు ధర్మరాజుయొక్క బంధు పుత్ర మిత్ర మంత్రిజనులందరును అతని దగ్గరనే సంతోషముగా నున్నారుకదా! అని ధృతరాష్ట్రు డడుగగా సంజయు డిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! మీయొక్క గొప్ప బలాతిశయము వలన వారందరును సౌఖ్యముగా నున్నామని చెప్పిరి. నిశ్చయమును

విచారింపగా వారనినదే యథార్థము. ధర్మరాజునకు ధర్మములు రుచించునట్లు విషయభోగములు రుచింపవు. సకల ధర్మములలో అహింసాధర్మమునందు ధర్మరాజునకు మిక్కిలి యిష్టముకలదు. ధర్మరాజు మానుషబలము కోరడు. గొప్ప దైవబలమును నమ్మియున్నాడు. పూర్వపాపములు రెంటిని నీయందు పెట్టియున్నాడు. నీవు నీకొడుకగు దుర్యోధనుని వశమందే వర్తింతువుగాని మరియొక మంచిమార్గమును యెరుగవు. నీ కార్యమంతయు కర్ణ శకునుల యధీనమందుండి నిశ్చయింపబడునేగాని నీ యభిప్రాయప్రకారము జరుగదు. ఇది స్పష్టము. ఆలుబిడ్డలులేని బ్రిమ్మరియగు కొయ్యవంటివాడు యిట్లు ప్రవర్తించునుగాని కూడుకుడుట బెట్టి తినువారలు యిట్టి క్రొవ్వుపనులను చూచుచుండరు. లోకమందు కొడుకులను గనిన రాజు లనేకమంది గలరు. ఆ కొడుకులు చెడుమార్గమందు ప్రవర్తించుచున్నయెడల వారికి బుద్ధిచెప్పి ఋజుమార్గమున బెట్టుదురుగాని యిట్లు చూచుచు వూరకుండరు. నీ పుత్రులకు నీవు బుద్ధిచెప్పనందున లోకమందలి జనులందరును నిన్ను తిట్టుచున్నారు. విశేషమైన ఆ తిట్లను వినుటకు నామనస్సు మిక్కిలి బాధనొందుచున్నది. ఆ తిట్లను వినజాలక నా చెవులయందు పుండ్లుపడినవి. ఆదుశ్శాసను శకును లిద్దరును తమ భుజాబల శక్తివలన మిమ్ములను పట్టుకొని యాడింపగా మీరు బొమ్మవలె యాడుచుందురు. నీవును, నీ కుమారుడగు దుర్యోధనుడును దుశ్శాసన శకునుల యధీనమందుండి వారు చెప్పినట్లు సంచరించుచుందురు. పాండవు లొకానొకప్పుడు కోపించుకొని వచ్చిన యెడల నీ బలగర్వము లన్నియు ఒక నిమిషమాత్రములో నశింపగలవు. మీరు చేసిన అపకార అవమాన కార్యములను ధర్మరాజు సహించియుండెను. అట్లు అతను ఓర్చియుండుటను జూచి మనవారు ధర్మరాజునకు భయముకలిగినట్లు తలచుచుందురు. పాండవులు యుద్ధ

మునకు వచ్చినయెడల కొండతో ఢీకొనిన సేనపోలెను ఆ కొండను జూచి ఓడిపోయినట్లు పాండవులను జూచి నీనవాడు ఓడిపోవును. ధర్మరాజు తన తమ్ములకు అడ్డుపడి నీ పుత్రులను ఏమియు చేయనందున అతనిని నీవు మెచ్చుకొందువు. ధర్మరాజు సాధువుగాను. సాధువు రేగినయెడల శిరోభూమియందే నిలుచునుగాని మధ్యమధ్య స్థలమందు నిలువదుసుమా! పూర్వము జూదమాడినపుడే నీ వుపేక్షయను అగ్నిహోత్రము పుట్టెను. అప్పుడే చిచ్చుపెట్టి కాల్చినట్లాయెను. నీ వుపేక్షయగు అగ్నిహోత్రముచేత కులమును దహింపజేసితివి. ధర్మరాజు తన చిత్తమును తన వశమందుంచుకొనినాడు. అతడు మెత్తని పెద్దపులివంటివాడు. అందరును నీమీద యధర్మము నారోపించి అపనింద నాలాపించి దూషించు పర్యంతము ధర్మరాజు యేమియు చేయక వినక చూడక పెద్దపులివలె నుండును. అందరును నిన్ను దూషించినపిమ్మట ధర్మరాజు కోపించును. అట్లు కోపించిన ధర్మరాజును మరల్చుటకు నీకును నాకునుగూడ సాధ్యముగాదు.

ధృతరాష్ట్రమహారాజా! నేను మిక్కిలి వేగముగా నడచి వచ్చినందున నా అవయవము లన్నియు మిక్కిలి బాధగానున్నవి. ఇప్పుడు నామనస్సు నా వశమందు లేదు. అదిగాక ప్రొద్దుపోయెను. గనుక యిప్పుడు నేను నా గృహమునకు వెళ్ళి యీరాత్రియందు నిద్రించి మార్గాయాసమును తీర్చుకొనెదను. రేపటి దినమునందు నీవును నీ పుత్ర మిత్ర బంధు స్నేహితు లందరును వినుచుండగా నేను వెళ్ళి వచ్చిన కార్యపద్ధతి నంతయు సవిస్తరముగా విన్నవించెదను. అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. అంతట ధృతరాష్ట్రు డట్లనే చేయుమని సంజయునితో చెప్పి పంపించెను. ధృతరాష్ట్రుడు కార్యవిషయమైన చింతగలవాడై ఆ చింతయందు మునిగి పరిచారకుని పిలిచి శీఘ్రముగా విదురుని పిలువుమని చెప్పెను.

ఆ పరిచారకు డతివేగముగా వెళ్ళి విదురుని తీసుకొనివచ్చి ధృత రాష్ట్రునకు తెలియజేసెను. అప్పుడు ధృతరాష్ట్రుడు మిక్కిలి ప్రీతి పూర్వకముగా విదురుని దనయొద్ద నుంచుకొని అతనితో యిట్లు అనెను.

తమ్ముడా! విదురుడా! సంజయుడు పాండవులదగ్గరకు వెళ్ళి యిప్పు డిక్కడికి వచ్చి నాదగ్గర నే నన్ను విశేషముగా దూషించెను. ఆ పాండవులదగ్గర జరిగిన. సంభాషణాది కార్యవిషయములను రేపటి దినమందు జెప్పెదనని నాతో చెప్పి వెళ్ళెను. ఆ సంజయుడు వచ్చి వెళ్ళినది మొదలుకొని నాకు చింతగలిగెను. ఆ చింతచేత నాచిత్తము కలకబారెను. నాదేహము నిప్పులలో పొరలించినట్లు పరితపించు చున్నది. కొంచెమైనను నిద్ర కలుగలేదు. అని ధృతరాష్ట్రుడా రాత్రికాలమందు విదురునితో చెప్పెను. ఆ మాటలకు విదురు డిట్లు అనెను.

ధృతరాష్ట్రమహారాజా! బలవంతుడు పైకివచ్చినపుడు బల హీనునకును, ధనముదు పోగొట్టుకొనిన వానికిని. దొంగిలించిన వానికిని, స్త్రీయందు కామ వ్యాకుల చిత్తముగల వానికిని నిద్రకలుగదు. ఈ నలుగురును నిద్రలేక రాత్రికాలమందు పరితపించుచుందురు. ఈ నాలుగు విధములైన చెడుకార్యములలో నొక చెడుకార్య మేదైన నీ చిత్తమందు గలదో లేక పరులసొత్తు నపహరింప దలచితివో చెప్పుము. నీకు నిద్ర చెడుటకు కారణమేమో తెలియచెప్పుము. అని విదురు డడుగగా అప్పుడు ధృతరాష్ట్రు డిట్లనెను. విదురుడా! సంజయుడు నీతో ధర్మరాజు యేమి చెప్పెనోయనియు, ఆ ధర్మరాజుయొక్క మాటల సరళిని యెట్లుండునోయనియు నాకు చింతగలిగి యున్నది. ధర్మరాజుయొక్క స్వభావమును తెలియజెప్పి నాచింతను పోగొట్టుటకు నీవు సమర్థుడవు. కావున ధర్మరాజు చిత్తవృత్తిని నాకు తెలియ

జెప్పి నామనఃపరితాపమును పోగొట్టుము అని ధృతరాష్ట్రుఁ డడుగగా విదురు డిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! అయ్యా! ధర్మరాజునకు శాంతస్వభావుడును, స్నేహితుడును, భటుడును, ప్రాపకుడును, గుణవంతుడు అగును. ధర్మరాజు తన సత్యగుణమును ప్రకటింపజేసెను. శాంతమూర్తి మహావినయ సంపన్నుడు, వివేకవంతుడు, అటువంటి ధర్మరాజు చెడు తలంపుగల మాటను చెప్పడు. నీవును, నీకొడుకగు దుర్యోధనుడును, నీతినిదప్పి పాండవులను కష్టపెట్టితిరి. అది నేరము. కనుక ఆపాండవులకు తగిన రాజ్యభాగమును పంచియిమ్ము. నీవును దుర్యోధనుడును శకుని కర్ణ దుశ్శాసనులమీద రాజ్యభారమును మోపి యుంచెదరు. ఈ కార్యము కడముట్టనేరదు. ఇది యెట్లనగా చెప్పెదను వినుము 1 దేశమును తా నెరుగుట 2 అందరవశముండుట 3 శాంతముగలిగియుండుట 4 విద్యగలిగియుండుట యీ నాలుగు గుణములులేని ప్రభుత్వము లోకమందు లేదు. శకుని కర్ణ దుశ్శాసను లయందు యీ నాలుగు గుణములలో ఒక గుణమైనను వెదకి పట్టి జూడజాలము. ఆ ధర్మరాజు నిన్ను నిశ్చయముగ తండ్రినిగా దలచి నమ్మి మీతప్పిదముల నన్నిటిని సహించియున్నాడు. ఆవిషయమును నీవే యెరుగుదువు. అని యిట్లు విదురుడు చెప్పగా ఆమాటలను ధృతరాష్ట్రుడు విని యిట్లనెను.

విదురుడా! సంజయునివలన కార్యవిచారము నంతయును చక్కగా విని మన మెట్లు చేయవలెనో అట్లు చేయింపుము. అప్పుడు నాకు హితవాక్యములను చెప్పి నా మనస్సున గల పరితాపమును పోగొట్టుము. నీవు సకల ధర్మాధర్మముల నెరిగినవాడవు. మేలు కీడులను యెరిగినవాడవు. నాకు నిద్రకలుగకుండునట్లు చేసెడు మనః పరితాపము నశించునట్లుగా నీవాక్యామృతమును నామీద చల్లుము.

అని యిట్లు ధృతరాష్ట్రుఁడు చెప్పఁగా విదురుఁడిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! జనులకు సమ్మతమైన విధముగా నడచుచు లోకనింద్య కార్యములను చేయక పరుని సంపదకు చింతింపక, మనుష్యులతో కలసి మెలసి బ్రతుకవలయును. ఇట్లు ప్రవర్తించుట మంచిమార్గమగును. ఇట్లు ప్రవర్తించినవాఁడే పండితుఁడు. 1 కోపము 2 సంతోషముచేత పుప్పొంగుట 3 గర్వము 4 తృప్తిబొందకుండుట 5 దురభిమానము 6 పనులుచేయక సోమరితనముగా నుండుట యీ ఆరు గుణములును కుత్సితి పురుషుల గుణములని పెద్దలు చెప్పుదురు. 1 తన అధికారిని 2 దైవమును 3 తన భార్యను 4 బంధువులను. వీరి నలుగురిని తగిన పూజాసత్స్వభావముల చేత సంతోషింపజేయని వాఁడు చెడిపోవును. అట్టి వాఁడు దుర్జనుఁడని చెప్పబడును. ధృతరాష్ట్ర మహారాజా! కార్యానుకూలము నెరుగని మూఢులు, తమయందు స్నేహము గలవారి మాటలను వినరు. తమయందు స్నేహము లేని వారి వెంటఁదగిలి ఆశ్రయింతురు. పరుల అధిక్యతను యెరిగి అట్టి వారితో కలహింతురు. అవివేకులగు జనులు కార్యానుకూల మెరుగక యిట్లు ప్రవర్తింతురు. 1 ధనము 2 విద్యయు 3 కీర్తియు యివి మూఁడును దురహంకారులకు మదమును కలిగించును. ఆవిద్యా ధన కీర్తులే సజ్జనులగు వారికి అడకువ గలిగించి వినయమును కలిగించుచున్నవి. ధనుర్ధరుడైన వాని తీక్ష్ణబాణము వొకనిని చంపును చంపక తప్పిపోవుటయు గలదు. అటువలెనే నేర్పరియగు వానిబుద్ధి, నీతి, శక్తి, శత్రురాజును జెరిచి, అతని రాజ్యమును నశింపజేయును. ఒకటియగు తత్వజ్ఞానమును పొంది రెండైన సత్వరజస్తమో గుణములను తన వశముచేసికొన వలయును అంతట మనోబుద్ధి చిత్తాహంకారములను నాలుగింటిని తన వశము చేసికొని అయిదైన జ్ఞానేంద్రియములను గెలిచి, ఆరైన షడ్భావ వికారములను యెరిగి

యేడైన సప్తావరణములను విడిచినవాడు వివేక ధనుడగును. నీవు వొకటియైన వివేక బుద్ధిచేత రెండైన పుణ్యపాపములను నిశ్చయింపుము. మూడైన శత్రుమిత్ర బాంధవులను, నాల్గైన సామదాన భేద దండోపాయములచేత వశముచేసికొనుము. అయిదైన జ్ఞానేంద్రియములను గెలిచి ఆరైన సంధి విగ్రహాదులగు గుణములను తెలిసి యుండుము. అట్లు యెరిగి యేడైన ద్యూతస్త్రీపానాది సప్తవ్యసనములను విడిచి సౌఖ్యవంతుడవుగమ్ము. అట్లు చేసినవాడు రాజనీతివంతుడు. ధృతరాష్ట్ర మహారాజా! మాధుర్య పదార్థములగు కల్లు సారాయి మొదలగువానిని పుచ్చుకొనరాదు. వివేకులగు జనులు నింద్రించునప్పుడు తాను వొక్కడే మేలుకొనియుండరాదు. ఒక్కడే కార్యాలోచనను చేయరాదు. ఒక్కడే మార్గమందు నడువరాదు. మంచినడవడిక కలిగియుండవలెను. మహాసముద్రమును దాటుటకు ఓడ సాధనమైనట్లుగా పాపసముద్రమును దాటుటకు సత్యగుణము సాధనమగునని పెద్దలు చెప్పుదురు. గనుక సత్యముకంటె అధికమైన మంచిగుణము లోకమందు కనబడలేదు. అవివేకులగు జనులు తప్పిదములను క్షమించువారిని జూచి అసమర్థులని తలంతురు. అయినను గొప్ప శాంతగుణమే భూషణమువంటిదగును. ఉత్తమ రూపమును గోరుజనులు అట్టి శాంతగుణమును భూషణముగా ధరింతురు. లోకమందు పురుషుడు రెండు విధములచేత శ్రేష్ఠుడని చెప్పబడును. ఎట్లనగా చెప్పెదను వినుము. పురుషుడు యెప్పటికైనను కఠినవాక్యములను జెప్పనియెడల శ్రేష్ఠుడగును. పాపకార్యములను చేయక విడుచుట వలన పురుషుడు శ్రేష్ఠుడని చెప్పబడును. ఈ రెండు విధములచేతను పురుషుడు శ్రేష్ఠుడని చెప్పబడునని తెలియుము. శిక్షించుటకు సమర్థుడైయుండియు శాంతము గలిగి తనకు అపకారము చేసినవారిని క్షమించువాడును, బీదవాడైయుండియు తనశక్తికొలది

యాచకులకు ద్రవ్యమిచ్చువాడును యీ యిద్దరు పుణ్యపురుషులని పెద్దలు చెప్పుదురు. న్యాయము దప్పక సంపాదించిన ధనమును అయోగ్యులకు యిచ్చినను, యోగ్యులకు యివ్వకున్నను యీ రెండు విధములచేత కీడుకలుగును 1 పరస్త్రీలయందు తగులుట 2 జూద మాడుట 3 కల్లు సారాయములు త్రాగుట 4 వేటాడుట 5 వ్యర్థముగా మాటలాడుట, కొట్టుట 6 కఠిన స్వభావమును కలిగియుండుట 7 నిష్ప్రయోజనముగా ధనమును వ్యయముచేయుట యీ యేడును సప్తవ్యసనములని చెప్పబడును. ఈ వ్యసనములయందు తగిలి యుండరాదు. అనగా యీ సప్తవ్యసనములను విడువ వలయును. ధృతరాష్ట్ర మహారాజా! 1 తన యోగ్యతకు తగిన వేషము గలిగి యుండవలెను. 2 తనను తాను పొగడకుండ నుండవలయును. 3 తాను పరులచేత బాధనొందినను కీడు మాటలను పలుకకుండ వలయును. 4 యాచకులకుయిచ్చి వెనుక యిచ్చితినని చింతించకుండ వలయును. ౫. తనకు దారిద్ర్యముచేత యెంతనడువకున్నను ధర్మ మార్గమును తప్పకుండవలయును. యీ అయిదుగుణములును మంచి నడవడికి గొప్ప గౌరవమును గలిగించుచున్నవి. 1 స్నేహము 2 సంభాషణను 3 బలిమి 4 కలహము 5 త్రోయుట మొదలగు కలహ కార్యములను చేయుట 6 న్యాయధర్మ విచారణ. యీ ఆరును తమతో సమాన జనులతో చేయువలయునేగాని కులహీనులతో చేయరాదు.

తమ పితృధనము కొంచెమున్నను కుటుంబస్థులు పంచుకొని అనుభవించుట మేలగును. పనులయందు దుఃఖమును సహించి కొంచెము సుఖమునైనను అనుభవించుట హితము. శత్రువునైనను అడిగిన యెడల అట్టి శత్రువునకు ధనమిచ్చుటమేలు. సజ్జనుడగువాడు తన జనులు పొగడినను ఆ పొగడ్తను విని సంతోషాతిశయమును

పొందడు. అట్టి సజ్జనుడు తనకు కీడుచేసినవారికైనను తనగల శక్తికి మేలుచేయును. సజ్జనుడు కొంచెమైనను పాపమును తన చుట్టు చేరనివ్వక పాపకార్యములను చేయక మానుచుండును. ధృతరాష్ట్ర మహారాజా ! యీ చెప్పబడిన మంచి గుణములన్నియు ధర్మరాజు యందు గలవు. అని విదురుడు ప్రసంగ రూపకముగా పాండవులను పొగడి ధృతరాష్ట్రునితో చెప్పెను. ధృతరాష్ట్ర మహారాజా ! ఆ పాండవులను పెంచి పెద్దవాండ్రనుజేసి రక్షించితివి. ఇప్పుడు ఆ పాండవులు దూరము నందుండగా నీవు పిలిపించి మన్నింపుము. ఆ పాండవులకు రాజ్యభాగమును పంచియిచ్చి వారిని నిప్పుడు నీ కుమారులతో పాటు వారిని భావించి నడుపుకొనుచుండుము. మరియును ఆ పాండవులును ఒకటిగానున్నయెడల దేవతలైనను మిమ్ములను తల యెత్తి చూడజాలరు. అని యిట్లు విదురుడు చెప్పగా ఆ మాటలను వినుచు పూకొట్టుచు, ధృతరాష్ట్రు డిట్లనెను.

విదురుడా ! చేయదగిన కార్యమును, మానమును నీవు చక్కదా యెరుగుదువు. ధర్మరాజుయొక్క స్వభావపద్ధతి యుండటయు, నీకు చక్కగా దెలుసును. గనుక నా చిత్తపరితాపమును నశించు నట్లుగా కార్యపద్ధతి నంతయు చక్కగా దెలుపుము. అని ధృతరాష్ట్రుడు విదురునితో చెప్పగా విదురు డిట్లనను. ధృతరాష్ట్రమహారాజా ! నీవు యీప్రకారము నన్ను వొత్తి యడుగగా నేను చెప్పుటకు తగుదును. గనుక వున్న వాస్తవమును చక్కగా చెప్పెదను, సావధానముగా వినుము. అయ్యో! నీకు రాజ్యము దక్కునని తలచి నీతమ్ముడగు పాండురాజుయొక్క రాజ్యభాగమును పాండవులకుపంచి యివ్వక మ్రింగజూచితివి. నీతమ్ముని రాజ్యభాగమును నీవు మ్రింగినను నీకు జీర్ణముకాదు. నీపద్ధతిని జూడగా మాంసమును ఆశచేత ఘనుపగాలమును చేప మ్రింగిన చందముగా నున్నది. నీపుత్రుడగు

దుర్యోధనుడు కుత్సితుడు. ఆ దుర్యోధనుని మనస్సు నన్ను యిట్లు నిందింప జేయుచున్నది. అని విదురుడు చెప్పగా ఆ మాటలను ధృతరాష్ట్రుడు విని బదులుమాట చెప్పక యూరకుండెను. అంత ధృతరాష్ట్రుడు కొంతసేపటివరకు నిశ్చేష్టితుడుగా నుండి చిత్తమందుగల అధిక చింతలచేత నిద్రపట్టక మరల విదురునితో యిట్లనెను.

విదురుడా! నీ మాధుర్య వాక్యములచేత యింతవరకు నా మనోపరితాపము కొంతవరకుఅణగెను. ఇక మేలుకీడులను కలిగించు నీతివాక్యములను నాకు చెప్పుము. అని ధృతరాష్ట్రుడుగగా విదురుడిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! చక్కగా పండని కాయను కోసినయెడల రుచి చెడుటయేగాక విత్తునకుకూడా చేటుకలుగును. చక్కగా పండినప్పుడు కోసినయెడల ఫలము గలుగుటయేగాక విత్తునకు చేటుగలుగదు. ఈ ప్రకారమే కార్యసిద్ధికిని అనుకూల ప్రతికూలములు గలిగియుండునని తెలిసికొనుము. పుష్పమాలికలను కట్టువాడు పుష్పములను కోయునట్లును పుష్పరసమును తుమ్మెద త్రాగినట్లును యెదుటివారికి బాధకలుగకుండునట్లు కార్యఫలమును పొందవలయును. బొగ్గులనిమిత్తమై చెట్టుమొదలును చెరుపగూడ నట్లు కార్యఫల విషయమై యెదుటివారిని మిక్కిలిగా నొప్పించరాదు. పరులకు గల ధన విద్యా తేజోబలాధిక్యములను జూచి అసహ్యపడి పరితాపమును బొందువాడు, వ్యాధిలేని దుఃఖమును అనుభవించును. ఎదుటవానికి మేలుకలుగునట్లును ఎదుట మనస్సునకు యింపుగా ప్రియముగలుగునట్లును మాటలాడవలయును. అట్లు మాటలాడినయెడల యిది యదియని చెప్పక యూరకుండుట మంచిది. కార్యవిషయమైన మాటలను చెప్పుటవలన స్నేహవిరోధములును, శాంతకోపములును, పుణ్యపాపములును గౌరవ నీచభావములును, కలుగును. గనుక కార్యవిషయమై యోచించి ధర్మయుక్తముగా చెప్ప

వలయును. కత్తి గొడ్డండ్రచేత చెట్లును కఠినముగా నఱికినను పిమ్మట ఆ చెట్టునందు చిగురించ గలదు. మాటలచేత చెడిపోయిన కార్యము ఎన్ని యుపాయముల చేతనైనను ఫలింపనేరదు. దేహమునందు నాటుకొనిన తీక్ష్ణబాణములను అతికఠినముగా పెరికివేయగ వచ్చును. గాని మనస్సున నాటుకొనిన మాటలను యెన్ని యుపాయముల చేతనైనను పెరికి వేయుటకు సాధ్యముగాదు.

ధృతరాష్ట్రమహారాజా! అయ్యో! ధర్మరాజు నోటివలన ఒక్కసారియైనను చెడుమాట ఒక్కటియైనను వెలువడలేదు. నీ కొడుకులు ఒకరొకరు మీరి అనేకసార్లు అనేకవిధములైన చెడు మాటలను ప్రేలుచు పాండవులను దూషించిరి. ఆ మాటలను నీవు బాధపడక వినుచు ఊరకుంటివి. ఇట్లు ఊరకుండుట నీకుదగదు. చేటుకాలమైన యెడల చెడుమాటలును అవివేక మార్గమును బట్టి న్యాయముగను ధర్మయుక్తముగను తోచును. ఆమాటలను అనర్థహేతు లని నీ మనస్సునందు నిశ్చయించుకొనుము. నీ బుద్ధి పాండవులతో విరోధమును విడిచి మరల కలియుట లేదు. ఇంతమాత్రమునచేత మనమేమియు చేయజాలము. మనకులమందు మహాతేజో మహా ధైర్య పరమధార్మికత్వాది గుణగరిష్ఠుడగు ధర్మరాజు పుట్టెను. అటువంటి ధర్మరాజు నీ రాజ్యలక్ష్మి లేనివాడై యుండుట న్యాయము గాదు. నీ పెద్దతనమును జూచి ధర్మరాజు సహించియున్నాడు. అని విదురుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. ఆ మాటలను ధృతరాష్ట్రుడు విని విదురునివైపు ముఖముంచి యిట్లనెను. విదురుడా! ఇప్పుడు నీవు చెప్పిన నీతివాక్యములచేత నా మనస్సు తృప్తిబొందలేదు. ఇంకను నీతివాక్యములను మరికొన్నిటిని ప్రబోధింపుము. అని ధృతరాష్ట్రు డడుగగా విదురు డిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! సకల పుణ్యకర్మల నొకవైపునను [illegible]మార్గము నొకవైపునను పెట్టి తూచగా ధర్మమార్గమున్న

దిక్కు వైపు బరువు మిక్కిలి అధికముగానున్నదని వేదములు చెప్పు చున్నవి. ధర్మమార్గ ప్రకారము ప్రవర్తించినయెడల భూలోకమందు సకల సౌఖ్యములు లభించుటయే గాక కీర్తి కలుగును. ఈ భూలోక మందు యెంతకాలమువరకు పొగడబడునో అంతకాలమువరకు అట్టి కీర్తి గల పురుషుడు పుణ్యలోకములయందు నివసించును. అని పెద్దలు చెప్పుదురు, పూర్వము ప్రహ్లాదుడు రాక్షస కులమందు బుట్టినను, ప్రహ్లాదుడు ధర్మబుద్ధి గలిగియుండెను. ప్రహ్లాదునకు విరోచనుడను కుమారుడు కలడు. అంగిరసుడను బ్రాహ్మణునకు సుధన్వుడను కుమారుడు గలడు. ఆ విరోచన సుధన్వులిద్దరును ఒకధర్మసందేహము నకు వివాదము గలవారై తమ ప్రాణములను పందెము వేసుకొనిరి. అట్లు పందెము వేసికొనిన విరోచన సుధన్వు లిద్దరును ధర్మసందేహ మును తెలిసికొను నిమిత్తమై ప్రహ్లాదుని యడిగిరి. అప్పుడు వీడు కొడుకనియు, వీడు పరుడనియు తలచక ఆ ప్రహ్లాదు డుమధ్యస్థుడుగా నుండి ధర్మసందేహము నెరింగి సత్యముగాజెప్పి సుధన్వుని గెలిపిం చెను. అప్పుడు సుధన్వుడు సంతోషించి మృతిబొందిన విరోచనునకు ప్రాణములిచ్చి ప్రహ్లాదునకు ఒప్పగించి వెళ్ళెను. గాన ధృతరాష్ట్ర మహారాజా! నీవు ధర్మమార్గమును విడునక అధర్మముచేత చెడి యుండు నీ కొడుకులయందు గల పక్షపాతమును విడువుము. న్యాయ ధర్మ ప్రకారము పాండవులకు రాజ్యభాగమును పంచియిమ్ము. అట్లు చేసితివేని పాండవులును కౌరవులును కూడ అపాయమును బొందక బ్రతుకుదురు. అట్లయిన యెడల నీవు దుఃఖముల పాలుగాక సుఖం చెదవు. అని విదురుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. ధృతరాష్ట్ర మహారాజా! పాపములు చేయదగినపనిని చేసిన యెడల ఆపాపములు పుణ్యకార్యములవలె ఫలించి పుణ్యఫలముల నిచ్చు పక్షమందు చేయవచ్చును. ఎప్పటికిని పాపములు పాపఫలమునే యిచ్చునుగాని

పుణ్యాఫలముల నివ్వనేరవు పెద్దలులేని సభ సభకాదు. చక్కగా ధర్మమును చెప్పనియెడల అట్టివారు పెద్దలుకారు. చక్కగా యోచించిన యెడల సత్యములేనిది ధర్మముకాజాలదు. ఒకవిధమున సత్యముగాకనబడినను అట్టిసత్యము సత్యముకాజాలదు. నీతిమార్గము వలన ధర్మము తప్పకజీవించుట మధ్యమవృత్తియగును. బరువు మొదలగునవి మోయుచు జీవించుట హీనవృత్తియగును. నీతిమార్గమును విడిచి జీవించువారు మిక్కిలి నీచవృత్తిగల వారగుదురు. అట్టి పాపాత్ములను జూచి పెద్దలుమెచ్చరు.

ధృతరాష్ట్రమహారాజా! నీ పుత్రులగు దుర్యోధన దుశ్శాసనాదులు అందరును సర్వదా యుద్ధమునకు కాలు ద్రువ్వుచుందురు. దుర్యోధనాదులకు మంత్రులగు కర్ణ శకునులు ముఖ్యులగు సహాయురును వారికంటె ముందుగా బిరుసులై యుద్ధమునకు కాలుద్రువ్వుచుందురు. అందుకుతగినట్లుగా నీవు నీతిమార్గము నవలంబింపక ప్రవర్తింపుచున్నావు. పాండవులు యుద్ధముచేయుటకు సమ్మతింపలేదు. అఖండమగు నీతిని పురస్కరించుకొని కార్యాలోచనమును చేయుచున్నారు. కౌరవులు యుద్ధము చేయదలచినయెడల పాండవు లగ్నిహోత్రము వలె మండుదురు. అట్లు పాండవులు కోపించుకొనినపిమ్మట వారి కోపాగ్ని నార్పుటకు యెవ్వరికిని సాధ్యముగాదు. పాండవులు తమ తండ్రియగు పాండురాజువలెనే నీయందు భక్తిగలవారై పెద్దలకు సమ్మతమైన ధర్మమార్గమందు ప్రవర్తింపుచున్నారు. అట్టి పాండవులను, నీవు పుత్రులవలెనే విచారింపవలయును. అని విదురుడు ధృతరాష్ట్రునితో చెప్పెను.

ధృతరాష్ట్రమహారాజా! కారణములేకనే ఉపకారముకొరకు పరులకార్యములను ఫలింపజేయు విషయమై సత్పురుషులు మిక్కిలి శ్రమజెందుదురు. అట్టి సత్పురుషులే ఆ పాండవులకు దిక్కు అగు

డును తపోదోషములు. బ్రహ్మప్రాప్తి కోరువాడు. యీ పన్నెండు గుణములను సర్వదా విడువవలయును. మృగములను పట్టెడువాడు యేనుగులు మొదలగు మృగములననుసరించి తిరుగుచు ఆమృగము లను పట్టుటకు కాలమును వెదకుచు ఒకానొకప్పుడు ఒకగుంటయందు యేనుగులు మొదలగు మృగములు పడినప్పుడు ఆమృగములను బాధించును. అటువలెనే యీక్రోధాదులును మనుష్యులకు ఉపద్రవ మును కలిగించుకొఱకు ఒక్కొక్కటి మనుష్యునియందుండి సేవింపు చున్నవి. అట్లు సేవింపుచు కాలము కనిపెట్టి యీ క్రోధాది గుణ మును మనుష్యునకు ఉపద్రవము కలిగించుచు చంపుచున్నవి. గనుక యీక్రోధాదులగు పన్నెండుదోషములలో ఒక్కటి యున్నను మను ష్యుని చంపుచున్నవి. గనుక ఆ పన్నెండు దోషములను సర్వదా విడువవలయును.

ధృతరాష్ట్ర మహారాజా! ఇకను ఏడు నృశంసములను జెప్పె దను వినుము. 1 సంభోగమందు బుద్ధి గలిగియుండుటయు 2 విషము వలె పరులకు ఉపద్రవము గలిగించి తాను వృద్ధిబొందుటయు 3 పరు లచిత్తములకు పరితాపముగలిగించుటయు 4 లోభమువలనకొంచెము లాభముకొఱకు అనేకులకు అవమానము గలిగించుటయును 5 జ్ఞాన బలము లేకుండుటయు 6 ఇంద్రియములనుపొగడుటయును 7 ఇతరుని ఆశ్రయించని తనభార్యయందు ద్వేషము గలిగి యుండుటయు యీ యేడును నృశంసదోషములని చెప్పబడును. ఈ యేడు దోషములును ముందు చెప్పిన కామక్రోధాదులగు పన్నెండుదోషములకంటె అన్య దోషములగును. ఇవియును తపోదోషములే యగును. గనుక యీ దోషములను. గూడ సర్వదా విడువవలయును. ఇకను సంపాదింప గుణములను చెప్పెదవినుము. 1 జ్ఞానము 2 సత్యము 3 దమము 4 శ్రుతము 5 అమాత్సర్యము 6 లజ్జా 7 తితీక్ష 8 అనసూయ

9 యజ్ఞము 10 దానము 11 ధృతి 12 శమము యీ పన్నెండుగుణములును మహావ్రతములని చెప్పబడును. ఈ పన్నెండు మహావ్రతములును పరమపురుషార్థసాధనములైనందున బ్రహ్మవేత్తను కలిగియుండవలయును. 1 పరమాత్మతత్త్వమును యెరుగుట జ్ఞానమగును 2 యథార్థముగా సంభాషించుట సత్యమగును. సర్వభూతములకు మేలు కోరుటయు సత్యమని చెప్పబడును. 3 జ్ఞానేంద్రియములను నిగ్రహించుటదమమని చెప్పబడును. 4 వేదాంతశాస్త్రమును వినుట శ్రుతమని చెప్పబడును. 5 సర్వభూతములయందును మాత్సర్యము లేకుండుట అమాత్సర్యమని చెప్పబడును. 6 చేయరాని కార్యమును చేసెడివిషయమై గల సిగ్గులజ్జయందురు. 7 సుఖదుఃఖాదులను సహించుట తితీక్ష యనబడుడు. 8 పరులదోషములను లెక్కింపకుండుట అనసూయయని చెప్పబడును. 9 అగ్నిష్టోమాది మహాయజ్ఞములను చేయుట యజ్ఞమని చెప్పబడును. 10 బ్రాహ్మణులకు ధనాదిపదార్థములను యిచ్చుట దానమని చెప్పబడును 11 విషయములదగ్గిర వున్నను యింద్రియనిగ్రహము కలిగియుండుట ధృతియని చెప్పబడును 12 మనస్సును నిగ్రహించుట శమమని చెప్పబడును.

ధృతరాష్ట్రమహారాజా! క్రోధాది దుర్గుణములను పూర్తిగా విడచి, ఈజ్ఞానాదిగుణములతో కూడినవాడు ఈసకలభూమిని తన వశము చేసికొనుచున్నాడు. దుర్గుణములు లేక జ్ఞానాది. సద్గుణములలో కొన్నిగుణములున్నను అట్టివారు క్రమముగా జ్ఞానులై బ్రహ్మస్వరూపమును పొందుచున్నారు. 1 మనోనిగ్రహము 2 త్యాగము 3 అప్రమాదము ఈ మూటివలన మోక్షముగల్గును. ఆమూడుగుణములును కలిగియుండి సత్యాదిగుణములు కలిగియుండిన యెడల అమృతరూపమైన మోక్షము కలుగునని పండితులు చెప్పుదురు. మరియు మనోనిగ్రహము పదునెనిమిదిదోషములతో కూడినదగును.

ఆ పదునెనిమిదిదోషములలో ఒకదోషము కలిగియున్నను మనోనిగ్రహమునకు దోషముకలుగును. ఆపదునెనిమిది దోషములను జెప్పెదవినుము.

1 అబద్ధముచెప్పుట, 2 పరులను దూషించుట, 3 విషయసుఖాపేక్షను గలిగియుండుట, 4 అందరికి ప్రతికూలముగ ప్రవర్తించుట 5 అజ్ఞానము గలిగియుండుట 6 స్త్రీభోగములయందు ఆసక్తి గలిగియుండుట, తనకు గలిగెడి లాభముచేత తృప్తిబొందకుండుట 7 జనులకు భయముకలిగించుట 8 అంతటను వినయములేక ప్రవర్తించుట 9 జనులతో కలహించుట 10 తనపొట్టను నిండించుకొనుట కొరకు జనులను పీడించుట 11 సమక్షమందు పరులను దూషించుట 12 వ్యర్థముగా మాటలాడుట 13 వ్యర్థముగా దుఃఖచింతను గలిగియుండుట 14 సుఖదుఃఖశీతోష్ణాదులను సహింపలేకుండుట 15 ఇంద్రియార్థములయందు చపలత్వముగలిగి ధైర్యములేకుండుట 16ధర్మజ్ఞానవైరాగ్యములు లేకుండుట 17 పాపకర్మములను చేయుట 18పరులను హింసించుట ఈపదునెనిమిదిదోషములును మనోనిగ్రహ దోషములని చెప్పబడును. ఈదోషములు లేనిగుణములు మనోనిగ్రహమని చెప్పబడును. మరియు పదునెనిమిది మదదోషములు గలవు. విపర్యయములయిన చింతనలు. ఏవికలవో అవన్నియు మదదోషములందురు. ఈ మదదోషములు వెనుకచెప్పబడును. త్యాగము ఆరువిధములు. ఆ త్యాగములలో కామమును విడుచుట మిక్కిలి దుష్కరము. కామమును జయించినయెడల సకలదుఃఖములును నశించును. లక్ష్మిని పొంది సంతోషవికారములు లేకయుండువాడు, షడ్విధత్యాగములను చేసిన శ్రేష్ఠుడగును. సర్వదా వైరాగ్యమును పొందియున్నప్పుడు యిష్టము ఘటింపకపోయినను, గొప్ప తృప్తిగలుగును. కామమును విడిచినవానికి సంపూర్ణతృప్తి కలుగును. ఈ చెప్పబడిన దుర్గుణము

లను విడిచి మంచిగుణములు గలవాడు మిక్కిలి ఐశ్వర్యవంతుడై నను దుఃఖముకలిగినయెడల ఎప్పటికిని దుఃఖింపడు. ఇట్టి సద్గుణగణములుగల జ్ఞానపురుషుడు మిత్రపుత్రభార్యల నయినను ఏవిషయమునం దైనను యాచింపడు. తనను యాచించినవానికి యిష్టార్థముల నిచ్చుచుండును. అప్రమాదమనగా జ్ఞానమునుపొందుట అజ్ఞానమును పొందకుండుట. అట్టి అప్రమాదమునకు ఎనిమిదిగుణములు సహాయముగా నుండును. ఆ ఎనిమిదిగుణములను చెప్పెదనువినుము. 1 సత్యము 2 ధ్యానము 3 సమాధానము (సమాధి) 4 చోద్యము (ప్రపంచమును యింద్రజాలము వంటిదను వస్తువులనలె చూచుట) 5 వైరాగ్యము 6 దొంగతనము చేయకుండుట 7 బ్రహ్మచర్యవ్రతమును ధరించియుండుట 8తత్త్వజ్ఞానమును పొందుట ఈ ఎనిమిది గుణములును అప్రమాదమునకు గలిగియుండును.

ధృతరాష్ట్రమహారాజా! మనోనిగ్రహమునకు గల పదునెనిమిది దోషగుణములను జెప్పితిని. బ్రహ్మవిద్యను కోరువాడు పదునెనిమిదిదోషములను విడిచి, మనస్సును నిగ్రహించవలెను. ఆదోషములన్నిటిని విడిచినయెడల అప్రమాదియై సత్య, ధ్యాన సమాధులు మొదలగు ఎనిమిదిగుణములను పొందగలడు. సత్యమందు సకల లోకములను, ప్రతిష్ఠింపబడియున్నవి. సత్యమందే మోక్షమున్నది. గనుక నీవు సత్యబుద్ధిగలవాడవు, సకలదోషగుణములను విడచి నిష్కల్మషమైన తపోవ్రతమును ఆచరించవలయును. అని పూర్వము పరమేశ్వరుడు చెప్పెను. పండితులకు సత్యము శ్రేష్ఠము కామక్రోధాదిదుర్గుణములను విడిచి జ్ఞానాదిసద్గుణములను కలిగియుండుటయే నిష్కల్మషమైన తపస్సుఅగును. ఇక విశేషించి చెప్పుటవలన ప్రయోజనములేదు. ఆ నిష్కల్మషతపస్సునకు మిక్కిలి అధికమగు సమృద్ధిఅయిన పుణ్యఫలవృద్ధికలుగును. నీవు నన్నడిగినవిషయమై

నిష్కల్మష తపోఫలవృద్ధివిషయమును యిప్పుడు నీకు సంక్షేపముగా చెప్పితిని.

పంచేంద్రియ మనోవిషయముల నన్నింటిని విడచి, గతించిన విషయములను స్మరింపక జరుగబోవు విషయములను ఆలోచింపక యున్నవాడు సంసారబాధ విముక్తుడగును. ఇట్లుచేసినయెడల, సర్వ పాపములు నశించును. జనన, మరణాదులు, నశించును. పరగు పద మును, పొందును. అని. భగవంతుడైన సనత్కుమార మునీం ద్రుడు చెప్పగా ధృతరాష్ట్రుడు, ఇట్లనెను. మునీంద్రా! పురాణేతి హాసములతోగూడిన అయిదు వేదములను చదివినవాడు పంచవేది యని చెప్పబడును. పంచవేది అందరికంటె తానధికుడని, తలచు చుండును. కొందరు నాలుగువేదములను సమగ్రముగా, చదివియుం దురు. మరికొందరు, మూడువేదములను, మాత్రమే చదివియుందురు. మరికొందరు ఒక్క వేదమును, మాత్రమే చదివియుందురు. కొందరు, వేదమునే చదువకుందురు. ఇట్లు వివిధరీతులుగా, చదివిన మనుష్యు లలో శ్రేష్ఠుడైన బ్రాహ్మణుడెవడో చెప్పుము. అని ధృతరాష్ట్రు డడుగగా సనత్కుమార మునీంద్రు డిట్లనెను. ఓ ధృతరాష్ట్ర మహా రాజా! అద్వితీయుడగు పరబ్రహ్మమును, తెలిసికొను నిమిత్తము విచారములను చేయుచున్నందున ఋగ్వేదాదులకు, వేదమని పేరు గలిగెను. వేదమనగా, జ్ఞానమని యెరుంగునది పరబ్రహ్మమును పొంద నందున అనేక వేదములు కలిగినవి. సర్వవేదములును పరబ్రహ్మ వస్తువును తెలిసికొనుటకు, కారణభూతములగును. వేదస్వరూపుడైన పరమాత్మను ఎరుగక మూఢుడైనవాడు వేదములను, చదివిన మాత్రముననే పండితుడనని తలంచుచున్నాడు. అట్టి మూఢుడు కర్మమార్గమందే ప్రవర్తింపుచు అభిమానింపు చుండును. సత్య, జ్ఞాన, అనంత, లక్షణములతో కూడియున్న పరబ్రహ్మమును

ఎరగనందున వ్యర్థములగు సంకల్పములు కలుగుచున్నవి. ఆ సంకల్పములు స్వాభావికములైన సత్య సంకల్పములు కావు. బ్రహ్మ స్వరూపము నెరుగనివారు, కర్మమార్గమున, ఆసక్తులై ప్రవర్తింతురు. ఆత్మకు సంసారము, అజ్ఞాన నిర్మితము. నృపుడు. పరమాత్మను సాక్షాత్తుగా ఎరుగని యంతవరకు అజ్ఞానముచేత మోహింపబడి, స్వర్గ, పశు, పుత్ర, ఆది, సాధన భూతములైన కర్మములనుచేయుచు, కర్మమార్గమందు, ప్రవర్తింపుచుందురు. రాజా! ఇతిహాస, పురాణ సహితములైన అయిదు వేదములను. సమగ్రముగా జదివిన బ్రాహ్మణుడు, మిక్కిలి, చదివిన వాడనిగనే చెప్పవలయునుగాని, సాక్షాత్తుగా బ్రాహ్మణుడని చెప్పరాదు పరబ్రహ్మ స్వరూపమును పొంది యున్నవాడే, ముఖ్యమైన బ్రాహ్మణుడని చెప్పరాదు. పరబ్రహ్మ స్వరూపమును ఎరుగక అజ్ఞానముచేత కర్మమార్గమునందు ప్రవర్తించు బ్రాహ్మణుని, నిజమైన బ్రాహ్మణునిగా, తలంచవద్దు. రాజా! వేదములన్నియు, పరమాత్మ స్వాధీనములై పరమాత్మను, తెలుపుచున్నందున పరమాత్మయందే, ప్రమాణము లగుచున్నవి. గనుక, పరమాత్మయందు వేదాంతములు ప్రమాణములగును. వేదాంతములు, పరమాత్మ స్వరూపమును, తెలుపుచు పరమాత్మను పొందుటకు, తగిన సాధనములను, ప్రతిపాదింపుచున్నవి. ఆ కారణముచేత, పండితులు, వేదాంత శ్రవణమును జేసి, పరమాత్మ స్వరూపమును బొందుచున్నారు. పరమాత్మ అవాఙ్మానస గోచరుడనియు, వేదముచేత ఎట్లు తెలియబడు ననియు అడిగితివేని. చెప్పెదను వినుము. ధృతరాష్ట్ర మహారాజా! ఋగ్వేదాది వేదములలో, ఒక వేదమైనను జ్ఞాన స్వరూపమైన పరమాత్మను ఎరుగ లేదు. ఆపరమాత్ముడొక్కడే. జ్ఞానస్వరూపమగు పదార్థము. ఆ పరమాత్మకంటె యితరమగు సర్వవస్తువులును, జడపదార్థములు, గనుక, జడపదార్థములు, పర

మాత్మని ఎరుగజాలవు. పరమాత్మ నెరింగినవాడే. సర్వము నెరింగిన వాడగును. ప్రపంచమంతయు పరమాత్మయొక్క అధీనమందుండుట చేత పరమాత్మ నెరింగినవాడు సర్వము నెరింగినవాడగును. ప్రపంచము నెరింగినవాడు, సత్య జ్ఞానానంద రూపుడగు పరమాత్మను, ఎరుగ జాలడు. జడమయిన ప్రపంచముచేత పరమాత్మ ప్రపంచములను ఎరుగ జాలడని చెప్పుటచేత, బ్రహ్మవేత్తకు ప్రపంచసిద్ధి కలుగదని సంశయింపకుము వేదములను. చదివి వేదార్థములను, ఎరింగిన వాడైనను, అనాత్మవేత్తయే యగును. భిన్నమైన జ్ఞానానుభవము చేత, అట్టివాడు ప్రపంచమును గ్రహించును. వేదవేత్తలను, వేదములను, పరమాత్మను, సామాన్య ప్రపంచము నెరింగినట్లు, ఎరుగుటకు శక్యముగాదు. పరమాత్మ ఇంద్రియములకు అగోచరుడైనను, వేదార్థ సంప్రదాయమును. ఎరిగిన వేదవేత్తలు వేదములచేత ఒకరీతిగా, ఆ పరమాత్మను, తెలుసుకొను చున్నారు. ఇంద్రియములకు, అతీతుడైన పరమాత్మను ప్రతిపాదింపలేవు. గనుక, ఆత్మస్వరూప ప్రతిపాదమును ఎరిగి, వేదార్థము నెవ్వడు చెప్పునో వాడే బ్రాహ్మణుడు. ఎవడు పరమాత్మను ఎరుగునో అట్టివానినే. బ్రాహ్మణుడని నేను చెప్పెదను. పరమాత్మ నిష్ఠగలవాడే ముఖ్యమగు బ్రాహ్మణుడు. కాని, విషయపరుడు, ముఖ్యబ్రాహ్మణుడు కాజాలడు. రాజా! విషయభోగేచ్ఛలేక ఈ మహావాక్యమును మూలాధారముగ, ప్రత్యగాత్మను ఎరింగినవాడు పిమ్మట తననుగా పరమాత్మను ఎరుగగలడు. ఆత్మకంటె అన్యముగా దోచు ప్రపంచ విషయములను అన్నిటిని విడచి, మనస్సున కొంచెమైనను స్మరింపక లోకమందంతటను తాను వున్నట్లు ధ్యానింపవలయును. అంతట పరబ్రహ్మము హృదయాకాశమందు స్ఫురించును. నిర్వికార చిత్తముచేత కేవలుడై మనస్సునందు విషయేచ్ఛను ఉంచక తనను లోకమునందు

అంతటనున్నట్లు ఉపాసింపవలయు. అట్లుపాసించగా పరిపూర్ణమైన, పరబ్రహ్మము సాక్షాత్కరించును. అట్టివాడు అజ్ఞానాంధకారము కంటె. ఆవలనుండు, పరమాత్మను పొందును. ఈముందు చెప్పబడిన మౌనమువలననే, అట్టివాడు మునియని చెప్పబడును. కేవలము అరణ్యము నందున్నంతిమాత్రమున మునియనరాదు. మనసులో పరమాత్మచే, తానయిట్లయితినని సాక్షాత్తుగా ఎరిగినవాడు మునిశ్రేష్ఠుడన దగును. బ్రహ్మవేత్త వైయాకరుణుడని అందురు. ప్రపంచమందు ఒక ప్రదేశములో నుండు శబ్దములను బోధించేయువాడు వయ్యాకరణుడగును. బ్రహ్మము, సర్వపదార్థములను సృష్టింపుచుండును. ఆ బ్రహ్మమునకు వయ్యాకరణత్వము శృతులయందు చెప్పబడెను. బ్రహ్మవేత్తయు, బ్రహ్మమే యయిన, బ్రహ్మమునకుగల వయ్యాకరణత్వము వీనికిని సిద్ధించెను. మరియు. ఈబ్రహ్మవేత్త భూర్భువాది సర్వలోకములను ప్రత్యక్షముగా చూచుచున్నాడు. పరమాత్మను చూచినవాడే, సర్వలోకములను చూచుటకు సమర్థుడగును. బ్రహ్మమందు, మనస్సునుంచి ఆ బ్రహ్మమును ఎరిగినవాడు సర్వమును ఎరిగినవాడగును. గనుక ఈ బ్రహ్మవేత్తను సర్వజ్ఞుడని చెప్పవలయును. గాని ఇతరుని చెప్పరాదు. ధృతరాష్ట్రమహారాజా! విద్వాంసుడు వేదాంత శ్రవణపూర్వకముగా, పైనిచెప్పబడిన జ్ఞానాది గుణములు గలవాడై పరబ్రహ్మ నిష్ఠను బొందుచున్నాడు. ఆ పరబ్రహ్మను పొందు పద్ధతినంతయు చెప్పితిని.

ఇది సనత్సుజాతపర్వమున ద్విచత్వారింశోధ్యాయము

సనత్కుమారు డీరీతిగా చెప్పగా ధృతరాష్ట్రుడు యిట్లనెను. భగవంతుడవైన ఓ సనత్కుమార మునీంద్రా ! పరబ్రహ్మ సంబంధమైన వాక్యములను నాకు జెప్పితివి. ఆపరబ్రహ్మమును వినుట

కైనను లోకమందు అశక్యమగును అపరబ్రహ్మమునుపొందు పద్ధతిని చెప్పుటకు నీవేతగుదువు. కనుక పరబ్రహ్మమునుకూర్చి మరల చెప్పుము. అని ధృతరాష్ట్రుడు అడుగగా సనత్కుమారు డిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! ఏ పరబ్రహ్మమును నీవుఅడిగితివో అపర బ్రహ్మమును తొందరపడు పురుషుడు పొందజాలడు. సంకల్ప వికల్ప రూపమైన మనస్సును విషయములనుంచి మరలించి బుద్ధియందుంచ వలయును. అట్లుంచబడిన మనస్సు ఆత్మయందే నిశ్చలముగా నిలుచు చున్నది. అట్లుమనస్సు బుద్ధియందు నిలిచినప్పుడు జ్ఞానముకలుగును. అట్టిబ్రహ్మజ్ఞానము బ్రహ్మచర్యము చేత లభించును. సర్వార్థభూత మైన బ్రహ్మవిద్యను చెప్పుమని నీవునన్నడిగితివి. అట్టి బ్రహ్మవిద్యను బ్రహ్మచర్యాది సాధనసంపన్నుడు మనస్సును నిగ్రహించి పొందు చున్నాడు. బ్రహ్మచర్యముచేత పొందబడు బ్రహ్మవిద్య స్థిరముగా నిలుచును. బ్రహ్మవిద్యను పొందినవారలు మనుష్యభావమును విడు చుదురు. గురుసంప్రదాయ పూర్వకముగా పొందబడిన బ్రహ్మవిద్య శిష్యులయందు స్థిరముగానుండును. అని సనత్కుమారుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను. భగవంతుడైన సనత్కుమార మునీంద్రా! బ్రహ్మచర్యముచేత బ్రహ్మవిద్యలభింపుచున్నదని చెప్పితివి. ఆబ్రహ్మ చర్యము యెట్లుకలుగునో చెప్పుము. అని ధృతరాష్ట్రు డడుగగా సన త్కుమారు డిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! ఆచార్యుని సమీప మునందుండి ఆచార్యునకు శిష్యుడై గురుశుశ్రూషాది బ్రహ్మచర్య మును జరుపవలయును. అట్లుజరిపి గురునిఅనుగ్రహమువలన పండితు లగుదురు. అట్లు గురుశుశ్రూషలుచేయుచు బ్రహ్మచర్యమునుజరిపి ఆగురుని అనుగ్రహమువలన జ్ఞానవంతులై ప్రారబ్ధకర్మము నశించిన వెంటనే దేహమునువిడిచి పరబ్రహ్మమును పొందుచున్నాడు. బ్రహ్మ విద్యనుపొందినవారలు యిక్కడనే సకలకామములనువిడచి పరమ

శాంతులై దేహమును విడుచుచున్నారు. అట్టి బ్రహ్మచర్యాది సాధన సంపన్నులు యిషీకయను గడ్డినుండి లేతగడ్డినిగీసినట్లు దేహమునుండు ఆత్మను వుద్ధరింపుచున్నారు. ధృతరాష్ట్రమహారాజా! తలిదండ్రులు బిడ్డలను తమ దేహమువలన యీశరీరములను కలిగించిరిగాని తమస్వస్వ రూపములచేత ఆత్మను కలిగింపజాలరు గనుక బ్రహ్మవేత్తకు యీ జన్మము అసత్యము ఆచార్యునివలన వేదశాస్త్రజ్ఞానరూపమను జ్ఞానముచేత లభింపబడెనో, ఆజన్మము సత్యము. ఆజ్ఞానజన్మమే నాశ ములేనిది. అదియే సాక్షాత్తుగా జన్మముగనుక సర్వపురుషార్థమైన మోక్షము ఆచార్యుని ఆధీనమగును. ఆచార్యుడు శిష్యునకు పూర్ణా నంద బ్రహ్మస్వరూపమును కలిగింపుచున్నాడు. అట్టి ఆచార్యుని ద్రోహముచేయరాదు. ఆచార్యుడుచేసిన వుపకారమును మరువక ప్రతినిత్యము దేవునిపూజించునట్లు సమస్తోపచారములచేత ఆచార్యుని పూజింపవలయును. అప్రమత్తుడై ప్రవర్తింపవలయును. ధృతరాష్ట్ర మహారాజా! బ్రహ్మచర్యముయొక్క నాలుగుపాదములను చెప్పెదను వినుము. ఆచార్యుని సమీపమునకు వెళ్ళి అతనికి శుశ్రూషలు చేయుచు జ్ఞానమును పొందుట యేదికలదో అది బ్రహ్మచర్యముయొక్క ప్రథమ పాదము. ఆచార్యునియందు సర్వదా యేప్రకారము శిష్యవృత్తిని జరిపెనో ఆప్రకారమే గురుభార్యయందును గురుపుత్రులయందును శిష్యవృత్తిని జరుపవలయును. ఇది బ్రహ్మచర్యముయొక్క రెండవ పాదము. ఆచార్యుడు తనకుచేసిన వుపకారమును యెరిగి పరమపురు షార్థమైన బ్రహ్మమునుపొంది అద్వితీయ బ్రహ్మస్వరూపుడై యుండ వలయును. ఆ యాచార్యుని తలచుకొని సంతోషించుచు కృతార్థుడ నైతినని తలచుచుండును. ఇది బ్రహ్మచర్యముయొక్క మూడవ పాదము తనప్రాణముల నిచ్చియైనను, ధనములనిచ్చియైనను. యేవి యైన పనులుచేసినను మనస్సుచేతను, వాక్కుచేతను, దేహముచేత

నైనను ఆచార్యునకు సంతోషము గలిగింపవలయును. ఇది బ్రహ్మచర్యముయొక్క నాలుగవపాదము. ధృతరాష్ట్ర మహారాజా! ఇక బ్రహ్మవిద్యయొక్క నాలుగుపాదములను చెప్పెదను వినుము. 1 బుద్ధి పరపక్వము 2 గురుశుశ్రూషకాలము 3 బుద్ధివైభవము 4 తనతో వేదాంతమును చదువువారితో శాస్త్రవిచారముచేయుట అను నీనాలుగునుగూడ బ్రహ్మవిద్యయొక్క పాదములగును. పూర్వము చెప్పబడిన జ్ఞానాదులగు పన్నెండుగుణములును, షడ్విధత్యాగములు, సత్యధ్యానము మొదలగు యెనిమిదిగుణములును ఆగుణధర్మపరిపాలన సామర్థ్యమును అవియన్నియు ఆచార్యుని కృపవలన ఫలింపుచున్నవి. ఆచార్యునికృపా సాన్నిధ్యములు లేనిచో నవి ఫలింపజాలవు. ఆచార్య సన్నిధియందు ఆచార్యునకుచేసిన గురుశుశ్రూషాదులు బ్రహ్మచర్యమని చెప్పితినిగదా! ఆబ్రహ్మచర్యము ఆత్మకు చిదానందాద్వితీయ బ్రహ్మైకత్వ సంపాదనద్వారా ఫలింపుచున్నవి.

ధృతరాష్ట్రమహారాజా! యీ బ్రహ్మచర్య మహిమము చేతనే దేవతలు దేవత్వమును పొందిరి. ఈ బ్రహ్మచర్య మహిమ వలననే ఋషులు మహానుభావులైరి. ఈ బ్రహ్మచర్య మహిమ చేతనే గంధర్వులతోగూడిన అప్సర స్త్రీలందరును మనోహరరూపములను జయించిరి. ఈ బ్రహ్మచర్య ప్రభావమువలననే లోకములను ప్రకాశింప జేయుటకు సూర్యుడు పుట్టెను. చింతామణి మొదలగునవి కోరిన వారి కోరికలను ఫలింప జేసినట్లు బ్రహ్మచర్యమును ఆదరించిన వారికి యిష్టఫలములు కలుగును. దేవాదు లందరును ఒక్కొక కోరిక గలవారై బ్రహ్మచర్యమును అదరించి వారు కోరిన ప్రకారము దేవత్వాదులను పొందిరి. గనుక ఆచార్యుని సమీపమును పొంది గురుశుశ్రూషాది బ్రహ్మచర్యమును నడిపినందున పరమ పురుషార్థము గలుగును. అందుచేత ఆచార్యుని సమీపమందు

బ్రహ్మచర్యమును జరుపవలయును. ధృతరాష్ట్రమహారాజా! కర్మము వలన అనిత్య ఫలమే కలుగును గాని నిత్యఫలమైన మోక్షము కలుగదు. జ్ఞానముచేత పరమాత్మ ప్రాప్తిలక్షణమైన మోక్షము కలుగును జ్ఞానమొకటితప్ప పరమాత్మను. పొందుటకు మరియొకమార్గము లేదు. జ్ఞానముచేత విద్వాంసుడు బ్రహ్మము నెరుంగుచున్నాడు. అని సనత్కుమారుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను. మునీంద్రా! అక్షర అమృత పరబ్రహ్మము తెల్లగానో, ఎఱ్ఱగానో, నల్లగానో, చిత్రవర్ణముగానో, మరి యే వర్ణముగా నుండునో చెప్పుము. ఆ పరబ్రహ్మము యేప్రదేశమందు ప్రకాశింపుచుండునో చెప్పుము. ఆ పరబ్రహ్మము యెటువంటి రూపముగలదో చెప్పుము. అని ధృతరాష్ట్రు డడుగగా సనత్కుమార మునీంద్రు డిట్లనెను.

రాజా! సంసారములో ప్రవర్తించెడు వస్తువు సంసారమందు ప్రవేశించి యున్నందున, ఘటాది దివ్యరూపమును పొందె అన్యస్థలమందు నివసించి యుండును. బ్రహ్మము సంసార సంబంధ వస్తువు గానందున పరిపూర్ణత్వాది లక్షణములను గలిగి తన మహిమయందే యున్నది. ఆ బ్రహ్మము నామరూపములు లేనిది. అందువలన భూమియందుగల నలుపు. యెరుపు. తెలుపు మొదలగు వర్ణములవంటివి కలదికాదు. సంసార సంబంధము లేనందున పంచభూతమయమైన యీ దేహమును ఆ బ్రహ్మము భరింపుచుండలేదు. ఆపరబ్రహ్మము ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదములను ఆధారముచేసికొని ఆవేదములయందు నిలిచియుండలేదు. రథంతరములను సామములయందును, బృహద్రథములను సామవాక్య మంత్రములయందును, బ్రహ్మము నిలిచియుండలేదు. అందుచేత యింత మాత్రమనియు, యిక్కడమాత్రమే నివసించి యున్నదనియు, ఆ బహ్మమును చెప్పుటకు సాధ్యముగాదు. జ్ఞానాదిగుణవంతుడైన మహా

వ్రతిముగల అధికారిచేత ఆత్మస్వరూపముగా తెలియబడుచున్నది. బ్రహ్మచర్యాది సాధన సంపన్నుడైన అధికారియొక్క మనస్సునందు కనబడు బ్రహ్మమును నివారింప జేయుటకు సాధ్యముగాదు. ఆ పర బ్రహ్మము సర్వభూత స్వరూపము. అజ్ఞానాంధకారము కంటె పర ముగా నుండును. ప్రళయకాలమందు ఆ పరబ్రహ్మము నశింపక వికా రమును పొందకుండును. అణువుకంటె మిక్కిలి అణురూపముగలదై అతిసూక్ష్మముగా నుండును. పర్వతములకంటె మిక్కిలి గొప్పరూప ముగలదై యుండును. ఆ పరబ్రహ్మము యీ ముందు ప్రకారముగా నుండునని యెరుగుము. ధృతరాష్ట్రమహారాజా! యీ జగత్తంతయు ప్రకాశరూపముచేత ఆ పరబ్రహ్మమందు నివసించి యున్నది. ఆపర బ్రహ్మము ఆత్మస్వరూపముగా మనస్సునందు ప్రకాశించుచున్నది. ఈ ప్రపంచమంతయు ఆ పరబ్రహ్మమందే నివసించి యున్నది. జ్ఞాన యోగమువలన ఆత్మవేత్తయగువారు బ్రహ్మమును తననుగాయెరుగు చున్నాడు. ఆ బ్రహ్మమును యెరిగినవారలు మరణమును తప్పించు కొని మోక్షమును పొందుచున్నారు.

ఇది సనత్సుజాత పర్వమున త్రిచత్వారింశోధ్యాయము

అని సనత్కుమార మునీంద్రుడు ధృతరాష్ట్రితితో చెప్పెను. ధృతరాష్ట్రమహారాజా! 1 శోకము 2 క్రోధము 3 ప్రజ్ఞాభావము 4 కామము 5 మానము 6 పరనింద 7 ఈర్ష్య 8 మోహము 9 విదిత్స 10 స్నేహము 11 అసూయ 12 జుగుప్స యీ పన్నెండు గుణములును మహాదోషగుణములు. ఈ గుణములు మనుష్యునకు మరణముగలిగించును. ఇవి ఒక్కొక్కటిగా మనుష్యుని ఆశ్రయించి యున్నవి. ఈపన్నెండు దోషగుణములు గలవాడు మూఢబుద్ధిగల వాడై పాపకర్మములను చేయుచుండును. సర్వదా విషయేచ్ఛలుగల

వాడును 2 నిర్దయుడును 3 కఠినముగా మాటలాడు వాడును 4 అసత్య
సంభాషణచేయువాడును 5 క్రోధముగలవాడును 6 మనస్సునందు
కపటమువుంచుకొని అసత్యమాడు వాడును యీ ఆరుగురును హింసిం
చెడివారగుదురు. ఈ ఆరును హింసాధర్మములగును. యీ ఆరుగు
రును పెద్దలను అవమానింతురు. 1 సంభోగాసక్తిసుఖములయందు సర్వ
దాబుద్ధిగలవాడును 2 క్రూరబుద్ధిగలవాడును 3 అహంకారము గర్వమును
గలవాడును 4 కృపణచిత్తుడును 5 న్యాయసత్యములను కోల్పోయినవా
డును 6 తననుస్తుతించుకొనువాడును 7 తనయందు భక్తిగల తనభార్య
యందు ద్వేషముగలవాడును, యీ ఏడుగురును పాపస్వభావులగు
దురు. హింసించువారగుదురు. ఈ చెప్పబడిన దోషగుణములు సన్ని
టిని నిశ్శేషముగా విడువవలయును. ఇక పొందదగిన సద్గుణములను
చెప్పెదను వినుము. 1 ధర్మమార్గప్రవర్తనము 2 సత్యము చెప్పుట
3 తపస్సుచేయుట 4 మనస్సును నిగ్రహించుట 5 మాత్సర్యము
లేకుండుట 6 చేయరాని కార్యములను చేయుటయందు సిగ్గుగలిగియుం
డుట 7 సుఖదుఃఖాదులను సహించుట 8 అసూయ లేకుండుట 9 పర
మాత్మను ధ్యానించుట 10 వేదాంతశాస్త్రము వినుట 11 ధైర్య
ముగలిగియుండుట 12 ఓర్పుగలిగియుండుట యీ పన్నెండు మహా
గుణములును బ్రాహ్మణునకు పన్నెండు మహావ్రతములగును. ఈ
పన్నెండు సద్గుణములను గలవాడు యీసకలభూమిని తనవశమొనరిం
చుకొనగలడు. ఈ ధర్మాదిసద్గుణములలో ఒక్కొక్క గుణమందు
పక్షపాతముగలవాడై ఆయామహాధర్మగుణములను రక్షించుటనిమిత్త
మైతన సకలధనములనైనను విడుచును. మనోనిగ్రహము, సర్వకామ
పరిత్యాగము, అప్రమాదము అనగా జ్ఞానము యీ మూడుగుణముల
యందు మోక్షము నిలిచియున్నది. బ్రహ్మప్రాప్తిని గోరుపండితు
లకు యీమూడు గుణములును ముఖ్యములు బ్రహ్మప్రాప్తిని గోరు

వాడు ఫలదోషములను చెప్పరాదు. పరులఫలదోషములను విచారించును సంసారప్రవర్తకులగు వారికి పాపముకలుగును.

పూర్వము పదునెనిమిదిదోషములు గలవని చెప్పితిని. ఆమద దోషము లన్నియు మనోనిగ్రహమునకు విరోధగుణములు. ఆమద దోషముల నన్నిటిని చెప్పెదనువినుము. 1 పరస్త్రీగమనాదులచేత జనులతో విరోధము గలిగియుండుట 2 ధర్మాదికార్యములకు విఘ్నములు చేయుటయు, 3 గుణములయందు దోషారోపము చేయుటయు 4 అసత్యము చెప్పుటయు 5 స్త్రీలయం దభిలాషగలిగియుండుటయు 6 క్రోధముకలిగియుండుటయు 7 కల్లుమొదలైన వానివశమందుండుటయు, 8 పరులదోషములను లెక్కించుటయు, 9 రాజాదుల సన్నిధియందు పరులదోషములను సూచించుటయు 10 నటనర్తకవేశ్యాదులయందైనను. దండనచేతనైనను ధనహానిని పొందుటయు 11 పరులతో విరోధము కలిగియుండుట 12 మాత్సర్యము 13 ప్రాణిపీడనము 14 ఈర్ష్య 15 మదహేతువైన సంతోషము 16 మర్యాద హేతువు లేని వాక్యములను జెప్పుట 17 కార్యాకార్య వివేకరాహిత్యము 18 సర్వదా పరదోషవిచారణస్వభావము యీ పదునెనిమిదిదోషములును మద దోషములని చెప్పబడును. ఈ పదునెనిమిదిగుణములును మనోనిగ్రహమునకు విరోధములగును. పండితులచేత నిందింపబడును. ఆపత్కాలమందైనను యీపదునెనిమిది గుణములలో ఒక్కగుణమునైనను కలిగియుండరాదు. స్నేహవిషయములైన ఆరుగుణములు గలవు. ఆగుణములను చెప్పెదను వినుము

1. తనస్నేహితులకు ప్రియవస్తువ లభించినప్పుడు తానుసంతోషింపవలయును. 2 తనస్నేహితులకు దుఃఖము కలిగినప్పుడు తాను దుఃఖించవలయును. 3 స్నేహితుడు యెట్టివస్తువునైనను యిమ్మని అడిగి ప్రార్థించినయెడల అట్టి స్నేహితునకు అడిగిన పదార్థములను

యివ్వవలయును. 4 ఏస్నేహితునకు తన సకల ధనమును నిచ్చునో అట్టి స్నేహితుని యింటిలో తాను ధనమిచ్చితినను బుద్ధిచేత నివసింపరాదు. 5 తాను సంపాదించిన ధనమున ననుభవింప నలయునే కాని, మిత్రాదులచేత సంపాదింపబడిన ధనము ననుభవింపరాదు. మిత్రాదుల ధనమును భక్షించినయెడల కొంతకాలమునకు మిత్రుల వలన యెగతాళినిపొంది స్నేహమునకు భంగము గలుగును. అందు వలన మిత్రాదుల ధనము నుపయోగింపరాదు. 6 మిత్రునకు మేలు కలిగించు నిమిత్తము తన కీర్తిని నశింపజేసుకొనును. ఈ ఆరును స్నేహవిషయమైన గుణములు. మహారాజా! గృహస్థుడు సకల దోషగుణములను విడచి స్నేహవిషయమైన సద్గుణములు గలవాడై దాతయై సత్వగుణము గలవాడై ఉన్నయెడల అట్టి గృహస్థుడు జ్ఞానేంద్రియములను శబ్ద స్పర్శాది విషయముల నుంచి మరలింప గలడు. అట్టి గుణములుగల గృహస్థుడు విషయముల నుండి యింద్రియములను మరలించి యింద్రియ నిగ్రహముగలవాడై యున్న యెడల ఆయింద్రియ నిగ్రహము సమగ్రమైన తపస్సు పరిణమించి పుణ్యలోక ప్రాప్తి కలుగును. కాని, జ్ఞానమువలె యిక్కడనే కృతార్థత్వమును కలిగింపజాలదు వారికి తీవ్ర వైరాగ్యము లేనందున, ధైర్యశక్తిని గలిగియుండదు వారి సంకల్పమునందు లౌకిక భోగాపేక్ష గలిగియుండును. వారిసంకల్పముచేత బ్రహ్మము తపోరూపమగును. వారికే పుణ్యలోక గతి కలుగుచున్నది. ఆతడే యోగి యగును. యోగియగువాడు సత్యసంకల్పము కలిగియుండును. సత్య సంకల్పమువలన యజ్ఞము వృద్ధిబొందుచున్నవి. యోగికిమనస్సుచేతనే సత్యసంకల్పమువలన యజ్ఞము కలుగుచున్నది. మధ్యముడైన వానికి బ్రహ్మయజ్ఞ జపాదులచేత యజ్ఞమగుచున్నది. ప్రాకృతుడైన పురుషునకు అన్యపశు పురోముశాది క్రియారూపకమైనకర్మముచేత యజ్ఞ

మగుచున్నది. ఈరీతిగా సగుణబ్రహ్మోపాసనవలన సత్యసంకల్పుడగు చున్నాడు. అట్టి సత్పురుషునకు అసంకల్పుడైన ఈశ్వరునివలన ఫల సిద్ధి కలుగుచున్నది. నిర్గుణ బ్రహ్మవేత్తకును, సంకల్పవిశేషమువలన అసంకల్ప పరమేశ్వరుడు అధిక ఫలసిద్ధిని కలిగింపుచున్నాడు. అనగా సగుణోపాస కాంక్షచేత నిర్గుణ బ్రహ్మవేత్తకును, సత్యసంకల్పాది కము అధికముగా కలుగుచున్నది.

ధృతరాష్ట్ర మహారాజా! యీ యోగశాస్త్రమును శిష్యులకు తెలుపవలయును. బ్రహ్మమును పొందుటకు యోగశాస్త్రము సాధనము. బ్రహ్మప్రాప్తిని కలిగించు యీ శాస్త్రముకంటె యితర శాస్త్రములు నోటికి వికారమగును. అని సర్వజ్ఞులగు పండితులు చెప్పుదురు. సర్వము యోగికి అధీనమై యుండును. ఈ ఉపాసనా యోగము నెరిగినవారలు అమృతస్వరూపులు. కర్మమువలన సత్య జ్ఞానానంత లక్షణ పరబ్రహ్మము పొందుటకు శక్యముకాదు. మహా యోగ స్వరూపమైన కర్మముచేత జ్ఞానహీనుడు మోక్షమును పొంద జాలడు. ఆనందమును పొందజాలడు. గనుక సర్వేంద్రియ వ్యవహార ములను విడిచి మౌనము గలవాడై ఆత్మయగు తాను లోకమందు ఆకాశమువలె నిండియున్నట్లు పరబ్రహ్మమును ధ్యానింపవలయును. అట్లు ధ్యానించునప్పుడు మనస్సుచేత యితరవిషయములు కొంచె మైనను స్మరింపరాదు. పరులు తనను స్తుతించినయెడల సంతోషింప రాదు. పరులు తనను నిందించినయెడల రోషమును పూనరాదు. అట్టి నిర్గుణ బ్రహ్మోపాసకుడు వేదోక్త దృష్టులయందు ఆరోపణాప వాదములుగా నున్నవాడై యిక్కడనే పరబ్రహ్మము నెరింగి అ బ్రహ్మమును పొందుచున్నాడు. బ్రహ్మవేత్త పరబ్రహ్మ స్వరూపుడై పరబ్రహ్మ మహాత్మ్యమును పొందుచున్నాడు. ఘటాకాశమునకు ఉపాధి నశింపగా ఘటాకాశము మహాకాశముతో ఐక్యమైనట్లు పర

బ్రహ్మమును పొందుచున్నాడు. గనుక పరబ్రహ్మవిద్య ప్రత్యక్ష ఫల విషయమై అనంత ఫలమైన మోక్షమును కలిగింపుచున్నది. కర్మము పరోక్ష ఫల విషయము. గాన వినాశ ఫలమును గలిగించును. అట్టి కర్మముకంటె జ్ఞానము శ్రేష్ఠమైనదని యెరిగి జ్ఞానము కొరకే ప్రయత్నించ వలయును. అని నేను నీకొరకు చెప్పుచున్నాను.

ఇది సనత్సుజాతపర్వమునందు చతుశ్చత్వారింశోధ్యాయము.

అని మఱియు సనత్కుమారమునీంద్రుడు ధృతరాష్ట్రునితో నిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! జ్ఞానయోగ మూలమున యోగులు బ్రహ్మమును జూచుచున్నారు. అట్లు చూచిన వారు మరణమును తప్పించుకొనుచున్నారు. ఆబ్రహ్మము పరిశుద్ధమైనది. అవిద్యాది దోషములు లేనిది. సర్వమును ప్రకాశింప జేయునది. తేజోరూపమైనది. మహాకీర్తిగలదై యింద్రాది దేవతలందరిచేతను ఉపాసింపబడును. ఆ పరబ్రహ్మము పరంజ్యోతి స్వరూపమై సూర్యునివలె ప్రకాశింపుచు పరమాత్మయనియు, భగవంతుడనియు, అనాది పురుషుడనియు చెప్పబడును. అట్టి పరబ్రహ్మమును జ్ఞానయోగులు మాత్రమే చూచుచున్నారు. జ్ఞానయోగులు కానివారు ఆ పరబ్రహ్మమును చూడజాలరు. ధృతరాష్ట్ర మహారాజా! యీ చెప్పబడిన పరబ్రహ్మము వలననే హిరణ్యగర్భుడను బ్రహ్మదేవుడు పుట్టెను. ఆపుట్టిన బ్రహ్మదేవుడు పరబ్రహ్మము వలననే వృద్ధిపొందుచున్నాడు. పరిశుద్ధమైన ఆ పరబ్రహ్మము సూర్యాదులలోనుండి తెలియబడకుండ స్వయముగా ప్రకాశింపుచున్నది. ఆ పరబ్రహ్మము అన్యముచేత ప్రకాశింపబడక సర్వమును ప్రకాశింప జేయుచున్నాడు. స్వయముగా ప్రకాశించు చున్నాడు. అటువంటి భగవత్స్వరూపమైన పరబ్రహ్మమును జ్ఞానయోగులే చూచుచున్నారు. దేశకాల వస్తువుల వలన

పరమాత్మకు పరిచ్ఛేదము లేనందున ఆపరమాత్మ పూర్ణుడగును. పరమాత్మయే జీవరూపుడై యున్నందున పరమాత్మయొక్క పూర్ణత్వము జీవునకు సిద్ధించెను. అందువలన జీవస్వరూపము పూర్ణమే యని విద్వాంసులు చెప్పుదురు. అట్టి పూర్ణ స్వరూపమైన జీవుడు దేహేంద్రియాదులయందు అనుసరించి ప్రవేశించి యున్నాడు. ఆదేహేంద్రియాదుల యందుగల పూర్ణమైన జీవరూపమును మాత్రము తీసి దేహద్వయమునకు సాక్షియైన సర్వాంతరుడగు ఆత్మను దేహద్వయమునుంచి పండితులు ఉద్ధరింపు చున్నారు. అట్లు ఉద్ధరింపబడిన ఆత్మ పూర్ణానందమైన బ్రహ్మస్వరూప మగు చున్నది.

ఓ ధృతరాష్ట్ర మహారాజా! యీపరమాత్మవలన మొట్ట మొదట పంచభూతములు సృష్టింపబడెను. పిమ్మట ఆపంచభూతముల వలన పంచభూతమయమైన స్థూలదేహాదికము సృష్టింపబడెను. ఆదేహములో మధ్యమునందుండెడి హృదయాకాశమందు జీవపరమాత్మలు వర్తింపుచున్నారు. ఆజీవపరమాత్మలిద్దరును ప్రకాశస్వరూపులు, వారు సర్వదిక్కులును వ్యాపకత్వముచేత కప్పియున్నారు. వారిద్దరిలో జీవుడు స్వాభావికచిత్సదానంద అద్వితీయబ్రహ్మస్వరూపమును పొందజాలక దేహాదులయందు ఆత్మభావమునుపొంది అజ్ఞానముచేత మోహింపబడియున్నాడు. జీవుడు భూత భౌతికలక్షణమైన కర్మఫలానురూపసుఖదుఃఖ మయమైన దేహాదికమును భరింపుచున్నాడు. రెండవవాడైన పరమాత్మ తనసత్యజ్ఞానానంద స్వరూపముచేత ప్రకాశింపుచు స్వస్వరూపమును భరించియున్నాడు. పరమాత్ముడు తన మాయాశక్తిచేత తనను ప్రాణాది అనేకభేదములుగాజేసి వాని యందు ప్రవేశించి సాక్షిగా సకలప్రపంచమును జూచుచున్నాడు. అట్టిభగవంతుడైన పరమాత్మను జ్ఞానయోగులు మాత్రమే చూచు

చున్నారు. దేహమందుండు ఆపరమాత్మ ప్రజ్ఞావంతుడు గనుకనే దివ్యపురుషుడు. ప్రకృతివలనపుట్టినవాడు కాడు. ముదిమి, చావులు మొదలగు ధర్మములు లేనివాడు. జ్ఞానస్వరూపుడు. పూర్ణానందుడు. ఈపరమాత్మతో సమానమగు రూపముగలవస్తువు వేరొకటిలేదు. ఈ పరమాత్మవంటి వస్తువు లేదు. సర్వాంతరుడైన యీపరమాత్మను యెవ్వడును కంటిచేతచూడలేడు. జ్ఞానయోగులే చూచుచున్నారు. నిశ్చయాత్మకమైన పరిశుద్ధబుద్ధిచేతను, సంకల్ప వికల్పరూపమైన మనస్సుచేతను, హృదయమందుండు పరమాత్మను పండితులు చూచుచున్నారు. హృదయమందుండు పరమేశ్వరునిచేత అనుగ్రహింపబడిన పండితులు యీపరమాత్మ నేనగుదునని తెలియుచున్నారు. ఇట్లు పరమాత్మను యెరిగినజ్ఞానయోగులైన పండితులు అమృతస్వరూపులగుచున్నారు. ఆపరమాత్మను జ్ఞానయోగులే చూచుచున్నారు. 1 శ్రోత్రము 2 త్వక్ 3 చక్షువు 4 జిహ్వ 5 ఘ్రాణము 6 వాక్కు 7 పాణి 8 పాదము 9 పాయువు 10 ఉపస్థ 11 మనస్సు 12 బుద్ధి. యీపన్నెండు యింద్రియములును పరమాత్మచేత రక్షింపబడుచు సంసారమార్గమందు ప్రవర్తింపుచుండును. పన్నెండు యింద్రియములును, ఒకయింద్రియవిషయమును మరియొకటి అనుభవించక తమతమవిషయసుఖముల ననుభవింపుచుండును. ఏపుణ్యపురుషులు పరమాత్మనుయెరిగి అనుభవింతురో, ఆ పుణ్యపురుషుల యింద్రియములు ఘోరమైన సంసారమును తరింపుచున్నవి గనుక యింద్రియములను విషయములనుండి మరలించి మనస్సునందుంచి తనవశము చేసికొనవలెను. ఇంద్రియములను రక్షించుపరమాత్మను జ్ఞానయోగులే చూచుచున్నారు. తుమ్మెద అర్ధమాసపర్యంతము సంపాదించిన పూదేనెను మిగతా అర్ధమాసమును త్రాగుచున్నది. అట్లుగానే యీసంసారమందు తుమ్మెదవలె తిరుగు సంసారియు పూర్వజన్మ

మందు సంపాదించి దాచినకర్మమును యీజన్మమందు అనుభవింపు చున్నాడు. అట్లయినయెడల కర్మము నిత్యమనియు జీవునకు నివృత్తి లేదనియు శంకించినయెడల చెప్పెదవినుము. కేవలకర్మమువలననే సంసారసిద్ధియగుపక్షమందు యీదోషముగలుగును. పరమేశ్వరుడు కృతప్రయత్నాపేక్షగలవాడగుచు సర్వభూతములకును ప్రాణాగ్ని హోత్రమునకును, యితరఅగ్నిహోత్రమునకును హవిస్సురూపమైన అన్నాదికమును కల్పించెను. గనుక ఆదోషములేదు. అట్టిభగవంతుడైన పరమాత్మను జ్ఞానయోగులే చూచుచున్నారు. సంసారులు కర్మములనుచేయుచు సంసారమందు జననమరణాదులను పొందుచుందురు. అజ్ఞానులు వేదముతోగూడిన బ్రాహ్మణదేహమునుపొంది ఆ బ్రాహ్మణాదిదేహములనుపొందినప్పుడు జ్ఞానులై సంసారబంధవిముక్తులగుచున్నారు. అట్టిపరమాత్మను జ్ఞానులేచూచుచున్నారు.

ధృతరాష్ట్రమహారాజా! యోగపద్ధతినిచెప్పెదను వినుము. సమాధికాలమందు అపానవృత్తిని ప్రాణవాయువునందుంచవలయును. ఆ అపానసహిత ప్రాణవాయువును మనస్సునందుంచవలయును. ఆ మనస్సునుబుద్ధియందునిలుపవలయును. ఆబుద్ధిని పరమాత్మయందుంచవలయును. అట్లునిలిపి స్వాభావికమైన చిదానంద పరబ్రహ్మస్వరూపముగా నుండవలయును. పరమాత్ముడు భూతభౌతికలక్షణమైన సంసారమును పొందకనే చిదానంద స్వరూపముచేత ప్రవర్తించుచున్నాడు. ఆపరమాత్మ తనమాయచేత సకలప్రపంచమును సృష్టించి తానేజీవరూపాధారియై ఆప్రతిబింబరూపుడైన జీవునిసంసారమందు ప్రవర్తింపజేసెను. పరమాత్మ జీవునిపుద్ధరించలేదు. అట్లు పరమాత్మ జీవునిపుద్ధరించు పక్షమందు తనమాయచేత తనస్వరూపమును ప్రాణాద్యనేక భేదములుగాజేసి అందు తాను జీవరూపముచేత ప్రవేశింపకుండవలయును. అప్పుడు జననమరణాది లక్షణసారమే లేకపోవును.

సంసారియైన జీవుడు లేనియెడల మోక్షము లేకపోవును. ఈకారణము లవలన పరమాత్మ జీవుని నుద్ధరించలేదు.

ధృతరాష్ట్రమహారాజా! చిదానందస్వరూప పరిపూర్ణుడైన పరమాత్మయే లింగదేహముతో కూడియున్నందున అంగుష్ఠమాత్ర పరిమాణముచేత పరిచ్ఛిన్నుడై జీవరూపుడై సర్వదా సంసారమందు ప్రవర్తింపుచున్నాడు. ఆపరమాత్మయే సర్వలోకను సీశ్వరుడగును. స్వయం జ్యోతిరూపుడగును. స్థూలసూక్ష్మ దేహాభిమానులగు మూఢులు ఆపరమాత్మను యెరుగజాలక సంసారమందు ప్రవర్తింపుచున్నారు. అటువంటి పరమాత్మను జ్ఞానయోగులే చూచుచున్నారని యెరుంగుము. రాజా! సర్పములు కలుగులలోనుండి వెలుపలికి వచ్చి తమ విషమును ప్రసరించి మనుష్యులను నశింపజేసి తిరిగి తమ కలుగులోనికి పోయి తమ స్వరూపములను దాచుకొనుచున్నవి. అట్లుగానే శ్రోత్రాదియింద్రియములును శ్రోత్రాదుల యందు పండుకొనుచు ఆశ్రోత్రాదిస్థలములనుండి వెలుపలికి వచ్చి శబ్దస్పర్శాదివిషయములను గ్రహించుటచేత మనుష్యులను నశింపజేయుచున్నవి. ఆ ఇంద్రియములంతట మరల శ్రోత్రాదిస్థలముల లోనికి పోయి తమరూపములను దాచుకొనుచున్నవి. ఇంద్రియములకు లోబడనివారలు విషములచేత తిరస్కరింపబడి విశేషముగా మోహమును పొందుచున్నారు. మనుష్యులకు మాటిమాటికి మోహము గలిగించుటకు ఆవిషయములు కారణములగును. ఆ శబ్దస్పర్శాదివిషయ మోహమువలన గర్భవాసజననమరణాది మహాసంసారదుఃఖము కలుగుచున్నది. మహారాజా! మనోనిగ్రహ ఇంద్రియనిగ్రహ బ్రహ్మచర్యాది సాధనసంపన్నుల యందును శమదమాదిసాధనము లేని మనుష్యులయందును ఆత్మరూపము సమానముగానే యున్నది. సాధనవంతులకు మోక్షము సమానమే. సాధన

ములు లేనివారికి సంసారబంధము సమానమే. శమదమాదిసాధన వంతులు మోక్షమును పొందుచున్నారు. అట్టి బంధమోక్షములకు కారణుడైన పరమాత్మను జ్ఞానయోగులే చూచుచున్నారు. మరియు బ్రహ్మజ్ఞానముచేత యిహలోకపరలోకములను వ్యాపించి పూర్ణా నందరూపమైన బ్రహ్మమును పొందుచున్నాడు. బ్రహ్మస్వరూప విషయమైన జ్ఞానముగలవానికి అగ్నిహోత్రాది సర్వఫలమును సంపాదించినట్లే యగును. మరియు హోమము చేయబడని అగ్ని హోత్రములన్నియు హోమముచేసినట్లే యగును. గనుక బ్రహ్మ జ్ఞానము కర్మమువలె స్వల్పఫలము నివ్వదు అనంతమహాఫలమును యిచ్చును. బ్రహ్మజ్ఞానము పరమాత్మను తన స్వరూపముగా సంపా దించుచున్నది. అట్టి బ్రహ్మజ్ఞానము గలవానికి బ్రహ్మ మను పేరు గలుగును. ధైర్యవంతులగు పండితులు పరబ్రహ్మమును ... త్మ చున్నారు. జ్ఞానయోగులు తప్ప యితరులు పరబ్రహ్మము మొదలగు జాలరు. ధృతరాష్ట్రమహారాజా! ఇట్లు ప్రజ్ఞానైకరస స్వా...త్మ నివసించి పరబ్రహ్మము నెరిగినవాడు యీ దేహమందే మృత్యువు న చింతించుట చున్నాడు. సర్వదా సత్యజ్ఞానానందస్వరూ ...రూపము. వానికి మృత్యువు లేదు. మృత్యురూపమై మోక్షము చెప్పనలయును. జ్ఞానికి సం... లేనప్పుడు మోక్షము కలుగునని చెప్పవలసి... సాధ్యముగాని విషయముగా యీ పరమాత్మ... యున్నది. యజ్ఞాదిపుణ్యకర్మములద్వారా ని... వారలు పరమాత్మను జూచుచున్నారు. రాగద్వేష... మైన విశుద్ధచిత్తము గలవాడు యీ పరమాత్మ నేనైతినని... ముగా యెరుగుచున్నాడు. ఇట్లు పరమాత్మ నెరిగిన వారలు అమృత ధర్మవంతులగుదురు. సర్వభూతములయందు సర్వవ్యాపియై యుండెడి

పరమాత్మను తననుగా జూచుచున్నవాడు కృతార్థుడగును. అట్టి వాడు దేహేంద్రియాదులయందు అభిమానులైనవారి నిమిత్తమై పరితపింపడు. తానైన పరమాత్మను యెఱుగుటవలన కృతార్థత్వబుద్ధి కలుగును. అట్టివాడు యెప్పటికిని పరితాపమును పొందడు. ఈబ్రహ్మజ్ఞాని ఒక ప్రయోజనమునిమిత్తము యీ మూడులోకములయందు యెవ్వరిని ఆశ్రయింపడు. బ్రహ్మజ్ఞానికి మూడులోకముల యందును కొంచెమైనను ప్రయోజనము లేదు. అని సనత్కుమార మునీంద్రుడు ధృతరాష్ట్రునితో చెప్పి యీ చెప్పిన అభిప్రాయమును దృఢపరచు నిమిత్తము వామదేవాదులవలె స్వానుభవమును చెప్పదలచి యిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! నాస్వానుభవమును చెప్పదలచితిన

వచ్చి ...నుము. ఇదివరకు గడచిపోయిన కాలమునకును గతించిన ప్రాణి

తమ కలుగు..., రాబోయెడి కాలమునకును, పుట్టబోవు భూతములకును,

చున్నవి. అట్లు...ందు భూతములకును యీసకలలోకములకును అంతరాత్మను

యందు పండుకొను...దును. లోకమందుగల మీకందరికిని నేనే తల్లినగుదును.

శబ్దస్పర్శాదివిషయము..., నేనే పుత్రుడను, సర్వము నేనే. సర్వప్రపంచము

జేయుచున్నవి. ఆ క...ల్పింపబడినందున సర్వము నేనేనని చెప్పితిని. రజ్జువు

లోనికి పోయి తమరూ...పబడిన సర్పమువలె పరమాత్మనగు నాయందు సర్వ

లకు లోబడనివారలు...ంనబడినందున పరమాత్మనైన నాకును ప్రపంచకము

మోహమును పొం...చెమైనను సంబంధము లేదు. ఈలోకమునకు పితామహు

మోహము గలిగి...న. వృద్ధుడను నేనే. ఈ సర్వప్రపంచము పరమాత్మనగు నాయందు నిలిచియున్నది. వాస్తవమునకు నాకు మీరు లేరు. మీకు నేను లేను. నాకు జననహేతువు ఆత్మనగు నేనే. నేనుపుట్టుక లేనిఆత్మను వస్త్రమందు నిలువుగను, అడ్డముగను చేరియుండు దారములవలె కార్యమైన ప్రపంచమందు అంతటను నేనుచేరి పూర్ణముగా వ్యాపించియున్నాను. ఈసర్వలోకములకును, సర్వభూతములకును, నేను అంత

రాత్మనగుదును. సర్వేశ్వరుడ నగుదును. నేనే సర్వకర్తనగుదును. ముముక్షువులు యెరుగదగిన పరబ్రహ్మము నేనే యగుదును. పరమాత్మనగు నన్ను పండితుడు యెరిగి సంసారబంధవిముక్తు డగుచున్నాడు. అని సనత్కుమారమునీంద్రుడు స్వానుభవమును దెలిపి ప్రకరణార్థమును ముగింపుచేయదలచి యిట్లనెను.

ధృతరాష్ట్ర మహారాజా! ఆపరమాత్మ మిక్కిలి అతిసూక్ష్మతరవస్తువు. ఇంద్రియములచేత చూచుటకు సాధ్యముగాదు. పరమాత్మనిర్గుణుడు. పరమాత్మ మాయయను దివ్య నేత్రమును గలిగి యున్నాడు. ఆదివ్యనేత్రము భూతభవిష్యద్వర్తమాన కాలముల యందు గల సకలవిషయములను యెరుగుచుండును. అందువలన పరమాత్మసగుణరూపుడగును. సర్వభూతములయందును పరమాత్మ అంతర్యామిగానుండి నివసించియున్నాడు. మనుష్యులు మొదలగు సర్వభూతములయొక్క హృదయకమలమందు పరమాత్మ నివసించి యున్నాడు. ఇటువంటి ప్రత్యగాత్మను హృదయమందు చింతించుట చేత సాక్షాత్కరించుకొనినవాడు కృతార్థుడగుచున్నాడు.

ఇది సనత్సుజాత పర్వమునందు పంచచత్వారింశోధ్యాయము

జనమేజయమహారాజా! యీప్రకారము ఆరాత్రికాలమందు భగవంతుడైన సనత్కుమారమునీంద్రుడు ధృతరాష్ట్రునకు తత్వజ్ఞానము నుపదేశించెను. అంతట కొంతసేపటికి సూర్యోదయమయ్యెను. అంతట సనత్కుమారమునీంద్రుడు ధృతరాష్ట్ర విదురులతో జెప్పి అంతర్థానుడై బ్రహ్మలోకమునకు పోయెను. అరుణోదయమైనప్పుడు కౌరవస్త్రీలు పాండవస్త్రీలతో కలహించుటకు చింతించి కాంతిహీనులైనట్లు చంద్రుడు తేజోహీనుడాయెను. కలువలు ఆరాత్రికాలమందు వికసించియుండి ఇప్పుడు ముకుళించిపోయెను. చుక్కలు తేజోహీనము

లాయెను. ఆ వేకువసమయమున చక్రవాకపక్షులు సంతసముతొత్తి మొగములను వొకటికొకటి చెమొత్తుచూచెను. ఆచక్రవాక పక్షుల దంపతులు ఆవేకువకాలమునందు సంభోగసౌఖ్యములయందు తేలుచుండెను. సూర్యోదయకాలమందు తుమ్మెదలన్నియు వెడలి పుష్పముల మీదికివచ్చి పూదేనెను త్రాగుచుండెను. కమలములు వికసించెను. వనములయందు చిలుకలును కోకిలలును తుమ్మెదలగుంపులును అక్కడక్కడ కూయుచు మనోహరముగా ధ్వనిచేయుచుండెను. అశ్వములు బాటసారులకువినబడి మేలుకొనిరి. బాటసారులు ఒకరినొకరు పిలుచునట్లుగా ఆపక్షులధ్వనులు వినిపించుచుండెను. గర్జనములను పలికినట్లును సైన్యములలోనుండు కోపసంయుతులైన భటులను పిలుచునట్లును పక్షులధ్వనులు బాటసారులకు వినిపించుచుండెను. అరుణోదయకాలమందుగల కాంతికంటె పద్మరాగములకాంతి అధికముగానుండెను. పక్వములైన పుష్పములను రాల్చుటచేత వృక్షములు పుష్పములు లేని ఆకాశమును తిరస్కరించుచుండెను. సూర్యునకు అశోక వృక్షమందు వికసించిన పూలగుత్తివలె నుదయ పర్వతమునందు కనబడుచుండెను. బాలసూర్యునికాంతి పర్వతములమీదను చినరను వ్యాపించి చరియలయందు మెరుగుపెట్టినట్లుండెను. వృక్షముల చిగురుటాకులకును, పొదరిండ్లగుంపుల చిగురుటాకులకును బాలసూర్యుని కాంతి వన్నెపెట్టినట్లుండెను. సముద్రతరంగములలో నుండు రేకులయందుగల తళతళకాంతికి, ఆబాలసూర్యకాంతికి మెరుగు పెట్టినట్లుండెను. చక్రవాకపక్షుల సంతతియొక్క రెక్కలయందుగల యెర్రనికాంతిని ఆబాలసూర్యకాంతి క్రొత్తచేసినట్లుండెను. బాలసూర్యకాంతి వుపమానరహితమై ఆకాశమును ప్రకాశింపజేసెను. ఇట్లు బాలసూర్యుడు వుదయించినతోడనే లోకములన్నియు ప్రకాశించెను. ఓ జనమేజయా! ఇట్లు సూర్యోదయమాయెను. ఆసూర్యోదయకాల

మందు ధృతరాష్ట్రుడు స్నానసంధ్యావందనాది కార్యములను జరిపి తగినప్రకారము అలంకరింపబడియున్న సభామంటపమునకువచ్చి పెద్ద సభదీరియుండెను, ఆసభయందు ద్రోణాచార్యకృపాచార్య అశ్వత్థామ కృతవర్మ కర్ణాదులగు అతిరధ మహారధశ్రేష్టులందరును చేరి కూర్చుండిరి. భీష్మ విదుర బాహ్లీక సోమదత్త భూరిశ్రవులు మొదలగు బంధు జనులందరును వచ్చియుండిరి. దుర్యోధన దుశ్శాసన వికర్ణాదికుమారులందరును ఆమహాసభకువచ్చియుండిరి. ఆసమయమందు సంజయుడు వచ్చి వాకిటయందు నిలిచియుండి తానువచ్చిన విషయమును ద్వారపాలకునివలన ధృతరాష్ట్రునకు తెలిపి సభలోనికివచ్చెను. సంజయుడట్లువచ్చి తనకుదగిన ప్రదేశమునకూర్చుండి యుండెను. సంజయుడు పాండవులదగ్గరకు వెళ్ళివచ్చినకార్య విషయమైన వాక్యములను వినుటకు ఆసమయమునందు వారందరును తొందరపాటుగలిగియుండిరి. అట్టిసభను సంజయుడు కలియజూచి యిట్లనెను.

## సంజయుడు ధృతరాష్ట్రునితో పాండవులతెరగు చెప్పుట

సభికులారా! ధృతరాష్ట్రమహారాజుపంపగా నేను పాండవుల దగ్గరకువెళ్ళి ధర్మరాజును జూచితిని. ధర్మరాజు మిగులప్రేమపూర్వకముగా కౌరవుల క్షేమములను ప్రత్యేకముగా అడిగెను. ధర్మరాజు ఆయామాదిధములచేత నమస్కార వినయబాంధవ స్నేహవాత్సల్య అనుగ్రహభావ పూర్వకముగా యుక్తుడై వారినందరిని ఆదరించెను. నేనును యీధృతరాష్ట్రరాజు చెప్పినప్రకారము కొరతలేనట్లుగా బంధుత్వమునకు కావలసినమాటలను ధర్మరాజుతో జెప్పితిని. పిమ్మట నేను చెప్పినసంధి కార్యవిషయమై సభయందు ధర్మరాజుతో ప్రసంగించితిని. నేనుచెప్పినమాటలకు ధర్మరాజు చెప్పినమాటలు మిగుల మాధుర్యముగా నుండెను. అని సంజయుడు సభికులతో చెప్పుచు ధర్మ

రాజుయొక్క మాటలను పొగడెను. అంతట ధృతరాష్ట్రుం సావధా నుడై అక్కడ జరిగిన సంభాషణలన్నిటిని చక్కగా చెప్పుమని సంజ యుని అడిగెను. సంజయుడు తాను ఆధర్మరాజునకు చెప్పిన వాక్యము లను ధృతరాష్ట్రునకు చెప్పెను. సంజయుడు ధృతరాష్ట్రునితో తన మాటలకు అన్నిటికిని ధర్మరాజుయిచ్చిన ప్రత్యుత్తరముల వివరము నంతను చెప్పెను. మరియు నిట్లనెను.

ధృతరాష్ట్ర మహారాజా! ఆ ధర్మరాజు నీతో చెప్పుమని కొన్ని మాటలను నాతో చెప్పెను. దుర్యోధనునకు చెప్పుమని కొన్ని మాటలను చెప్పెను. ఆమాటల నన్నిటిని క్రమముగా చెప్పెదను. మరియు ధర్మరాజు సంభాషించిన వాక్య సరణియంతయు చెప్పెదను వినుము. అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. ధృతరాష్ట్ర మహారాజా! నేను వుపప్లావ్యపట్టణమునకు వెళ్ళి యెదుట కృష్ణార్జును లను జూచితిని. ఆ కృష్ణార్జును లిద్దరును నీతిమార్గము దప్పకుండ వారి బలశక్తి సామర్థ్యములను బట్టి నాతో మాటలాడిరి. వారి మాట లను చెప్పెదను వినుము. అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను. సంజయా! కృష్ణుని చిత్తము యే ప్రకారముగా నుండెనో చెప్పుము. ఆ కృష్ణుడు నీతో యేమనెనో చెప్పుము. అని ధృతరాష్ట్రు డడుగగా సంజయు డిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! కృష్ణుడును అతని భార్యయగు సత్యభామయు, అర్జునుడును, ద్రౌపదియు యీ నలుగురును రహస్యగోష్ఠియం దున్నారు. వారున్న నెలవునకు వారి పుత్రులైనను వెళ్ళరాదు. కృష్ణుడు స్త్రీలచేత సేవింపబడుచు నన్ను పిలిపించెను. ఆ కృష్ణునకు నాయందుగల దయాకారము యెట్టు వంటిదో తెలియలేదు. నేనును ఆ కృష్ణార్జునులున్న పద్ధతిని ద్వార పాలకుని వలన యిదివరకే తెలిసికొంటిని. అందువలన నేను చొక్కాయిని తొడిగికొని తలగుడ్డను ధరియించుకొని వినయ

పూర్వకమైన వేషముతో కృష్ణార్జును లున్న గృహములోనికి వెళ్ళి తిని. అప్పుడు కృష్ణార్జునులు అనేక మణిమయ భూషణములను ధరించుకొని ఆ భూషణ ప్రభలచేత ప్రకాశించుచుండిరి. అట్లు ప్రకాశించుచు కృష్ణార్జునులు ఒక్క పాన్పుమీద వుండిరి. కృష్ణుడు పండుకొని యుండి కాళ్ళు చాచెను. ఆ కాళ్ళను అర్జునుడు తన తొడలమీద వుంచుకొనికూర్చుండెను. సత్యభామ ద్రౌపదులిద్దరును కుర్చీలమీద కూర్చుండిరి. అట్టిసమయమందు నేను వెళ్ళి వినయ పూర్వకముగా దండ ప్రణామము చేసితిని. కృష్ణుడు నన్నాదరించి అర్జునునకు సైగచేసెను. అదిగ్రహించి అర్జునుడు కృష్ణుని పాదముల క్రిందినుండు బంగారు పీఠమును రత్నమయమైన దానిని తీసెను. కృష్ణుడు బంగార పీఠము మీదనుండు తన కాళ్ళను దిగిచికొనెను. ఆసమయమున అర్జునుని యేర్పాటుచేత సత్యభామ ద్రౌపది లిద్ద రును ఆ బంగారు పీఠమును యెత్తితెచ్చి నాదగ్గర పెట్టిరి. నేనా పీఠమందు కూర్చుండక నాఅరచేతులతో నాబంగారు పీఠమును అంటుచుభూమిమీద కూరుచుంటిని. అట్లుచేసి పిమ్మట చేతిని ముడిచి శిరస్సున జేర్చుకుని కృష్ణార్జునులను జూచుచుంటిని. ఆ కృష్ణార్జు నులు నల్లని మనోహరములైన దేహవర్ణములను కలిగి భుజాబల దర్పములచేత ప్రకాశించుచు మదపుటేనుగులవలె నుండిరి. అటువంటి కృష్ణార్జునులనుజూచి నాకు సంతోషముచేత కన్నీరు స్రవింప నా దేహము పులకాంకురిత మయ్యెను. పిమ్మటనాకు భయము కలిగెను. ఆ సమయమందు నామనస్సులో నే నిట్లని తలంచితిని. ధర్మరాజు చెప్పిన పనిని యీ కృష్ణార్జును లిద్దరును చేయుదురు గదా! కృష్ణా ర్జునులు పూనుకొని నప్పుడు ధర్మరాజునకు ఫలింపని తలంపు ఒక్కటైన నను ఉండనేరదు. ధర్మరాజు తలంచిన తలంపు నీ యిరువురును నాయాసముగా నెనవేర్చెదరు. వేయి విషయములను విచారించుట

వలన విశేషమేమియు నుండబోదు. ధర్మరాజును [illegible] మాటను జూడగా యనుధర్మరాజుయొక్క [illegible] [illegible]. అని యిట్లు నేను నారాయణస్వామితో పలుకుచుండగా. [illegible] మహాను భావులగు కృష్ణార్జునులు [illegible] నన్ను [illegible] ఉప యోగించు నాహారమును నాకు [illegible] యిచ్చిరి. వారు కట్టుకొనిన వస్త్రములను నాకు యిచ్చిరి. వారు ధరించునట్టి [illegible] ఆభరణములను నాకు ధరింపజేసి నన్ను [illegible]. అంతట నేను [illegible] వెళ్ళిన సంధికార్య విషయములను కృష్ణార్జునులకు [illegible]. అప్పు డర్జునుడు పెద్దముఖముతో [illegible] [illegible] చెప్పు టకు ప్రయత్నించెను. ఆ సమయమున కృష్ణుడు అర్జునుని [illegible] నాతో నిట్లనెను.

## సంజయుడు ధృతరాష్ట్రునకు కృష్ణుడు చెప్పిన మాట లెరిగించుట

సంజయా! నేను చెప్పుమాటలను వినుము. ధృతరాష్ట్రుడు నిండుసభయందున్నప్పుడు అతని కుమారులగు దుర్యోధనాదులును, ద్రోణాచార్య కృపాచార్య భీష్మాదులును అందరును వినుచుండగా ధృతరాష్ట్రునితో యిట్లని చెప్పుము. ధృతరాష్ట్రమహారాజా! ధర్మ రాజు కోపించినందున అతనికోపము నీటిలోబుట్టిన నిప్పువంటిదిగ నుండును. ఆ ధర్మరాజుయొక్క కోపాగ్నిహోత్రమును చల్లార్చుట మీకు సాధ్యముకాదు గాన మీరు నేర్పువలన చేయదగిన కార్యము లను చెప్పెదను వినుము. ఇప్పుడు మీకు గలిగియున్న సకలధనము లను నిశ్శేషముగా సద్బ్రాహ్మణులకు దానములను చేయుడు. మీయొద్ద గల సకల బంధుమిత్ర ఆశ్రిత జనులను రప్పించి వారివారికి తగిన ధనములచేత సన్మానించి సంతోషమును గలిగింపుడు. మీ మనస్సు

లకు సంతోషము గలుగునట్లు మీ యిష్టప్రకారము యింద్రియ సౌఖ్యములను అనుభవింపుడు. ప్రీతిపూర్వకముగా ఆయావిధముల చేత మీ భార్యాపుత్రులను గౌరవించి సంతోషము గలిగింపుడు. మీలో యెవ్వరెవ్వరి చిత్తములకు యే యే కోరికలున్నవో ఆయా కోరికలప్రకారము విషయ సుఖముల ననుభవించి మీ యిష్టప్రకారముగా విహరింపుడు. ఇకను ఆలస్యము చేయక మీ ప్రాణములను మీ అరచేతులయం దుంచుకొని యుద్ధమునకు నడచిరండు. అని యిట్లు ధృతరాష్ట్రునితో అందరు వినుచుండగా జెప్పుమని కృష్ణుడు సంజయునితో జెప్పెను.

సంజయా! ధృతరాష్ట్రునకు యింతవరకు చెప్పవలసిన పని యేమియని యంటివేని చెప్పెదను వినుము. సంజయా! పాండురాజుయొక్క కోడలగు ద్రౌపది పూర్వము ఆ కౌరవ సభయందు కౌరవులవలన మిక్కిలి అవమానమును బొందెను. ఇదివరకు యేకాలమందైనను యెవ్వరును పొందలేని అవమానమును ద్రౌపది పొంది మహాదుఃఖము గలదై హా కృష్ణా! ద్వారకావాసా! నన్ను కాపాడుము. కాపాడుమని దూరమం దుండెడి నన్ను తలచి యేడ్చెను. ఈదరాని అప్పువలె ఆ ద్రౌపది దుఃఖము నా మనస్సునకు మిక్కిలి భారమై నా మనస్సునందు సర్వదా చలింపకున్నది. అందువలన ధృతరాష్ట్రునకు యీ మాటలను చెప్పవలసి వచ్చెను. సంజయా! ఇటువంటి నేను అర్జునునకు సారధ్యము చేసెదను. అర్జునుడు సర్వలోక ప్రసిద్ధమైన గాండీవమును యెక్కుపెట్టి రెండు అంబుల పొదులయందుగల అక్షయ దివ్యబాణములను ప్రయోగించును. అటువంటి అర్జునుడు నేడో రేపో మీ మీదకు యుద్ధమునకువచ్చును. గనుక మీరు దప్పించుకొని యెక్కడికిని పోజాలరు. అని కృష్ణదేవుడు యీవిధముగా నీతో చెప్పుమని నాతో చెప్పెను అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను.

వలన విశేషమేమియు నుండబోదు. ధర్మరాజును పూజించుటను జూడగా యమధర్మరాజుయొక్క శిరస్సును త్రెన్నినట్లగును. అని యిట్లు నేను నామనస్సులో తలంచుచుంటిని. అప్పుడా మహానుభావులగు కృష్ణార్జునులు యిద్దరును నన్ను సన్మానించి నా కుపయోగించు నాహారమును నాకు తెచ్చియిచ్చిరి. వారు కట్టదగిన వస్త్రములను నాకు యిచ్చిరి. వారు ధరించదగిన భూషణములను నాకు ధరింపజేసి నన్ను గౌరవించిరి. అంతట నేను వారికడకు వెళ్ళిన సంధికార్య విషయములను కృష్ణార్జునులకు విన్నవించితిని. అప్పుడర్జునుడు పెద్దమనుష్యులతో నామాటకు ప్రత్యుత్తరము చెప్పుటకు ప్రయత్నించెను. ఆ సమయమున కృష్ణుడు అర్జునుని వారించి నాతో నిట్లనెను.

## సంజయుడు ధృతరాష్ట్రునకు కృష్ణుడు చెప్పిన మాట తెలిగించుట

సంజయా! నేను చెప్పుమాటలను వినుము. ధృతరాష్ట్రుడు నిండుసభయందున్నప్పుడు అతని కుమారులగు దుర్యోధనాదులును, ద్రోణాచార్య కృపాచార్య భీష్మాదులును అందరును వినుచుండగా ధృతరాష్ట్రునితో యిట్లని చెప్పుము. ధృతరాష్ట్రమహారాజా! ధర్మరాజు కోపించినందున అతనికోపము నీటిలోబుట్టిన నిప్పువలె నారని యుండును. ఆ ధర్మరాజుయొక్క కోపాగ్నిహోత్రమును చల్లార్చుట మీకు సాధ్యముకాదు గాన మీరు నేర్పువలన చేయదగిన కార్యములను చెప్పెదను వినుము. ఇప్పుడు మీకు గలిగియున్న సకలధనములను నిశ్శేషముగా సద్బ్రాహ్మణులకు దానములను చేయుడు. మీయందు గల సకల బంధుమిత్ర ఆశ్రిత జనులను రక్షించి వారివారికి తగిన ధనములచేత సన్మానించి సంతోషమును గలిగింపుడు. మీ మనస్సు

లకు సంతోషము గలుగునట్లు మీ యిష్టప్రకారము యింద్రియ సౌఖ్యములను అనుభవింపుడు. ప్రీతిపూర్వకముగా ఆయావిధముల చేత మీ భార్యాపుత్రులను గౌరవించి సంతోషము గలిగింపుడు. మీలో యెవ్వరెవ్వరి చిత్తములకు యే యే కోరికలున్నవో ఆయా కోరికలప్రకారము విషయ సుఖముల ననుభవించి మీ యిష్టప్రకారముగా విహరింపుడు. ఇకను ఆలస్యము చేయక మీ ప్రాణములను మీ అరచేతులయం దుంచుకొని యుద్ధమునకు నడచిరండు. అని యిట్లు ధృతరాష్ట్రునితో అందరు వినుచుండగా జెప్పుమని కృష్ణుడు సంజయునితో జెప్పెను.

సంజయా! ధృతరాష్ట్రునకు యింతవరకు చెప్పవలసిన పని యేమియని యంటివేని చెప్పెదను వినుము. సంజయా! పాండు రాజుయొక్క కోడలగు ద్రౌపది పూర్వము ఆ కౌరవ సభయందు కౌరవులవలన మిక్కిలి అవమానమును బొందెను. ఇదివరకు యేకాలమందును యెవ్వరును పొందలేని అవమానమును ద్రౌపది పొంది మహాదుఃఖము గలదై హా కృష్ణా! ద్వారకావాసా! నన్ను కాపాడుము. కాపాడుమని దూరమం దుండెడి నన్ను తలచి యేడ్చెను. తీరరాని అప్పువలె ఆ ద్రౌపది దుఃఖము నా మనస్సునకు మిక్కిలి భారమై నా మనస్సునందు సర్వదా చలింపకున్నది. అందువలన ధృతరాష్ట్రునకు యీ మాటలను చెప్పవలసి వచ్చెను. సంజయా! ఇటువంటి నేను అర్జునునకు సారథ్యము చేసెదను. అర్జునుడు సర్వలోక ప్రసిద్ధమైన గాండీవమును యెక్కుపెట్టి రెండు అంబుల పొదులయందుగల అక్షయ దివ్యబాణములను ప్రయోగించును. అటువంటి అర్జునుడు నేడో రేపో మీ మీదకు యుద్ధమునకువచ్చును. గనుక మీరు తప్పించుకొని యెక్కడికిని పోజాలరు. అని కృష్ణదేవుడు యీవిధముగా నీతో చెప్పుమని నాతో చెప్పెను అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను.

ధృతరాష్ట్రమహారాజా! కృష్ణుడిప్పుడు చెప్పినసంగతులు [illegible] వారి ప్రయత్నమును దలచి నేను భయపడితిని. నా పుత్రుండైన దుర్యోధనుడు ఆ పాండవులకు రాజ్యభాగమును పంచి యియ్యని విషయమును తలచి నేను మిక్కిలి భయపడితిని. దుర్యోధనుడు కృష్ణార్జునుల మహిమలను యెఱుగడు. భీష్మ ద్రోణుల యొక్క [illegible] జేసికొని కర్ణుని గర్వము తనను గెలిపించునని దుర్యోధనుడు పాండవులతో కలహము పెట్టుకొనెను. అని సంజయుండు ధృతరాష్ట్రునితో చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను. సంజయుడా! అర్జునుడు నీతో యేమని చెప్పెనో చెప్పుము. అని ధృతరాష్ట్రు డడుగగా సంజయు డిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! కృష్ణుడు నాతో చెప్పిన మాటలను అర్జునుడు విని కోపము గలవాడై [illegible] కోపముచేత యెఱ్ఱని తామరలవంటి నేత్రములు గలవాడై యిట్లు అనెను.

సంజయా? దుర్యోధనుడును, అతనికి సహాయులైనవారు [illegible] సకల రాజ సమూహములును వినుచుండగా నామాటలను నీవు ధృతరాష్ట్రరాజుతో యిట్లని చెప్పుము. ధర్మ[illegible] రాజ్యభాగమును యియ్యనని దుర్యోధను డనుచుండగా దుర్యోధనుడు యియ్యనియెడల అది వానికు మేలేమియుగానేరదు. దుర్యోధను డిది వరకు మాకు కలిగించిన కష్టములకు [illegible] గలిగియున్నది. దుర్యోధనుడు రాజ్యభాగమును ధర్మరాజునకు యియ్యనియెడల యిదివరకు తాను చేసిన చెడుకార్యములకు యిప్పుడు మెరుగు పెట్టినట్లు అగును.

అందుకు నేనును భీముడును సంతోషింతుము. యేలయనగా దుర్యోధనుడు యుద్ధము చేయుటకాసించెనేని ధర్మాత్ముడైన ధర్మరాజుయొక్క కార్యము సఫలముగా సిద్ధించినట్లయినను. దుర్యో

ధనుడు యుద్ధభూమియందు బాణములపాన్పుమీద బడనియెడల ధర్మరాజు వనమందు భూమిమీద పండుకొనిన ఆయాసము నశింపజాలదు. ధర్మరాజు సత్యమార్గమును అవలంబించి కష్టములను సహించి కోపమును అణగించుకొనెను. కార్చిచ్చు అడవిని దహించునట్లుగా ధర్మరాజు కోపాగ్ని కౌరవసైన్యములను చంపినయెడల దుర్యోధనాదులు ధర్మరాజును లక్ష్యముచేయగలరు. అంతవరకు ధర్మరాజును లక్ష్యపెట్టరు. భీముడు ప్రళయకాల యమధర్మరాజువలె మండిపడుచు గదాయుధమును త్రిప్పుచు కౌరవులయేనుగుల గుంపులను నుగ్గగునట్లు చేయును. నానావిధరథ సమూహములను చదియగొట్టును. గుఱ్ఱములదండులను పొడిపొడియగునట్లు చేయును. ఈ ప్రకారముగా భీముడు విజృంభించి తన గదాయుధముచేత కౌరవ సైన్యములను చంపినప్పుడు దుర్యోధనుడు ధర్మరాజునకు రాజ్యభాగమును పంచియిచ్చును. నకులుడు పెద్దపులివలె చెలరేగి ఆకలిచేత లేళ్ళగుంపులమీదికి దూకు పెద్దపులివలె కౌరవసైన్యములను చెదరగొట్టును. మహావాయువు మేఘములమీద భయంకరముగా వ్రాలి విసరినట్లు సహదేవుడు శత్రుసైన్యములను చెదరగొట్టును. జీవులమీదికిపోయి కసిమసగిన మారివలె సాత్యకి కౌరవసైన్యములను పడగొట్టును. ప్రళయకాలమందు ఆకలిగల రుద్రుడు జగత్తులను సంహరించినట్లు అభిమన్యుడు కౌరవసైన్యముల నన్నిటిని చంపును. ఇట్లు నకులసహదేవ సాత్యకి అభిమన్యులచేత కౌరవసైన్యములు చచ్చినప్పుడు కౌరవులుచూచి ధర్మరాజుతో సంధి చేయుదురు. ద్రౌపదీపుత్రు లైదుగురును సింహపుపిల్లలు యేనుగుల గుంపుమీదికి దూకినట్లు శత్రువుల సైన్యములమీదకు దూకి నెత్తుటినీటియందు తేల్తురు. అప్పుడు మీ దుర్యోధనుడు కోపమును మానును. విరాట ద్రుపదరాజులును వారి బంధుమిత్రభటులును మహాఘోరమైన

పంచియిచ్చాను. భగవంతుడైన మాశ్రీకృష్ణదేవుడు బాల్యమందే విలాసముగా మహారాక్షసులను చంపెను. సర్వదా మూడులోకములందును భక్తియుక్తముగా కృష్ణదేవుని పూజించుచుందురు. అటువంటి శౌర్యాలంకారుడైన కృష్ణుని దుర్యోధనుడు లక్ష్యముచేయలేదు. ఆకృష్ణునే లక్ష్యముచేయనప్పుడు మమ్ములను దుర్యోధనుడు యెందుకు గ్రహించును? దుర్యోధనునియందు దోషము కనుపించుటలేదు. సంజయా! మేము భీష్మ ద్రోణ కృపాచార్యులకు నమస్కరించి మారాజ్యభాగము నిమిత్తమై కౌరవులను యెదిరించి యుద్ధముచేయుదుము. ఆకౌరవులనిమిత్తమై యెవ్వరువచ్చి మాతో యుద్ధము చేసినను వారిశస్త్రాస్త్రములన్నియు ధర్మముచేత చెడిపోవునని మేము తలచుచున్నాము. సంజయా! పన్నెండు సంవత్సరముల పర్యంతము వనవాసముచేసి బహుకష్టములనుపొందితిమి. పదమూడవసంవత్సరమందు జనులుగల ప్రదేశమందుండి అజ్ఞాతవాస ఆయాసమును అనుభవించితిమి. అట్లు అనుభవించివచ్చి మాతండ్రియొక్క రాజ్యభాగమునిమిత్తమై మేము కౌరవులతో యుద్ధమునుచేసెదము. సకల దేవ దేవేంద్రరాక్షసుల నందరిని సహాయముగా తీసుకొనివచ్చియైనను కౌరవులు మమ్ములను గెలువజాలరు. కౌరవులే మమ్ములను గెలిచెడి పక్షమందు ధర్మముకంటె అధర్మము బలవంతమాయెనని తలంచవలయును. ఇంతమాత్రముగాని మేముచేయబూను యుద్ధము మాకుకీడు కలిగించునదికాదు. మేము భగవంతుడైన కృష్ణునిముందుపెట్టుకొని యుద్ధమునకు నడుతుము. కనుక యీయుద్ధమందు మాకువిజయము సిద్ధమేయగును. సర్వవిధములచేతను మేము కర్ణసహితులైన దుర్యోధనాదులందరిని యుద్ధమందుచంపి మేముభూమిని తీసికొందుము. ఇది తప్పదు. నాగాండీవము తనంతటతానే గుండ్రముగా తిరుగుచున్నది. నాదివ్యబాణములు తమంతటతామే అంబులపొదులలోనుండి వెలుప

యుద్ధమందు ప్రాణములను దాచక క్రూరాస్త్రములచేత అతి ఘోర
ముగా కౌరవుల నెదిరించి యుద్ధముచేయుచుండు. యుద్ధము చేయు
నప్పుడు కౌరవులు ప్రక్కకు తప్పుకొని మాటలచేత కౌరవులు వంగరు.
మహాశిఖండి ధనుర్ధరుడై రథముమీద యెక్కి భీష్మునిమీదకు
పోవును. మీవారెంతమంది అడ్డుపడినను శిఖండివారినంక జూచి
తన పగానికను ఫలింపజేసికొనునిమిత్తమై రథమును భీష్మునిమీదికి
పరుగెత్తించినప్పుడు మీ కౌరవులు మాకు సగపాలు భూమిని పంచి
యిత్తురు. అంతవరకు పంచియివ్వరు. మహాధృష్టద్యుమ్నుడు మెరుపుల
దండమువంటి ధనుస్సును ధరించి ద్రోణునిమీదికి దుమికినప్పుడు మా
సైనికులకు యుద్ధమహోత్సాహము పెట్టింపు కాగలదు. అటువంటి
ధృష్టద్యుమ్నుని ఘోరయుద్ధమందు మీరు జూచినప్పుడు యుద్ధము
మానుదురేగాని అంతవరకు యుద్ధమును మానరు. నా గాండీవము
యొక్క గుణధ్వని వెంటవెంటనే మ్రోగుచుండగా బాణపరంపరలు
ఆకాశమును కప్పును. శత్రువుల బాణములు నా క్రూర బాణ పరం
పరలచేత నరుకబడి రాలును. నా బాణములచేత శత్రుసైన్యముల
యందుండు మదపుటేనుగులును గుర్రములును అవయవ భేదము
యెరుగకుండునట్లు జర్ఝరితముగా నరుకబడును. అప్పుడు రక్తప్రవా
హములచేతను మెదడులచేతను, ఎముకలచేతను, నరములచేతను,
యుద్ధభూమి అతిభయంకరముగా నుండును అప్పుడు నా కపిధ్వజ
మతి భయంకరముగా ప్రకాశించును. నా తెల్లని దివ్యమైన గుర్ర
ములు ప్రకాశించుచుండును. నా రథముయొక్క నొగలుమీద భగ
వంతుడైన శ్రీకృష్ణదేవుడు కూర్చుండును. నా దేవదత్త శంఖము
మహాభయంకరముగా మ్రోగును.

అటువంటి నారథము యుద్ధభూమికి వచ్చినపుడు దుర్యోధ
నుడుచూచి మాకురాజ్యభాగమును పంచియిచ్చునేగాని అంతవరకు

పంచియివ్వాడు. భగవంతుడైన మాకృష్ణదేవుడు బాల్యమందే విలాసముగా మహారాక్షసులను చంపెను. సర్వదా మూడులోకములందును భక్తియుక్తముగా కృష్ణదేవుని పూజించుచుందురు. అటువంటి శౌర్యాలంకారుడైన కృష్ణుని దుర్యోధనుడు లక్ష్యముచేయలేదు. ఆకృష్ణునే లక్ష్యముచేయనప్పుడు మమ్ములను దుర్యోధనుడు యెందుకు గ్రహించును? దుర్యోధనునియందు దోషము కనుపించుటలేదు. సంజయా! మేము భీష్మ ద్రోణ కృపాచార్యులకు నమస్కరించి మారాజ్యభాగము నిమిత్తమై కౌరవులను యెదిరించి యుద్ధముచేయుదుము. ఆకౌరవులనిమిత్తమై యెవ్వరువూనివచ్చి మాతో యుద్ధము చేసినను వారిశస్త్రాస్త్రములన్నియు ధర్మముచేత చెడిపోవునని మేము తలచుచున్నాము. సంజయా! పన్నెండు సంవత్సరముల పర్యంతము వనవాసముచేసి బహుకష్టములనుపొందితిమి. పదమూడవసంవత్సరమందు జనులుగల ప్రదేశమందుండి అజ్ఞాతవాస ఆయాసమును అనుభవించితిమి. అట్లు అనుభవించివచ్చి మాతండ్రియొక్క రాజ్యభాగమునిమిత్తమై మేము కౌరవులతో యుద్ధమునుచేసెదము. సకల దేవ దేవేంద్రరాక్షసుల నందరిని సహాయముగా తీసుకొనివచ్చియైనను కౌరవులు మమ్ములను గెలువజాలరు. కౌరవులే మమ్ములను గెలిచెడి పక్షమందు ధర్మముకంటె అధర్మము బలవంతమాయెనని తలంచవలయును. ఇంతమాత్రముగాని మేముచేయబూను యుద్ధము మాకుకీడు కలిగించునదికాదు. మేము భగవంతుడైన కృష్ణునిముందుపెట్టుకొని యుద్ధమునకు నడుతుము. కనుక యీయుద్ధమందు మాకువిజయము సిద్ధమేయగును. సర్వవిధములచేతను మేము కర్ణసహితులైన దుర్యోధనాదులందరిని యుద్ధమందుచంపి మేముభూమిని తీసికొందుము. ఇది తప్పదు. నాగాండీవము తనంతటతానే గుండ్రముగా తిరుగుచున్నది. నాదివ్యబాణములు తమంతటతామే అంబులపొదులలోనుండి వెలుప

టికి వచ్చుచున్నవి. మరియు తోలులోనుండి యెగసివచ్చు మహాసర్పమువలె నాకత్తి తనంతటతానే ఒరలోనుండి వెలుపటికి యెగయుచున్నది. ఈనిమిత్తముువలన మాకు ఆకౌరవులతో అవశ్యముగా యుద్ధము సంభవించును.

మాపాశుపతాది దివ్యాస్త్రముల చేతకౌరవపక్షపు ప్రజలనందరినిచంపి శాంతమును పొందెదను. సంజయా! మాటలనన్నిటిని కౌరవ సభయందు అందరికిని తెలియజెప్పవలయును. ఈ మాటలనన్నిటిని కౌరవ సభయందు కురువృద్ధుడగు బాహ్లికుడు వినవలయును. పితామహుడగు భీష్ముడు వినవలయును. గురుడగు ద్రోణాచార్యుడు వినవలయును. మాకు శిక్షకుడైన కృపాచార్యుడు వినవలయును. మాగురుపుత్రులగు అశ్వత్థామ వినవలయును. మహాబుద్ధిమంతుడగు విదురుడు వినవలయును. ధర్మాత్ముడైన శల్యుడు వినవలయును. ఈ మాటలను ఆ కౌరవ సభయందుండు వారందరును విని యెట్లు నిశ్చయించి చెప్పెదరో అట్లు చేసెదము. ఆ దుర్యోధనాది కౌరవులు ఆయుస్సు గలవారగుదురు గాక. అని అర్జునుడు నాతో చెప్పెనని సంజయుడు ధృతరాష్ట్రునితో అందరును వినునట్లుగా చెప్పెను. ఆ మాటల నన్నిటిని భీష్ముడు విని అందరు వినునట్లుగా దుర్యోధనునితో యిట్లనెను.

దుర్యోధనా! పూర్వము బ్రహ్మదేవుడు మహాసభ చేసియుండెను. ఆ మహాసభయందు దేవేంద్రాది సకల దేవతలును దివ్యమునిసంఘములును, మహాముని సంఘములును చేరియుండిరి. ఆ బ్రహ్మసభయందు యిద్దరు దివ్యమునులు బ్రహ్మదేవుని వారసికొని నిర్లక్ష్యముగా పోయిరి. వారిద్దరి తేజో విశేషముల చూడజాలక దేవేంద్రాదుల నేత్రము లన్నియు నిశ్చేష్టములుగా నుండెను. అప్పుడు బృహస్పతి బ్రహ్మదేవునితో యిట్లనెను.

మహాత్మా! బ్రహ్మదేవా! యీప్రకారము మీరు సభ చేసి వుండగా యీ యిద్దరు మునులును లక్ష్యముచేయని విధముగా వెళ్ళుచున్నారు. ఈయిద్దరుమునులెవ్వరో చెప్పుము అని బృహస్పతి బ్రహ్మదేవుని అడుగగా బ్రహ్మదేవుడు ప్రీతిపూర్వకము యిట్లనెను. బృహస్పతీ! యీ యిద్దరును నరనారాయణులను దివ్యమునులు. ఈ మహాత్ములగు నరనారాయణు లిద్దరును మహాతపస్సంపన్నులై మహాబల శౌర్య గర్వవంతులై యున్నారు. మహాత్ములగు నరనారాయణు లిద్దరును అన్ని యుగములయందును లోకములకు మేలు చేయు నిమిత్తము ప్రవర్తించుచుందురు. ఈ నరనారాయణ మును లిద్దరును దేవతలకుమేలుచేయుచు రాక్షసులను నశింపజేయుచుందురు. అధర్మయుద్ధము గలిగిన స్థలమందు ధర్మపరులగు జనులను యీ నరనారాయణులు గెలిపింతురు. బృహస్పతీ! పూర్వము దేవ రాక్షసులకు యుద్ధముజరిగినప్పుడు దేవేంద్రుడు వెళ్ళి యీ నరనారా యణులను పూజించి తనకు సహాయము కోరెను. అప్పుడీ నరనారా యణు లిద్దరును దేవేంద్రునకు సహాయముగా వచ్చి పౌలోమి కాల కేయులను అనేక రాక్షసులను జంపి దేవేంద్రునకు విజయము కలి గించిరి. అది మొదలుకొని అందరును యీ నరనారాయణులను యెరిగి యున్నారు. ఈ నరనారాణుల తేజస్సు ఒకటేయగును. ఆ ఒక్క తేజస్సే రెండు దేహములయందు ప్రకాశింపు చున్నది. అని బ్రహ్మదేవుడు ఆ దివ్యసభయందు బృహస్పతితో చెప్పెను. అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పి మరల యిట్లనెను.

దుర్యోధనా! మహాత్ములైన నరనారాయణమునులలో నరు డను ముని యిప్పుడు అర్జునుడై పుట్టెను. నారాయణుడను ముని యిప్పుడు కృష్ణుడై పుట్టెను. అర్జున కృష్ణులే నరనారాయణులు. అర్జునుడు సముద్ర తీరమందుగల హిరణ్య పురము నాక్రమించి

నివాత కవచ కాలకేయులను అరువదివేల మంది రాక్షసులను చంపి దేవేంద్రునకు సంతోషము గలిగించెను. కృష్ణుడు కంస నరకాసురులు మొదలగు అనేక దుర్మార్గులను చంపెను. ఆ కృష్ణుని పరాక్రమము లోక ప్రసిద్ధిని చెందియున్నది. గనుక వాస్తవమైన విషయమును చెప్పెదను వినుము. దుర్యోధనా! కృష్ణార్జునులిద్దరును ఒక పక్షమందుండు యుద్ధమునకు వచ్చిన యెడల ఆరుద్రుడైనను కృష్ణార్జునులను యెదిరించి యుద్ధము జేయజాలడు. మన మనగా యెంత వారము? ఆ యర్జున కృష్ణులిద్దరును రథిక సారథులై ఒక రథము మీద కూర్చుండి అతిఘోరముగా ప్రకాశించుచు యుద్ధమునకు వచ్చినప్పుడు పిమ్మట వారిబలపరాక్రమములను నీవు యెరుగగలవు. అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పుచు యిట్లనెను. దుర్యోధనా! నేను చెప్పిన మాటలకు నీవు మనస్సునందు కొంచెమైనను బెదరవు. చెడు కార్యమును చేయుటయందు సంతోషము గలిగియుందువు. కౌరవులకు కాలము పూర్ణమాయెనేమో తెలియదు. నీవంటి గర్వవంతుని నేను యేమందును? నీకు మేలుకలిగించు నామాటలను యిప్పుడు నీవు వినినయెడల అప్పుడు యుద్ధమందు వారు చచ్చిరి, వీరు చచ్చిరి, అను మాటలను విందువుగాక! అట్టి చెడుమాటలను వినుటకు శకుని కర్ణ దుశ్శాసనులు ముగ్గురును సమ్మతింపగలరు. దుష్ట కష్ట నీచ బుద్ధులగు యీ శకుని కర్ణదుశ్శాసనులు ముగ్గురును చెప్పెడి చెడు బుద్ధులనే విందువుగాని మరి యొకరి మాటలను వినవు. అందులకు యేమి చేయవచ్చును? అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పెను. ఆ మాటలను కర్ణుడు విని కోపించుకొని భీష్మునితో యిట్లనెను. భీష్మా! నీవు యిట్లు చెప్పరాదు. నేనేమిచేసితినో చెప్పుము. రాజు యొక్క సొమ్మును తినుచు రాజును సేవింపుచు బల శౌర్య మాత్సర్యములను చెప్పుట విరుద్ధముగాదు. గనుక నేను ధృతరాష్ట్ర మహా

రాజునకును అతని పుత్రులకును అతని మనుమలకును మేలుకలుగు నట్లుగా నేను వర్తింతును. నా నడవడిక మంచిది గాని యెడల దుర్యోధన రాజు నన్ను యింతటి మనుష్యునిగా యెందుకు చేయును? ఈ నిండుసభలో నీ నోటియందు యిట్టి తెలివితేటవనిమాటలు రాగూడదు.

## భీష్ముడు కర్ణుని దుర్ణయము ధృతరాష్ట్రునితో చెప్పుట

అని కర్ణుడు భీష్మునితో కోపముతో చెప్పెను. ఆ మాటలను భీష్ముడు విని ధృతరాష్ట్రునితో యిట్లనెను ధృతరాష్ట్రా! పాండవు లలో ఒక చిన్న వానితో నైనను యీ కర్ణుడు సమానుడు కాడు. అటువంటి యీ కర్ణుడు సిగ్గులేక పాండవులను గెలుతునని చెప్పు చుండును. కర్ణుని గడాయి మాటలను శకుని దుశ్శాసన దుర్యోధనా దులు ప్రీతిపూర్వకముగా వినుచు కర్ణునితో జేరియుందురు. ఆ పాండవు లను యీ కర్ణుని బలము జయించునని నమ్మి మహా గుణవంతులగు పాండవులను దుర్యోధనుడు అవమానించెను. అయ్యో! దుర్యో ధనుడు యీ కర్ణుని నమ్మి మహాత్ములగు పాండవులతో విరోధము కలిగించుకొనెను. పాండవులలో ఒక్కొక్కడు అనేక విధ యుద్ధము లందు జయములను పొందిరి. ఆ పాండవు లెక్కడ? వీ డెక్కడ? మరియు వుత్తర గోగ్రహణకాలమందు అర్జునుడు యీ కర్ణుని యొక్క తమ్ముని జంపి పరాక్రమించెను. కర్ణుడు దగ్గరయుండియు అర్జునుని మీదికి యుద్ధమునకు పోలేదు. ఆ గోవులను అర్జునుడు మరలించునప్పుడు యీ కర్ణుడక్కడనే యుండి వూరకుండెను. పూర్వము ఘోషయాత్రకు పోయినప్పుడు గంధర్వులచేత నీకొడుకగు దుర్యోధనుడు అపజయమును పొంది అవమానింపబడెను. పాండ వులు రక్షించిరి. ఈ దుర్మార్గుడైన కర్ణుడు తనయిష్టప్రకారము ప్రేలు చుండును. నీవును యీ కర్ణుని మాటలను ప్రీతిపూర్వకముగా విను చుందువు. ఇదియంతయు మేలేయగును. అని భీష్ముడు ధృతరాష్ట్రు

నితో చెప్పెను. ఆ మాటలను ద్రోణుడు విని ధృతరాష్ట్రునితో యిట్లనెను.

ధృతరాష్ట్ర మహారాజా! యీ భీష్ముడు కౌరవ వంశమున కంతకు ముఖ్యుడు. ఈ భీష్ముని మాటలు మిక్కిలి మేలు కలిగించునవి. ధర్మరాజుతో యుద్ధము చేయరాదు. సంధిచేయుట మేలు. అర్జునుడు సంజయునితో చెప్పినమాటల ప్రకారము చేయుటకు సమర్థుడు అర్జును డిదివరకు చేసిన ఖాండవదహనాది కార్యములన్నియు మీకు తెలిసేయున్నవి. లోకమందు యితరులనేకులు ధనుర్బాణములను ధరియించిన వారు కలరు. అనేకులు మొనగాండ్రై యుద్ధములయందు జయమును పొందిన వారుకలరు. అట్టి వారందరును కొన్ని కొన్ని సమయములయందు యుద్ధములయందు అపజయములను పొందిరి. అందుచేత యెవ్వరికిని విజయుడనెడి పేరు గలుగలేదు. అర్జునుడు ప్రతియుద్ధమందును విజయమును పొందుచున్నందున విజయుడను పేరుకలిగెను. అర్జునునితో సమాన రథికుడు మనలో గాక లోకమందెక్కడను కనబడలేదు. ఇది నిశ్చయమైన విషయము. ఇందుల కనుమానింప బనిలేదు. అర్జునుని యెదిరించి యుద్ధముచేయుట కెవ్వరికిని శక్యము కాదు. అని ద్రోణాచార్యుడు ధృతరాష్ట్రునితో చెప్పి మరల పరమహిత వాక్యములను చెప్పెను. ఎంత చెప్పినను ధృతరాష్ట్రుడు భీష్మ ద్రోణుల మాటలయందు లక్ష్యముంచక వారికి తగిన ప్రత్యుత్తరమును చెప్పలేదు. వారలతో అనుకూలముగా సంభాషింపలేదు. అంతట ధృతరాష్ట్రుడు మరల పాండవులు చెప్పిన వాక్యములను అడుగుటకు సంజయుని దిక్కునకు మళ్ళెను. అప్పుడు కౌరవ పక్షపు వీరులందరును తమ ప్రాణములయందు ఆశలను విడిచి యుండిరి. అంతట ధృతరాష్ట్రుడు సంజయునితో యిట్లనెను.

సంజయా! యిక్కడ మన సైన్యములన్నియు మిక్కిలి అధికముగా చేరియున్నవని ధర్మరాజు వినెను. ఇక్కడ మనవారి తలంపులన్నియు ధర్మరాజు యెరిగియుండును. మన యస్త్రప్రయత్న సైన్యములన్నిటిని ధర్మరాజు విని యెవ్వరినితీసికొని కౌరవులమీదికి యుద్ధమునకు వచ్చునో చెప్పుము. అని ధృతరాష్ట్రుడు సంజయుని అడిగెను. ఆమాటలను సంజయుడు విని వేడిగా నిట్టూర్పువిడిచి నిశ్చేష్టితుడై మూర్ఛపొందినట్లుండెను. సంజయుడు స్మృతిలేనివాడై యుండి కొంతసేపటికి స్వస్థచిత్తుడై యిట్లనితలంచెను. అయ్యో! యీధృతరాష్ట్రరాజు యింత తెలివిలేనివాడుగదా! ధర్మరాజుయెవరి సహాయమువలన యుద్ధమునకు వచ్చునని నన్నడుగుచున్నాడు. ఇతడెంత యెరుగనివాడగును? ఎంతచెప్పినను యీధృతరాష్ట్రుడు తెలిసికొనజాలడు. ఇతనిపద్ధతి ఇటువంటిదై యుండగా ఇతని కొడుకులగు దుర్యోధనాదుల పద్ధతిని వేరుగాయెంచవలసిన పనిలేదు. ఇక నేనేమని చెప్పుదును? అయినను యీధృరాష్ట్రరాజు నన్నడిగినమాటకు తగిన ప్రత్యుత్తరములు చెప్పవలయును. అని సంజయుడు తనమనస్సులోతలచి ధృతరాష్ట్రునితో యిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! ఆధర్మరాజు సంధిచేయవలెనని సంధినే మనస్సుయందు కోరుచుండును. మీరు రాజ్యభాగమును పంచి యిచ్చుపక్షమందు ధర్మరాజు యుద్ధమునకు ప్రయత్నింపడు మీరురాజ్యభాగమును ధర్మరాజునకు పంచియివ్వనియెడల ధర్మరాజు మీమీదకు యుద్ధమునకువచ్చును. ధర్మరాజు తనబలముచేత భూమిని తీసికొనదలచినయెడల మీబలమునంతయు కొంచెమైనను లక్ష్యముచేయడు. ధర్మరాజు యెవరిని తీసికొని యుద్ధమునకువచ్చునని అడిగితివి. నీవు యెరుగనివారు ఆపాండవులదగ్గర లేరు. అయినను చెప్పెదను చిత్తగింపుము.

ధృతరాష్ట్రమహారాజా! ధర్మరాజుయొక్క తమ్ముడుభీముడు బకాసుర జటాసుర హిడింబాసురులను చంపెను. కీచకవంశమును నిర్మూలనముచేసెను. యుద్ధమునందు మహోత్సాహము గలవాడు పదివేల మదపుటేనుగులకుగల బలమును శక్తినిగలవాడు శత్రువుల వ్యూహములను దహించువాడు. అటువంటి భీముని తీసికొని ధర్మ రాజు యుద్ధమునకు వచ్చును. ఆకాశమును అందియున్నవాని పొడు గెంతయని యడిగినట్లుగా రుద్రదేవునితో ద్వంద్వయుద్ధము చేసిన అర్జునుని బుజాబలమును నీవు లెక్కింపుము అటువంటి అర్జునుని తీసికొని ధర్మరాజు యుద్ధమునకువచ్చును. అర్జునుడుండగా ధర్మరాజు యుద్ధమునకువచ్చు విషయమై భయపడుడు. ధర్మరాజు యుద్ధమునకు వచ్చినప్పుడు మీ సైన్యములు పారిపోకమాత్రము నిలిచియుండ వలయును. ధర్మరాజు నకులసహదేవులను తీసికొని యుద్ధమునకు వచ్చును. ఆపద్ధతిని జూడగా సింహములను పట్టుకొని వేటాడిన చందముగానుండును. ధృతరాష్ట్రమహారాజా! ద్రౌపదీపుత్రులును అభిమన్యుడును ఉక్కుతునకలవంటివారు. ఆకుమారులనందరిని తీసి కొని ధర్మరాజు మీమీదకు యుద్ధమునకు వచ్చును. వీరిని తీసికొని ధర్మరాజు యుద్ధమునకువచ్చి గెలుచునని నీకు యెందుకు తోచలేదో తెలియలేదు. అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. మహా రాజా! కృష్ణుని తమ్ముడగు సాత్యకియు ద్రౌపదీసహోదరులగు ధృష్ట ద్యుమ్నుడు మొదలగువారునుసామాన్యులుగారు. గ్రీష్మకాలమందు గల సూర్యునివంటివారు. ద్రుపదరాజు మహాశౌర్యవంతుడు. విరాట రాజు మహాపరాక్రమవంతుడు. విరాటుని తమ్ములందరును మహా ధైర్యవంతులు. విరాటుని కొడుకులందరును భయంకర తేజోవంతులు. అన్నదమ్ములైన కేకయరాజులు అయిదుగురును మహాప్రతాప వంతులు. మహాభుజాబలవంతులు. జరాసంధుని కొడుకగు మాగధ

సహదేవుడును, జయత్సేనరాజును, శిశుపాలుని కొడుకులగు ధృష్టకేతుడు వృషభుడు మొదలగువారును, చేకితానుడును శైబ్యుడును, వీరందరును కూడ మహాబలపరాక్రమ శౌర్య ధైర్యసాహసపరులు రాజా! యీ చెప్పబడిన వారందరును పాండవులు పొందినకష్టములకు మీయందు మిక్కిలి కోపముగలవారై పగతీర్చుటకు పూనికగలిగి యున్నారు. ఆ పాండవులపక్షమందు ఒక్కడైనను బలహీనుడు లేడు. భీముని కుమారుడగు ఘటోత్కచుడు తన మాయాబలముచేత మన సైన్యముల నన్నిటిని చెదరగొట్టును తూర్పుదిక్కుయందుండు రాజులును ఉత్తరదిక్కుయందుండు రాజులును నానావిధసైన్యములతో వచ్చి పాండవపక్షమును చేరియున్నారు. పాండవపక్షపురాజు లందరును అగ్నినైనను పిడికిలిచేతపట్టుకొందుమని చెప్పుచున్నారు. అదిగాక కృష్ణదేవుడు సకలలోకములను తన అరచేతిలోనికి తెచ్చి నిలుపుటకు సమర్థుడగును. అటువంటి మహాధైర్యనిధియగు కృష్ణదేవుడు ధర్మరాజునకు పెద్ద అండయైయున్నాడు. సర్వేశ్వరుడే తనవాడై యున్నప్పుడు ధర్మరాజు యుద్ధమునకు రాకమానడు. అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. ఆ మాటలను ధృతరాష్ట్రుడు విని సంజయునితో యిట్లనెను.

## ధృతరాష్ట్రుడు భీముని పరాక్రమము దలచి దుఃఖించుట

సంజయా! నీవు చెప్పినట్లు పాండవపక్షమందుండు రథికులందరును మహాబలవంతులు అయినను వారందరొక యెత్తగుదురు. భీముడొక్కడే ఒకయెత్తగును. బలప్రమాణములను యోచించి చూడగా పాండవపక్షమందుగల సకలరథికుల బలపరాక్రమములును ఒక భీమునికే కలిగియున్నవి. సంజయా! భీముని దలచినయెడలనామనస్సునకు భయముకలిగి బెదరుచుండును. ఆభీముని దలచిన కాలమందు

రాత్రివేళ నాకు నిద్రపట్టదు. భీముని యెదిరించి యుద్ధముచేయుటకు సమర్థుడు మనసైన్యములలోలేడు. భీముడు కోపించుకొనినయెడల యమధర్మరాజు దండమువంటి గదాయుధమును తీసికొని కౌరవుల మీదికి రాకమానడు. భీముడు చిన్నవాడైనప్పుడు. నేను చెప్పినట్లు వినలేదు. మనకౌరవులు ఆపాండవులతో విరోధము వహించి యుద్ధమునకు ప్రవేశింపుచున్నారు. మనవారు ఆ భీమునిచేత బాల్యమందు పీడింపబడిరి. అట్లు పీడింపబడియు యుద్ధమును మానలేదు. భీముడు బాల్యమందు మన దుర్యోధనాదులను నిర్లక్ష్యముచేసి పీడించినందు ననే యీకలహము కలిగెను. ఈకలహమునకు భీముడే కారణము. సకలదేవరాక్షసులైనను భీముని యుద్ధమందు యెదిరింపజాలరు. మల్ల యుద్ధముచేత నిమిషమాత్రములో భీముడు జరాసంధుని చంపెను. గనుక యితరులు భీమునియెదుట నిలువజాలరు. భీముడు కోపముచేత కనుబొమలు ముడుచుకొని రౌద్రరసముగలవాడై శౌర్యముచేత విజృంభించి నాకు యెదురెవ్వరని తలచుచు కౌరవసైన్యములమీద బడును. భీమునిజూచి కౌరవసైన్యములు భయపడి ధైర్యమునువిడిచి అంతటంతట పారిపోవును. భీముడు గదాఖడ్గాది ఆయుధములను తీసి కొనకవచ్చినను భీముని యెదిరించి యెవ్వరును మల్లయుద్ధమును చేయజాలరు. భీముడు ప్రళయకాలసముద్రునివలె పొంగి మిక్కిలి భయంకరముగా యుద్ధమునకు వచ్చును. అటువంటి భీముడను మహా సముద్రమును దాటుటకైనను యీదుటకైనను నా కొడుకులకు సాధ్యముగాదు. నా కొడుకులు విధివశమువలన దురహంకారులై పరులను తమ్మునుగూడ యెరుగక కలహమునకు పూనియున్నారు. కార్చిచ్చునకు గాలిసహాయముగా వచ్చినట్లు భీముని పరాక్రమము నకు గాండీవమును తీసికొని అర్జునుడు సహాయముగా వచ్చును.

సంజయా! ఉన్నవాస్తవమును చెప్పెదను వినుము. అర్జును నితో సమానరథికుడు యేయుగములందును వున్నట్లు వినలేదు.

చూడలేదు. నీయెదుట చెప్పినప్రకారము చేయుటకు సమర్థుడర్జునుడు. అర్జునుడు వ్యర్థములైనమాటలను చెప్పడు. అతనిగాండీవము సర్వ లోక ప్రసిద్ధము. అతని దివ్యరథముమీద ఆశ్చర్యమైన తేజస్సుచేత కృష్ణుడు ప్రకాశింపుచుండును. కృష్ణుని భుజాబలమునకు అర్జును డాశ పడలేదు. అర్జునుడొక్కడే కౌరవసైన్యములను కాల్చిచ్చువలె దహిం చును. ఇట్లు ప్రతాపమూర్తులగు భీమార్జును లిద్దరును ఒక్కటచోట్టే చేరియున్నారు. వీరిభయంకర తేజస్సుల నన్నిటిని సహించుటకు సాధ్యముగాదు. అర్జునుడొక్కడే సకలదేవరాక్షస సహితములైన సర్వలోకములను జయించగలడు. అర్జును డపరిమిత బలవంతుడైనం దున యెవ్వరిచేతకు చిక్కపడడు. అని ధృతరాష్ట్రుడా సంజయు నితో చెప్పి మరల యిట్లనెను. సంజయా! అర్జునుడు కౌరవసైన్యము లను గెలుచుట ఒకవిషయము కాదు. అర్జునుని గాండీవమువలన యెగ సిన నిప్పులమంటవంటి బాణసమూహములు కౌరవసైన్యములను తెగగాల్చునుసుమా! భీమార్జునుల బలపరాక్రమ పరిమాణములను భీష్మద్రోణు లెరుగుదురు. ఇతరు లెరుగరు. ఇతరులెరిగినను మానవ ధర్మమననుసరించి సేనలకుముందరభాగమున నిలిచియుందురు. కీర్తి నిమిత్తమై ప్రాణములను విడుతురు. ఇంతమాత్రము నేగాని భీమార్జు నులను గెలువజాలరు. భీష్మద్రోణులకు పాండవులును కౌరవులును మనుమలును శిష్యులునై యున్నారు. అందువలన రెండుపక్షములవారి యందును భీష్మద్రోణులకు సమానబుద్ధి గలిగియుండును. భీష్మద్రో ణులు మనదగ్గరయున్న తప్పునకు మనపక్షమం దుండవలెనవియుం దురు. మనదగ్గరయున్నందుకు యింతకష్టము వచ్చెను. దైవాధీనహే తువు వలన నేను నాబిడ్డలకు వొత్తి చెప్పి నియమింపజాలను. విదు రుడు మొట్టమొదట యేమనిసాటించి చెప్పెనో అదియంతయు యిప్పు డు ఫలించు సమయమువచ్చెను. జూదమాడినది మొదలుకొని యీ

కౌరవజాతికి చేటుమూడునని తోచుచున్నది. దుర్యోధనుడు మంద బుద్ధిగలవాడై లోభగుణముచేత పీడింపబడుచు దురాశచేత యింత కీడుగలిగించెను. కాలవిపర్యయమువలన కౌరవులకు దాటరాని అవస్థ వచ్చెను. సంజయా! నేనేమిచేయుదును? యెందులో దూకుదును? నాకుగతియేది? నాకుదిక్కెవ్వరు? నేను యెవ్వరిని ఆశ్రయింతును? భీమార్జునులు యుద్ధరుమాత్రమేకాదు. నకుల సహదేవులును భీమార్జునులవలెనే మహాబలపరాక్రమవంతులు. ద్రుపదుడు మొదలగు బంధుజన స్నేహితు లందరును భీమార్జునులకంటె అధికబలవంతులగుదురు. ధర్మరాజు యుద్ధమందు మిక్కిలిసమర్థుడు. యుద్ధమందు స్థిరచిత్తుడై నందుననే ధర్మరాజునకు యుధిష్ఠిరుడను పేరుగలిగెను. ధర్మరాజు సత్యము, పరిశుద్ధము, ధర్మము, దయ మొదలగు మహాసద్గుణములు గలవాడు. ధర్మరాజు మంచి వినయ వివేక సత్స్వభావముల చేత ప్రసిద్ధుడు, అతడు తనబంధు భృత్యజనుల నందరిని తన నేర్పరితనముచేత తనవశముచేసికొనును. అటువంటి ధర్మజుని మీదకు మనము యుద్ధమునకు వెళ్ళుటచూడగా మంటమీదకువెళ్ళు మిడుత చందముగా నున్నది. సంజయా? పాండవులతో యుద్ధముచేయుటచే మనకౌరవ కులమునకు నాశముగలుగును. ఇదితప్పదు. సంధిచేసికొని శాంతముగా నుండుట మేలగును. సంధివిషయము మనవారికి యిష్టమైనయెడల అందుకు తగినప్రయత్నమును జేసెదను. అని ధృతరాష్ట్రుడు సంజయునితో చెప్పెను. ఆమాటలను సంజయుడువిని ధృతరాష్ట్రునితో యిట్లనెను. మహారాజా! దేవరవారు యిప్పుడానతిచ్చిన వాక్యము మిక్కిలిబాగుగా నున్నది. పూర్వము నీవే వుపేక్షించి పాండవులను వనములకు పంపించితివి. ఇకనైనను నీవు పిలిపించిన యెడల పాండవులు నీదగ్గరకువత్తురు ఈ కౌరవకులము నశించుటకు పాండవులు సమ్మతింపరు, అదియెట్లనగా చెప్పెదను వినుము. పాండ

వులు పూర్వము వనములకు వెళ్ళియుండి బహుకష్టములను అనుభవిం
పుచుండగా నీకొడుకగు దుర్యోధనుడు ఘోషయాత్రకుబోయి గంధ
ర్వులచేతిలో పట్టుబడెను. పాండవులు వనవాసదుఃఖమును అనుభవిం
పుచుండియు గంధర్వులను గెలిచి మనదుర్యోధనుని విడిపింపజేసిరి.
ఈ విషయమును మనమెరిగియే యున్నాము. అట్టిసమయమందైనను
నీవు పాండవులను రక్షించి తగురీతిని సన్మానింపలేదు. అట్లు సన్మానిం
చినయెడల అప్పుడే పాండవులు కోపమును విడుతురు. నీ మాటలను
పాండవులు అతిక్రమింపరు. నీవు యిప్పుడైనను పాండవులను పిలిచి
వారిరాజ్యమందు వారిని నిలుపుము. అని సంజయుడు ధృతరాష్ట్రు
నితో చెప్పెను. ఆ మాటలన్నిటిని దుర్యోధనుడు విని తనతండ్రియైన
ధృతరాష్ట్రునితో యిట్లనెను.

## దుర్యోధనుడు తండ్రితో స్వపక్షవీరుల సామర్థ్యము చెప్పుట

ఓ తండ్రీ! ధృతరాష్ట్రమహారాజా! పాండవులు అడవుల
యందును కొండలయందును పడియుండి మహాకష్టములను పొంది
రూపుమాసిపోయిరి. అటువంటి పాండవులను యిప్పుడు కృష్ణుడు తీసి
కొనివచ్చి కొంత కూటిమూకను సైన్యముగాచేర్చి పాండవుల దగ్గర
జేరియున్నాడు. అటువంటి బలహీనులైన పాండవులు మమ్ములను
కొట్టజాలరు. నీవుయింత భయపడుటకు కారణమేమో తెలియలేదు.
నాబలపరాక్రమములను అల్పముగా తలచవద్దు. ఏవిధముచేతనైనను
పాండవులను నేను యుద్ధమందు గెలువగలను. ఈ భీష్ముడు పరశు
రాముని గెలిచిన మొనగాడు. భీష్మునిపేరు వినినమాత్రమున రాజు
లందరును భయపడి పారిపోవుట నీవును యెరిగియేయున్నావు. భీష్ముడే
కోపించినయెడల పాండవులెంతమాత్రపు వారగుదురో నీవే తెలిసి
కొనుము. ద్రోణాచార్య కృపాచార్యు లిద్దరును అయోనిసంభవులు,

అపరిమిత భుజాబలవంతులు. యుద్ధక్రీడలయం దపరిమితమగు సమర్థత గలవారు. పరులచేత జయింపబడనివారు. ఈ ద్రోణ కృపాచార్యులు యుద్ధమును కోపించినయెడల వీరిద్దరితో రుద్రుడైనను యెదిరించి యుద్ధముచేయజాలడు అశ్వత్థామ శివునివరమువలన పుట్టెను. దేవేంద్రుని గుర్రమువలె మహాతేజోవంతుడు దివ్యాస్త్ర విద్యయందు మహాసమర్థుడగును. ఇటువంటి అశ్వత్థామను కలిగియుండగా మనము యుద్ధమందు భయపడవలసిన పనిలేదు. కర్ణుడు సహజకుండలములు గలవాడు. మహాశౌర్య మహాభుజబలవంతుడు. ఇటువంటి కర్ణుడు మన పక్షమందుండెను. కర్ణునితో సమానరథికుడు ధర్మరాజు పక్షమందెవ్వరు గలరో చెప్పుము.

పూర్వము ఇంద్రుడు వచ్చి తన భార్యయగు శచీదేవికొరకు కర్ణుని సహజ కుండలములను అడిగెను. అప్పుడు కర్ణుడు తన సహజ కుండలములను ప్రీతిపూర్వకముగా ఇంద్రునకు యిచ్చెను. ఈ చెప్పబడిన భీష్మ ద్రోణ కృపాచార్య అశ్వత్థామ కర్ణులు పాండవులచేత నేగాక దేవతలచేతనైనను గెలువబడరు. ఈ విషయము స్పష్టము. బాహ్లికుడును సోమదత్తుడును, భూరిశ్రవుడును, శల్యుడును, సైంధవుడును, గాంధారరాజు మొదలగు మహావీరు లందరును భీష్మ ద్రోణాదులకంటె సమగ్ర బలవంతు లగుదురు. తక్కిన రాజసమూహములును మనకు సహాయముగా వచ్చిన నానాదేశముల రాజులును అనేకులు మహావీరులైయున్నారు. వీరందరును నాతో సుఖదుఃఖములను అనుభవించుటకు సమ్మతించి సాహసముచేత అగ్నినైనను నా నిమిత్తమై పట్టుకొందురు. సముద్రమునైనను యీదుటకు తెంపువహించి యున్నారు. గనుక ఆ పాండవులు మా తట్టు తేరి చూచుటకు నేమాత్రమును శక్యముగాదు. నీ వనుమానింపకుము. యుద్ధము చేసిన యెడల పాండవులు మమ్ములను గెలుతురను విషయమున నీ వెంత

మాత్రమును సంశయింపకుము. మాపక్షమునందు యెవ్వడును లేక నా బంధుమిత్ర సహాయు లందఱును సమ్ములమునిడిచి పారిపోయినప్పుడు, పాండవులే బంధుమిత్ర సహాయ సమగ్రులైన మొదల పాండవులకు రాజ్యప్రాప్తి కాలము వచ్చెనని తలంచవలయును. ఇంతమాత్రమే గాని ఇకను మేము పాండవులపాదములను పట్టుకొని ప్రార్థించము. ఆ పాండవులను కొలుచుచు సేవింపము. పాండవులకు భయపడి మేము పారిపోజాలము. సర్వవిధములచేతను ఆ పాండవులతో యుద్ధమే చేసెదము. ఆ యుద్ధమందు నేను తలచినట్లు నాకైనను జయము గలుగవలయును లేక ఆ కృష్ణుడు తలంచినట్లు పాండవులకైనను జయము గలుగవలెను. ఈ రెండువిధములలో యెవరికి జయము గలిగినను మేలేయగును. ఈ చెప్పినట్లు జరుగక మానదు. ఇది నిశ్చయముగును. అని దుర్యోధనుడు ధృతరాష్ట్రునితో చెప్పెను.

తండ్రీ ! ధృతరాష్ట్రమహారాజా ! పాండవులు మనకు శత్రువులగుదురు. వారితో సంధిసేయుట మనకు మిక్కిలి నీచము. కులములో తలవంపు గలుగు కూడును తినుడని మమ్ములను పంపుటకు ప్రయత్నించుచున్నావు. అయ్యయో ! అట్టి శత్రువులు మామీదకు దండెత్తి వచ్చినప్పుడు మేము యుద్ధము చేయజాలమని చెప్పుట ధైర్యము చెడుటయేగాక పాండవులతో మనకు పొందు గలుగజాలదు. నీవు నీ పుత్రులకు మరణకష్టములు గలుగునని తలచి యిట్లు బతిమాలుకొని పెద్దగా అరచుటచేత జనులందరును మనలను జూచి అసహ్యపడుదురు. ఇంకను నిన్నేమని యందును ? భీముడు మిక్కిలి బలవంతుడనియు గదాయుద్ధమందు సమర్థుడనియు నీవు తలచి అనేకవిధములుగా ఆ భీముని పొగడితివి. గదాయుద్ధమందు భీముడు నాతో సమానుడుగాని విషయమును నీవు యెరుగుదువు. గదాయుద్ధమందు నాతోసమానమగు సమర్థతగలవాడు యీభూమిపై

లోకములయందు కనబడుటలేదు. ఆ భీముడు గర్వముచేత నన్ను యుద్ధమందు యెదిరించినయెడల వజ్రాయుధముచేత పెద్దకొండను గూల్చినట్లుగా నా గదాయుధము చేత భీముని పడగొట్టెదను. భీమునితో గదాయుద్ధము చేయవలెనని నేను సర్వదా కోరుచుంటును. బహుకాలమునుంచి కోరుచుండగా యిప్పుడు భీమునితో గదాయుద్ధము చేయదగిన కాలము లభించెను. అందుకు నేను సంతోషింపుచున్నాను. నాచేత భీముడు గదాయుద్ధమందు పడినపిమ్మట పాండవ సైన్యమునకు వుత్సాహము కలిగించెడివాడు మరియొకడు లేడనుట స్పష్టము. ఈ విషయము నంతయు ధర్మరాజు యెరిగియే భయపడి తమకు అయిదు గ్రామములే చాలునని కోరెను. అర్జునుడు కలడని సంశయించితివేని చెప్పెదను వినుము.

తండ్రీ ! ఇంద్రుడు కర్ణుని సహజ కవచకుండలములను తీసికొనునప్పుడు తన దివ్యశక్త్యాయుధమును కర్ణుడు కోరగా కర్ణునకు యిచ్చెను. ఆ దివ్య ఘోర క్రూర శక్త్యాయుధము యిప్పుడు కర్ణుని దగ్గర యున్నది. ఆ యాయుధము కర్ణునివద్ద నున్నంతవరకు అర్జునుడు బ్రదుకజాలడు. భీష్మ ద్రోణ అశ్వత్థామ భగదత్తాది రథికశ్రేష్ఠుల దివ్యబాణములు అర్జునుని మ్రింగివేయగలవు. దుశ్శాసన, దుష్ప్రహ, దుర్ముఖ వివింశతి, వికర్ణ, చిత్రసేనాదులగు నీ కొడుకులందరును ఒకడొకడే జగత్తుల నన్నిటిని జయింపగలరు. నీవు భయపడవద్దు. నా ప్రార్థనను అవధరింపుము. మహాబలపరాక్రమ ధైర్య మహోత్సాహవంతుడగు కర్ణుడును దుశ్శాసనాది కుమారులును వీరందరు ఒక్కసారి యుద్ధమునకు నడిచినయెడల అర్జునుని మాత్రమేగాక పాండవుల నందరిని ఒక్క ముద్దగా భక్షింపగలరు. అదిగాక మాకు పదునొకండక్షౌహిణుల సైన్యము కలదు. పాండవుల పక్షమందు ఏడక్షౌహిణుల సైన్యము మాత్రమే కలదు. మా సైన్యము మిక్కిలి బలముకలది.

పాండవుల సైన్యము బలహీనము. పాండవులు మమ్ములను యేవిధముగా జయింతురో చెప్పుము నీవు యీ యెక్కువ తక్కువలు విచారింపక లేని భయమును కల్పించుకొని వూరక చింతించుచున్నావు. నిన్ను దుఃఖింపకుండ చేయజాలకున్నాము. అంతియేగాని తక్కిన పనుల నన్నిటిని అనుకూలింప జేసికొనుటకు మేము సమర్థులము. అని దుర్యోధనుడు ధృతరాష్ట్రునితో చెప్పి సంజయునివైపు చూచి యిట్లనెను. సంజయా! ధర్మరాజు నానాదేశములయందుండు పెద్ద భటులను కూర్చుకొని మాయందు మాత్సర్యబుద్ధి గలిగియుండెను గదా! ఆ ధర్మరాజు యేమని చెప్పెనో అతని పద్ధతిని చెప్పుము అని దుర్యోధనుడు సంజయుని అడుగగా సంజయు డిట్లనెను.

## సంజయుడు దుర్యోధనునకు ధర్మరాజుయొక్క నిశ్చయమును యెరింగించుట

దుర్యోధనమహారాజా! ధర్మరాజునకు యుద్ధమని చెప్పినయెడల అతని దేహము పుష్పించును. అతని తమ్ములందరును పెండ్లికి పోయినట్లుగా మిక్కిలి ప్రియముగలిగి యుద్ధఉత్సాహము కలిగియున్నారు. వారికి గల యుద్ధవిషయమైన తెలివి యెక్కడను కనబడలేదు. పాండవుల పక్షమందుండు రథికభటులందరును మాచేతుల తీట యెప్పుడు పోగొట్టుకొందుమా యని తలచుచుందురేగాని కొంచెమైనను చలింపరు. అర్జునుని పాశుపతాది దివ్యబాణసమృద్ధిని వారి సైన్యములు నమ్మియున్నవి. భీముని గదాయుధమును నమ్మి పాండవ సైన్యములు యుద్ధమహోత్సాహమును గలిగియున్నవి. భీమార్జునుల భుజాబలదివ్యబాణములను నమ్మి పాండవభటు లందరు భయంకరముగా యుద్ధమునకు కాలుద్రవ్వుచుందురు. పాండవపక్షపు భటులందరును నిర్భయులై ఎప్పుడెప్పుడు యుద్ధము జరుగునోయని తలం

చుచు, యుద్ధమహోత్సాహము గలవారై చెలరేగి యుద్ధమునకు సిద్ధమగుచున్నారు. అని సంజయుడు దుర్యోధనునితో చెప్పగా దుర్యోధను డిట్లనెను. సంజయా! నీవు చెప్పినది సరియే అగును. నీవు పాండవులను స్తుతించుచున్నావు. పాండవులు ఏయుద్ధసాధనములవలన భయపడక కౌరవులమీదికి యుద్ధమునకు వచ్చెదరో చెప్పుము. అని దుర్యోధనుఁ డడుగగా సంజయు డిట్లనెను. దుర్యోధనమహారాజా! అర్జునుని దివ్యరథమును అతని తెల్లని గుఱ్ఱములును అతని కపిధ్వజమును అతని దేవదత్తశంఖమును ఇవన్నియు శత్రువులచేత నశింపబడనివి. అర్జునుని యుద్ధసాధనము లన్నియు దివ్యవస్తువులు. ధర్మరాజ, భీమ, నకుల, సహదేవుల రథములును, గుఱ్ఱములును, దివ్యబాణములును, గదాఖడ్గాదిసాధనములును అమోఘములు. పాండవులయొక్క యుద్ధసాధనము లన్నియు మిక్కిలి గొప్పవి. మరియు విరాట్ద్రుపదాది రాజులకు యుద్ధసాధనము లన్నియు ఏ కొరంతయులేక సమగ్రముగా నున్నవి అని సంజయుడు పాండవులకును వారిపక్షమునందు గల రథికులకును గల యుద్ధసాధనముల మహాత్మ్యములను అన్నింటిని ప్రత్యేకముగా వర్ణించి దుర్యోధనునకు వివరించి చెప్పెను. ఆమాటలన్నిటిని ధృతరాష్ట్రుడు విని సంజయునితో ఇట్లనెను. సంజయా! ఇక్కడ మాపక్షమందుండు భీష్మద్రోణాది అతిరథులు ఎవ్వరిచేతను జయింపబడరు. ఇట్టి వీరిని జయించుటకు పాండవు లెట్లూహించిరో చెప్పుము. అని ధృతరాష్ట్రుడడుగగా సంజయు డిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! ఈభీష్మాదులను చంపుటకు పాండవపక్షపువారు ఒక్కొకరు ఒక్కొరినిగా పంచుకొనిరి. ఆపంచుకొనిన విధానమును చెప్పెదను ఆలింపుము. భీష్మునకు, శిఖండి, పాలగును. ఆశిఖండికి విరాటుని సైన్యము భీష్ముని చంపువిషయమై సహాయ

ముగాయుండును. ద్రోణాచార్యుడు ధృష్టద్యుమ్నుని పాలగును. ధృష్టద్యుమ్నుడు ద్రోణుని చంపువిషయమై ద్రౌపదీపుత్రు లాతనికి సహాయముగా నుందురు. దుర్యోధనుడును అతని తమ్ములును భీముని పాలగుదురు. దుర్యోధన దుశ్శాసనాదుల పుత్రులగు లక్ష్మణుడు మొదలగు నీమనుమలందరును అభిమన్యుని పాలగుదురు. మరియు శకుని, సైంధవ, అశ్వత్థామ, కర్ణులును ఇతరులచేత గెలువబడని తక్కిన భగదత్తుడు మొదలగువారును అర్జునుని పాలగుదురు. కృతవర్మ సాత్యకిపాలగును. సోమదత్తుడు చేకితానుని పాలగును. ఈ ప్రకారముగ ఆవీరులతో పాండవరథికులు యుద్ధము చేయునట్లుగా నిశ్చయించిరి. నకుల, సహదేవులు, శకునిని, ఉలూకాదిపుత్రులును సారస్వతులును కళింగదేశపురాజులును చంపునట్లుగా నిశ్చయించిరి. పాండవపక్షమందు గల కేకయరాజులు మనపక్షమందు గల కేకయ రాజులను గెలుచునట్లుగా నిశ్చయించిరి. మహాపుణ్యాత్ముడైన ధర్మ రాజు మహాపుణ్యపురుషుడైన శల్యుని చంపునట్లుగా నిశ్చయించెను. అని యిట్లు ధర్మరాజు నిశ్చయించగా ఆమాటల నక్కడ నుండు రాజులువిని ధర్మరాజు నుద్దేశించి ఇట్లని చెప్పుకొనిరి. రాజులారా! ఈధర్మరాజు మహాబల పరాక్రమ శౌర్యధైర్యవంతుడు. శల్యుడు ఈధర్మరాజుతో సమానుడుకాడు. గనుక ధర్మరాజు ఎక్కడ? శల్యు డెక్కడ, అని అక్కడరాజులు చెప్పుకొనిరి. అప్పుడు ధర్మరాజు శల్యునియొక్క బలపరాక్రమ శౌర్యములను మిక్కిలిగా ఆరాజు లతో చెప్పెను. అదిగాక ఎవ్వరికి ఎవ్వరు యుద్ధమందు తటస్థించె దరో అట్టివారితో వారే ఎదిరించి యుద్ధముచేయునట్లుగా నిశ్చ యించిరి. ధృతరాష్ట్రమహారాజా! ఈప్రకారము పాండవులు క్రొవ్వు మిగిలి కొరతలేని మహోత్సాహముగలవారై తెంపుజేసి ప్రకాశించు చున్నారు. నీకును నీకొడుకగు దుర్యోధనునకును ఎట్లుచేయుట మంచి

దని తోచునో ఆప్రకారమే చేయుడు. అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను. సంజయా! నాకొడుకులు ఇక నెట్లు బ్రతుకగలరు? ఏవిధముగా జూచినను ఇప్పుడు నీవు చెప్పిన పాండవాదులను గెల్చుట సాధ్యము గాదు. ఈ కౌరవసైన్యములు పాండవవీరులను ఎంతమాత్రము గెలువజాలవు. ఇక నేనేమని చెప్పుదును? ధర్మరాజు ప్రభువైయుండగా ధర్మరాజునకు భగవంతుడైన కృష్ణుడు విజయము గలిగించుటకు పూనికొనియున్నాడు. అటువంటి ధర్మరాజు సైన్యమును మన దుర్యోధనుడు లక్ష్యము చేయులేదు. ఇందుకు కారణము నాపూర్వజన్మసంస్కారమే యగునుసుమా! ఈ కలహామును నివర్తింపజేయుట నావశముగాదు. ఈ రాజులకందరికిని ఆయుష్కాలము పూర్ణమైయున్నది. సంజయా! ఈ యుద్ధవిషయమై నీవు దుఃఖింపకుము. ఈవిషయమైన మాటల నిక చెప్పకుము. అని ధృతరాష్ట్రుడు సంజయునితో చెప్పెను. ఆమాటలను దుర్యోధనుడు విని ధృతరాష్ట్రునితో యిట్లనెను.

తండ్రీ! ధృతరాష్ట్రమహారాజా! మేమును, పాండవులను, ఒక్కకులమందు పుట్టి, ఒక్కచోటనే పెరిగి, ఒక్కగురువుయొద్దనే, సకలవిద్యలను, నభ్యసించితిమి. అట్లయినపుడు ఆ పాండవులు, మాకంటె, బలవంతులై, మహాపరాక్రమ శౌర్యములచేత, మమ్ములను, యుద్ధమందు గెలుతురని ఎట్లునిశ్చయింపవచ్చును. వారే గెలుతురని నిశ్చయించుటకు సాధ్యముగాదు. నీవు పాండవులపక్షమందుండెడి వారిని పొగడుచు వర్ణించుచుందువు. మాపక్షమందుండెడివారిని తలంపవు. ఈభూమి అపాండవులకు లేనట్లుగాను మాకు లభించునట్లుగాను, ఏర్పరచి ఇదివరకే మమ్ములను బ్రహ్మదేవుడు సృష్టించెను. ఇదిసిద్ధము. ఆబ్రహ్మ లిఖితమును ఇప్పుడు మరియొకడు మాన్పజాలడు. గనుక నీవు వ్యర్థముగ మనస్సునందు దుఃఖించుటవలన

ప్రయోజనములేదు. అని దుర్యోధనుడు ధృతరాష్ట్రునితో జెప్పెను. అంతట ధృతరాష్ట్రుడు సంజయునితో యిట్లనెను. సంజయా! నా పుత్రుడగు ఈ దుర్యోధనుడు పిచ్చిపట్టిన వానివలె మాటలాడు చున్నాడు. ఇట్లు మాటలాడునేగాని సత్య, ధర్మ, పరాక్రమ, సహాయ, సంపన్నులైన, పాండవులను దుర్యోధనుడు గెలువజాలడు. దుర్యోధనుడు ప్రబలుడైనను యుద్ధముచేయుట కీడేయగును గాని మేలుగాదు, ఆవిషయమును అట్లుండనిమ్ము. నేనొక్కవిషయము నడిగెదను చెప్పుమని మరల ధృతరాష్ట్రుడు సంజయునితో యిట్లు అనెను.

సంజయా! పాండవులను యుద్ధమునకు పురికొల్పుచు మమ్ము లను తలచినపుడు ఉల్లికుట్టు మాటలచేత పాండవుల చిత్తములకు కోపము గలిగించువాడు అక్కడెవడుండునో చెప్పుము. పాండవులకు యుద్ధమహోత్సాహమును కలిగించెడి వాడెవడో చెప్పుము. అని ధృతరాష్ట్రు డడుగగా సంజయు డిట్లని చెప్పెను. ధృతరాష్ట్రమహా రాజా! ధృష్టద్యుమ్నుడు ఏవిధములైన మాటలచేతనైనను, నేతిచేత అగ్నిహోత్రమును ప్రజ్వలింపజేసినట్లు పాండవులకు కోపమును ప్రజ్వా లింపజేయును. ఆ ధృష్టద్యుమ్నుడు నేను వినుచుండగా ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! కౌరవసేన సముద్రమువంటిది. భీష్మ ద్రోణాది మహావీరులు సముద్రమందుండు క్రూర జంతు సమూహ ముల వంటివారు. ఏనుగులగుంపులు సముద్రమందుండు పర్వతముల వంటివి. గుఱ్ఱపుదండులు సముద్రమందుగల ఎడతెగని కెరటముల వంటివి. అట్టి కౌరవసైన్యమును సముద్రమునకు నేనొక్కడనే చెలి యలి కట్టువంటి వాడనై కౌరవసైన్యమును ఆపెదను. అని ధర్మ రాజుతో ధృష్టద్యుమ్నుడు చెప్పగా ధర్మరా జిట్లనెను. ధృష్ట ద్యుమ్నా! ఇంతటి కార్యమును చేయుటకు నీవు సమర్థుడవని అంద

రుసు ఎరిగియే యున్నారు. ఇట్లు యుద్ధమందు మమ్ములను నీవు ఉద్ధరింపుము. అని ధర్మరాజు ధృష్టద్యుమ్నునితో చెప్పి అతని కొనియాడెను. అంతట ధృష్టద్యుమ్నుడు నాతట్టుజూచి నాతో యిట్లు అనెను.

సంజయా! మీవారికందరికి తెలియజెప్పుము. పరమేశ్వరుడు మొదలగు సకల దేవతలును అర్జునునకు సకల దివ్యాస్త్రములను నిచ్చిరి. అట్టి అర్జునునిచేత అనేక మహారాక్షసజాతులు చంపబడి నశించెను. అట్టి రాక్షసాది జాతులే నశించినపుడు మనుష్యులు అర్జునునకు ఎంతమాత్రపు వారగుదురు? ఇటువంటి జగజ్జెట్టియైన అర్జునుడు కౌరవుల వెన్నుదన్నుచు చూచుచుండగలడు. గనుక మాబోటి వారందరును పోక పెనగినయెడల కౌరవులకు భారమై ప్రాణములకు అపాయము కలుగును. అంతకష్టమును పొందుటకంటె, పరమ దయాపరుడైన ధర్మరాజు శరణుజొచ్చి బ్రతుకుడని ఆ కౌరవులతో జెప్పుము. ఇదివరకు ధర్మరాజునకు గొప్ప కష్ట అవమానములను కలిగించి తప్పులు చేసితిమని తలచవద్దు. ధర్మరాజు శాంతి యను అమృత సముద్రమువంటి చిత్తముగలవాడైనందున ఎన్ని తప్పులు చేసినను శరణుజొచ్చినయెడల రక్షించును. అని ధృష్టద్యుమ్నుడు నాతో జెప్పెను. అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పగా ఆ మాటలను ధృతరాష్ట్రుడు విని దుర్యోధనునితో యిట్లనెను.

## ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో సంధిచేయుమని జెప్పుట

కుమారా! దుర్యోధనా! నీ పరిజనులకును, నీకును ఈ భూమిలో సగముభూమి చాలును. తక్కిన సగముభూమిని ధర్మరాజునకు యిచ్చి నెమ్మదిగా బ్రతుకుము. ఇట్లు చేయుట ఉచితము. నాకు యుద్ధముతో పనిలేమి? మనపెద్దలగు వారెవ్వరికిని యుద్ధముచేయుట

ఇష్టము లేదు. యుద్ధము తగినవృత్తిగాదు. గనుక ద్రోణుడు మొదలగు మిత్రులును భీష్ముడు మొదలగు బంధువులును కోపముచేత యుద్ధముచేయరు. ధర్మరాజు మహాత్ముడు. అతనితోకూడి బ్రతుకుట వలన ఈ కౌరవుల కందరికి పరమానందము కలుగును. నిన్ను కర్ణుడు యుద్ధమునకు పురికొల్పుచుండును. శకుని దుశ్శాసను లిద్దరును కర్ణుడు చెప్పిన నిర్ణయమునే పొగడుచుందురు. వారిమాటలు నీ చెవులకు యింపుగానుండును ఆ కర్ణ, శకుని, దుశ్శాసనుల వాక్యములు ఎప్పటికిని కార్యసాధకములు గావు. అని ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో చెప్పెను. ఆమాటలకు దుర్యోధనుడు కటకటంపడి ధృతరాష్ట్రునితో యిట్లనెను.

మహారాజా! భీష్మ ద్రోణాదులగు పెద్దలందరును యుద్ధము చేయుటకు సమ్మతింపరని నీవు చెప్పెదవు. ఆ ముసలివాండ్రు అందరును యుద్ధముచేయుటకు సమర్థులు కారు. ఇటువంటి భీష్మద్రోణాది వృద్ధులను సహాయము చేసికొని నేను పాండవులను గెలుచుట పూనలేదు. కర్ణ దుశ్శాసను లిద్దరిని సహాయము చేసికొని పాండవుల కోపాగ్నులను చల్లార్చెదను. మరియొకని సహాయము నేను కోరను. ఇక నీవు మాటలచేత నన్ను బాధింపకుము. ఈ భువిలో తీక్ష్ణమైన సూదిమోపినంత భూమినైనను యికను నేను పాండవులకు యివ్వను. నాచేయి అంత పనికిమాలినది కాదు. అని దుర్యోధనుడు ధృతరాష్ట్రునితో చెప్పగా ఆమాటలను ధృతరాష్ట్రుడు విని దుర్యోధనునితో మరల యిట్లనెను.

ఓ దుర్యోధనా! నీ చావు నిమిత్తమై నేను అంతగా దుఃఖించుటలేదు. నీవు పోవుగతికి పోవుటకు పూనియున్న వారి కందరికిని నేను మిక్కిలి దుఃఖింపుచున్నాను. కనుక నీవు కోపింపక యుద్ధము మానుకొనుము. యుద్ధముచేయరాదు. రెండుపక్షముల

సైన్యములును పొగడునట్లుగా భీముడు గదాయుధమును తీసికొని మహాభయంకరముగా యేనుగుల కుంభస్థలములను పగులకొట్టును. అట్లు పగులకొట్టగా యేనుగులగుంపులు రక్తమయములై నెల యేరులతో గూడిన పర్వతములవలె భూమిమీద పడును. అట్లు చచ్చి పడి యుండెడి యేనుగులను జూచి యైనను, అప్పుడు నామాటలను తలచుకొన గలవు. అర్జునుడు తన దివ్యబాణములచేత నీ సైన్యములను ఒక్కసారే పడగొట్టును. అర్జునుడు నీ సైన్యమునంతయు నుగ్గు నుగ్గుగా తన దివ్యబాణముల మహిమలచేత సరికివేయును. అట్లు నరుకబడిన సైన్యము మహాభయంకరముగా అడవివలెపడియుండును. అట్లు చచ్చి పడియుండెడి నీ సైన్యమును జూచి అప్పుడైనను నేను చెప్పిన మంచి మాటను తలచుకొనుము. అని ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో జెప్పి అతనివలన బదులుమాట గానక మరల మనస్సును మరల్చి తన కొడుకులు యుద్ధమందు జయింతురేమో యను ఆశచేత సంజయుని తట్టు మళ్ళెను. అట్లు మళ్ళిన ధృతరాష్ట్రుడు పాండవ కౌరవుల పక్షమందుగల వీరుల, బలశక్తి తారతమ్యములను అడుగుచు రెండు పక్షములవారి తారతమ్యములను యోచించుచుండెను. అంతట సంజయుడు చెప్పు బల తారతమ్య వాక్యముల చేతను తన ఆలోచన చేతను రెండు పక్షములవారి బలాబలములను నిశ్చయించెను. నిశ్చయించు నప్పుడు కౌరవులకంటె పాండవులు బలవంతులైనటు యేర్పడెను. రెండు పక్షములవారి బలాబలములను సంజయుని వలన వినుచు సంజయునితో లెక్కలు బెట్టి చెప్పుచు బోధించుచు చాలసేపు బలాబల విషయములను సంజయునితో వితర్కించెను. అట్లు వితర్కించి బలములను నిశ్చయించు నప్పుడు పాండవులశక్తి దైవశక్తి యనియు కౌరవుల శక్తి మానుషశక్తి యనియు ధృతరాష్ట్రుడు తలచెను. ధృతరాష్ట్రుడు మరల దుర్యోధనునితో యిట్లనెను.

కుమారా! దుర్యోధనా! పూర్వము అర్జునుడు అగ్నిదేవుని కొలిచెను. అగ్నిదేవుడు అర్జునునియందు దయగలవాడై దివ్యరథ దివ్యాశ్వ దివ్యధ్వజ దివ్యధనుర్బాణ అక్షయ తూణీరాది దివ్యసాధనముల నన్నిటిని యిచ్చెను. అదిగాక ధర్మదేవుడు వాయుదేవుడును, దేవేంద్రుడును, అశ్వనీ దేవతలును పాండవులకు పాండురాజు వలెనే తండ్రులగుదురు. ఆ ధర్మదేవాది పంచ దేవతలును పాండవులకు ఒక కీడైనను గలుగకుండునట్లుగా రక్షింపుచుందురు. గనుక భీష్మ ద్రోణాది రథికులకు మన వారందరును, పాండవులను యుద్ధమందు అవమానింప జాలరు. ఈ మాట సిద్ధము. అదిగాక పాండవులను దేవతలు రక్షింపవలసిన పనిలేదు. అర్జునుడు దేవతలతో సమాన పురుషుడు. దేవతలచేత జయింపరాని రాక్షసులను అర్జునుడు చంపెనుగదా! నీవును నీ వారును, అర్జునుని బల పరాక్రమ దివ్య బాణ సమృద్ధిని యెరిగియేయున్నారు. దుర్యోధనా! ఇప్పుడు కౌరవులకు నీ నిమిత్తమై మహాభయము కలిగినది. ఇందుకు పరిహారము సంధితప్ప మరియొక యుపాయము కనబడుటలేదు. ఎన్నివిధములచేత చూచినను. యోచించినను గూడ యుద్ధముమానుటయే మనకుమేలు. నీవు శాంతమును పొందుము.

అయ్యో! దీర్ఘవైరము యెవ్వరికిని పనికిరాదు. అని యిట్లు ధృతరాష్ట్రుడు తన కొడుకగు దుర్యోధనునితో చెప్పెను. దుర్యోధనుడు ధృతరాష్ట్రునితో యిట్లనెను. తండ్రీ! ధృతరాష్ట్ర మహారాజా! దేవతలు అర్జునునకు సహాయముగా వచ్చెదరని చెప్పరాదు. అది యెట్లనగా చెప్పెదను వినుము. రాగద్వేషాదులు లేనందుననే మొట్టమొదట దేవత్వము కలిగెను. దేవతలు రాగద్వేషాదులు గలవారై మనుష్యులకు సహాయపడరు. అట్లుగాక దేవతలు పాండవులయందు పక్షపాతము గలవారై మనమీదకువచ్చినయెడల వారల

దేవత్వము చెడిపోవును. అట్టి దేవతల దేవత్వముచేత అర్జునుడును రక్షింపబడ జాలడు. నీవు నేను చేయబూనిన యుద్ధ విషయమై చింతింపవద్దు. అని దుర్యోధనుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. తండ్రీ! ధృతరాష్ట్ర మహారాజా! పెరిగివచ్చు కార్చిచ్చును నివర్తింప జేయుటకు నేను సమర్థుడను. రాళ్ళ వర్షమును నివారింప జేయుటకు నేనుసమర్థుడను. పెద్దగాలిని నిలుపుటకు నేనుసమర్థుడను. మంత్రము చేత నదీ సముద్రాది జలములను అభిమంత్రించి ఆ జలములను భూమివలె గట్టివస్తువుగా జేసి అట్టి గట్టివస్తువుమీద నాచతురంగ బలములను నడిపించుటకు నేను సమర్థుడను. నా సేన నడచునప్పుడు కావలసిన స్థలమందు జలములను పుట్టించుటకు నేను సమర్థుడను. సింహాశరభ శార్దూల మహా సర్పాది క్రూరజంతువుల క్రూర స్వభావములను నిలుపుటకు నేను సమర్థుడను. ఈ చెప్పబడిన అగ్ని స్తంభన జల స్తంభన వాయు స్తంభనాది అనేక మహావిద్యలను నేను అభ్యసించియున్నాను. తగురీతిని మిత్రులకు శుభములును శత్రువు లకు దుఃఖములను కలిగించు విద్యను నేను నేర్చియున్నాను. నానా విధములైన సిద్ధులను గలిగించు మంత్ర ధ్యానానుష్ఠానములు అనేక ములు నాకు గలిగియున్నవి. నీవు చెప్పిన అగ్నిదేవుడు మొదలగు దేవతలందరును నాయందు దయగలిగి యుండునట్లుగా ఆ దేవతల నందరిని ఆరాధించి యున్నాను. నేనింత మహానుభావుడనై యున్నాను. నాకు వలెనే ఆ పాండవులకు మహానుభావత్వము కలిగియున్న యెడల ఆ పాండవులు పదమూడు సంవత్సరముల పర్యం తము ఆ ప్రకారము కష్టములను పడకనే యుందురుగదా! వినుము చెప్పెదను.

## దుర్యోధనుడు తండ్రితో తనబలపరాక్రమములు చెప్పుట

తండ్రీ! ధృతరాష్ట్రమహారాజా! నేనుకోపమును బూనిన వానిని దేవతలైనను రక్షింపజాలరు. దేవతలు కోపమువహించినవా

నిని నేను పూనికబూని చెడకుండునట్లు కాపాడగలను. నాకు మనుష్యులు తృణప్రాయులు. ఈ చెప్పినమాటలు గర్వముచేత చెప్పితినని తలచవద్దు. ఇవియన్నియు సత్యములు. ఎన్నడును నన్నుగురించి నేను నీవద్ద చెప్పుకొనలేదుగదా! ఆత్మస్తుతి పౌరుషముకాదు. ధర్మరాజు మొదలగు పాండవులును, పాండవపక్షమునందుగల ద్రుపదుడు మొదలగు పాంచాలదేశస్థులును విరాటుడు మొదలగు మత్స్యదేశస్థులును కృష్ణుడు మొదలగు యాదవులును, కేకయపాండ్య మాగధ చైద్యుడు మొదలగు సకలసేనానాయకులును యుద్ధమందు నాయెదుటబడి సముద్రములో ప్రవేశించిన యేరులవలె అణగిపోవుదురు. ఈవిషయమును నీవు అవధరించెదవుగాక! పాండవులును పాండవపక్షమందుండెడివారును తేజో ధైర్యపరాక్రమ ఉపాయవిచారణ వివేకములయందు నాతోసమానులుకారు. భీష్మ ద్రోణాచార్య కృపాచార్య అశ్వత్థామలు శస్త్రాస్త్రవిషయములయందేమెఱుగుదురో అవియన్నియు నేనును నేర్చికొనియున్నాను. సర్వవిషయములను నేను చక్కగా నెఱుగుదును. అని దుర్యోధనుడు ధృతరాష్ట్రునితో తనబలపరాక్రమ మాహాత్మ్యములను జెప్పెను. దుర్యోధనుని మాటలువిని కౌరవసభయందున్నవారందరును ఆశ్చర్యమును పొందిరి. దుర్యోధనుడు పాండవులుచేయు యుద్ధపద్ధతిప్రకారములగు ఆలోచనలను సంజయునివలనవినుచు వారితో మాటలాడుచుండెను. అంతట కర్ణుడు ధృతరాష్ట్రుని లక్ష్యముచేయక దుర్యోధనునకు సంతోషముగలుగునట్లు దుర్యోధనునితో యిట్లనెను.

దుర్యోధనమహారాజా! నాగురువగు పరశురాముని కోపముచేత నాకు దివ్యాస్త్రస్ఫురణలేదని జనులుచెప్పుకొందురు. ఆమాట అబద్ధము మరల నేను పూజావిశేషములచేత పరశురాముని అనుగ్రహమునుపొంది దివ్యాస్త్రస్ఫురణమును పొందితిని. కనుక అఖండ

మైన సకలశస్త్రాస్త్ర మహిమలను నేను పొందియున్నాను. దేవేం ద్రాది సకలదేవతలైనను నన్ను యెదిరింపజాలరు ఇటువంటి నేనుం డగా అర్జునుడు నీవలన భూమిని తీసికొనజాలడు. నాబలపరాక్రమ ములు ప్రకాశించునట్లుగా, నీవు మెచ్చునట్లుగా యుద్ధమందునిలిచి నేను పాండవులను గెలిచెదను. భీష్మ ద్రోణాదులందరును నీదగ్గర నిలిచియుండి వేడుక జూచుచుండగా మన సర్వసైన్యములయందును గాలినైనను సోకనివ్వను. నాభుజాబలముచేత పాండవులను యెదిరించి ఘోర క్రూరబాణములచేత పాండవుల దేహములను చీల్చిచెండా డెదను. నాధనుర్విద్యా విలాసముచేత యుద్ధమందు క్రీడించెదను. అని కర్ణుడు దుర్యోధనునితో చెప్పెను. ఆమాటలను భీష్ముడువిని కర్ణ నితో యిట్లనెను. కర్ణా! మృత్యువుచేత ప్రేరేపింపబడి యిట్లుప్రేలు చున్నావు. ఇట్లుప్రేలినమాత్రముననిన్ను మొనగానినిగా తలచరాదు. ఇంతసమర్థునిగా నిన్ను మేమునమ్మజాలము. నీవు అన్నిపనులను సాధిం చుటకు చాలుదువుగాని యిటువంటి బడాయికూతలను యికమానుము కర్ణా! ఘోరయుద్ధములో పాండవుల కపాయము గలుగునా? ఎప్పటి కిని పాండవులకు యుద్ధమం దపాయము కలుగదు. మనతట్టున మొన గాండ్రందరును వొక్కొక్కడుగా ముందునుండి చత్తురు. పిమ్మట క్రమముగా కౌరవసైన్యము లన్నియు కూలగలవు. పిమ్మట కౌరవు లందరును కూలుదురు. ఇంతమాత్రమున నీనోటియరుచివలన ప్రయో జనములేదు. దురహంకారముచేత యిన్నిమాటలను వ్యర్థముగా ప్రేలుచున్నావు. పూర్వము నీకు దేవేంద్రుడు క్రూరదివ్యమహాశక్త్యా యుధమును యిచ్చెను. ఆదివ్యశక్త్యాయుధముచేత అర్జునుడు పడుటని చూచెదవేమో చెప్పెదను వినుము. ఆభగవంతుడగు కృష్ణునిచేత ఆశక్త్యాయుధము బ్రద్దలై తునుకలై పొడిపొడియై నేలకలిసిపోవును. నీవద్ద సర్పముఖ బాణమున్నదనియు దానిని అర్జునునిపై ప్రయోగిం

చెదనని తలంతువేని అట్లునీవు తలంచవద్దు కృష్ణుడు అర్జునుని నిమిత్త మానస్వనుశాస్త్రమునేగాక అటువంటి దివ్యాస్త్రముల నెన్నింటినైనను నశింపజేయును. అర్జునుని రక్షించునిమిత్తము కృష్ణు డెన్ని అసాధ్యకార్యములనైనను చేయగలడు. అని భీష్ముడు కర్ణునితో చెప్పి ధృతరాష్ట్రునితో యిట్లనెను. మహారాజా! దాయాది జనులు అన్యోన్యముగా స్నేహముగలిగి కలిసిమెలసి యున్నయెడల సౌఖ్య సంతోషములను పొందుదురు. భేదముగలిగియున్నయెడల చెడిపోవుదురు. గనుక దాయాదిజనులు విరోధముగలిగి యుండరాదు దాయాదిజనులు అన్యోన్య సంభాషణ భోజనాది సన్మానములచేత వినయముగా ప్రవర్తించుచు సంతోషించి యుండవలయును. అట్లున్న దాయాదిజనులు యిహపరలోకములయందు సౌఖ్యములను పొందుదురు. అని భీష్ముడు ధృతరాష్ట్రునితో చెప్పెను. రాజా! పూర్వము నేను బ్రాహ్మణులను వెంటబెట్టుకొని ఒకకార్యముకొరకు వెళ్ళితిని. ఒకపర్వతమందు అందరానిచరియయందు ఒక తేనెతుట్టెవుండెను. ఆతేనెతుట్టెను కొందరుజనులుచూచి దానినిపొగడి ఆహా! యీతేనె తుట్టెయందుగల తేనెను త్రాగినమనుష్యులకు ముదిమిచావులు గలుగవు. రోగశ్రమలు కలుగవు. అని యిట్లు చెప్పుకొనిరి. ఆమాటలను బోయలుకొందరువిని ఆశచేత ఆకొండచరియమీదికి యెగిరి ఆతేనె తుట్టెనుఅందుకొను నిమిత్తమైదూకి క్రిందబడి చచ్చిరి.

ధృతరాష్ట్రమహారాజా! బోయవాండ్రవలెనే నీకొడుకులగు దుర్యోధనాదులందరును అవివేకులై భూమినంతను తామే యేలవలెనని చూచెదరే గాని తాము చచ్చిపోవుటను కానకున్నారు. మన కౌరవులు అర్జునునెదిరించి మానప్రాణములను దక్కించుకొనజాలరు. పాండవులు కౌరవులతో సమానబలవంతులైనను యుద్ధమందు వీరు గెలుతురు, వారు గెలుతురను యాలోచనలవలన

ప్రయోజనము లేదు. ధర్మరాజును నీలోనికి దెచ్చుకొనుము. ఇట్లు చేయుట నీకు తగిన కార్యము. అని భీష్ముడు ధృతరాష్ట్రునితో చెప్పెను. ఆమాటలను బాహ్లికుడు విని ధృతరాష్ట్రునితో యిట్లనెను. ధృతరాష్ట్రా! కన్నుభ్రమించిన బాటసారికి అపాయము లేనిమార్గమును జనులు చెప్పగా ఆమాటలను వినునట్లు తగు మంచిమార్గమును నీవు ప్రవేశింపకున్నావు. అయ్యో! ఇందుకు కారణమేమో తెలియు లేదు. అని బాహ్లికుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో యిట్లనెను. ఓరి కుమారా! దుర్యోధనా! నావలెనే యీభీష్మబాహ్లికు లిద్దరును నీమేలు గోరుచుందురు. వీరిద్దరును నీయందు మిత్రభావమును గలిగియుందురు. వీరిమాటను వినుము. మేము ముగ్గురము నీచేత పూజింపదగినవారము. నిన్ను ప్రార్థించెదను. మనము ధర్మరాజును విడువరాదు. కనుక పాండవులకు సగము రాజ్యమును ప్రీతిపూర్వకముగా పంచియిమ్ము అని ధృతరాష్ట్రుడు అనేకవిధములుగా దుర్యోధనునితో చెప్పెను. అందుకు దుర్యోధనుడు సమ్మతింపక వూరకుండెను. అప్పుడు ధృతరాష్ట్రుడు దుర్యోధనునియందు మిక్కిలి కోపముగలవాడై ఆసభయందుండువా రందరు వినునట్లుగా దుర్యోధనునితో యిట్లనెను. దుర్యోధనా! యిదివర కర్జునుడు చేసినయుద్ధములను మనమెరుగుదుముగదా! విరుగునట్లుగా బారచాపరాదు. విరాటుని గోవులను పట్టినప్పుడు అర్జును డొక్కడే వచ్చి విరాటుని పశువులను మరలించెను. అప్పుడు నీసైన్యముచచ్చి పారివచ్చెనుగదా! అప్పుడు కర్ణుడును నీవునుగూడ అచ్చటనేయుంటిరి కదా! అని యిట్లు ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో చెప్పి కర్ణుడున్న ప్రక్కకు ముఖమును మరలించి యిట్లనెను.

కర్ణా! విరాటుని గోవులను మరలించుటకు అప్పు డర్జును డొక్కడే వచ్చెను. ఇప్పు డట్లుగాదు. భగవంతుడైన కృష్ణుడు అర్జు

నుని రథముయొక్క నొగలిమీద కూర్చుండి వచ్చును. అర్జునుని కిరుప్రక్కలను భీముడు మొదలగు సహోదరులును అభిమన్యుడు మొదలగు కుమారులును నడిచివత్తురు. అట్లు వచ్చు అర్జునుని యెదిరించుటకు మనకు శక్యముకాదు. నీబలపరాక్రమముల చేత. నీబంటుతనము ప్రకాశించునట్లుగా పాండవులతో యుద్ధముచేసెదవు అట్లు యుద్ధము చేసి తెంపుచేసి చచ్చెదవు. అట్లు యుద్ధమందు చచ్చి వరిస్థుడవై పుణ్యగతిని పొందెదవు. ఇట్లు యుద్ధమందు చచ్చుట భృత్యధర్మమే యగును. గనుక నీవు నీ బలపరాక్రమములచేత పాండవులను యెదిరించి చచ్చుట మంచిదే. అయినను దుర్యోధనుని చావునకు సమ్మతించి నీవు యింతప్రయత్నమును చేయుచున్నావు. నీవు దుర్యోధనుని చావునకు సమ్మతింపరాదు. అని ధృతరాష్ట్రుడు కర్ణునితో చెప్పెను. ఆమాటను కర్ణుడు విని మిక్కిలి కోపమును బూని ధృతరాష్ట్రునితో యిట్లనెను.

## కర్ణుడు భీష్మునిపై రోషముచేత అస్త్రసన్యాసము చేయుట

ధృతరాష్ట్రమహారాజా! ఇదియంతయు యిట్లయ్యెను. అట్లుగాక తక్కినది అట్లుండెను. ఇప్పుడు భీష్ముడు నన్ను నిరాకరించి పలికిన మాటలు ఫలమును ఆ భీష్ముడు అనుభవించుగాక అని కర్ణుడు ధృతరాష్ట్రునితో చెప్పి భీష్మునుద్దేశించి యిట్లుచెప్పెను. భీష్మా! యిప్పుడు నీవు నన్ను నిరాకరించినందున నాభుజాబలము నీకు సహాయము గాకుండవలయును. నీవు యుద్ధమందు పడు పర్యంతము నేను యుద్ధముచేయను. నేను ఆయుధములను ధరింపకుందును. నీవు యుద్ధమందు పడినపిమ్మట నాబలపరాక్రమ శౌర్యములను నేను జూపెదను. అని కర్ణుడు భీష్మునితో చెప్పి అస్త్రసన్యాసముచేసి సభలో నిలిచియుండుటకు సమ్మతింపక దిగ్గున లేచిపోయెను. ఆ సమయమున

భీష్ముడు నవ్వుచు దుర్యోధనునితో యిట్లనెను. దుర్యోధనా! కర్ణుడు యుద్ధము చేయకుండుటకు సమర్థుడు ఇంతకుముందు పాండవులను గెలిచెదనని కర్ణుడు ప్రతిజ్ఞచేసి యిప్పుడు యుద్ధము చేయనని లేచి పోయెను. ఇంతపెద్దమనిషి యగు కర్ణుడు కోపించినయెడల యుద్ధమందు పాండవులు యెట్లు బ్రతుకుదురు? దుర్యోధనా? కర్ణునిమాటలు విని నీవు ధర్మరాజుతో నెట్లును యుద్ధము చేయకమానవు. ఆయుద్ధమందు నీవు అనుమానమును విడిచి నేను చేయు యుద్ధమును కర్ణుడు చేయు యుద్ధమును చక్కగా చూచుచుండుము. బాహ్లీకద్రోణులు మొదలగువారు చూచుచుండగా పాండవపక్షమందుండు అనేక సహస్రవీరులను చంపెదను. పిమ్మట కర్ణుడు చేయు యుద్ధమును చూచెదవుగాక అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పెను. దుర్యోధనుడు కర్ణునియందు పక్షపాతము వహించి అవివేకియై సహింపజాలక భీష్మునితో యిట్లనెను.

భీష్మా! నీవును ద్రోణాదులును, పాండవులు యుద్ధమందు గెలుతురని యెరిగియో యెరుగకనో అందరు వినుచుండగా సర్వదా జెప్పుచుందురు. సేనాముఖమందు నిన్నును ద్రోణాదులును నేను యుద్ధము చేయుటకు పూనితిని. ఇదియే నామొనగానితనమునకు జాలును. కర్ణదుశ్శాసను లిద్దరును గలిగియుండగా యితరులతో నాకు పనిలేదు. మేము ముగ్గురమే పాండవుల సకలసైన్యములను గెలువగలము. ఇతరుల సహాయమును మేము అపేక్షింపము. ఈ నాలుగుసముద్రములలోపల నుండు భూమండలమంతయు నిరభ్యంతరముగా మాపరాక్రమమువలన మాకు దక్కును. మానిర్ణయము ఇటువంటిది. ఇది నీతియో అవినీతియో తుదియందు చూడుము. అని భీష్మునితో దుర్యోధనుడు చెప్పెను. ఆమాటలను ధృతరాష్ట్రుడు విని దుఃఖముగలవాడై తనకొడుకగు దుర్యోధనుని యేమియు అనజాలక విదురునితో యిట్లనెను.

విదురుడా! అయ్యో! నాకొడుకగు దుర్యోధనుడు కర్ణుని సహవాసముచేసి మృత్యుపాశముచేత కట్టబడెను. అయ్యో! దుర్యోధనుడు మీకుయెఱుగక నాశమును పొందదలచెను. ఇక మనమేమి చెయవలెనో చెప్పుము. అని ధృతరాష్ట్రుడు విదురు నడుగగా విదురు డిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! మనకౌరవులు యిదివరకే దుర్బలులై యున్నారు. తమలోతాము కలహించుకొని విరసముగా మాటలాడుచు ఒకరియందు ఒకరు ద్వేషము గలిగించుచున్నారు. ఇదియంతయు అర్జుననకు కార్యసాధనమే యగును. ఇంతమాత్రమే గాని యికను మన మేమనవచ్చును. పాండవులు బంధుమిత్ర సహాయులై అందరును ఒక్కటే తలంపు గలిగియున్నారు. వ్యర్థములైన యీపనికిమాలిన మాటలు విడిచి పాండవులను పిలిపించి ధర్మప్రకారముగా జరుపవలయును. ఇట్లు చేయుట తప్ప మనము చేయదగిన మరియొక పనిలేదు. అని విదురుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. అప్పుడు ధృతరాష్ట్రుడు పాండవులు కడపట చెప్పినమాటను వినవలెనని సంజయుని తట్టుమరలి ఆతనితో యిట్లనెను. సంజయా! నీతో అర్జునుడు తాను తలచినప్రకారము వరుసగా అన్నిమాటలను చెప్పెను. ఆమాటల నన్నిటిని నాకు చెప్పితివి. నిన్ను ఆపాండవులు పంపించునప్పుడు కడపట అర్జునుడు నీతో యేమని నిశ్చయించి చెప్పెనో అమాటను చెప్పుము చూతము. అని ధృతరాష్ట్రుడడుగగా సంజయు డిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! అర్జునుడు తుదకు నిశ్చయించి యిక్కడ పెద్దలందరును వినుచుండగా దుర్యోధనునితో చెప్పుమనిన మాటలను జెప్పెదవినుము. సంజయా! ధర్మరాజు, కురువంశస్థులలో శ్రేష్ఠుడగును. ఆ ధర్మరాజు నాతండ్రిభాగ్యమైన సగముభూమిని నాకు యివ్వదగునని చెప్పగా ఆమాటను దుర్యోధనుడు వినియు గర్వించి

యిన్వానియెడల నేనుచేయుటకు నిశ్చయించిన కార్యమును చెప్పెదను వినుము. నాబాణాగ్నిజ్వాలలయందు కౌరవులను వరుసగా వారియై శ్వర్యములతోగూడా హోమముచేసెదను. ఈమాట నిశ్చయము. ఇట్లు నేను నిశ్చయించి చెప్పినట్లు పెద్దలందరు వినుచుండగా నీవు దుర్యోధనునితో చెప్పుము. అని అర్జునుడు సంజయునితో చెప్పినట్లు సంజయుడు అందరు వినుచుండగా ధృతరాష్ట్రునితో చెప్పి మరలయిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! అట్లు అర్జునుడు నిశ్చయించి నాతో చెప్పి నన్ను కౌగిలించుకొని వస్త్రభూషణాది మనోహరవస్తువులను నాకు బహుమానముగా యిచ్చెను. అంతట నేను కృష్ణ పాండవులతో వినయపూర్వకముగా పోయివచ్చెదనని చెప్పి వారిఅనుమతిని బొందివచ్చితిని. ఈసమాచారమంతయు దేవరవారికి యెరింగించెడి నిమిత్తమై అతివేగముగా వచ్చితిని. అని యిట్లు సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. ఆమాటలను దుర్యోధనుడు వినక పెడచెవుల బెట్టెను. ధృతరాష్ట్రుడును ఆమాటలనువిని దిగులుపడి వూరకుండెను. అంతట ఆసభయందుండు సమస్తజనులును దిగ్గునలేచి తమతమనివాస గృహములకు వెళ్ళిరి. ధృతరాష్ట్ర దుర్యోధన సంజయులు ముగ్గురు మాత్రము ఆసభామంటపమందుండిరి. ధృతరాష్ట్రుడు దుర్యోధనుని వంశమందు ప్రవర్తించెడివాడైనందున తనకొడుకగు దుర్యోధనుడు పాండవులను గెలుచునేమోయను దురాశగలవాడై సంజయునితో యిట్లనెను. సంజయా! పాండవపక్షమునందు వీరులబలములనున్ను, యీకౌరవవీరుల బలాబలములనున్ను నీవు యెరుగుదువు. ఈ రెండు పక్షములవారికిని యుద్ధము జరిగినయెడల యెవ్వరు గెలుతురో యీవిషయమును నిశ్చయింతము. ఈరెండుపక్షములవారిలో యేపక్షమందు అధికోపాయ పౌరుషవంతులు గలరో చెప్పుము చూతము. అని ధృతరాష్ట్రు డడుగగా సంజయు డిట్లనెను. మహారాజా! యీ

విషయమై నన్నడుగవద్దు. మీ తండ్రియగు వేదవ్యాసమునీంద్రుడు యిక్కడికి వేంచేయునట్లుగా భక్తిపూర్వకముగా తలచుకొనుము. ఇప్పుడే తమదేవియగు గాంధారీమహాదేవిగారిని యిక్కడికి పిలిపింపుము. ఆ వ్యాస గాంధారులు మిక్కిలి నీతివంతులు. నిశ్చయార్థమును యెరిగినవారలు. ధర్మవేత్తలు నీమనస్సునకు అసూయాది గుణములు కలిగినయెడల అట్టిగుణములను ఆ వ్యాస గాంధారులు పోగొట్టనేర్తురు. అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. అంతట ధృతరాష్ట్రు డట్లుచేసెదనని సంజయునితో చెప్పి ఒకపరిచారికను పిలిచి గాంధారీదేవిని రప్పించెను. అంతట ధృతరాష్ట్రమహారాజు సద్భక్తిపూర్వకముగా వేదవ్యాసమునిని తలచెను.

## వేదవ్యాసుడు ధృతరాష్ట్రునియొద్దకు వచ్చుట

అట్లు తలచిన క్షణమందే దివ్యజ్ఞాన మహానీయుడగు వ్యాసమునీంద్రుడు ధృతరాష్ట్రుని దగ్గరకు విచ్చేసెను. అప్పు డక్కడుండెడి వారందరును లేచి సాగిలపడి నమస్కరించిరి. అప్పుడు తగిన పీఠమందు వ్యాసమునీంద్రుని కూర్చుండబెట్టి అర్ఘ్యపాద్యాది విధుల చేత అందరును పూజించిరి. ఆ సమయమున ధృతరాష్ట్రుడు విన్నవించకమునుపే వ్యాసమునీంద్రుడు ధృతరాష్ట్రసంజయుల చిత్తవృత్తులను యెరిగెను. అంత వ్యాసుడు అనుగ్రహదృష్టిచేత సంజయుని జూచి యిట్లనెను. సంజయా! నీవు సమస్తమును యెరిగినవాడవు. గనుక నీ వూరకుండరాదు. ఈ ధృతరాష్ట్రమహారాజు నిన్నడిగిన విషయమును నేను వినుచుండగా చెప్పుము. అని వ్యాసమునీంద్రుడు సంజయునితో చెప్పెను. అప్పుడు సంజయుడు ప్రసాదమని చెప్పుచు ధృతరాష్ట్రునితో యిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! పాండవసైన్యమునకును, నీ సైన్యమునకును ఆధిక్యతను గురించి నీవు నన్నడిగితివి. పాండవసైన్యమందు

కృష్ణుడున్నాడు. ఆ కృష్ణునితో సమానుడగు వానిని నీ సైన్యమందు నాకు చూపుము. కృష్ణు డెటువంటివాడని యడిగితివేని చెప్పెదను వినుము. ధృతరాష్ట్రమహారాజా బాణాసురుడు భక్తివిశేషము చేత శివుని ప్రత్యక్షము చేసికొని తన వశమందుంచుకొనెను. బాణాసురుడు తన బలపరాక్రమముల చేత సకలజగత్తులను తనవశము చేసుకొనెను. అటువంటి సర్వలోకవీరుడగు బాణాసురుని గర్వమును ఒకఘడియ సేపులో కృష్ణుడు మాన్పి బాణాసురుని చంపెను. దేవేంద్రుని కల్ప వృక్షమును అనాయాసముగా ఆటలాడిన చందముగా తెచ్చెను. కనుక కృష్ణుని పరాక్రమము సర్వలోక ప్రసిద్ధము. మిక్కిలి అసాధ్య ములైన కార్యములనైనను కృష్ణుడు ఆటలాడిన విధముగా సాధింప గలడు. కృష్ణుడు పూర్వజన్మమందు నారాయణముని యను పేరుగల వాడై నరుడను పేరుగల మునికి స్నేహితుడై యుండెను. ఆ నరు డను మునియే యిప్పు డర్జునుడై పుట్టెను. అందువలన కృష్ణుడు పూర్వజన్మ స్నేహమువలన అర్జునునితో కలిసి ఏకస్వరూపుడై యుండెను. అటువంటి కృష్ణుని దివ్యచక్రాయుధము అతని మాయా బలమువలన సూక్ష్మరూపియై పాండవుల సకలాయుధముల యందును వ్యాపించి పాండవులకు విజయము కలిగింపుచుండెను.

ఓ ధృతరాష్ట్రమహారాజా ! నీవు మాటిమాటికి పాండవులబల పరాక్రమ తారతమ్యములను వితర్కించుచు ఊహింపుచున్నావు. పాండవుల బలతారతమ్యములను యెరుగుటకు సాధ్యముకాదు. వారి బలపరాక్రమములు తెలియబడక గూఢముగా నుండును. అదియును తెలియజెప్పెదను వినుము. పాండవుల బలపరాక్రమములు కృష్ణుడే యగును. కృష్ణుని మహాత్మ్యమును విన్నవించెదను చిత్తగింపుము. మహారాజా ! సర్వలోకములను ఒక తట్టునుండి కృష్ణుడొక్కడు మాత్రము మరియొక తట్టున నిలిచియున్నను కృష్ణుడే మిక్కిలి

బలముగలిగి యుండును. కృష్ణుడు లేనిచోట్లను సకలలోకములును మిక్కిలి బలహీనములై యుండును. సర్వలోకములును ఒకతట్టున నుంచి కృష్ణుడొక్కనిని మరియొకతట్టు నిలిపి త్రాసుచేత తూచినను కృష్ణునితట్టే బరువుగలిగి యుండును. లోకములున్నతట్టు బలహీన ములై తూగగలదు. కృష్ణుడు సంకల్ప మాత్రముచేతనే సకలలోకము లను పుట్టించుటకును, రక్షించుటకును, సంహరించుటకును సమర్థు డగును. కృష్ణుడు విలాసముకొరకు మనుష్యాది దేహములను పొంది అనేకవిధములైన పోకలు పోవుచుండును. మహారాజా! ఏపక్షమందు సత్యముండునో, ఏపక్షమందు ధర్మముండునో ఆపక్షమందు కృష్ణుడుం డును. కృష్ణుడున్న కారణమువలన ఆపక్షమునకు విజయము కలుగ గలదు. అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పి యిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! సర్వలోకములును కృష్ణుడేయయి సర్వభూతములకును స్వరూపుడై విహరింపుచుండును. కృష్ణుడు తన మాయచేత ఒక్కొకసారి మనుష్యాది దేహములను ధరించి పుట్టి, పెరిగి కర్మములను చేయుచుండును. లోకములందు సాధువులను రక్షించుటకును, దుర్మార్గులను శిక్షించుటకును భగవంతుడైన కృష్ణుడు పూనియుండి అవతారములను పొందుచుండును. లోకములను రక్షిం చుటయే కృష్ణునిపని. ఇప్పుడు కృష్ణుడు పాండవులను నెపముగా జేసి కొని పాపాత్ములైన నీ పుత్రుల నందరిని చంపుటకు పూనియున్నాడు. భగవంతుడైన కృష్ణుని స్వరూపమును వాస్తవముగా నెరిగి అతనిని ఆశ్రయించినవారు బ్రతుకుదురు. అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పగా ధృతరాష్ట్రుడు సంజయునితో యిట్లనెను.

సంజయా! కృష్ణదేవుడైన కృష్ణుని తెలుసుకొను పద్ధతిని నీవు చూచియున్నరీతిగా చెప్పుము. అని ధృతరాష్ట్రు డడుగగా సంజయు డిట్లనెను. మహారాజా! విద్యయనియు, అవిద్యయనియు రెండు

గలవు. అవిద్యచేత మోహింపబడినవాడు అజ్ఞానముచేత మిగ్రింగ బడినవాడై విష్ణుని యెరుగజాలడు. విద్యగలవాడు పరమాత్మ్మడైన విష్ణుని యెరుగగలడు. అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను. సంజయా! విద్యయనగా యెటువంటిదో చెప్పుము. అవిద్యయనగా యెటువంటిదో చెప్పుము. దేనివలన నీవు ఆ సర్వేశ్వరుడైన విష్ణుదేవుని యెరిగితివో అట్టిసాధనములను నాకు చెప్పుము. అని ధృతరాష్ట్రు డడుగగా సంజయు డిట్లనెను. మహా రాజా! సాత్విక, రాజస, తామసవికారములు మూడును ప్రకృతి కార్యములు. అట్టి వికారములచేత త్రిప్పటపడక పుణ్యకర్మలను చేయుచు ఆత్మధర్మము నాచరించుచు చిత్తశుద్ధికలిగి యుందును. ఇట్టి స్వభావముచేత నేను విష్ణుదేవుని యెరిగితిని. ఇదియే విద్య. నీవైనను యితరులైనను విష్ణుదేవుని నెరుగుటకు యీవిద్యయే మార్గము. ఇటువంటి విద్యగాని విధమంతయు అవిద్యగా తెలుసు కొనవలయును. అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. ఆ సంజ యుని మాటల నన్నిటిని ధృతరాష్ట్రుడు విని దుర్యోధనునితో యిట్లనెను.

కుమారా! దుర్యోధనా! సంజయుడు మిక్కిలి విహితుడ గుసు. మనకు మేలుగోరుచుండును. ఈ సంజయుని వుపదేశమును ఆధారముగా జేసికొని విష్ణుదేవుడైన కృష్ణుని ఆశ్రయింపుము. ధర్మ మార్గముచేత విష్ణుని ఆశ్రయింపవలెను. ఆ కృష్ణుని ఆశ్రయించిన యెడల నీవును నీతమ్ములును నీకొడుకులును బ్రతుకుదురు. అనియిట్లు ధృతరాష్ట్రుడు తనకొడుకగు దుర్యోధనునితో చెప్పగా దుర్యోధను డిట్లనెను. తండ్రీ! ధృతరాష్ట్రమహారాజా! కృష్ణుడు సకలలోకములను మ్రింగువాడైనను సర్వమును రక్షించువాడైనను కానిమ్ము. అతడు అర్జునునకు స్నేహితుడని నాచెవులారా వింటిని. అట్లువినుచు ఒకబా

ధను తప్పించుకొనుటకొరకు ధైర్యమునువిడిచి యికను కృష్ణుని ఆశ్రయింపను అని దుర్యోధనుడు తన తండ్రితో జెప్పెను. ఆమాటలను ధృతరాష్ట్రుడు విని తనభార్యయగు గాంధారితోయిట్లనెను. గాంధారీ! నీకొడుకగు యీదుర్యోధనుడు అధర్మవంతుడు. అవివేకి, నీతిలేనివాడు, కలహప్రియుడు, ఈర్ష్యను విడువడు. నామాటలను వినడు. ఈ పాపాత్ముడైన దుర్యోధనుడు చెడిపోవునేగాని బ్రతుకజాలడుసుమా! అని ధృతరాష్ట్రుడు చెప్పిన ఆ మాటలను గాంధారి విని తన పెద్దకొడుకగు దుర్యోధనునితో యిట్లనెను. కుమారా! దుర్యోధనా! నీవు ఆయుస్సును, లక్ష్మివిభవమును, ముమ్ములను, సకలస్నేహబంధు జనులను, విడుచుటకు ప్రయత్నము చేయుచున్నావు. ఇట్టి ప్రయత్నమును చేయుటవలన ప్రయోజనములేదు. నీవంటి అవివేకు లెక్కడను కనబడలేదు. ఆదైవము భీముని రూపముగావచ్చి చంపుచుండగా యితరులెవ్వరును అడ్డుపడజాలరు, అని గాంధారి తనకొడుకగు దుర్యోధనునితో చెప్పెను. ఆసమయమున వేదవ్యాసమునీంద్రుడు ధృతరాష్ట్రునితో యిట్లనెను. పుత్రా! ధృతరాష్ట్రా! భగవంతుడైన కృష్ణదేవుడు నీయందు దయగలిగియుండును, నీకును నీకు పరమాప్తుడైన సంజయుని నారాయణుని దగ్గరకు పంపించితివి. ఇట్లు పంపుట మంచికార్యమైనది. ఆమహాత్ముడైన కృష్ణదేవుని మహానీయ ప్రభావమును వాస్తవముగా యీసంజయు డెరుగును. ఈతడు చెప్పిన బుద్ధిని విని నీవు కృష్ణదేవు నాశ్రయింపుము. ఏకాగ్రచిత్తముగలిగి ఆరాధించెడి జనులకు అతడు సమీపమందుండును. కామక్రోధముల చేత మోహింపబడి తమకున్న ధనముచేత తృప్తినొందక అన్యాయమార్గమందు ప్రవర్తించువారలకు కృష్ణదేవుడు దూరమందుండును. సర్వవిధములచేతను నీవు అతనికి శరణాగతుడవై బ్రతుకుము అని వేదవ్యాసమునీంద్రుడు చెప్పెను. ధృతరాష్ట్రమహారాజు మహాప్రసాద

మని, మీరు చెప్పినట్లు చేసెదనని వేదవ్యాసునితో చెప్పినపిమ్మట సంజయునితో యిట్లనెను.

సంజయా! వాసుదేవ శబ్దమునకుగల అర్థమును నాకు స్పష్టముగా చెప్పుము. ఆవాసుదేవుని పొందెడి వుపాయమును నాకు వుపదేశింపవే యనియడుగగా సంజయు డిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! సర్వలోకములయందును వాసుదేవుడు నివసించియున్నందునను ఆతనియందు సర్వలోకములు నివసించియున్నందునను ఆతనికి వాసుదేవుడని పేరుగలిగెనని పెద్దలుచెప్పుదురు. ఆవాసుదేవ శబ్దమునకు యిదియే అర్థము. వాసుదేవ శబ్దార్థమునుయెరిగి ఆయనయందు భక్తిగలజనులయందు శుభము నివసించియుండును. మనోనిగ్రహమును పొందినయెడల అతనిని పొందుటకు మార్గమగునని పెద్దలు చెప్పుదురు. ఎట్లయినను ప్రయాసనుపొంది చిత్తవికారములనుమాన్పి కేవలభక్తివిషయమైన జ్ఞానముచేత వాసుదేవుని కొలువవలయును. అట్లు సేవించినయెడల భగవంతుడైన ఆతని కనుగ్రహము కలుగును గనుక నీవును అనేక విధములైన బుద్ధులనువిడిచి పరమాత్ముడైన వాసుదేవుని ఆశ్రయింపుము. అని సంజయుడు ధృతరాష్ట్రమహారాజుతో చెప్పెను. ఆమాటలను ధృతరాష్ట్రమహారాజు విని సంజయునితో యిట్లనెను.

సంజయా! నాకు నేత్రేంద్రియము లేనందున నేను అంతగా దుఃఖింపలేదు. సర్వమనోహర రూపుడైన కృష్ణదేవుని చూడనందుకు నేను సర్వదా దుఃఖింపుచుందును. అటువంటి కృష్ణదేవుని రాత్రింబగళ్ళును పాండవులు జూచుచున్నారు. పాండవు లెంత గొప్ప తపస్సు చేసిరో తెలియలేదు. కృష్ణదేవుడు తనను ఆశ్రయించిన భక్తులయందు దయగలిగియుండును. పాపములను పోగొట్టెడివాడగును. ధర్మపరతుడు. కృపాసముద్రుడు, సర్వలోక ప్రసిద్ధుడు, పరిశుద్ధపుణ్య

స్వరూపుడు. శరణాగతులను రక్షించువాడు. అటువంటి మహాత్ముడైన కృష్ణదేవుని ఆశ్రయించెదను. అని ధృతరాష్ట్రుడు సంజయునితో చెప్పి పరమ శాంతచిత్తుడై వేదవ్యాస మహామునితో యిట్లనెను. మహాత్మా! తండ్రీ! నేను కృష్ణదేవుని శరణుజొచ్చి బ్రతికెదను. అని ధృతరాష్ట్రుడు వ్యాస మునీంద్రునితో చెప్పుచు రెండు చేతులను జోడించుకొని నమస్కరించెను. వ్యాసమునీంద్రుడు ధృతరాష్ట్రునకు ఆశీర్వాదముచేసి అంతర్ధానుడై వెళ్ళెను. ధృతరాష్ట్రుడు దుర్యోధన సంజయులను తమ నివాస గృహములకు పంపించి తానును గాంధారియు అంతఃపురములోనికి వెళ్ళిరి. అట్లువెళ్ళిన ధృతరాష్ట్రుడు అంతఃపురమందు తగిన వ్యాపారములయందు ప్రవర్తింపు చుండెను. అని వైశంపాయన మునీంద్రుడు జనమేజయ మహారాజుతో చెప్పెను. అదియంతయు జనమేజయ మహారాజు విని అటు పిమ్మట జరిగిన వృత్తాంతమును చెప్పుమని వైశంపాయన మునీంద్రుని అడిగెను.

ఇది శ్రీ మహాభారతమందు ఉద్యోగపర్వమున
ద్వితీయాశ్వాసము.

---

## తృతీయాశ్వాసము.

దేవా! హరిహరనాథా! వైశంపాయన మునీంద్రుడు జనమేజయ మహారాజును జూచి యిట్లనెను. ఓ జనమేజయ మహారాజా! సంజయుడు వుపప్లావ్య పట్టణమందుండు ధర్మరాజు దగ్గరకు వెళ్ళి మాటలాడి ధర్మరాజుయొక్క అనుమతినిపొంది వచ్చెనని చెప్పితిరి. గదా! పిమ్మటి వృత్తాంతము చెప్పుడన మునియిట్లనెను.

సంజయుడు వుపప్లావ్య పట్టణము నుంచి వచ్చిన మరునాడు

ధర్మరాజు తన పుత్ర మిత్ర సహోదర భృత్యులనందరను పిలిపించి అందరు వినుచుండగా తన తమ్ములతో యిట్లనెను. ‘ఓ తమ్ములగు భీమార్జున నకుల సహదేవులారా! ఇప్పుడు మనము కృష్ణుని దగ్గరకు వెళ్ళి ప్రార్థించి అతనిని కౌరవ సభకు పంపించి సంధిజేయుమని ప్రార్థింతము. ఆ కృష్ణుడు కౌరవ సభలో మాటలాడిన యెడల సంధి కుదురును. సంధికుదిరిన యెడల బంధుస్నేహిత గురు జనులతో యుద్ధముచేయుట తప్పిపోవును. కనుక కౌరవసభకు కృష్ణుని పంపించిన యెడల అందరికి మేలగును.’ అని ధర్మరాజు అందరువినుచుండగా తన తమ్ములతో చెప్పి అందరిని వెంటబెట్టుకొని కృష్ణుని గృహము నకు వెళ్లెను. అప్పుడు కృష్ణదేవుడు ధర్మరాజును పూజించెను. సమస్త, బంధు మిత్రాది పరిజనులందరును ధర్మరాజును సేవించుచు చుట్టుకొనియుండిరి. అప్పుడు ద్రౌపదియు తగిన పరిచారిక స్త్రీలచేత సేవింపబడుచు ఒక ప్రక్కనుండెను. అంతట కృష్ణ ధర్మరాజు లిద్దరును సుఖముగా తగిన పీఠములయందు కూర్చుండిరి. అప్పుడు ధర్మరాజు కృష్ణునిజూచి యిట్లనెను

‘ఓ మహాత్మా! కృష్ణదేవా! మాకు గల సకలఆపదలను పోగొట్టుటకును శుభములను కలిగించుటకును, మాకు యీ జన్మమునందు నిన్ను జూపి మాతండ్రియగు పాండురాజు స్వర్గస్థుడాయెను. శత్రుమిత్రుల కార్యములను చక్కబెట్టుటకు యిది మంచిసమయము. దుర్యోధనుడు అవివేకి. నీకారణమువలన మేము దుర్యోధనునితో యుద్ధము మానుకొని మాపాలికి వచ్చు రాజ్యమును మేము అనుభవింపగలము. నీకు మేము ప్రద్యుమ్నాది కుమారులవంటివారము. మాకు కష్టము కలుగకుండునట్లు నీవు రక్షింపుము.’ అని ధర్మరాజు కృష్ణుని ప్రార్థింపగా కృష్ణదేవు డిట్లనెను. ‘ధర్మరాజా! నీవు ఆజ్ఞాపించుప్రకారము చేసెదను. నీతలంపు యేదియో చెప్పుము.’ అని కృష్ణదేవుడు చెప్పగా

ధర్మరాజు యిట్లనెను. మహాత్మా! కృష్ణదేవా! నీవు హస్తినాపట్టణమునకు వెళ్ళి కౌరవులతో తగిన మాటలను జెప్పి సంధికలిగింప వలయును. అని ధర్మరాజు కృష్ణునితో చెప్పి ప్రార్థించి అందు కతనిని సమ్మతింపజేసి యిట్లనెను. 8 మహాత్మా కృష్ణదేవా! మా తండ్రియగు ధృతరాష్ట్రమహారాజుయొక్క తలంపును దుర్యోధనుని పద్ధతియు నిన్నటిదినమందు సంజయుడు చెప్పినమాటలవలన నీకు తెలిసెను గదా! ఆ ధృతరాష్ట్ర దుర్యోధనుల చిత్తవృత్తి ప్రకార మంతయు సంజయుడు యెరుగును ధృతరాష్ట్ర దుర్యోధనులు భాగము పంచి యివ్వక వుపచార వ్యర్థవాక్యములచేత మా కోపమును తీర్చుచున్నారు. జూదమందు జరిగిన యేర్పాటు ప్రకారము మిక్కిలి దుష్కరములైన వనవాస అజ్ఞాతవాసములను పదమూడు సంవత్సరములవరకు మేము జరిపివచ్చితిమి. ఇప్పుడైనను ధృతరాష్ట్ర మహారాజు కులధర్మము నడుపవలెనని తలపక చెడదలచిన మోసల దుర్యోధనాది పుత్రులయిష్టప్రకారము ప్రవర్తించువాడని చెప్పవలయును. ఆ ధృతరాష్ట్రరాజు దుర్యోధనుని కుటిలబుద్ధిని మాన్పలేనివాడు. దుర్యోధనాదుల యిష్టప్రకారము ధృతరాష్ట్రరాజు ప్రవర్తించు పక్షమందు యింతకంటె మాకు అధికమైన ఆపత్తు కనబడలేదు.

౯ మా తల్లియగు కుంతీదేవియు నా సకలబంధుజనులును సంతోషించునట్లుగా కౌరవులను శాంతముజేయునట్టి వుపాయ మేదియో తెలియలేదు. కౌరవులును మేమును స్నేహముగలిగి ఒకటిగా బ్రతుకు వుపాయమేదియో తెలియలేదు. ఇందుకు మా పౌరుషము వుపయోగింపదు. కృష్ణా! ఇక్కడిబంధువులును నీవును ఆశ్చర్యమును పొంది వినుచుండగా అయిదుగ్రామములను మాకు యిచ్చినయెడల చాలునని నిన్నటిదినమందు నేను సంజయునితో చెప్పితిని. ఈ మాట అసత్యముకాదు. అయిదుగ్రామములను మా కిచ్చినయెడల అదియే

మాకు పరిపూర్ణమగునుసుమా! నేనడిగిన అయిదుగ్రామములనైనను ఆ దుర్యోధనుడు యివ్వజాలడేమో తెలియకున్నది. నేను క్రూర కర్మమైన యుద్ధము చేయుటకు సమ్మతింపజాలను. ఐశ్వర్యము నాకు వద్దని చెప్పుదునా నన్నాశ్రయించియున్న యీబంధుజనులకు అన్న వస్త్రములు జరుగజాలవు. కనుక కౌరవులును మేమును కలిసి రాజ్యలక్ష్మిని అనుభవించినయెడల నా బంధుమిత్ర జనుల కందరికిని సంతోషము కలుగును. అయ్యో! ఇతరులనైనను శత్రువులనైనను యుద్ధముచేసి చంపుటవలన ప్రయోజనములేదు. యుద్ధముతప్ప మరి యొక మార్గము లేదాయేమి? కౌరవపక్షమందుండు బంధుమిత్రు లందరును పొగడునట్లు యుద్ధమునుమాని మరియొకవిధమున మనము ప్రవర్తింతము. సంపదనిమిత్తమై యుద్ధమందు సకలబంధు జనులను చంపి దూషింపబడి పాపమును పొందుటకు సమ్మతింపరాదు. ఈ దురవస్థను పొందుటకు వొప్పుకొనరాదు. 15 అని ధర్మరాజు కృష్ణునితో చెప్పెను.

14 కృష్ణా! క్షత్రియజన్మమింత క్రూరజన్మము. క్షత్రియుడగు వాడు శస్త్రాస్త్రములవలన జీవింపవలయునేకాని యితర ధర్మముల వలన జీవింపరాదని పెద్దలు చెప్పుదురు. కనుక క్షత్రియులకు శస్త్ర జీవనమే తగియున్నది. అయినను యుద్ధమందు కౌరవులను చంపి వంశము నశింపజేయుటకు నా మనస్సు సమ్మతింపలేదు. 15 అదిగాక 16 యుద్ధమువలన విజయము కలిగినయెడల రాజ్యలక్ష్మి కలుగును. ప్రాణహాని కలుగును. ఇది నిశ్చయమగును. యుద్ధము చేసినయెడల ఒకనికి అనేకులు ఓడిపోవుట గలదు. బలహీనునిచేత బహుబలవంతు లును చచ్చుటయు కలదు. 17 యుద్ధమందు జయము గలుగుననియు ఓడుదుమనియు, నిశ్చయముగా చెప్పరాదు. యుద్ధమందపజయమును పొందినయెడల అది మరణముకంటె మిక్కిలి కష్టముగా హృదయ

మును ఛేదించును. ఇది నిశ్చయము! కనుక యుద్ధము జరుగని ప్రయత్నము వలన శత్రువులతో సంధిచేసికొని ధైర్యము కలిగియుండి కొమ్మమీద చేయిపట్టుకొని సుఖముగా నిద్రింపవచ్చును. విరోధము కలిగియున్న యెడల క్రూరసర్పముండు యింటిలో కాపురమున్నట్లు భయముగలిగి యుండునేగాని నిర్భయముగా బ్రతుకుటకు సాధ్యము గాదు. కనుక యెవ్వరికిని దీర్ఘవిరోధము పనికిరాదు. విరోధమును యేవిధముచేతనైనను మాన్పుట శుభమగును. విరోధమును పోగొట్టుటయే శ్రేష్ఠమైన కార్యము. విరోధమును కలిగియున్న యెడల మనస్సునకు బాధకలుగును. విరోధము వలన యుద్ధము జరుగును. యుద్ధము వలన సకల ప్రాణులకు హానికలుగును. మరియు వంశము నశించును. యుద్ధముచేసి పగతీర్చిన యెడల క్రూరభావము గలిగి యుండును. యుద్ధమందు అపజయమును పొందియెడల అపకీర్తి కలుగుటయేగాక పరలోకహాని కలుగును. యేవిధము చేత చూచినను విరోధమువలన మేలునిశ్చయముగా గలుగదు.

ఓ కృష్ణా! కనుక శాంతమును పొందుటయే మంచిది. అదిగాక రాజ్యలక్ష్మి కావలె ననియు, యుద్ధము జరుగకుండవలెననియు, మేము కోరుచున్నాము. సకలమైన ధనములు కులములు క్షయములు గాకుండునట్లు మరియొక యేవిధము చేతనైనను కార్యము చక్క బడుట మిక్కిలి మంచిదగునుసుమా! కనుక నీవు కౌరవ సభకు వెళ్ళి మాయందు పక్షపాతమును విడిచి రెండు పక్షములయందు సమానబుద్ధి గలవాడవై న్యాయధర్మ ప్రకారము మాటలాడుము. మాకును కౌరవులకును మేలు కలుగునట్లుగా మాటలాడుము. భీష్మ ద్రోణ విదురాదుల బుద్ధికి యేవిధముగా సంతోషము కలుగునో ఆ ప్రకారము ధర్మయుక్తము లయిన మాటలను మాటలాడుము మరియు వుచితమైన నీ నేర్పరి తనముచేత రాజులందరును విను

చుండగా కఠినముగా సమయముజూచి మాటలాడుము. నీవు మాట లాడు నప్పుడు దుర్యోధనరాజు నిర్దయగా మాటాడిన యెడల ఆ మాటలకు సహించి యుండుము. శాంతమూర్తివై నిలిచియుండుము. ఆ దుర్మార్గుడైన దుర్యోధనుడు పెద్దవారి మాటలనువినడు. అట్టి దుర్యోధనుని దగ్గర ధృతరాష్ట్రుని యిష్టప్రకారము మనము నిలిచి యుండుటవలన పెద్దలందరును సంతోషింపగలరు. నీయొక్క ప్రభుత్వ గౌరవములు ప్రకాశింపగలవు. నీవుమాటలాడు నప్పుడు ధృతరాష్ట్ర రాజు దుర్యోధనుని వశమందుండి నీకు తగిన మాటలను చెప్పక అన్యాయమందు ప్రవర్తించిన యెడల సంధికలుగదని నీవు తెగించి శీఘ్రముగా లేచిరావద్దు. నీవు తెంపుచేసి చెప్పునప్పుడు ధర్మమార్గము లోక ప్రసిద్ధమగునట్లు మాట్లాడి పిమ్మట యిక్కడికి మరలిరమ్ము. మామనస్సులకు నిశ్చింతగలుగునట్లుగా జేయుము. ఇన్ని కష్టముల చేత మాచిత్తములు దహింప బడుచున్నవి. మామనో దుఃఖము లను తీర్చుటకు నీవే వుపాధ్యాయుడవు.

కృష్ణా! వేయిమాటలు చెప్పుటవలన ప్రయోజనములేదు. ముఖ్యమైన మాటలను చెప్పెదను వినుము. నీవు యేరీతిగా నన్ను ప్రవర్తింప చేయదలచితివో అదియే నాకు పరమ సంతోషముగ్గ అని ధర్మరాజు కృష్ణదేవునితో చెప్పి తన మనస్సున వేరొక అభిప్రాయ మును తలచికొని మరియు యిట్లనెను. ఓమహాత్మా! కృష్ణదేవా! నీవు దుర్యోధనుని దగ్గరకు వెళ్ళరాదని యిప్పుడు నాకు తోచు చున్నది. ఆ దుర్యోధనుడును, అతని మంత్రులగు శకుని కర్ణాదులును నీవు చెప్పెడి మంచిమాటలను వినరు. దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు నలుగురును కుటిలబుద్ధిగలవారు, అవివేకులు, క్రూరకర్ములు. అటువంటి నీచుల దగ్గరకు నిన్ను పంపజాలను. నీవు కష్టపడిన పక్షమందు దేవేంద్ర పదవినైనను నేను పొందజాలను. కనుక నీవు

వొంటరిగా దుర్యోధనుని వద్దకు వెళ్ళవద్దు. అని ధర్మరాజు కృష్ణునితో చెప్పగా కృష్ణుడిట్లనెను ధర్మరాజా! ధృతరాష్ట్రుడును దుర్యోధనునివలెనే కుటిలబుద్ధిగలవాడు. ఏమాటకుసత్యము. నీచులగు దుర్యోధనాదులు నా మీదకు యుద్ధమునకు వత్తురేమో తెలియదు. నీవట్లు తలంచుట నాకు తెలియును. నేను నిశ్చయముగా కోపమును వహించినచో కౌరవులలో ఒక్కడైనను నాయెదుట నిలిచి యుద్ధము చేయజాలడు. కనుక నన్ను కౌరవసభకు పంపుము. నేను వెళ్ళుట మంచిది కార్యానుకూలమగును. కౌరవసభకు వెళ్ళి నేను కౌరవులతో మాటలాడినపక్షమున ఆ కౌరవులు నామాటను లక్ష్యపెట్టక వినకున్నను మనయం దేవిధమైన లోపమును లేదని జనులకందరికిని తెలియగలదు అని కృష్ణదేవుడు ధర్మరాజుతో చెప్పెను. ఆమాటలను విని ధర్మరాజు కృష్ణునితో మరల నిట్లనెను. ఓ మహాత్మా! కృష్ణదేవా! ఆ కౌరవసభకు నీవు వెళ్ళదలచినయెడల మేలేయగును. గాన నీ కిష్టమైనయెడల మేమును ఆ కౌరవులును కలసియుండునట్లుగా సంధి గావింపుము. సర్వవిధముల చేతను ఆ కౌరవులతో మేము కలిసియుండ వలెనని కోరుచున్నాము. ఇదియే మాకు మంచికార్యము. నీవు మా అభిప్రాయములను యెరుగుదువు. ధృతరాష్ట్రదుర్యోధనాదుల యభిప్రాయముల నెరుగుదువు. కార్యసిద్ధి వివేకము నెరుగుదువు. సంభాషింపవలసిన వాక్యముల పద్ధతిని యెరుగుదువు. నీకు బుద్ధులు చెప్పుటకు నే నెంతవాడను? అని ధర్మరాజు కృష్ణునితో చెప్పగా కృష్ణుడిట్లనెను.

## కృష్ణుడు ధర్మరాజుతో కౌరవుల నిర్ణయము చెప్పుట

ధర్మరాజా! నిన్నటిదినమందు సంజయుడు చెప్పినమాటలను నేను వింటిని. నీవు ఆ సంజయునితో చెప్పిన మాటలను వింటిని.

నీమనస్సు కేవలము ధర్మమార్గము నవలంబించియున్నది. కౌరవులు వైరమును విడువకున్నారు. వారికి భీష్మద్రోణులు కలరని బిరుసులై యున్నారు. రాజులగువారు పరులను యాచించి జీవింపరాదు. కౌరవులు సునాయాసముగా నీరాజ్యమును తీసికొన రుచిగలిగియున్నారు. అటువంటి కౌరవులు నీకు సులభముగా రాజ్యమును పంచియివ్వరు. దుర్యోధనాది కౌరవులు అధర్మమునకును చేటునకును భయపడరు. దుర్యోధనాది కౌరవులు దుర్మార్గులు. నీవు దైన్యమును విడువుము. యుద్ధమందు కౌరవులను పొడిచి విజయమును పొందుము. శత్రువులను జయించుటవలన యిహపరలోకసౌఖ్యములను బొందుటయే గాక నీకు శాశ్వతమైన కీర్తి లభించును. 3 పూర్వము కౌరవులు మూఢులై ద్రోణ భీష్మాదులు చూచుచుండగా సభయందు మీకు అట్లు కీడు గలిగించిరి. కౌరవులట్లు కీడు గలిగించినందులకు పశ్చాత్తాపమునైనను పొందలేదు. అట్టి కౌరవుల విషయమై దయాబంధుత్వములను విడువుము. ఆకౌరవుల గర్వక్రూరకార్యములను చూచినవారందరును కౌరవులయందు కోపింపక మానరు. 4 కపటజూదమును నెపముగా జేసికొని మిమ్ములను వనములకు పంపునప్పుడు దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు నలుగురును కలకల నవ్విరి. అట్లు నవ్వి భయపడక వారనినమాటలు చెప్పుటకు శక్యముకానివి. ఆమాటలను సకలజనులును విని ధృతరాష్ట్రుని దూషించుచుండిరి. మీరు బలవంతులై యుండి సత్యము నవలంబించి వూరక వనములకు వెళ్ళితిరి. మీరు వెళ్ళుటజూచి జనులందరును ఆశ్చర్యమును పొంది చింతాక్రాంతులై యుండిరి. కౌరవు లిట్టి చెడుకార్యములచేత యిదివరకే దైవముచేత కొట్టబడి చెడియుందురు. కనుక అట్టి కౌరవులను యిక చెరుచుట సులభము. కౌరవులు క్రూరస్వభావులై నందున వారి చావును అందరును కోరుచుందురు. లోకమందుగల జనులంద

రును కౌరవులను చంపదగినవారుగా నున్నప్పటికి నీవు వారిని యెందుకు చంపవో తెలియుటలేదు. నిర్విచారముగా పాములను చంపినట్లు కౌరవులను చంపవలయును. అట్టి పాపాత్ములను చంపుట వలన దోషము లేదు. 37 మీతండ్రియగు ధృతరాష్ట్రునకును, మీతాత యగు భీష్మునకునుకు సంతోషము కలుగునట్లు వారియందు నీవు భక్తి గలిగియుండుము. మీ తాతలగు భీష్మాదులదగ్గరకు నేను వెళ్ళి నీ వినయభక్తి స్నేహగుణములను వర్ణించెదను 38 కౌరవసభకు నేనువెళ్ళి అక్కడుండు బంధుమిత్రులును నానాదేశముల రాజులును అందరు వినుచుండగా నీపుణ్యచరిత్రములను చెప్పెదను. నీవు తలచెడి ధర్మ మార్గమునంతయు చక్కగా చెప్పెదను. 39 నేను చెప్పుమాటలకు దుర్యోధనుడు సమ్మతింపక అనుకూలముగాని మాటలను చెప్పును. ఆధృతరాష్ట్రుడు దుర్యోధనుని చెడుబుద్ధిని నివారింపనేరక వుపేక్షించి యుండును. వారిద్దరిపద్ధతులను చూచి వారివలన మీరు పూర్వము పొందిన కష్టములను తలచి అందరును ధృతరాష్ట్ర దుర్యోధనులను నిందింతురు. ఇంతమాత్రమేగాని నునకు మరియొక ప్రయోజనము కనుబడదు. నాశక్తి యున్నంతవరకు అనేకవిధముల సంధి చేయవలె నని చూచెదను. అట్లు సంధియే సిద్ధించెడిపక్షమందు మేలేయగును. అట్లు సంధికలుగనియెడల కౌరవుల ఉత్సాహపద్ధతులను తెలిసికొని వచ్చెదను. కౌరవులలో యుద్ధము చేయదగినవారి ప్రవర్తన లన్నియు యెరింగి వచ్చెదను. ఆకౌరవరథికుల బలాబలములను అన్నిటిని యెరింగిన నీకు విజయము కలుగు పద్ధతిలో తిరిగివచ్చెదను.

40 ధర్మరాజా! దుర్యోధనుని ముక్కుయందు వూపిరి గలిగి యుండెడు పర్యంతము వాడు నీకు భూమిపంచియివ్వడు. కనుక నీవు యుద్ధమందు విజయ మూలకముగా సకల భూమి లభింపగలదు. నేను అనేక విధములైన శకునములను జూచితిని. ఏ విధముచేత జూచి

నను నీకు యుద్ధమందును విజయము కలుగునట్లు తోచుచున్నది. గనుక నీవు యుద్ధ ఉత్సాహమును విడిచియుండరాదు. ఉత్సాహమును గలిగియుండుము. 44 చతురంగ బలములను సిద్ధముచేయింపుము రథికులను పురికొల్పుము. భయమును వీడుము. సకల యుద్ధ ప్రయత్నములను చేయింపుము. కార్యము సాగింపుము. సాధింపుము. అని కృష్ణుడు ధర్మరాజుతో చెప్పెను. ఆ మాటలను భీముడు విని కృష్ణునితో యిట్లనెను.

4 కృష్ణా! యుద్ధము గలుగునని మమ్ములను నీవు భయపెట్టవద్దు. ఆ దుర్బుద్ధియైన దుర్యోధనుడు శాంతమును పొందు కార్యమును నీవు చేయుము. 44 దుర్యోధనుడు పాపాత్ముడు. మదాంధుడు. ఆ తులువయగు దుర్యోధనుడు నీవు చెప్పినట్లు చేయడు. దుర్యోధనుని మాటకు యెవ్వడును అడ్డుమాట చెప్పజాలరు. దుర్యోధనుడు మిక్కిలి దురభిమాని, కోపవంతుడు, దుర్యోధనుని మరలించుటకు యెవ్వరికిని సాధ్యముగాదు. అందరును దుర్యోధనుని వాని యిష్ట ప్రకారమే పోనిత్తురు. గనుక దుర్యోధనుడు నిన్ను లక్ష్యము చేయడు. నామాటజూడుము. 45 ఆ పాపాత్ముడైన దుర్యోధనుడు తనను దగ్గిరతీసిన వారిని చంపుటకు ప్రయత్నించును. భుజాబల గర్వముచేత దుర్యోధనుడు నన్ను మెచ్చడు. నీచుడగును. అటువంటి దుర్యోధనునితో కలిసి బ్రతుకుదమని మనము పోరాదు. అయినను మన అర్జునుడు మనరాచవాడును కురువంశమును నశింపచేయుటకు సమ్మతింపలేదు. గనుక కౌరవులతో మనము కలసి బ్రతుక వలయును పాలు నీళ్ళు కలసినట్లు పాండవులు కౌరవులు అందరును కలసి స్నేహము కలిగియుండగా దుర్యోధనుడు దుష్కార్యములచేత పాండవుల కింత కీడుకలిగించెనని దుర్యోధను డొక్కడే కులక్షయమునకు కారణ భూతుడాయెనని జనులు చెప్పుకొను

చున్నాడు. నీశక్తికొలది దుర్యోధనునకు బోధించి సంధికలిగింపుము. దుర్యోధనుడు దుర్మార్గుడైనందున భరతవంశమున కొకకీడు కలుగుట చేత నిందవచ్చునను సూహకలదు. అటువంటి నీచుడగు దుర్యోధనునకు బుద్ధిచెప్పి సంధిగలిగించి యీ భరతవంశమును రక్షించుటవలన మిక్కిలి గౌరవము గలుగును గనుక ఓకృష్ణా! మాకును కౌరవులకును భీష్ముడు తాతయగును. ఆ భీష్ముడు వినుచుండగా ధృతరాష్ట్రుని సభయందు నామాటగా దుర్యోధనునితో యిట్లని చెప్పుము.

50 దుర్యోధనా! అయ్యో! మనము అన్నదమ్ములమై యుండియు యితరులు తలయెత్తి చూచుచుండగా యుద్ధము చేయ వలసిన పనియేమో తెలియలేదు, మన పెద్దవారు చెప్పినట్లుగా మన మీ భూమిని పంచుకొని అనుభవింప వచ్చును. 51 అని యిట్లు నేను చెప్పినట్లుగా దుర్యోధనునితో చెప్పుమని భీముడు కృష్ణునితో చెప్పెను. కృష్ణా! నేను యిట్లు చెప్పితినని దుర్యోధనునితో నీవు చెప్పి యే విధముచేతనైనను, సంధి చేయవలయును. మేమును ఆ కౌరవులును కలిసి మెలసి అనుకూలముగా నుండుటవలన భూమి యందు గల జనులందరికిని మేలుకలుగును. అని భీముడు కృష్ణునితో చెప్పెను. 52 ఆ భీముని మాటలను కృష్ణుడు విని చిన్న నవ్వునవ్వి ధర్మరాజాదులతో నిట్లనెను. ధర్మరాజాదులారా! యీ భీముని వలన మనము యెన్నడైనను వినని వింత విషయముల నిప్పుడు విన గలిగితిమి. అగ్ని చల్లగా నున్నట్లును, మహాపర్వతము తేలికగానున్నట్లును యీ భీముని వలన మెత్తని మాటలను వింటిమి. ఈ భీముడే మెత్తగా మాటలాడినప్పుడు యిక తక్కినవారిని గురించి చెప్ప వలసిన పనిలేదు. అని కృష్ణదేవుడు ధర్మరాజుతో చెప్పి తన మనస్సులో నిట్లు తలచెను.

## శ్రీకృష్ణుడు భీముని కౌరవులతో యుద్ధమునకు పురికొల్పుట

యుద్ధమందు తన సహోదరులకు ఆయాసము కలుగునని భీముడు తలచెను. కౌరవులను చంపుటకు యిష్టములేక యున్నాడు. స్నేహభావము పూని కరుణ గలిగి యున్నాడు. అందుచేత యిట్లు మెత్తగా మాటలాడుచున్నాడు. ఈ భీముని కౌరవుల మీదికి పురికొల్పవలయును. అని కృష్ణుడు తన మనస్సులో తలచి భీమునితో యిట్లనెను. నీకు యిదివరకు యుద్ధమందు సర్వదా వేడుక కలిగి యుండును. మహాబలవంతులగు శత్రువులను చంపు బలగర్వ ఉత్సాహములు గలిగియుందువు. దుర్యోధనుని ఆధిక్యతను నీవు యిదివరకు సహింపకుందువు. నీయన్నయగు ధర్మరాజునకు రాజ్యమును కలిగింప వలెనని యిదివరకు నీవు సర్వదా తలచుచుందువు అటువంటి నీవు యిప్పుడు బీదమాటలు చెప్పుట యుక్తముకాదు, అని కృష్ణుడు భీమునితో చెప్పెను. భీమా! యిదివరకు నీవు భయము యెట్టు వంటిదో యెరుగవు, నీయంత వానికి యింత దృఢముగా నేర్పి యీపిరికి తనమును కలిగించినవారు యెవ్వరో చెప్పుము. అని యిట్లు కృష్ణుడు. అందరు వినుచుండగా భీమునితో చెప్పి కల కల నవ్వెను. అందుకు భీముడు నవ్వుముఖముకలవాడై కృష్ణునితో యిట్లనెను. కృష్ణా! నీవు బంటుతనములగు మాటలకు పోవద్దు. ఈ ధర్మరాజు తన తండ్రియొక్క రాజ్యభాగమును తీసికొనుటయే చాలునని తలచి నీతో సంధిచేయుమని చెప్పెను. ఆ ధర్మరాజు మాటలకు అడ్డము చెప్పరాదని నేనును అందుకు అనుకూలములైన మాటలను జెప్పితిని. ఈ విషయమును నీవు యెరుగవాయేమి? పూర్వము దుర్యోధనుని పద్ధతిజూచి అప్పుడు నీవేమంటివో నీకే తెలియును. యుద్ధభూమి యందు నిన్ను నేను సంతోషింప చేసెదను. నా భుజాబలమును ఆలోచింపక నీవు యిట్లు నన్ను దూషింపరాదు, భూమ్యాకాశములు

రెంటను తలక్రిందైనను చేతులొడ్డి త్రోయగలను. అని భీముడు కృష్ణునితో చెప్పగా నారాయణు డిట్లనెను.

భీమా ! నేను నవ్వులాటలకు అట్లంటిని. ఇంతమాత్రము చేత నే నీవుయిట్లు మాటలాడరాదు. దుర్యోధనాదులు చేసిన దుష్కార్యము లను నీవు తలంచక మెత్తగా మాటలు చెప్పితివి. ఆమాటలను నేను చూచి నీవు యిట్లు చెప్పరాదని యంటినేగాని యిదివరకు నీవు చేసిన కార్యమువలన నీ బలపరాక్రమములను నేను యెరిగియే యున్నాను. అని కృష్ణుడు భీమునితో చెప్పి మఱియు, భీమా! మన అర్జునుడు తన రథము తోలుటకు నన్ను సారథిని గమ్మని మిక్కిలిగా నన్ను ప్రార్థించెను. అందుకు నేను సంతోషించి అతనికి సారథ్యము చేయు టకు సమ్మతించితిని. కనుక అర్జునుడును నేనును యుద్ధమును గోరు చున్నాము. మేము నిన్ను ఆశించుకొని యున్నాము. శత్రువులను జయించుటవలన కీర్తికలుగుటయేగాక సకలరాజ్య భోగములును కలుగగలవు. శత్రువులను జయించుట వలన తప్ప తక్కిన వుపాయ ముచేత కీర్తి రాజ్య సౌఖ్యములు గలుగవు. అని యిట్లు కృష్ణుడు భీమునితో చెప్పెను. ఆ మాటలను భీముడు విని కృష్ణునితో యిట్లనెను.

కృష్ణా ! నీవును అర్జునుడును మొనగాండ్రై మీ భుజాబలము వలన కౌరవసైన్యములను చంపుడు. అప్పుడు మేము పెద్దమిట్టభూమి యెక్కి ఆశ్చర్యమును పొందుచు మిమ్ములను చూచుచుండెదము. ఈసారికి ఆ కౌరవసభకు వెళ్ళిరమ్ము. ఇప్పుడు భీముడు వుత్తమాట లకు కోపింపలేదని తెలిసికొనుము. అని యిట్లు భీముడు కృష్ణునితో మెలకువగా కార్యవాక్యములకు భీముడు మరుమాటలను చెప్పి ఆ మాటలచేత తృప్తిబొందక భీముడు కృష్ణునితో యిట్లనెను. కృష్ణా ! కౌరవులతో మనకు యుద్ధము కలిగినయెడల నా గదాయుధముచేత

కౌరవసైన్యములలోని యేనుగు కుంభస్థలములను పగులగొట్టెదను. గుఱ్ఱముల బొంగులను భూమిమీద కూలగొట్టెదను. రథసమూహము లను నేలపాలు చేసెదను. ఈప్రకారముగా కౌరవసైన్యములను చంపి నా గదాయుధమునకు పండుగ గలిగించి నీ మనస్సునకు వెక్కసము గలిగించెదను. ఇట్లు చేయవలెనని నేను కోరుచున్నాను. యుద్ధము జరిగినయెడల దైవప్రయత్నము సఫలమాయెనని తలచవలయును. అని యిట్లు భీముడు కృష్ణునితో చెప్పగా కృష్ణు డిట్లనెను. భీమా! నీవు మిక్కిలి మొనగాడవు. నీవు చెప్పినంత కంటె అధికముగా పని చేయుదువు. మేమందరము నిన్ను తెప్పగా జేసికొని మేము అనేక పర్యాయములు భయపడక దుఃఖసముద్రములను యీదితిమి. ఇక నీవు యీ కౌరవ కార్యమగు కౌరవసైన్యములను చంపి నమ్ములను సౌఖ్యవంతులుగా జేయుము. ఇదిగో కౌరవులదగ్గరకు పోయెదను. అట్లు పోయి తగినట్లు మాటలాడి సంధివిషయమై ప్రయత్నించెదను. ఇట్లుచేయుట నాకు తగును. సంధి కుదరనియెడల మాకందరకును నీవె రక్షకుడ వగుదువు. అని యిట్లు కృష్ణుడు భీమునితో చెప్పెను. అప్పు డర్జునుడు కృష్ణునితో యిట్లనెను.

## అర్జునుడు శ్రీకృష్ణునితో దన యభిప్రాయము చెప్పుట

మహాత్మా! కృష్ణా! నీవు సంధికి వెళ్ళు విషయమై చెప్ప వలసిన మాటల నన్నిటిని ధర్మరాజు నీతో చెప్పెను. అతని మాటల పద్ధతి నంతయు నీవు వింటివి. మేమందరము యిక చెప్పవలసిన మాటలు లేవు. అయినను నాకు తెలిసినంత చెప్పెద వినుము. ధృతరాష్ట్రరాజు అతిలోభము గలవాడగును. అతడు మాకు భూమి పంచి యివ్వడు. అతని పుత్రుడగు దుర్యోధనుడు పాపాత్ముడు. గనుక సంధి కలుగదని నీవు చెప్పుచు కైపుయెక్కిన వానివలె యిప్పుడు

సంధి చేయవలెనను తలంపు నీకు కలిగెను. నా గాండీవ దివ్యాస్త్రము లన్నియు వుంచినట్లే యుండగా సంధి చేసి మాకు సకల చింతలను పోగొట్టుము. నీవు చేయుటకు పూనిన పనివలన యెప్పటికిని కీడు కలుగదు. కొన్ని కార్యములు ఫలింపనట్లు తోచుచు పురుషప్రయత్నము వలన ఫలింపుచున్నవి. పురుషప్రయత్నమువలన ఫలసిద్ధి గలుగు విషయమై దైవసహాయ ముండవలయును. పురుషప్రయత్నము, దైవ సహాయము యీ రెండును నీ వినోదములు. ఇది సత్యము. దుర్యోధనాది కౌరవులు ధర్మరాజును బుద్ధిపూర్వకముగా అవమానించిరి. అట్టి కౌరవులు అందరిచేతను చంపదగినవారే యగుదురు. కౌరవులు మాయందు అసూయా కోపవంతులై మాకు కష్టములు కలిగించిరని నీవు తలచి ఆ కౌరవులయందు కోపము గలిగియున్నావు. మాయందు పరమకృపా స్నేహములను గలిగియున్నావు. అందుచేత నీవు యిట్లు చెప్పుచున్నావు. అయినను నా మనవిని చిత్తగింపుము. పాపాత్ములైన కౌరవులు సభయందు అట్లు ద్రౌపదిని అవమానించిరి. అందుకు మేము సహించి దైన్యమునకు నోర్చి ఆ ప్రకారము వనములకు వెళ్ళితిమి. ఈ విషయము నంతయు నీ వెరిగియున్నావు. గనుక నీవు కౌరవులయందు కోపమును సహించుకొని నీ నేర్పరితనముచేత వారికిని మాకును సంధి కలిగింపుము.

కౌరవులు వివేకము లేక మాకు కలిగించిన కష్టములు మా మనస్సునందు నిలిచి చవిటి భూమియందు వేసిన విత్తనముల వలె అంకురింపక చెడిపోయెను. ఆ మూర్ఖులగు కౌరవులను యేవిధముచేతనైనను సమ్మతింపజేసి మాకు సగము భూమిని పంచిపెట్టి మేము వారితో పొందు పొసగి యుండునట్లు చేయుము. ఇట్లు చేయుట మిక్కిలి మంచిది. గౌరవము కలుగును. సౌఖ్యము కలుగును. కృష్ణా! యీ విషయము నీ చిత్తమునకు సరి గాకున్న యెడల యిది

కూడదనియు, యీ ప్రకారము రండనియు మీరు యీ కార్యమును చేయుడనియు నీవు మాకు అనుజ్ఞనిమ్ము. కృష్ణా! యిది మాకు హితమనియు యీ పద్ధతి మాకు ధర్మమనియు యిది యిట్లుండవలె ననియు నీకు నేను బోధించుటకు నేను నీకంటె తెలిసినవాడనుగాను. నీవే హితధర్మములను విచారించి చూచి యెట్లుపొమ్మని మాకు ఆజ్ఞాపించెదవో ఆ ప్రకారము మేము నిశ్చింతగా జేసి అభివృద్ధిని పొందెదము. నీవు చెప్పిన ప్రకారము మేము ప్రవర్తించుట నేడు మాత్రమేకాదు. సర్వకాల సర్వావస్థల యందును నీ యాజ్ఞాప్రకారము మేము ప్రవర్తించెదము. అని ఇట్లు అర్జునుడు కృష్ణునితో జెప్పెను. ఆమాటల నన్నిటిని కృష్ణుడు విని అర్జునునితో యిట్లు అనెను.

అర్జునా! నేర్పుబలములచేత వేయివిధములుగా మేలు కలిగించి పైరుబెట్టినను తగిన కాలమందు వర్షము లేనియెడల ఆపైరు ఫలింపరాదు. ఆ ప్రకారమే దైవానుగ్రహము లేనియెడల పురుష ప్రయత్నములు ఫలింపజాలవు. దైవానుగ్రహమున్నయెడల చక్కగా చేసిన పురుషప్రయత్నము లన్నియు ఫలించుచుండును./ గనుక మీకును కౌరవులకును సంధి కలిగింపవలెనని నా శక్తికొలది పురుష ప్రయత్నమును చేసెదను. నా ప్రయత్నము దైవముచేత యెట్లగునో నేను యెఱుగను. దుర్యోధనుడు నామాటలను గౌరవించి మీకు సగము భూమిని పంచి యిచ్చుపక్షమందు బాల్యము మొదలుకొని యేవిధముచేతనైనను మిమ్మును చెరుపవలెనని మీకు యిన్నికష్టములను కలిగింపడు. అదియంతయు అట్లుండనిమ్ము. ఇక్కడ విరాటుని గోవులను మరలించుటకు నీవు వెళ్ళినప్పుడు భీష్ముడు దుర్యోధనునితో చెప్పిన పద్ధతిని చెప్పెదను వినుము.

దుర్యోధనా! యీ వచ్చినవాడు అర్జునుడు. మనము అవశ్యముగా యిప్పుడు గెలుతుమని చెప్పరాదు. రాజ్యలక్ష్మి నిమిత్తమై

యుద్ధముచేయు రెండుపక్షముల వారును గెలువజాలరు. ఒకపక్షము వారు గెలుతురు. మరియొక పక్షమువారు ఓడుదురు. కనుక ఇప్పుడొకానొక విధము ప్రకారము సంధిచేయుటమంచిది. అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పగా దుర్యోధను డిట్లనెను. భీష్మా! మనకును పాండవులకును యెట్లును సంధిగలుగజాలదు. నేను పాండవులకు రాజ్యభాగమును పంచిపెట్టను. యుద్ధమే చేసెదను. ఇదియే నా నిశ్చయమగును. అని యిట్లు దుర్యోధనుడు భీష్మునితో చెప్పెను. భీష్మదుర్యోధనులకు అప్పుడు జరిగిన సంవాదమును మనము వెనుకనే వినియున్నాము. అప్పుడు నీవు విరాటుని గోవులను మరలించి కౌరవసైన్యముల నన్నిటిని గెలిచి దుర్యోధనాదుల నందరిని అవమానించితివి. దుర్యోధనుడు తాను చెప్పిన మాటలకు తగిన ఫలము అనుభవించియు పిమ్మటనైనను తెలిసికొనలేదు. అని కృష్ణుడర్జునునితో చెప్పి మరల యిట్లనెను.

అర్జునా! ఆ దుర్యోధనుని గుణదోషములు అట్లుండెను. ధర్మరాజు చెప్పినప్రకారము నేను చేయవలయును. కనుక ధర్మరాజు చెప్పినప్రకారము సంధిచేయు నిమిత్తము నేను కౌరవ సభకు వెళ్ళి అక్కడుండు పద్ధతినంతయు చక్కగా యెరిగి వచ్చెదను. అని కృష్ణుడర్జునునితో చెప్పెను. అప్పుడు నకులుడు తిన్నగా కృష్ణునితో యిట్లు అనెను.

ఓ మహాత్మా! కృష్ణదేవా! ధర్మరాజ భీమార్జునులు ముగ్గురును నీతో చెప్పినమాటలు వ్యర్థములైనవిగావు. మేము వనవాస అజ్ఞాతవాసములను జరిపినప్పటివలె ఇప్పుడు మాకు దోషములు గలుగలేదు. ఇప్పుడు మా మనస్సులయందు కృపగలిగియున్నది. ఒకడు పశువును నడిపినయెడల మరియొకడు పెయ్యను నడుపవలసిన పనిలేదు. కౌరవులతో కలిసియుండుట చెడుమార్గముకాదు. మనకు

క్రూరస్వభావముండుటవలన ప్రయోజనమేమి ? అర్జునుడు విరాట్టుని గోవులను మరలించినది మొదలుకొని కౌరవులు మెత్తపడియుందురు. నీయనుగ్రహమువలన మాకు యేడు అక్షౌహిణుల సైన్యము చేరును. మనపక్షమందుండెడి రథికులును, పాంచాలయాదవ పాండ్య కేకయ మాత్స్యులందరును తెంపుచేసియున్నారని కౌరవులు యెరుగకుండరు. భీమార్జునుల బలపరాక్రమ దివ్యబాణములకును నీ సహాయమునకును కౌరవులు భయపడకుండరు. మరియు ద్రోణాచార్య కృపాచార్య బాహ్లీక భీష్ములు ఆ కౌరవులకు బుద్ధిచెప్పి చక్కచేయకమానరు. నీవు మంచిమాటలను చెప్పగా విదురుడు మెచ్చును. గనుక దుర్యోధనాదులు నీమాటలకు సమ్మతింపగలరు. నీవు వెళ్ళినప్పుడు దుర్యోధనాదులు నిన్ను ఆదరింపకుండరు. నీవు ఆ కౌరవులదగ్గరకు వెళ్ళినప్పుడే యీ సంధికార్యము చక్కపడును. అని నకులుడు కృష్ణునితో చెప్పెను. వారిమాటల నన్నిటిని సహదేవుడు విని కృష్ణునితో యిట్లనెను.

మహాత్మా! కృష్ణదేవా! దుర్యోధనుడును అతని తమ్ములగు దుశ్శాసనాదులును రాక్షసులవలె మాటలాడుదురు. వారిమాటలలో ఒక్కమాటనైనను నీవు కాదని చెప్పవద్దు. పూకొట్టుచుండుట అంతకంటె మిక్కిలి మేలగును. అయ్యో! దుర్యోధనుని వేడుకొను నిమిత్తము నీవు వెళ్లుచున్నావేమో తెలియుటలేదు. దుర్యోధను డెక్కడ ? భూమిలోసగమును పంచియిచ్చు టెక్కడ ? ఇంత మొన గాండ్రైన వీరులు యిట్లు వేడుకొనెడి దైన్యకార్యమును తలచరాదు. దుర్యోధనుని ప్రార్థించెడినిమిత్తమై ధర్మరాజు కృష్ణుని పంపెనను మాటను వినినయెడల మన బంధు స్నేహితులందరును మనలను దూషింతురు. ఇతరరాజులును యీ కార్యమును మెచ్చుకొనరు. ఇటువంటి హీనకార్యములను పౌరుషవంతులు చేయజాలరు. ధర్మ

రాజు నిన్ను వేడుకొనగా రాజ్యభాగమును ఇచ్చుటకు నీవు వెళ్ళు చున్నావు. దుర్యోధనాదులు రాజ్యభాగమును ఇవ్వక మనతో యుద్ధము చేయుదురు. యేవిధము చేతనైనను కూడు పెట్టుకలదె యగును కృష్ణా ! మనధర్మరాజ భీమార్జున నకులులు ధర్మమార్గ ప్రకారము చక్కగా మాటలాడినను కౌరవులు సంధికి సమ్మతించినను అట్టిసంధి కొనసాగ నేరదు కనుక యుద్ధమే తగినదగును. వంకరమాటలను చెప్పు టకు నేను నేరను. కౌరవసభయందు నిశ్చయముగా యిట్లని చెప్పుము. దుర్యోధనా ! నీవును పాండవులవలెనే పదమూడు సంవత్సరముల పర్యంతము వనవాస అజ్ఞాతవాసములను జరుపుము. అట్లు నీవు వన ములయందు తిరిగి వచ్చినపిమ్మట సగము రాజ్యమును నీవు తీసికొనుము నీవు వనవాసము చేసి వచ్చినపిమ్మట నీకు అర్ధరాజ్యమును ఇవ్వకుంటె వచ్చునా? అట్లు చేయజాలని యెడల యుద్ధమందు చచ్చిపొమ్ము. ఇక నీ నేర్పరితనము చెల్లదుసుమా ! అని దుర్యోధనునితో అందరువినను చుండగా చెప్పి వానిమనస్సు తూట్లుపడునట్లుగా చేయుము. అని సహ దేవుడు నారాయణునితో చెప్పెను. సహదేవుని మాటలను సాత్యకి విని సంతోషించి కృష్ణపరమాత్మునితో నిట్లనెను.

అన్నా ! కృష్ణా ! యీసహదేవుని మాటలు మిక్కిలి బాగుగా నున్నవి. దుర్యోధనుడు దుర్మార్గుడు. అట్టివానికి బోధించుటకు నీవు వెళ్ళినయెడల ప్రయోజనము గలుగదు. గౌరవము చెడిపోవును. ఈ వీరులందరును యుద్ధమందు మహోత్సాహము గలిగియున్నారు. ఈ వీరులందరికిని యుద్ధమే మేలని తోచుచున్నది. అని సాత్యకి కృష్ణుని తో చెప్పెను. ఆమాటలనన్నిటిని ఆసభయందుండు రథికశ్రేష్ఠులు విని తమలోతామిట్లు చెప్పుకొనిరి. రథికశ్రేష్ఠులారా ! సహదేవుడు మిక్కిలి చక్కగా మాటలాడెను. సాత్యకి చెప్పినమాటలు మిక్కిలి బాగుగా నున్నవి. తక్కిన ధర్మరాజాదుల మాటలు మాటలుగావు.

శత్రువులను అడుగబోవుట తగునట. యుద్ధముచేయుట మంచిదిగా దట. తాముబొందిన అవమానమును పోగొట్టుకొనుట తగదట. అని యిట్లనేకులు అనేక ప్రకారములుగా చెప్పుకొనిరి. వారిమాటలధ్వని మిక్కిలిఅధికమై ఒక్కటే మోతగా ఆ సభయందు వ్యాపించెను. ఆమాటలధ్వని ఆకాశమందు వ్యాపింపబడెను.

## ద్రౌపది కృష్ణునితో తాను మున్నుపడిన భంగపాటు చెప్పుట

పిమ్మట ద్రౌపది దుఃఖముగలదై అదివరకు ధర్మరాజు చెప్పిన సంధివాక్యములనువిని పరితపించుచుండెను. ద్రౌపది పరితపించుచు కోపముగలదై దుఃఖమువలన గద్గదకంఠధ్వనితో వాసుదేవునితో యిట్లనెను. కృష్ణా! దేవకీనందనా! ఆ కౌరవులు అన్ని చెడుకార్యములనుచేసి వానినన్నిటిని పోగొట్టి సంజయునిచేత వీరి యోగక్షేమములను యెరుంగుటకు సంజయుని యిక్కడకి పంపించిరి. ఇటువంటి ప్రియమాటలచేత ధర్మరాజు సంతోషించి తమ కయిదుగురికి అయిదు గ్రామములను కోరెను. ధర్మరాజు కోరినప్రకారము అయిదుగ్రామములను దుర్యోధనుడిచ్చి వీరినిక బాధింపకుండునేమో తెలియదు. దుర్యోధనాది కౌరవులును యీపాండవులును అన్నదమ్ములైనందున వారు వీరిని కష్టపెట్టరు. కౌరవులవలన యింతకు పూర్వము ధర్మరాజు బహుఅవమాన కష్టములను పొందెను. దుర్యోధనుడు ధర్మరాజునకు తమ్ముడైనందున అతనియందుగల స్నేహాధిక్యతచేత ఆదుష్కార్యములనన్నిటిని యీ ధర్మరాజు సహింపకుండడు. మరియు సరిగా సగభాగపు భూమినిపంచి తీసికొనినయెడల ఈపాండవులకు తెలివిలేదని జనులు చెప్పుకుందురు. మాకు ఆశలేదనియు, అయిదుగ్రామములే చాలుననియు యీ ధర్మరాజు సంజయునితో చెప్పెను. అట్లుచెప్పుట చేత యీ పాండవు లసమర్థులైనందున యిట్లయిదు గ్రామములనే

కోరిరని లోకులును కౌరవులును యెగతాళి చేయుదురు. కనుక యిటువంటి సంభవము గౌరవమును పోగొట్టుకొనవలసినపని యేమి? విచారించిచూడగా సంధి చేయుటచేత కౌరవులకే మేలగును. పాండవులు కౌరవులనుజూచినప్పుడు వీరు వారిని యుద్ధమందు సాధింపరేమో తెలియలేదు. అట్లుగానియెడల యుద్ధమందు కౌరవులనుకొట్టు తలంపు వున్నయెడల వారినిచంపరాదని సంశయముగలదేని తెలియలేదు. బ్రాహ్మణులైనయెడల వారుచేసిన కీడులను క్షమింపవచ్చును. కౌరవులు బ్రాహ్మణులుగానందున వారుచేసిన కీడులను క్షమింపరాదు. కృష్ణా! ఆ దుర్యోధనుని చిత్తమందు యుద్ధవిషయమైన భయము కొంచెమైనను కలిగియుండలేదు. నీమాటలకు దుర్యోధనుడు సమ్మతింపకుండుటయే గాక అధిక దురహంకారమును పొందును. కౌరవులు యుద్ధప్రయత్నములనుచేసి యుద్ధమునకు వచ్చినయెడల యీపాండవులు యుద్ధముచేయుదురో లేక వనవాసము చేయుటకు వెళ్ళుదురో తెలియదు. కృష్ణా! నేను యిట్లుచెప్పితినని సంధియత్నమును మానవద్దు. నీవును ధర్మరాజును అతనితమ్ములును మీరందరును తగినపద్ధతినిజూచి మనగౌరవకార్యములకు చేటుగలుగకుండునట్లుగా ఒకానొక విధముగా మీయిష్టప్రకారము సంధిచేసుకొనుడు. అని ద్రౌపదిని కృష్ణునితో చెప్పెను. కృష్ణా! నేను అపకీర్తిని సకలకష్టములను అనుభవించితిని. అందుచేత నేను యేమియు చెప్పజాలకున్నాను. ఆకౌరవులు మాకుగలిగించిన కీడునకు నోటితో కౌరవులకు అపకారము చేయుచున్నాను. నానోటికివచ్చిన మాటలను మనస్సునందు నిలుపజాలక కఠినముగా నోటితో ప్రేలుచున్నాను. నేను కీడు మేలులను యెరుగను. కోపముచేత పిచ్చిపట్టిన మనిషికి మరల వివేకమురాదు. కృష్ణా! మాతండ్రియగు ద్రుపదమహారాజు తపస్సుచేసి యజ్ఞముచేయగా వరమువలన ఆయజ్ఞమందు నేనుబుట్టి

తిని, భరతకులమందు ప్రవేశించితిని. ఆభరతవంశమున పాండుమహా రాజునకు పెద్దకోడలనై తిని. మహాపుణ్యాత్ములగు పాండవులకు భార్యనైతిని. నీతి పరాక్రమవంతులగు పుత్రులనుకంటిని. నాఅన్నదమ్ములగు ధృష్టద్యుమ్నాదులయొక్క ప్రాపుగలిగియుంటిని. ఇన్ని విధముల చేత లోకమందు నేనుపొగడబడుచున్నాను. అదిగాక నీవు సుభద్రయందుకంటె నాయందు మిక్కిలి కృపగలవాడవై నన్ను గౌరవింపుదువు. రాజసూయ మహాయజ్ఞమునందు అవబృథస్నానముచేత నా శిఖ మిక్కిలి పరిశుద్ధమైయున్నది. ఇటువంటి నాశిఖను ఆ దుశ్శాసనుడు పట్టుకొని యీపాండవులైదుగురును చూచుచుండగా నన్నుసభకు యీడ్చుకొని పోయెను. ఇందుకు కులస్త్రీలు సహించియుందురేమో చెప్పుము. అప్పుడు నేనుఒక్కవస్త్రమును కట్టుకొని రజస్వలనై యుంటిని; అట్టినన్ను దుశ్శాసనుడు సభకు యీడ్చి తెచ్చెను. నన్నవమానించి బాధించెను. అప్పుడు నాథులగు పాండవులైదుగురును దుశ్శాసనుని చూచుచు చిత్రపు బొమ్మలవలెనుండి వూరకుండిరి. అప్పుడు నామనస్సు నిన్నునమ్మి నిన్నుకోలు మటకు నీదగ్గరకువచ్చెను. ఆవిషయము నిప్పుడు నీవుతలంపుము. అప్పు డాధృతరాష్ట్రరాజు విచారించక నన్ను కోడలనుగా తలచలేదు. పిమ్మట యీపాండవులైదుగురును ఆధృతరాష్ట్రరాజు దగ్గరకువెళ్ళిరి. అంతట నేనును వీరి వెంబడివెళ్ళి కౌరవులకు కోడరికము చేయవలెనో లేక వారికిదాసినై దాసిచేసెడి నీచకార్యములను చేయవలెనో నీవు నిశ్చయించి చెప్పుము. అని ద్రౌపది నారాయణునితో చెప్పి మహాదుఃఖము గలదై తనశిఖయొక్క ముడిని విప్పి తలవెంట్రుకలను యెడమచేతితో పట్టుకొని దుఃఖించుచు కన్నీటిని కార్చుచు దిగ్గునలేచి కృష్ణునిదగ్గరకు వచ్చెను. ద్రౌపది తనశిఖయొక్క ముడిని విప్పగా వానిశిఖయందునల్లని తేజస్సుగల వెంట్రుకల జడయొకటి మహాసర్పమువలె ప్రకా

శించుచు వ్రాలియుండెను. ఆ జడను ద్రౌపది ఆతనిముందర బెట్టియిట్లనెను. అన్నా! నాతలవెంట్రుకలనుపట్టి దుశ్శాసనుని వ్రేళ్ళుతగిలి సగము వెంట్రుకలు వూడిపోయెను. తక్కిన సగము వెంట్రుకలును కౌరవులు మాటలాడిన అవమానవాక్యములచేత ఆ కౌరవులదగ్గర వూడిపోయెనని తెలిసికొనుము. ఇట్లు రెండుసగములుగా వూడిన నా వెంట్రుకలను నీకుచూపుటకు యిట్లుధరించియున్నాను. నాతలవెంట్రుకల యీ శిఖనుపట్టుకొని ఆదుశ్శాసనుడు ఒకచేతిచేత నన్ను యీడ్చెను. ఆదుశ్శాసనుని దేహమును యుద్ధమందు తునకతునకలుగా నరుకవలయును. అట్లు రూపుమాసి పడియున్న దుశ్శాసనుని కళేబరమును నేనుజూచినయెడల నాదుఃఖము నివర్తించును. ఇప్పుడు నాకు కలిగియున్న రోషదుఃఖములు చిన్నవలెనున్నవి. ఈ దుఃఖము వ్యర్థముగా నశింపదు. దుర్యోధనుడు పీనుగగును. ధర్మరాజును నేనును కండ్లారా జూడనియెడల యీభీమార్జునుల బలపరాక్రమములు కాల్చుటకు వుపయోగించునేగాని మరియొక కార్యమునకు వుపయోగింపనేరవు. ఈభీముడు పెద్దగదాయుధమును ధరించియున్నాడు. అర్జునుడు పెద్ద గాండీవ మను ధనుస్సును ధరించియున్నాడు. వీరిద్దరును కౌరవులను చంపనియెడల వీరిబలపరాక్రమములుమరియెక్కడ వుపయోగించునో తెలియకున్నది. ఈ ధర్మరాజును నేను నిన్నికష్టములను పొందితిమి. ఆదుర్యోధనుని శవమును మేముకండ్లారాజూడనియెడల మాదుఃఖము నశింపదు. బహుకాలమునుండి యిటువంటి కోపమును మనస్సునందు నిలిపియున్నాను. మిక్కిలిసాహసమైన వోర్పుచేత అగ్నిహోత్రమును వొడియందుబట్టుకొనినట్లు బహుకాలమునుండి యీ కోపమును నేను వహించి యున్నాను, ఈ కోపము యెప్పటికిని నాకు నశింపదు. కృష్ణా! లోకమందుగల దుష్టులను సంహరించుటకును పెద్దలను రక్షించుటకును సకల జగత్తులను రక్షించుట

కును నీవు పుట్టితివి. ఇటువంటినీవు నాకుఅన్నవగుచున్న. నా భర్తలగు యీ పాండవులు మహాకీర్తివంతులు. ఇటువంటి భర్తలును నీవును నావారైయుండగా యీదుఃఖము నాకు నశింపజాలదు. అని ద్రౌపది కృష్ణునితో చెప్పి మిక్కిలిగా యేడ్చెను. అంతట భగవంతుడైన కృష్ణుడు ద్రౌపదియందు కృపగలవాడై ఆమె నూరార్చి నూర్చుం డుటకు నియమించెను. ఆ ద్రౌపదికి కన్నులు తుడుచుటకును. జడముడు చుటకును, తగినపరిచారికస్త్రీలను కృష్ణుడు నియమించెను. అట్లు నియమించి ద్రౌపదితో యిట్లనెను.

## శ్రీ కృష్ణుడు ద్రౌపది నూరార్చుట

ద్రౌపదీ! నేనుండగా నీవు దుఃఖింపవలసిన పనిలేదు. నాకు భీమార్జునులను సహాయముగా ధర్మరాజు పంపిన యెడల నీవు మెచ్చునట్లుగా కౌరవుల నందరిని చంపెదను. ఎంతమాత్రమును సంధి కుదరదు. కౌరవులు భూమిని పంచిపెట్టరు. ద్రౌపదీ! ఇకను నీవు విచారింపకుము. కౌరవుల భార్యాపుత్రులు విచారించుకాలము సంప్రాప్తమైనది. ఆ దుర్యోధనాదుల భార్యాపుత్రాదు లందరును యేడ్చుచుండగా వారి దుఃఖధ్వనులను విని నీవు కల కల నవ్వు కాలము వచ్చినది. యమధర్మరాజుయొక్క దున్నపోతు మెడయం దుండు ఘంటల ధ్వనులను వినవలెనని కౌరవులు కోరుచున్నారు. కనుక సంధికార్యములకు సంబంధించిన వాక్యములు కౌరవులకు రుచి యింపవు. అదియును గాక కౌరవుల కందరికిని యుద్ధమందు నాశము కలుగునట్లుగా మొట్టమొదట ఆ బ్రహ్మదేవుడు నిర్మించినట్లు పెద్దలు చెప్పుదురు. ఆ విషయము తప్పదు. నేను మనస్సుచేత చూచి చెప్పిన యెడల మేరుపర్వతము తలక్రిందైనను నామాట తప్పదు. నేను పూనుకొని చెప్పుచున్నాను. నా మాటను వినుము. నీ భర్తలగు

పాండవులు సకల శత్రువులను సంహరించి మహత్తరమైన పుణ్యము లచేతను కీర్తిరాజ్య సామ్రాజ్యముల చేతను ప్రకాశింపుచు మహా దైశ్వర్యమును అనుభవింప గలరు. ఇకను ఆలస్యము లేదు. నామాట సత్యమగును. అని కృష్ణదేవుడు ద్రౌపదితో చెప్పెను. ఆ మాటలను ద్రౌపది విని దుఃఖమును విడిచి యోచ్చచాలించెను. అంత అర్జునుడు కృష్ణునితో యిట్లనెను.

కృష్ణదేవా! పాండవుల మైన మేమును కౌరవులును చుట్టరికమువలన నీకు సమానమే యగుదుము, గాన నీవు మనస్ఫూర్తిగా యే విధము చేతనైనను కౌరవులకును మాకును మేలు కలుగునట్లు చేయుము. ధర్మరాజు చెప్పిన ప్రకారము ధర్మయుక్తముగా తగినట్లు కౌరవ సభయందు చెప్పుము. దుర్మార్గులైన కౌరవులు ధర్మమార్గము నకు రానియెడల పిమ్మట దైవమే యెరుగును. అని అర్జునుడు కృష్ణునితో చెప్పగా ఆ మాటలను కృష్ణుడు విని అర్జునునితో యిట్లనెను. అర్జునా! మీకును కౌరవులకును మేలుచేయదలచి నేను ధర్మ రాజు చెప్పిన ప్రకారము ధృతరాష్ట్రుని దగ్గరకు ప్రీతిపూర్వకముగా వెళ్లుచున్నాను. ధర్మరాజు చెప్పినట్లు మాటలాడెదను. అని కృష్ణుడు అర్జునునితో చెప్పెను. కృష్ణుని ధర్మయుక్త వాక్యమును ధర్మరాజు విని సంతోషించి కృష్ణునితో యిట్లనెను.

మహాత్మా! కృష్ణదేవా! నీవు చెప్పినట్లు చేయుము. సంధి కలిగించుటయే మన నిశ్చయమగును. దీనిని నీవు మరువవద్దు. అని ధర్మరాజు కృష్ణునితో చెప్పి కార్య నిశ్చయముచేసి దినశుద్ధిని చెప్పి మరల యిట్లనెను కృష్ణదేవా! నీ జన్మనక్షత్రము, రోహిణిగదా! రేపటిదినమందు రేవతీ నక్షత్రము. రేపటి దినమందు నీకు చంద్ర బలతారాబలములు గలిగియున్నవి. ప్రయాణమునకు రేపు ప్రాతః కాలమందు బాగుగానున్నది. రేపటి వుదయకాలమందు ప్రయాణమ్ము

చేయుము. అని యిట్లు ధర్మరాజు కృష్ణునితో చెప్పెను. ఆమాటలకు కృష్ణుడు గౌరవ పూర్వకముగా అంగీకరించెను. అంతట ధర్మరాజు సభను కలియజూచి యిట్లు కృష్ణుని పంపుట మీకందరికి యిష్టమే గదాయని అందరి నడిగెను. అంతట ధర్మరాజు, అతనితమ్ములగు భీమార్జున నకుల సహదేవులును ద్రౌపదియు వారి పరిజనులును తగిన ప్రకారము తమ తమ నివాసము గల గృహములకు వెళ్ళిరి. మరు నాటి అరుణోదయ కాలమందు కృష్ణుడు స్నాన సంధ్యావందనాది కార్యములను తీర్చికొని సూర్యుని వుపాసించి అగ్నిహోత్రమును పూజించెను. అంతట కృష్ణుడు ప్రమాణదానములు మొదలగు పూజా విశేషములచేత బ్రాహ్మణులను పూజించి భక్తియుక్త ముగా నమస్కరించి ఆ బ్రాహ్మణులను సంతోషింప జేసెను. ఆ బ్రాహ్మణులు కృష్ణుని దీవించి మంత్రపూర్వకములైన అక్షత దూర్వాంకురములను యిచ్చిరి. వాని నన్నిటిని కృష్ణుడు గ్రహించి తగిన ప్రదేశమందుండి సాత్యకిని రప్పించి యిట్లనెను.

తమ్ముడా! సాత్యకీ! మన వారిలో హస్తినా పట్టణమునకు రాదగినవారిని రప్పింపుము. నీవును ప్రయాణమై నాతో హస్తినా పట్టణమునకు రమ్ము. దుర్యోధనుడు పాపాత్ముడగును. అతనిచేత మన్నింప బడెడువారును కుటిలబుద్ధి గలవా రగుదురు. గనుక నా చక్ర గదాది ఆయుధములను మన రథముమీద పెట్టింప వలయును. అని యిట్లు కృష్ణుడు సాత్యకితో చెప్పెను. ఆ సమయమున కాల మును కనిపెట్టి కృష్ణుని సారథియగు దారకుడు కృష్ణునకు కనబడెను. కృష్ణుడు దారకునిజూచి యిట్లు పలికెను.

దారకుడా! మనము హస్తినాపురమునకు వెళ్ళవలయును. గనుక మన రథమును పూన్పుము. అనియిట్లు కృష్ణుడు దారకునితో చెప్పెను అంతట కృష్ణుని రథమునకు దారకుడు శైబ్య సుగ్రీవ

మేఘ పుష్పనలాహాకములను సుగ్రములను పూన్చి ఆ రథమునకు గరుడధ్వజము నెత్తెను. ఆ దివ్యరథము నవరత్నముల కాంతిచేత దేదీప్యమానముగా ప్రకాశించుచుండెను. అట్టి దివ్యరథమును తయారుచేసి దారకుడు తోలుకొని తెచ్చెను. అంతట కృష్ణుడును ప్రయాణ వేషమును ధరించి మంగళవాద్యములు మ్రోయుచుండగా చామరములు ప్రకాశించుచుండగా జనుల నేత్రములకు కన్నులపండువుగా ఆ రథముమీద నెక్కెను. ఆ సమయమందు సాత్యకి పరిజన సమేతముగా వాసుదేవుని దగ్గరకు వచ్చెను. అప్పుడు వాసుదేవుడు తన వెనుక రథముమీద సాత్యకిని యెక్కించుకొని శుభ శకునములను చూచుచు పూర్ణకలశ వృషభాది శుభవస్తువులను జూచుచు బయలుదేరెను. పుణ్యస్త్రీలు వాసుదేవుని రథముమీద అక్షతలను చల్లుచుండిరి. వాసుదేవుడు సంతోష చిత్తము గలవాడై వెడలెను. ఆ సమయమున పాండవ సైన్యములును, యాదవ సైన్యములును, పాంచాల సైన్యములును, కేకయరాజ సైన్యములును, పాండ్య సైన్యములును, మత్స్య సైన్యములును, భద్రగజములును, గుర్రముల గుంపులును, రథసమూహములను, కృష్ణదేవుని పంపుటకు వచ్చెను. ఆ సైన్యముల నన్నిటిని వాసుదేవుడు చూచి ఆయా సకలరాజులను గౌరవ సంభాషణ పూర్వకముగా ఆదరించుచు తిన్నగా నడుచుచుండెను. ఇట్లు వాసుదేవుడు మెల్లగా నడచుచు విడిదిస్థలమునకు వచ్చెను. ఆ సమయమున మిక్కిలి శుభకరములైన శకునములు కనబడెను. ఆశకునములను జూచి అందరును సంతోషించిరి. ఇట్లు వాసుదేవుడు ఉపప్లావ్య పట్టణమునుండి బయలుదేరి వెళ్ళుచుండగా ధర్మరాజు తన రథమును వాసుదేవుని దగ్గరకు తోలించి ప్రీతిపూర్వకముగా వాసుదేవునితో యిట్లు పలికెను.

కృష్ణా! కృష్ణుడు వచ్చెననుమాటను మాతల్లియగు కుంతీదేవి వినినయెడల ఆమె ప్రాణములు లేచివచ్చును. సంతోషించును.

నీవు హస్తినాపురమందు విదురుని గృహమందున్న కుంతీమహాదేవి గారి దగ్గరకు వెళ్ళి పాండవు లందరి వంతునను ఆమెకు నమస్కరించి కుంతీమహాదేవిని కౌగిలించుకొని ఆమె చిత్తపరితాపమును పోగొట్టుము. మేము అడవికి వెళ్ళునప్పుడు మమ్ములను పంపుటకు కుంతీ మహాదేవి చాలదూరము వరకు వచ్చెను. అప్పుడామె ముఖము బహుదైన్యమును పొందియుండెను. కన్నీరు కార్చుచుండెను. అటువంటి కుంతీదేవిని మేము విడిచి పోవలసివచ్చెను. ఆ కుంతీదేవి యింత వరకు దుఃఖముచేత కుందుచు పాలలోబడిన బల్లివిధమున బాధపడుచుండును. వాసుదేవా! అయ్యో! లక్కయిల్లు కాలినదిమొదలుకొని కుంతీదేవి మానిమిత్తమై బహుదుఃఖములను పొంది కష్టపడుచు యెవ్వరు దిక్కులేనట్లున్నది. ఇకను నీ కష్టములు దీరి దుఃఖము నశించుకాలము వచ్చెనని నేను చెప్పినట్లుగా చెప్పుము. వాసుదేవా! నీ మేనత్తయగు కుంతీదేవిని నూరడింపుము. తనకు నీవు కార్యానుకూలుడవై యుందువని సర్వదా ఆ కుంతీ మహాదేవి చెప్పుచుండును. అని ధర్మరాజు వాసుదేవునితో చెప్పెను.

మహాత్మా! వాసుదేవా! ద్రోణాచార్యునకును, భీష్మబాహ్లికాది కురు వృద్ధులకును నేను చెప్పినట్లు చెప్పుము. కౌరవ సభయందు స్నేహితులకును, బంధువులకును, సకలరాజులకును, ప్రీతికలుగు నట్లుగా నేను నమస్కారాదులచేత సన్మానించి నట్లుగా చెప్పి ఆదరింపుము. మరియు పరమ సంతోష పూర్వకముగా విదురుని కౌగలించుకొని నాకొరకు నీవు పరమబాంధవుని రీతి వారిని సన్మానింపుము. విదురుడు మాకును కౌరవులకును మేలుకోరుచుండును. మధ్యస్థ బుద్ధి గలిగియుండును. మాకు మిక్కిలి పరమ హితుడు. అని ధర్మరాజు వాసుదేవునితో చెప్పెను. పిమ్మట అర్జునుడు వాసుదేవునితో యిట్లనెను.

వాసుదేవా! నీవు హస్తినాపురమునకు వెళ్ళి కౌరవ సభ యందు అందరు వినుచుండగా రాజ్యములో సగము రాజ్యము మేము తీసికొందుమని చెప్పుము. అందుకు ప్రసన్నుడై ధృతరాష్ట్రుడు సమ్మతించి మా సగము రాజ్యము మాకు యిచ్చినయెడల దుర్యోధనాదులు సమ్మతించినయెడల మేమును సమ్మతించెదము. అందుకు దుర్యోధనుడు సమ్మతింపక మరియొక మాట చెప్పినపక్షమున పుత్రమిత్ర సహితముగా కౌరవపక్షమునందుండు వారినందరిని యుద్ధమునందు చీల్చి పాతిపెట్టెదను. అని అర్జునుడు వాసుదేవునితో చెప్పెను. ఆమాటను భీముడు విని పెద్ద కంఠధ్వనితో యిట్లనెను.

కృష్ణా! అర్జునుడు కార్యవిషయము నీతిస్పష్టముగా చెప్పెను. ఇతనిమాట మిక్కిలి లెస్సగానున్నది. అని భీముడు అర్జునుని మెచ్చుకొనెను. ఆసమయమున భీముని ముఖమందు మహాగర్వము కనబడుచుండెను. అవయవములు వుప్పొంగి ధ్వనించు మదపుటేనుగు ధ్వనివలె భీముని కంఠధ్వని తోచుచుండెను. అప్పుడు నకులసహదేవులిట్లనిరి. కృష్ణా! నీవు శీఘ్రముగా హస్తినాపురమునకు వెళ్ళి స్నేహమునుగాని యుద్ధమునుగాని యీరెంటిలో నేదోయొకటి నిశ్చయించుకొని శీఘ్రముగారమ్ము. ఆలస్యమును చేయకుము. అని యిట్లు నకుల సహదేవులు కృష్ణునితో చెప్పి అర్జునుడు చెప్పినమాటలకు మిక్కిలి సంతోషించిరి. జనమేజయమహారాజా! ఈరీతిగా పాండవులందరును కృష్ణునకు చెప్పవలసినమాటలను చెప్పి కృష్ణుని కౌగిలించుకొని తగినప్రకారము మరలిరి. తక్కినరాజులందరును తగినప్రకారము కృష్ణుని అనుమతినిపొంది మరలిరి. అంతట కృష్ణుడు తన వెంబడి హస్తినాపట్టణమునకు వచ్చుచున్న ప్రయాణసర్వసంభార నిర్వాహకులను కలియజూచి తగురీతిని మాటలాడుచు వెళ్ళుచుండెను. హస్తినాపురరాజమార్గమును బట్టి శ్రీకృష్ణుని రథము వెళ్ళుచుండెను. కృష్ణుని

రథముయొక్క గుఱ్ఱములు మిక్కిలి బలవేగములు గలుగుటవలనను దారకుని చాతుర్యముచేతను అతివేగముగా నడచుచుండెను.

## శ్రీకృష్ణుడు నారదాది మహామునులను గని సంభాషించుట

శ్రీకృష్ణుడు బహుదూరమునకు వెళ్ళి వెళ్ళి మార్గమందు పోకచోట నారద, జమదగ్ని, కణ్వాదిమహామునులను కొందరును చూచెను. అట్లు చూచిన కృష్ణుడు రథమునుదిగి ఆమునులకు నమస్కరించి భక్తిపూర్వకముగా వారికుశలమడిగి యిట్లనెను. మహాత్ములగు నారదాదిమహామునులారా! మీరు యిచ్చటకు విజయము చేయుటకు కారణమేమి? నేను చేయవలసిన పనియేమో ఆనతిండు. అని కృష్ణుడడుగగా కృష్ణదేవునితో నారదుడిట్లనెను. మహాత్మా! కృష్ణదేవా! పుణ్యాత్ముడవగు నిన్ను చూచుటకును కౌరవసభయందు నీవు మాటలాడు మాటలను వినుటకును యీమునులందరును వచ్చియున్నారు. నీమాటలను విదురభీష్మాదులు యేరీతిగా వినెదరో ఆ పద్ధతిని యెరుంగుటకు యీమునులువచ్చిరి. నీవు చెప్పుమాటలను కౌరవసభయందుండువారు యేరీతిగా ప్రత్యుత్తరమును జెప్పుదురో ఆమాటలను వినుటకు యీమునులందరును వేడుకకలిగి వచ్చిరి. అని యిట్లు నారదమునీంద్రుడు కృష్ణునితో చెప్పెను. ఆ మాటలను కృష్ణుడువిని మంచిది. అట్లుచేయుదురుగాకయని నారదాది మహామునులతో చెప్పెను. నారదాదిమహామునులందరును కృష్ణునిదీవించి యిట్లనిరి. మహాత్మా! కృష్ణదేవా! నీవు హస్తినాపురమునకు వెళ్ళుము. మేమును అచ్చటకు వచ్చెదము. అని నారదాదిమునులు ప్రీతిపూర్వకముగా కృష్ణునితో చెప్పి పంపించిరి. అంతట కృష్ణుడు వెళ్ళి ఆదినము మధ్యాహ్నకాలమందు పోక, పుణ్యాశ్రమమున దిగి మాధ్యాహ్నికవిధులను నిర్వర్తించి పిమ్మట అక్కడనుండి బయలు

దేరి సూర్యాస్తమయకాలమునకు కుశస్థలమును చేరెను. అంతట ఆ కుశస్థలమందున్న బ్రాహ్మణులందరును కృష్ణున కెదురుగావచ్చి చూచి తమ నివాసగృహములకు రమ్మని కృష్ణుని పిలిచిరి. అప్పుడు కృష్ణుడు ఆ బ్రాహ్మణులయందు దయగలవాడై సమ్మర్దము కూడదని చెప్పి విశాలమైన మందిరాకారముగ బాహ్యప్రదేశమందు ఒక గృహముగా యేర్పరచెను. కృష్ణుడు తనబలములను జనులను వెంటబెట్టుకొని ఆ బ్రాహ్మణులగృహములకు వెళ్ళి ఆ బ్రాహ్మణులచేత అభ్యాగతపూజలను పొందెను. కృష్ణుడు ఆ కుశస్థలమందు బ్రాహ్మణులను ఆదరించి తన విడిదిప్రదేశమునకు వచ్చి తగినప్రకారము ఆ రాత్రి కాలమందు ప్రవర్తింపుచుండెను. ఆ రాత్రికాలమందు హస్తినాపురమందున్న ధృతరాష్ట్రుడు కృష్ణుడు వచ్చుచున్నాడని సమాచారమును వినెను. అట్లువిని ఆ క్షణమందే భీష్మ ద్రోణ విదుర కర్ణ సైంధవ శకుని దుర్యోధన సంజయులను పిలిచి దుర్యోధనునితో యిట్లనెను. పుత్రా! దుర్యోధనా! కృష్ణుడు పాండవుల కార్యార్థియై మనకడకు వచ్చుచున్నాడు. నేటి దినమున కుశస్థలములో నిలిచి యున్నట్లు తెలిసెను. రేపటిదినమందు ఆ కృష్ణుడు యిక్కడికి వచ్చునని వింటిమి. కృష్ణుడు లోకమందరిచేతను పూజింపబడు సర్వేశ్వరుడు. అటువంటి కృష్ణుడు మనవద్దకువచ్చుట ఆశ్చర్యముగానున్నది. అటువంటి మహానుభావుడగు కృష్ణుడు మనదగ్గరకు వచ్చుటకంటె మరియొక పుణ్యవిశేషమును లాభాతిశయమును కనబడదు. కృష్ణుడెవ్వరివలన సంతోషించునో వారికి తప్పక జయముకలుగును. అట్టి జనులకు శుభముకలుగును. కృష్ణుడెవ్వరియందనాదరము చూపునో అట్టివారి కపజయముకలుగును. అశుభములు కలుగును. ఇదితప్పదు. ఆ కృష్ణునకు తగిన పూజలను చేయుటకు యత్నింపుము. గృహముల నలంకరించుటకు తగురీతుల జనులను నియమింపుము. కృష్ణునకు నీ

విభవముపై ప్రీతికలుగునట్లు తగినప్రకారము సకలమును సిద్ధము చేయుము. అని ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో చెప్పెను. ఆ మాటలకు భీష్మద్రోణులు సంతోషించి ధృతరాష్ట్రుని బుద్ధివిశేషములను పొగడిరి. దుర్యోధను డంతట నట్లనే గావించుటకై తనపరిచారికా సమూహమును పిలిపించెను. దుర్యోధను డా వచ్చిన పరిచారకులను జూచి యిట్లనెను.

పరిచారకులారా! కస్తూరికలచేత మన పెద్ద సభాస్థలమును అలుకుడు. కర్పూరములచేత ముగ్గులు బెట్టుడు. కుంకుమములచేత గోడలను పూయుడు. మణుల దండలను కట్టుడు. యీరీతిగా మన సభాకూటము నలంకరింపుడు. మనపట్టణమం దంతటను మనోహరముగా అలంకారమును చేయుడు. మీచాతుర్యాతిశయములు ప్రకాశించునట్లు మన యింటియందును దుశ్శాసనుని యింటియందును మనోహరమగు శిల్పికార్యములను శోభనప్రదముగా చేయుడు. వృక్షస్థలమందు పందిళ్లు వేయుడు. అది విడిదిగా నగును. కృష్ణుడు రేపటి యుదయముననే యిచ్చటకు వచ్చును. ఆ కృష్ణుడు వచ్చు లోపలనే యీ చెప్పిన పనులన్నియు తయారు కావలెను. రేపుదయమున మన పురమం దుత్సవమని చాటింపు చేయింపుడు అని దుర్యోధనుడు తన పరిచారకులతో చెప్పి పంపించెను. నానావిధములగు గంధమాల్యాదులను సంపాదించుటకు తగు మనుష్యులను నియమించెను. నవరత్న భూషణ చిత్రవస్త్రములను సిద్ధము చేయుటకొరకు తగినవారి నేర్పరచెను. సరసములైన అన్నపానాదిభోజన పదార్థములను తయారుచేయుటకు తగిన జనులను నియమించెను. యీ ప్రకారముగా దుర్యోధనుడు ఆయా పనులు జేయుటకు నేర్పరులగు జనులను నియమించెను. ఆ సమయమున ధృతరాష్ట్రుడు విదురునితో యిట్లనెను.

## ధృతరాష్ట్రుడు విదురునితో శ్రీకృష్ణుని రాక చెప్పిన సంతోషించుట

తమ్ముడా! విదురుడా! కృష్ణుడు పాండవ కార్యార్థియై మన దగ్గరకు వచ్చుచున్నాడు. నవరత్న ఖచితములైన నానావిధ రథములను, నేను కృష్ణునకు యిచ్చెదను. మహావేగముతోకూడిన బలవంతములైన గుఱ్ఱములను, అనేక భద్రగజములను, రత్నభూషణములను, అనేక దాసీస్త్రీలను, నేను కృష్ణునకు యిచ్చెదను. మనయింటి యందును, దుర్యోధన దుశ్శాసనుల యిండ్లయందును కృష్ణుని కంటికి ప్రియమగు వస్తువుల నన్నిటిని నేను కృష్ణునకు యివ్వవలెను. అట్లు యిచ్చుటవలన మనకు గౌరవము కలుగును. అని ధృతరాష్ట్రుడు విదురునితో చెప్పెను. అమాటలను విదురుడు విని ధృతరాష్ట్రునితో యిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! కృష్ణుని మనస్సునకు సంతోషము గలిగించుట కంటె మరియొక మేలుకార్యము లేదు. పాండవుల కార్యము నిమిత్తమై కృష్ణుడు యిక్కడికి వచ్చుచున్నాడు. అతడు వచ్చుకార్యము ననుకూలింపజేసినయెడల అతడు సంతోషించును. ఆకార్యము సానుకూలము గానిపక్షమున మరియేమిచేసినను అతడు సంతసింపడు. (ధృతరాష్ట్రమహారాజా! నీ యభిప్రాయమును నేను యెరిగితిని. నీ నేర్పరితనముచేత కృష్ణునకు లంచమిచ్చి సంతోషింపజేసి కార్యభేదమును జేయవలెనని తలంచుచున్నావు. నీవు యింత పనికిమాలిన వాడవైతివి. మేరుపర్వతమంత ధనము అతని కిచ్చినను అతడు అర్జునుని విడువడు. అతనియందు అర్జునునకుగల అపరిమిత భక్తివిశేషములు నీవు యెరుగుదువుగదా! అర్జును డతని ప్రాణముతో సమానుడు. గనుక జలముచేత నిండియున్న పూర్ణకలశమును దెచ్చి ఆ నీటితో అతని పాదములు కడిగి పిమ్మట కుశల ప్రశ్నము చేయవలయును. ఇంతకుతప్ప వేరుకార్యమువలన అతడు

సంతోషింపడు. ధృతరాష్ట్రమహారాజా! నేను చెప్పుమాటను వినుము. కృష్ణదేవుడు పూనికతో యేకార్యముకొరకు యిక్కడికి వచ్చెనో ఆకార్యమును చేయుటయే అతనికి ప్రియమగును. తక్కిన విషయములచేత తృప్తిని పొందజాలడు. అని విదురుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. ఆమాటలను దుర్యోధనుడు విని ధృతరాష్ట్రునితో యిట్లనెను.

తండ్రీ ధృతరాష్ట్ర మహారాజా! యీ విదురుడు చెప్పిన మాట నిజమే. తుదకు కృష్ణుడు పాండవులను విడువడు. అతనికి మనము లంచము యిచ్చినయెడల మనము భయపడితిమని తలంచెదరు. మనము యిచ్చు లంచము అతడు తీసికొననియెడల జనులు నవ్వుదురు. అతడు పూజింప దగినవాడని నేను యెరుగుదును. అతనికి ధనమిచ్చినయెడల మనకు హీనత్వము సంభవించును. పాండవు లుప్పొంగి గర్వింతురేగాని వైరము మానరు. అని దుర్యోధనుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. ఆమాటలను భీష్ముడు విని ధృతరాష్ట్రునితో యిట్లనెను. కుమారా! ధృతరాష్ట్రా! నీ పుత్రుడగు దుర్యోధనుడును కృష్ణున కేమైన యిచ్చినయెడల ఒకటి తలచును, యివ్వనియెడల మరియొకటి తలచును. 166 అతడు చేయబూనిన పనిని తప్పింపరాదు. పాండవుల కార్యార్థము యిక్కడికి అతడు రేపువచ్చును. అతడు చెప్పినప్రకారము చేయుము. అతడు ధర్మార్థరూపముగా మాటలాడును. ఆమాటలను నీవును నీవారును గ్రహించి ... యిష్టప్రకారము చేయుము. అట్లు చేసితివేని సకల అనుకూలము లగును, అని భీష్ముడు ధృతరాష్ట్రునితో ఆమాటలను దుర్యోధనుడు విని భీష్మునితో యిట్లనెను.

భీష్మా! కృష్ణుడు వచ్చి యీ భూమిలో సగము పాండవులకు యిమ్మనును. నేను యెంతమాత్రము భూవి

ఆ విషయ మటుండనిమ్ము మరియొక కార్యమును చేయదలచితిని. ఆ కార్యమును చెప్పెదను వినుము. భీష్మా! పాండవులకు కృష్ణుడే దిక్కగును. అతనిని పట్టుకొని బంధించిన యెడల రెక్కలు విరిగిన పక్షులవలె పాండవులు నాకు విధేయులగుదురు. ఆ పాండవుల బంధుమిత్రులగు పాంచాల యాదవాదు లందరును నాకు వశవర్తులై ప్రవర్తింతురు. సకల దేశములను నేనే యేలుదును. గనుక అతనిని పట్టుకొని బంధించుటకు తగిన వుపాయములను సిద్ధముచేసెదను. ఇకను నీవేమి చెప్పెదవో చెప్పుము అని దుర్యోధనుడు భీష్మునితో చెప్పెను. ఆ దుర్యోధనుని అతిఘోర విచారమునకు మంత్రిజన సహితముగా ధృతరాష్ట్రుడు పరితపించి దుర్యోధనునితో యిట్లు అనెను.

ఓరీపాపాత్మా! దుర్యోధనా! ఓహోహో! ఇట్లు నీవు చెప్పుట జగద్ద్రోహము. ఈమాటను మరువుము. దూతత్వము 2 మాహాత్మ్యము 3 ధర్మోత్సాహము యీమూడును బాధ్యతకు కారణములగును. ఈమూడు కారణములు మాత్రమే కృష్ణునియందున్నవని చెప్పుటకు నాకుసాధ్యముకాదు. ఆకృష్ణుడే ఇక్కడికి వచ్చుటవలన కురువంశమునకు యేమైనను కీడుకలుగునా యేమి? అదిగాక కృష్ణుడు నీకేమైనను కీడు చేసెనా యేమి? అని ధృతరాష్ట్రుడు దుర్యోధనుని అదల్చెను. భీష్ముడు ధృతరాష్ట్రునితో యిట్లనెను. ధృతరాష్ట్రా! నీ కొడుకగు ఈ దుర్యోధనుడు ప్రాణహాని కార్యములు జేయదలచి కృష్ణుని పట్టుకొని బంధింపజూచిన యెడల దుర్యోధనుడును, యితనితమ్ములును వినాశమును పొందుదురు. ఇంతమాత్రమేయగును. ఇట్టి చెడుకార్యమును యీ దుర్యోధనాదులు చేసినను చేయకున్నను ఆ మహాత్ముడైన కృష్ణుని విషయమున యిట్టి అపరాధమును తలంచినందున యీ దురాత్ములిట్లు చెడిపోవుదురుగాక! ఇటువంటి మాటలను నేనువినజాలను. అని యిట్లు భీష్ముడు ధృతరాష్ట్రునితో చెప్పుచుముఖమునుచిట్లించుకొని

దిగ్గున లేచిపోయెను. అంతట ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో యిట్ల నెను. కుమారా! దుర్యోధనా! యిట్టి చెడుతలంపులను నీవు మనస్సు నందు తలచినప్పుడు చేయుటకు ప్రయత్నించెదవు. ఈ తలంపువలన నీకు చేటువచ్చును. కాన యిట్టి చెడుతలంపులను విడువుము. అని ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో చెప్పి అతనిని తక్కినవారిని అందరిని పంపించెను. అంతట ధృతరాష్ట్రుడు ఆ రాత్రికాలమందు తగురీతిని ప్రవర్తించెను. జనమేజయమహారాజా! ఆ మరునాడుదయకాల మున కృష్ణుడు ప్రాతఃకాలవిధులను తీర్చుకొని ఉదయకాలమందే బయలుదేరెను. అప్పుడు కుశస్థలమందుగల బ్రాహ్మణులందరును కృష్ణుని పంపించుటకు అతనివెంబడివచ్చుచుండిరి. కృష్ణుడా బ్రాహ్మ ణుల నందరిని ఆదరించి వారిని నిలిపి హస్తినాపురమునకు వచ్చుచుం డెను. అంతట ధృతరాష్ట్రుని కుమారులగు దుర్యోధనాదులందరును ఫలహారములను, పండ్లను, గంధపుష్పమాలలను, కృష్ణునకు పంపిం చిరి. ఆ వస్తువుల నన్నిటిని తగినజనులు తెచ్చి మార్గమందు అక్క డక్కడ కృష్ణునకు సమర్పించిరి. ఆ వస్తువుల నన్నిటిని కృష్ణుడు ప్రీతి పూర్వకముగా తీసికొని వేడుకచేత అనుభవించిన వానివలె నటించి ఆ వస్తువుల నుపయోగించకుండెను. అంతట కృష్ణుడు హస్తినాపురము దగ్గరకు వెళ్ళెను. ధృతరాష్ట్రుడు పంపగా బాహ్లీక ద్రోణ భీష్మాది బంధుమిత్ర జనులతో దుశ్శాసనాది కుమారులు అందరును కృష్ణున కెదురుగా వచ్చిరి. దుర్యోధను డొక్కడుమాత్రము రాలేదు. తక్కిన ధృతరాష్ట్రుని కొడుకులందరును భీష్మాదులను వెంటబెట్టుకొని సకల వాద్యములతో మహావిభవముతో కృష్ణునకు యెదురుగావచ్చిరి.

## శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని మందిరమునకు బోవుట

కృష్ణుడు భీష్మ ద్రోణాదుల నందరిని ఆయావిధములచేత గౌర వించెను. కృతవర్మ తమవాడైనందున అతనితో కృష్ణుడు విశేష

ముగా స్నేహముచేసెను. కృతవర్మ కృష్ణునివెంట వెంటనడచుచుండెను. హస్తినాపట్టణమునుంచి వచ్చిన సకలజనులును అతనిచుట్టును నడచుచుండిరి. అతడు హస్తినాపురములో ప్రవేశించి రాజమార్గముద్వారా వెళ్ళుచుండెను. అతనిరాకకు హస్తినాపురము అలంకరింపబడియుండెను. ఆపురమందుగల జనులందరును మహానందమునుపొంది మేడల మీదనుండి అతనిని జూచుచుండిరి. రాజమార్గముయొక్క రెండుప్రక్కలను మనోహరమలైన మేడలమీద స్త్రీలు నిలిచియుండి అక్షతలరాసులను పుష్పసమూహములను అతనిమీద సంతోషముగా చల్లుచుండిరి. ఆ అక్షతలు పుష్పములు ముత్యములతో కలసియుండెను. మంచిపరిమళము గలిగియుండెను. స్త్రీలందరును అక్షత పుష్పములను అతనిమీద జల్లుచు, సంతోషించుచు మ్రొక్కుచు సొక్కుచు సోలుచుండిరి. ఆస్త్రీలందరును అతనిని జూచుచు యిట్లని చెప్పుకొనుచుండిరి. అక్క ... గా! యీ కృష్ణుడే బాలుడైనప్పుడు పూతనయను రాక్షసియొక్క పాలు ... ~~దానిప్రాణములను తీసికొనెను~~. ఒకనిమిషమాత్రములో చాణూరుని ... లోకములను మెప్పించిన జగజ్జెట్టి ఈతడే యగును. దుర్మార్గుడైన కంసు ... జంపి అతని తండ్రియగు నుగ్రసేనునికి పట్టముగట్టిన ప్రభువు ఈతడే య... సత్యభామకు పారిజాతపుష్పమందుగల కోరికను దీర్చిన రసికుడు ... సుమా! ఈ కృష్ణుడే వెన్నముద్దలను, గోపికాస్త్రీల చిత్తములను ... సుమా! ఈ కృష్ణుడే ... పాదకమలములోలించిన వాడగును. వేదాంతములయందు తన పాదకమలములను ... కూర్చిన చతురుడూ ఇతడేకదా! అని ఈవిధముగా హస్తినాపురమును స్త్రీలందరును చెప్పుకొనుచు పరమసంతోషముతో అతనిని జూచుచుండిరి. అంతట నాపురజనులందరును అతనిని చూడవలెనను ఆశచేత అతనిరథముచుట్టును కదిసి సందడి కలిగించిరి. ఆజనులందరిని అతనిపరిచారకులు బెత్తములచేత బెదరించుచు సందడిని అణచుచుం

డగా వారిని కృష్ణుడుచూచి నివారించెను. అందువలన హస్తినాపట్టణమందుండు జను లాబాలగోపాలమును అందరును శ్రీకృష్ణుని దర్శించిరి. అంతట అతడాపురజనుల సమ్మర్దమునుండి తిన్నగా రథమును తోలించి రాజమార్గమును దాటివెళ్లెను. మణులచే నమర్చబడిన తోరణములచేత అలంకరింపబడియున్న రాజద్వారమును మనోహరమగురీతిని ప్రవేశించెను. అతడు కక్ష్యాంతరంబులుగడచి యేనుగ మొగసాలను ప్రవేశించి రథంబునునిలిపి యచ్చటదిగి మెల్లగానడచుచుండెను. అంతకుముందే భీష్మద్రోణాదులు ధృతరాష్ట్రుని దగ్గరకు పోయి వాసుదేవుని రాకను చెప్పిరి. పిమ్మట ధృతరాష్ట్రరాజు విదుర సంజయులను వెంటబెట్టుకొని అతనికి యెదురుగా వచ్చెను. ధృతరాష్ట్రరాజు వెంబడి భీష్మద్రోణాదులందరును వచ్చిరి. ఆతడు ధృతరాష్ట్రుని కౌగిలించుకొనెను. అక్కడనున్న విదురాది పుణ్య[illegible]షులను అతడు ఆలింగనము జేసికొనెను. పిమ్మట వారంద[illegible]గురీతిని సంతసపరచుచు వారితో వాసుదేవుడు సంభా[illegible]. వారందరితోడను తగినసమాచారములను సంభాషిం[illegible]ను సమాధానములను చెప్పుటకును సాత్యకిని నియమించె[illegible] ధృతరాష్ట్రరాజుయాజ్ఞాప్రకారమది వరకే తనగృహమున[illegible] పెద్దబంగారుపీఠము తెచ్చి పెట్టియుండెను. ఆబంగారుపీఠమ[illegible] శ్రీకృష్ణపరమాత్మను కూర్చుండబెట్టెను. అట్లు కూర్చున[illegible]వాసుదేవునకు ధృతరాష్ట్రరాజు యనుమతిగొని రాజునగరికి [illegible]బంధించిన రాజపురోహితులువచ్చి అర్ఘ్యపాద్యాదివిధులచేత పూజించి మధుపర్కాది ఉపచారములను గావించిరి. పిమ్మట ఆపురోహితులు సాత్యకిని ఉచితమగు పీఠమున కూర్చుండజేసి పూజించిరి. ధృతరాష్ట్ర భీష్మాదులును తమతమ యుచితాసనములపై గూర్చుండిరి. ఆసమయమున ధృతరాష్ట్రరాజు సభయంతయు సూర్యోదయపు కాలమున వికసించిన తామరపుష్పములుగల కొలనువలె నుండెను.

ఆసమయమున వాసుదేవుడు ధృతరాష్ట్ర భీష్మ ద్రోణ బాహ్లీక విదు
రాది పెద్దలకు ధర్మరాజు వాక్యములుగా నమస్కారములొసగెను ఆవ
రణ సంభాషణ మర్యాద మొదలగు వాక్యములను చెప్పెను. ఆసభ
యందుండు తక్కుంగల బంధుమిత్ర సంఘములకు స్నేహవిషయము
లగు వాక్యములను చెప్పి వాసుదేవుడు వారిని సంతోషపరచెను.
ధృతరాష్ట్రునకు ప్రీతిగలుగునట్లు పూర్వాది మధురసంభాషణముల
నాతడు గావించెను. హాస్యవాక్యములచేత దుశ్శాసనాది కుమారుల
నానందపరచెను. ఈవిధముగా నతడు ఆయాజనులను తగినమాటల
చేత యింపుపుట్టించెను. అతడు ధృతరాష్ట్రుని గృహమునందు కొంత
సేపటివరకు నిలిచియుండి పిమ్మట ధృతరాష్ట్రునితో యిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! విదురుని గృహమునకు వెళ్ళెదను.
ఇంకను వెళ్ళవలసినస్థలములకు వెళ్ళివచ్చెదను. అని వాసుదేవుడు
ధృతరాష్ట్రునితో చెప్పి అతని అనుమతినిబొంది విదురునియింటికి
వెళ్ళెను. విదురు డతిశీఘ్రముగా పరుగెత్తివెళ్ళి మంగళోపచార
సహితముగా వాసుదేవున కెదురుగావచ్చెను. మరియు భయభక్తి
వినయస్నేహ ఆనందములచేత వికసించిన చిత్తముగలవాడై దేవోప
చారములచేత వాసుదేవుని పూజించెను. పిమ్మట విదురుడు వాసు
దేవుని పాండవుల కుశలమడిగెను. వాసుదేవుడంతట విదురునకు
పాండవుల వృత్తాంతమునంతయు సవిస్తరముగా చెప్పి తదనంతరము
సంతోషపూర్వకముగా కుంతీదేవియుండు గృహమునకు వెళ్ళెను.
అప్పుడు విదురుడు భోజనాదిసదుపాయముల నేర్పరింతునని వాసు
దేవుని యడిగెను. వాసుదేవుడు అన్నాదిపదార్థములను చేయింపు
మని విదురునితో చెప్పి కుంతీదేవిని చూచెను. కుంతీదేవి వాసుదేవుని
నీడలనుబోలు తన కుమారులను తలచుకొని మిక్కిలి దుఃఖముగలదై
అతని మెడ పట్టుకొని బహువిధములుగా యేడ్చెను. వాసుదేవుడు

కుంతీదేవిని ఊరార్చెను. కొంతసేపటికి కుంతీదేవి అతనిబోధవలన దుఃఖమును విడిచి అతని కుచితమగు పీఠమును వేయించి తగురీతుల నుపచారములను చేయించి పిమ్మట అతని సమీపమందు కూర్చుండి దుఃఖమువలన గద్గదకంఠముతో యిట్లనెను.

మేనల్లుడవగు కృష్ణా! నాకుమారులైన పాండవులు నీశిక్షవలన పెరిగినందులకు నీతిమంతులై పుణ్యపరులై శూరులైరిగదా! పాండవులనేకులగు పరిజనులచేత సేవింపబడుచు సౌఖ్యముల ననుభవించుటకు తగినవారగుదురు. అటువంటి పాండవులు సకలకష్టములను పొందుచు జనశూన్యమైన వనమునకు వెళ్ళిరి. నన్ను యిక్కడవిడిచి ఆపాండవులు యెట్లువెళ్ళిరో తెలియదు. ఆపాండవులకు నేను భోజనపదార్థములను నడ్డింపగా తృప్తిగా భుజించెడివారు. పాన్పులమీద సుఖముగా పండుకొని యుందురు. మంగళసంగీతధ్వనులచేతను ఏనుగుల ఘీంకారధ్వనులచేతను నిద్రను మేల్కొందురు. పాండవులు కందమూలఫలములను ఆధారముగా జేసికొని పొదలయందును పుట్టలయందును పడియుండి వనమృగము లరుచుచుండగా మేల్కొనుచుండిరిగదా! ఇక నేమి చెప్పెదను?

కృష్ణా! అయ్యో! తండ్రిలేని ఆ పాండవులు తల్లిని విడిచి బహుకాలమువరకు యీరీతిగా భంగపాటు, దుఃఖపాటు, సంకటములను పొందిరి. పిమ్మట విరాటరాజుదగ్గర అజ్ఞాతవాసమును జరుపుచు బహుకష్టములను పొందిరి. అని యీరీతిగా కుంతీదేవి కృష్ణునితో చెప్పెను. కృష్ణా! దాన దయాపరుడగు ధర్మరాజు క్షేమమేగదా! సింహామునుబోలు పరాక్రమముకల భీముడు కుశలమేగదా! సకల శస్త్రాస్త్ర విద్యాసమర్థుడగు అర్జునుడు సుఖమేకదా! మహావినయవంతులగు నకుల సహదేవులు సురక్షితులేగదా! అయ్యో! ఆ పరమ పతివ్రతా తిలకమగు ద్రౌపది క్షేమమేగదా! కృష్ణా! ఆ

ద్రౌపది నాకు ప్రియమైన కోడలు. నా పుత్రులగు పాండవులకంటె కోడలగు ద్రౌపదియందు మిగుల ప్రీతి. నాకుమారులగు పాండవులు నాకుచేయు నుపచారములకంటె, వారుజూపుభక్తివినయములకంటె నా కోడలగు ద్రౌపది కోటిపాళ్ళు అధికముగా నాయందు భక్తిగలిగి వుపచారములను చేయుచుండును. ద్రౌపది పుణ్యాత్మురాలగును. మా కులమును పవిత్రమును జేయును అటువంటి ద్రౌపది పూర్వము కౌరవ సభయం దవమానింప బడినప్పుడు నేను మిక్కిలి దుఃఖము చేత పరితపించితిని. కృష్ణా! ఆ కౌరవసభయందు ద్రౌపది పడిన అవమానమును నేను చూచి ఓర్చితిని. గనుక యికనెన్ని కష్టముల కైన, యెన్నిదుఃఖములకైన నేను వోర్వగలను. ఆ ద్రౌపది పొందిన అవమాన కష్టలములకంటె అధికమైన దుఃఖములు లోకమం దేమి యును లేవు. అట్లు ద్రౌపది అవమానమును పొందినప్పుడు, యిట్లు చేయుట అధర్మమని విదురు డొక్కడు మాత్రము చెప్పి దుఃఖించెనే గాని ఆ సభయందుండు వారందరును పలుకక వూరకుండిరి. ఆ విదు రుని మంచిస్వభావనే యీలోకమును రక్షింపుచున్నది. అని యిట్లు కుంతీదేవి తన దుఃఖము లన్నియు కృష్ణునితో చెప్పుకొనుచు త్రవ్వు కొని మహాదుఃఖ ప్రవాహ రూప బుద్ధిగలదై కొంతదుఃఖమును ద్రింగెడి చిత్తముచేత మరల అతనితో యిట్లనెను.

కృష్ణా! యీ దుఃఖమంతయు నాకొక యెత్తగును. ఈ పద మూడు సంవత్సరములనుండి నా బానకొడుకగు దుర్యోధనుని కూడు తినుచుంటిని. ఈ దుఃఖము నాకొక యెత్తైయున్నది. ఇక నేనేమని చెప్పుదును? కృష్ణా! ఆ దుర్యోధనాదుల నందరిని నా పుత్రులగు పాండవుల వలెనే నేను చూచుచుందునేగాని యెప్పుడైనను నాబుద్ధి యందు భేదము కలిగియుండలేదు. ఇందుకుఆదైవమే సాక్షియగును. ఈమాట నిశ్చయమైనయెడల పాండవులును నీవును సకల దుఃఖము

లను విడచి సంతోషమును పొందియుండగా నేను చూచెదను. తుదకు నా దుఃఖమున కదియే మందు. కృష్ణా! నాబావయగు ధృతరాష్ట్రమహారాజు ఒప్పుకొనడని చెప్పుటవలన ప్రయోజనము లేదు. అతని కుమారుడగు దుర్యోధనుని దూషించుటవలన లాభము లేదు. కౌరవ కులవృద్ధుగు బాహ్లికుని దూషింపరాదు. భీష్మునిపై నింద మోపరాదు. ఇటువంటి క్రూరులగు కౌరవుల యింటియందు నన్ను యిచ్చినందుకు యాదవులనుదూషించెదను. అర్జునుడుపుట్టినప్పుడు వీడుసకల లోకములను గెలిచి మహాకీర్తిని పొందుననియు, యుద్ధమం దర్జునుడు కౌరవులను జయించుననియు, యీ అర్జునుడు, అతని సోదరులును సకలరాజ్యగౌరవముల ననుభవింతురనియు ఆకాశవాణి చెప్పెను. ఆయాకాశవాణి యిటువంటి అసత్యములను చెప్పినందుల కాయ శరీరవాణిని నిందింపవలయును. కృష్ణా! ధర్మమున్న యెడలఆవాక్కులే సత్యములగును. ఆధర్మమును నిర్వహించువాడవు నీవు కలవుగదా! పాండవులను నీవు రక్షింపుచుందువు, పాండవులు నీకు స్నేహితులగుదురు. పాండవులకు చెప్పవలసిన మాటలు కొన్నిగలవు. ఆమాటలను చెప్పెదనువినుము. ధర్మరాజుతో యిట్లుచెప్పుము. ధర్మరాజా! రాజపుత్రులగువారు పరులను వేడుకొని దీనవృత్తిగా జీవింపరాదు. రాజపుత్రులు తమప్రతాపములు విడిచినయెడల నిప్పుకు వేడిమి చెడినట్లగును. పైగా జనులు లక్ష్యముజూపరు. అని ధర్మరాజుతో చెప్పి భీమార్జునులతో యిట్లని చెప్పుము. భీమార్జునులారా! రాచకుల జాతయగు మానిని కుమారుల నెందునిమిత్తము కనునో ఆపనివారు నిర్వహించుటకు యిప్పుడు తగిన సమయమని చెప్పుము. ఇక మీరాలస్యము చేయరాదు. ఇప్పుడు మీరు చేయదగిన పనిని యోచించి మీరాచరించినయెడల జనులప్పుడు మిమ్ము పురుషులందురు. అట్లు చేయనియెడల పురుషులు కాజాలరు. అని భీమార్జునులతో చెప్పి నకులసహదేవులతో యిట్లు చెప్పుము.

నకులసహదేవులారా! క్షత్రియులకు క్షమాబలములకన్న జీవిం
చుట ధర్మము. మెత్తదనము గలిగియుండుట క్షత్రియులకు
నింద్యము. అని నకులసహదేవులతో చెప్పి పాండవులకందరికిని
మరల యిట్లు చెప్పుము. ధర్మరాజ భీమార్జున నకులసహదేవులారా!
మీరందరును ద్రౌపదినిఅడిగి ఆమె చెప్పిన ప్రకారము కార్యములను
చేయుచు, మీరు చేయదలచిన దానిని ద్రౌపదికి తెలియపరచుచు,
యామెను అడుగుచుండవలెను. అనియిట్లు ఎక్కువగా పాండవుల
దగ్గరను అయినగురితో చెప్పుము అని కుంతీదేవి కృష్ణునితో చెప్పెను.
కృష్ణా! భీమార్జునులు యుద్ధమును కోపించినయెడల వారికెవ్వరును
అడ్డుపడజాలరని నేనుయెరుగుదును. అంతగొప్పవగు కష్టములనుపొం
దినప్పుడు భీమార్జునులు తీర్చవలయునుగదా! కృష్ణా! సకలకార్యము
లను తీర్చుటకు ఆపాండవులేగలరు. నీవుయెట్లు చెప్పెదవో ఆప్రకార
ము పాండవులు చేయుదురు. ఏవిధముచేతనైనను నన్ను కృతార్థురా
లినిగా జేయుటకు నాకుగలదుఃఖమును పోగొట్టుము. అని కుంతీదేవి
కృష్ణునితో చెప్పి దుఃఖించెను. అంతట అతడు కుంతీదేవిని ఓదార్చి
యిట్లు చెప్పెను. ✓19/7/60

## శ్రీకృష్ణుడు కుంతీదేవి నూరడించుట

మేనయత్తా! కుంతీమహాదేవీ! నీవుమంచిగుణవంతురాలవు.
నీవుపుట్టిన యింటికిని ప్రవేశించిన యింటికిని మహాకీర్తి గలుగునట్లు
మంచి నడవడికగలిగి ప్రవర్తించితివి. నీవు మంచిధైర్యవంతురాలవు.
నీవుదుఃఖమును సహింపజాలనియెడల యీలోకములయందు ఇంక నెవ్వ
రును దుఃఖములనుసహింపజాలరు. గొప్పబుద్ధిగలదానవు. నీవే యిట్లు
దుఃఖమును భరింపలేనియెడల యిక యల్పబుద్ధులగువారి విషయము
యోచింపనేల? నీవుదుఃఖమును విడువుము. నీ మనోవ్యథలనన్నిటిని

పోగొట్టెదను. నీకుమారులగు పాండవులును, నీకోడలగు ద్రౌపదియు క్షేమముగా నున్నారు. వారందరును నీకుమిక్కిలి భక్తిపూర్వకముగా నమస్కారములను చేసిరి. వారందరును తమమనస్సులచేత నిన్ను కౌగిలించుకొనిరి. నీకొడుకులగు పాండవులందరును వీరసుఖమునే చిత్తములయందు దలంచుచుందురుగాని వేరుసుఖములను కోరుటలేదు. పాండవులు అల్పబుద్ధులుగాదు నీకొడుకులగు పాండవులు మిక్కిలి ఉత్సాహముగలవారై శత్రువులను చంపి మహాసామ్రాజ్య మహోత్సవమును పొందుదురు. అటువంటి కొడుకులను నీవుచూచి దుఃఖమును విడువుము. అని కృష్ణుడు కుంతీదేవితో చెప్పెను. ఆ మాటలను విని కుంతీదేవి దుఃఖమును పోగొట్టుకొని వికసించిన ముఖముగలదై శ్రీకృష్ణునితో యిట్లని చెప్పెను.

కృష్ణా! పాండవులకు నీవే తండ్రివి. నీవే గురుడవు. నీవే దైవము నీవు ధర్మమును, న్యాయమును, హితమును యెట్లు నిశ్చయించి చెప్పెదవో ఆ పాండవులట్లు చేయుదురు. వారునిన్ను ఆశ్రయించిన వారికెన్నటికిని కీడుగలుగదు. కృష్ణా! నీవు పాండవులకు మాత్రమేగాక కౌరవులకును సర్వలోకములకును నీవే దిక్కు. సర్వము నకును నీమాట వేదతుల్యము అని యీరీతిగా కుంతీదేవిఅనగా విని గౌరవించి నిలిపి కుంతీదేవి గృహమునుండి బయలుదేరెను. కృష్ణుని రాక నిమిత్తము దుర్యోధనుని గృహమదివరకే అలంకరింపబడి యుండెను. శ్రీకృష్ణుడు కృతవర్మ సాత్యకులను వెంటబెట్టుకొని దుర్యోధనుని గృహమునకు వెళ్ళుచుండెను. దుర్యోధనుని ద్వారపాలకులు కృష్ణుని జూచి అతి శీఘ్రముగా గృహములోనికి వెళ్ళి వాసుదేవుని రాకను దుర్యోధనునకు తెలిపిరి. ద్వారపాలకులు దుర్యోధనుని అనుమతి వలన పరుగెత్తుచు వచ్చి వాసుదేవుని యెదుర్కొని కక్ష్యాంతరంబుల యందు సందడి లేకుండ జేయుచు వినయపూర్వకముగా వాసుదేవుని

గృహములోనికి దీసికొనిపోయిరి. దుర్యోధనుకు కైలాసపర్వత శిఖరమువంటి ఒక సేవకుండు నుండెను. ఆ దుర్యోధనునివద్ద బాహ్లిక, భీష్మ ద్రోణులు మొదలగువారును, కర్ణ శకుని సైంధవాదులును, దుశ్శాసన వికర్ణ దుర్ముఖులు మొదలగు కురుకుమారులును, అనేక దేశముల రాజులును, కూర్చుండి దుర్యోధనుని సేవించుచుండిరి. దుర్యోధనుడు పెద్దసభ చేసి సింహాసనమందు కూర్చుండి యుండెను. ఆ దుర్యోధనుని యొద్దకు వాసుదేవుడు వెళ్ళగా దుర్యోధనుడు పరిజన సహితముగా వాసుదేవునకు యెదురుగా వచ్చెను. అప్పుడు కృష్ణ సాత్యకులిద్దరును దుర్యోధనుడు మొదలగు వారిని కలిసిగనాది ఉపచారములను చేసిరి. దుర్యోధనుడొక పెద్ద బంగారు సింహాసనమందు వాసుదేవుని కూర్చుండబెట్టి పూజించెను.

## శ్రీకృష్ణుడు దుర్యోధనునితో సంభాషించుట

దుర్యోధనుడు తగురీతిని సాత్యకిని పూజించి పిమ్మట దుర్యోధనాదులందరును వాసుదేవునిముఖమును జూచుచుండిరి. వాసుదేవుడు దుర్యోధనాదులతో మాధుర్యముగా మాటలాడుచుండెను. ఆ సమయమున దుర్యోధనుడు కూరలను జెప్పుచు, భోజనమందుగల సౌఖ్యాతిశయమును చెప్పి వాసుదేవునకు యిష్టము గలిగింప దలచెను. వాసుదేవుడు యిక్కడ భోజనము చేయనని దుర్యోధనునితో స్పష్టముగా చెప్పెను. అప్పుడు దుర్యోధనుడు కర్ణుని ముఖముచూచి కర్ణునితో యిట్లనెను. కర్ణా! యీ వాసుదేవుడు ఇక్కడ భోజనము చేయనని చెప్పెను. యీ మాటల పద్ధతిని చూడగా మిక్కిలి వింతగా నున్నది. ఇతని మాటలపద్ధతిని మొదట విచారించిన ఇతని స్వభావమంతయు మనకు తెలియగలదు. అని దుర్యోధనుడు కర్ణునితో చెప్పి వాసుదేవునితో నిట్లనెను.

కృష్ణా! కావలసిన అన్నపానాదులను అనేక విధములైన నేర్పుగల నిపుణులచే తయారుచేయించినాను. ఇప్పుడు నీవు అన్నపానాదుల నిచ్చుట భుజించనని స్పష్టముగా చెప్పితివి. ఇట్లు చెప్పుట వలన బాంధవ మర్యాదలకు లోపముగలుగును. మరియు కౌరవులును పాండవులును నీకు ఒక రీతిగలవారే యగుదురుగదా! మహా ధర్మాచారుండవు. మాతండ్రియగు ధృతరాష్ట్ర మహారాజు యందధికమైన ప్రేమ కలిగియుందువు. అటువంటి నీవు యిట్లు చెప్పుటకు కారణమేమో చెప్పుము. అని దుర్యోధను డడుగగా వాసుదేవుడిట్లనెను. దుర్యోధనా! దూతలుగా వచ్చినవారు తామువచ్చిన కార్యమును చేయకనే మొట్టమొదట అన్నవస్త్రాదులను గ్రహింపరు. తామువచ్చిన కార్యమును నిర్వహించి పిమ్మట దూతలు అన్నవస్త్రాదులను గ్రహింతురు. అని యిట్లు వాసుదేవుడు చెప్పగా దుర్యోధను డిట్లనెను.

వాసుదేవా! తొందరపడుట వలన ప్రయోజనములేదు. నీవు వచ్చిన కార్యము తీరినను తీరకపోయినను పిమ్మట మాటలాడవచ్చును. ఇప్పుడు ముక్కు త్రాటిచేత కాలుదూర్చునట్లు మాటలాడవచ్చునా? గాన నీవు వచ్చినవాడవు మాయింటియందు భోజనము చేసి కూర్చుండి అన్ని విషయములు చెప్పుటమంచిది. భోజనము చేయనని చెప్పరాదు. ఇట్లు చెప్పుటకు కారణము తెలియలేదు. నీవు యోచించక యిట్లు చెప్పితివి. అని దుర్యోధనుడు వాసుదేవునితో చెప్పగా ఆ మాటలకు వాసుదేవుడు చిరునవ్వు గలవాడై అందరి కలియజూచెను. వాసుదేవుడు మదపుటేనుగు చిగురుటాకును బట్టినట్లు దుర్యోధనుని అరచేతిని పట్టుకొని యిట్లనెను.

దుర్యోధనా! నేను ఏ గృహమందు భోజనము చేయక పోవుటకు కారణము నేనే నీకు చెప్పవలసినయెడల చెప్పెదను వినుము.

దుర్యోధనా! ప్రీతిపూర్వకముగా పిలిచి పెట్టెడి యన్నము మంచిది. నీతిలేని స్థలమందు ఆపదలు కలుగునెడల అక్కడి అన్నము మేలు కలుగదు. నీవు మాయందు ప్రియుడవు కావు. అందుచేత నీ గృహమందు నేను భుజింపరాదు. అదిగాక శత్రువుల యింటియందు భుజించినయెడల అనుమానము కలుగును. శత్రువుల కమృతములైనను భుజించుటకు యివ్వరాదు. దేహమున కెట్టి యాపద వచ్చినన్ను అనుమానము బాధింపుచుండును. నేను శత్రువుడనా యందువేని చెప్పెదను వినుము. దుర్యోధనా! నీవు పాండవులయందు విరోధమును గలిగియుంటివి. పాండవులు నాకు ప్రాణములు. తమ ప్రాణములయందు విరోధము గలవాడు శత్రువులు అని చెప్పుటకు సంశయము లేదు. నీవు పుట్టినది మొదలుకొని నిష్కారణముగా పాండవులకు కీడు కలిగించుచున్నావు. పాండవులు పుణ్యాత్ములు. నీకు సహోదరులు. పెద్దలు. అటువంటి పాండవులతో నీవు విరోధమును వహింపరాదు. మీ రందరును పాండవులయందు విరోధము గలిగి యున్నందున మీయందరి అన్నములును దుష్టాన్నములగును. మృష్టాన్నములు గా నేరవు. కాన విదురుని యన్నమును భుజింపనిశ్చయించితిని. అందువలన విదురుని యింటికి వెళ్ళెదను అని కృష్ణుడు దుర్యోధనునితో చెప్పెను. దుర్యోధనుని అనుమతిని పొంది అతడు విదురుని యింటికి వెళ్ళుచుండెను. అప్పుడు బాహ్లీక భీష్మాది కౌరవులును, ద్రోణుడు మొదలగు పెద్దలును, అతని వెంబడి నడచుచు కృష్ణునితో యిట్లు అనిరి.

మహాత్మా! కృష్ణదేవా! మాగృహముల నన్నిటిని అలంకరించుకొని నీవు విజయము చేయుటకు యెదురు చూచుచున్నాము. మా ప్రార్థనను అంగీకరించి మాగృహములకు మేలుచేయవలయును. అని యిట్లు భీష్మ ద్రోణ బాహ్లీకాదులందరును ప్రార్థించగా వారితో

కృష్ణు డిట్లనెను. బాహ్లిక భీష్మాదులారా! నేనందరి గృహములకు వచ్చినవాడను. మీ అందరి పూజలను గైకొన్నవాడను. మీ రం దరు నిలువుడు అని చెప్పి వారిని యచట నిలిపి విదురుని గృహము నకు వెళ్ళెను. అప్పుడు విదురు డతి భక్తియుక్తముగా నిశ్చల స్నేహ ముప్పతిల్ల శ్రీకృష్ణునకు నిర్మలస్నానము చేయించెను. పిమ్మట విదురుడు మొదట బ్రాహ్మణులకు భోజనములను పెట్టించెను. ఆవెనుక మనోహరమైన స్థలమందు విదురుడు కృష్ణసాత్యకులను కూర్చుండ బెట్టి వినోదములైన భక్ష్య భోజ్య లేహ్యచోష్యములను నాలుగు విధములైన ఆహారములను తెచ్చి పెట్టెను. ఆ యాహారములను కృష్ణ సాత్యకులు భుజించి తృప్తిబొందిరి. ఆ పదార్థములను శ్రీకృష్ణుడు ఆరగింపుచు అప్పుడప్పుడు మనోహరమగు సంభాషణల చేత విదురునికి ఆనందమును గలిగించెను. అప్పుడు విదురు డతనితో యిట్లనెను.

మహాత్మా! కృష్ణదేవా! భోజనముచేత తృప్తిని బొందుము. ఇదియే మాకు పరమధనము. మరియొకవిధముగా నిన్ను పూజింప జాలినవాడు నెక్కడను లేడు. అని యిట్లు విదురు డతనితో చెప్పి మరల నత్యంత వినయ వాక్యములచేత అతనిని ఆరాధింపుచుండెను. అతడు భోజనము చేసిన పిమ్మట విదురుడు అతనికి చందనముపూసి పుష్పమాలాదులచేత పూజించెను. విదురుడు కృతార్థుడై యుండెను. అంత కవీశ్వరులును, సంగీతపాఠకులు మొదలగు విద్వజ్జనులును, పిల్లనగ్రోవివూదు జనులును, వీణెను వాయించువారును, మేలుకొలు పులు పాడువారును, మొదలగు పలురకముల వినోదజనులు పరమే శ్వరుడైన కృష్ణదేవుని చూడవచ్చిరి. వారందరును ప్రొద్దుపుచ్చి తమ యభీష్టములను పొంది వెళ్ళిరి. అంతట రాత్రికాలమాయెను. అప్పుడు విదురుడు తగు అంతఃపురమున హంసతూలికా తల్పమును

వేయించి ఆ పాన్పునందు శ్రీకృష్ణదేవుని వుంచెను. అతడా హంస తూలికా తల్పమందు బరుండినపిమ్మట విదురుడు కృష్ణునిదగ్గర యుచితాసనమున కూర్చుండి అతనితో యిట్లనెను.

మహాత్మా! కృష్ణదేవా! దుర్యోధనుడు దుష్టబుద్ధిగలవాడు. మహాదురభిమాని. నీమాటను వినడు. ఇదియొక కార్యముగా దలంచి పూనికతో నీవిక్కడకు వచ్చితివి. నీవిదుర్యోధనుని దగ్గరకురాకూడదు. దుర్యోధనుని పక్షమందు పదనొకండక్షౌహిణుల సైన్యము వచ్చి చేరియున్నది. ఆసైన్యములనుజూచి అతడధికమైన దురహంకారమును పొందియున్నాడు. దుర్యోధనుడు భీష్మ ద్రోణుల బలములను నమ్మియున్నాడు. కర్ణుడొక్కడే తనకు విజయమును కలిగించునని అతడు తలచియున్నాడు. నీవు యిక్కడకు వచ్చెదవని దుర్యోధనాదులందరునుగుమిగూడి ఆలోచించుకొని తమలోనిశ్చయించుకొనిన అభిప్రాయమును చెప్పెదను వినుము. నీయాజ్ఞను కౌరవులు అతిక్రమింతురు. పాండవులకు కొంచెమైనను భూమినిపంచి యివ్వరు. తామే యీభూమినంతను యేలెదరు. పూర్వము పాండవులు దిగ్విజయము చేసినప్పుడు రాజులందరును పాండవులచేత జయింపబడిరి. కనుక ఆ రాజులందరును యిప్పుడా దుర్యోధనుని పక్షమందుజేరి కర్ణునితో కలిసియుండి అర్జునునిచేత చచ్చెదము లేక అర్జునుని గెలిచెదము. ఇంతకుతప్ప వేరులేదని ఆరాజులందరును నిశ్చయపరచుకున్నారు. అందుచేత దుర్యోధనుడు క్రొవ్వుమిగిలియున్నాడు గనుక సంధికలుగజాలదు.

కృష్ణా! వారికందరికిని కాలము పూర్ణమైనది. ఏవిధముచేతను కౌరవులను విచారించుటకు సాధ్యముకాదు. ఆదుర్మార్గులగు కౌరవులు తమనుతామే మరచియున్నారు. గర్వముచేత అతిశయించియున్న ఆదుర్మార్గులనడుమ నీవుకూర్చుండరాదు. వారుచెప్పుమాట

లకు జవాబొసంగుట వృథయగును. కృష్ణా! కౌరవులు దుర్మార్గులైనం దున మీరు కార్యానుకూలమగు మాటలను చెప్పజాలరు. మూర్ఖులగుటవలన ప్రతాపవాక్యములకు భయపడరు. వారియాలోచనలు ఆపదలకు ఆకరములు. నీమహనీయమగు ప్రభావబుద్ధి పౌరుషములను నేనుయెరుగుదును. అయినను పాండవులయందు నాకుగలస్నేహముచేతను నీమీద నాకుగల భక్తివిశేషముచేతను ముఖ్యమైన విషయమును చెప్పెదవినుము. నీవు కౌరవసభకు వెళ్ళవద్దు. అని విదురుడు చెప్పగా ఆమాటలను కృష్ణుడువిని విదురునితో యిట్లనెను.

## శ్రీకృష్ణుడు విదురునితో సంభాషించుట

మహాత్మా! విదురా! నీవివేకమును స్నేహమునుజూపి తల్లిదండ్రులవలె నాకుహితమును నేర్పితివి. నేనువచ్చిన పద్ధతినంతయు చెప్పెదను వినుము. నేను చెప్పినమాటలను వినుము. పిమ్మట నీవు చెప్పినట్లుచేసెదను. విదురుడా! నేను ఆదుర్యోధనుని యెరుగుదును. అతని చెడుబుద్ధినంతయు నేనుయెరుగుదును. అతనితోగూడినరాజులందరును పాండవులయందు విరోధమును పూనియుందురు. సంధిపొసగదని నాకు తెలియును. పాండవులకును కౌరవులకును యుద్ధముజరిగినప్పుడు భూమియందుగల సకలరాజులును, సకలజనులును, గుఱ్ఱములును, యేనుగులు నిశ్శేషముగా మృత్యువు పాలగును. అట్లునశించుటకు సిద్ధమైయున్నప్పుడు అట్టియుద్ధమును మాన్పినయెడల మహాపుణ్యము గలుగును. మానుపవచ్చునాయని యంటివేని చెప్పెదను వినుము. మహాత్మా విదురా! పురుషుడు పుణ్యపాపములను చేయుచుండగా, ఒకప్పుడు ప్రయత్నించి చేయబూనినప్పుడు ఆపుణ్య పాప కార్యములు జరుగకున్నను, పుణ్య పాపఫలములు ఆపురుషునకు కలుగును. అదిగాక యీపాండవులును కౌరవులును నాబంధువులు.

బంధువులకు విరోధము కలిగినప్పుడు అడ్డుపడి వారితో హెచ్చాడియైనను పూనుకొని వారికలహమును మాన్పవలయును. అట్లు కలహమును మాన్పుటకు పూననివానిని క్రూరకర్ముడని కర్మవాదులు చెప్పుదురు గనుక యీ కౌరవపాండవులకు సంధిగల్గించుటకు ప్రయత్నముచేసె దను. ధర్మయుక్తమైన మాటలను మంత్రులతో గూడియుండు దుర్యోధనునకు చెప్పెదను. ఆపాండవులకును కౌరవులకును లోకము నకు మేలుకలిగించు పద్ధతిని వంచనలేకుండ చెప్పెదను. నేనట్లుచెప్పి నపుడు దుర్యోధనుడు నన్ను పాండవులవానిగా శంకించి నామాటను విననియెడల మేలేయగును. నేనుయిట్లు చెప్పనియెడల అన్నదమ్ము లగు కౌరవపాండవులకు విరోధము కలుగగా వారిని కృష్ణుడు వారిం పక వుపేక్షించెననియు, కృష్ణునిచేత ఈకార్యము చక్కపడదా య నియు మూఢులు చెప్పుకొందురు. పెద్దలు మెచ్చునట్లుగా కార్యగతి పద్ధతినంతయు సర్వవిధములచేతను చక్కగా చెప్పెదను. ఆదుర్యోధ నాదులకు బ్రతికెడిమార్గ మున్నయెడల నామాటను వింపుదు. వారు నామాట వినక నీవుచెప్పినట్లు నామీదకు కలహింపవచ్చిన యెడల దుర్యోధనాదులు నాముందు నిలువజాలరు అని కృష్ణు డావిదురునితో చెప్పెను. ఆమాటలను విదురుడువిని అట్లు చేయుమని సమ్మతించి కృష్ణుని విడిచి తనపడకటింటికి వెళ్ళెను. పిమ్మట రాత్రికాలమందు కృష్ణుడు తన మనస్సులో యిట్లని తలచెను.

ఈ విదురుడు యిటువంటి హితవాక్యములను నాతో చెప్పెను. ఈతనివంటి పుణ్యపురుషుడు లోకమందెక్కడను కనబడలేడు. అని తనమనస్సులో అతనిని మెచ్చుకొని ఆవిదురుని మాటలను పద్ధతిని తలచుచు పాలసముద్రమువంటి పాన్పుమీద పండుకొనెను. ఇట్లు కృష్ణ దేవుడా రాత్రికాలమందు సుఖముగా నిద్రించి వేకువజామున వంది మాగధుల మంగళగానములవలన మేల్కొనెను. అంతట ప్రాతఃకా

లకృత్యములను నిర్వర్తించెను. ఆసమయమున సాత్యకి కృతవర్మ లిద్దరునువచ్చి కృష్ణునకు కనబడిరి. కృష్ణు డొకప్రదేశమున సాత్యకి కృతవర్మాది యిష్టజనులచేత సేవింపబడుచుండెను. అంతట దుర్యోధనుడు కర్ణ శకుని దుశ్శాసనులను వెంటబెట్టుకొని కృష్ణుని దగ్గరకు వచ్చెను. ఆవచ్చిన నలుగురును ప్రియవాక్యములచేత కృష్ణుని కొనియాడిరి. కృష్ణదేవు డాదుర్యోధనాదులతో మధురసంభాషణములను చేసెను. దుర్యోధనాదులు నలుగురును కృష్ణునితో యిట్లనిరి.

కృష్ణా! ధృతరాష్ట్రమహారాజు పెద్ద సభచేసి యున్నాడు. ఆసభయందు బంధుమిత్రాది సమస్తజనులును చేరియున్నారు. అని దుర్యోధనాదులు అతనితో చెప్పిరి. అందుకు అతడు సంతోషించి అదివరకు సిద్ధముగానున్న తన రథమెక్కి భేరీ, శంఖ, చామర, ఛత్రములు మొదలగు శుభచిహ్నములతో బయలువెడలెను. అతని రథమునకు యెత్తిన గరుడధ్వజము దేదీప్యమానముగా ప్రకాశింపుచుండెను. కృతవర్మ సాత్యకు లిద్దరును మరియొక రథమువీద కూర్చుండి ఆ కృష్ణుని రథమునకు ఒక పార్శ్వముగా వచ్చుచుండిరి. దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు నలుగురును మరియొక రథము మీదయెక్కి కృష్ణుని రథమునకు మరియొక తట్టుగా వచ్చుచుండిరి. అట్లు మూడురథములమీద కృష్ణాదులు వచ్చుచుండగా జూచి పురజనులు మిక్కిలి యానందమును పొందిరి. శ్రీకృష్ణుడు రాజమందిర ద్వార సమీపమునకు రాగానే ఆరథముల ధ్వనులను విని ధృతరాష్ట్రుని సభయందుండు వారందరును అమితోత్సాహముగలవారై కృష్ణదేవుని రాకకు యెదురు చూచుచుండిరి. అంతట అతడు తన దివ్యరథమువీదనుండి దిగెను. విదురుడు అతనికి యెదురుగా వచ్చెను. అతడు రథమువీదనుండి దిగి ఒకచేతితో విదురుని పట్టుకొని మరియొకచేతితో సాత్యకిని పట్టుకొని నడిచెను. కర్ణ దుర్యోధను

లిద్దరును ముందు నడచుచు ముందరగల జనులను తొలగద్రోయుచు సందడిని అణగించిరి. అంతట కృష్ణుడు సభాగృహములోనికి వచ్చి నప్పుడు కృతవర్మయు సభాగృహమునగల మొదలగాంత్రైన యాదవు లందరును ఆ కృష్ణుని చుట్టుకొని నడచిపోవుచుండిరి. అతడు సూర్యుని వంటి తేజస్సుతో ప్రకాశింపుచుండెను. అతని సమీపమందు ధృత రాష్ట్రుని కుమారులగు దుర్యోధన దుశ్శాసనాదు లందరును నడచు చుండగా సూర్యుని సమీపమందుండు అంగారకాది గ్రహములవలె తేజోహీనులై యుండిరి. ఇట్లు మహా తేజోరాశియగు కృష్ణుడు ఆ సభాగృహమును ప్రవేశించెను. ధృతరాష్ట్రు, భీష్మ, బాహ్లిక, ద్రోణాది రథికశ్రేష్ఠులును అతనికి యెదురుగావచ్చిరి. అంతట కృష్ణ దేవుడు వారి నందరిని సంతోషింపజేసి తన నిమిత్తమై వుంచిన మణీ మయమైన బంగారు పీఠమందు తాను కూర్చుండెను. ఆ సమయమున నారద జమదగ్ని కణ్వాది మహామునులు మహాతేజస్సులచేత ప్రకా శించుచు ఆకాశమందు కనబడిరి. ఇట్లు దగ్గిరకు వచ్చియుండు నార దాది మహామునులును అతడు భీష్మునకు చూపి ఆ భీష్మునితో యిట్లు అనెను.

భీష్మా ! యీ మహాత్ములగు నారదాది మహామునులందరును మనలను చూడవలెనను వేడుకచేత వచ్చిరి గనుక నీవు శీఘ్రముగా అర్ఘ్యపాద్యాదులచేత యీ మహామునులను పూజింపుము. వీరికి తగిన పీఠముల నుంచుటకు తగిన మనుష్యులను పంపుము. ఈ మునులు తగిన పీఠములయందు కూర్చుండక మునుపు మనము కూర్చుండుట ధర్మముగాదు. అని కృష్ణదేవుడు భీష్మునితో చెప్పెను. అప్పుడా సభయందుండు వారందరును సంభ్రమాశ్చర్యములు గల వారై ఆ నారదాదిమునులవైపు చూచుచుండిరి. ఆ క్షణముననే భీష్ముడు తన పరిచారకులను పిలిచి నవరత్న మయములైన బంగారు

పీఠము లను అనేకములు తెప్పించెను. మునులందరును ఆ యా పీఠ ములపై వచ్చి కూర్చుండిరి.

ఆ మహామునుల కందరకును వాసుదేవుడు నమస్కరించి పీఠ ములపై అర్ఘ్యపాద్యాది విధులచేత వారినందరిని పూజింప జేసెను. పిమ్మట తాను కూర్చుండెను. అటుపిమ్మట ధృతరాష్ట్రుడును తక్కిన వారును తగినవిధముగా ఆ మహా మునులకు నమస్కరించి తమతమ ఆసనములమీాద కూర్చుండిరి. దుశ్శాసన వివింశతు లిద్దరును పీఠములుంచగా సాత్యకి కృతవర్మ లిద్దరును వాసుదేవునకు రెండు ప్రక్కలయందు కూర్చుండిరి. కర్ణ దుర్యోధనులిద్దరును ఒక్క పీఠ మందే వాసుదేవుని సమీాపమందు కూర్చుండిరి. వాసుదేవునకు వెనుకవైపు నవరత్న మయమైన పీఠమందు విదురుడు వాసుదేవుని పీఠమును తాకునట్లుగా కూర్చుండెను. మరియు వ్రాలియుండి పండు కొని నట్లుండెను. గాంధార రాజు తన పుత్రులతో కలిసి ఒక్కచోట తన పీఠమందు కూర్చుండెను. వాసుదేవుడు నీల మేఘమువంటి దేహము కలవాడు. పచ్చని వస్త్రమును ధరించినవాడు. తామర రేకులవంటి నేత్రములు కలవాడు. అటువంటి వాసుదేవుని చూచుట చేత సభికుల నేత్రములు అమృతమును పొందినట్లు ఆనందమును పొందియుండెను.

## శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితో సంభాషించుట

ఆ సభయందుండు వారందరును నిశ్చలముగా నుండి ఒక్క డైనను నోరుమెత్తక యూరకుండిరి. వాసుదేవుడు తన దంతముల కాంతి సభాంగణమందు వ్యాపింపగా ఉరుమువంటి గొప్ప కంఠ ధ్వనితో అందరికి వినబడునట్లు ధృతరాష్ట్రునితో యిట్లనెను "ధృత రాష్ట్రమహారాజా! నీవు యెరుగని కార్యములు లేవు. అయినను

నా బంధుజనులకు తగిన పరమహితమును చెప్పవలెనని యిక్కడికి నేను వచ్చితిని. నేను వచ్చినందుకు భరతవంశస్థులందరును సంతోషించిరి. నీళ్ళు పాలు కలిసియున్నట్లు పాండవులు కౌరవులు కలిసి బ్రతుకుట మంచిదగును. ఆ విషయమును నీవు యోచించి కౌరవపాండవులు కలిసి మెలసి యుండునట్లు చేయుము. వీరు మనవారనియు వారు పరులనియు నీకు భేదములేదు. ఇదివరకు మీ భరతవంశమునందు ధర్మ న్యాయ సత్య స్నేహసంబంధ కరుణాభివృద్ధులు గలిగి యున్నవి. అందుచేత మీ భరతవంశము మిక్కిలి స్తుతింపబడి యున్నది. ఆ భరతవంశమునందు పుట్టిన నీవును నీ తమ్ముడగు పాండురాజును మహాగుణవంతులు. నీకొడుకులందరు మహాశక్తివంతులు. మీరందరును మంచినడవడి గలవారు. అట్టివంటివారు మీ సదాచారము తప్పుటవలన ప్రయోజనము లేదు. అట్లు యిప్పుడు మీరు తప్పరాదు.

2. ధృతరాష్ట్రమహారాజా! భరతవంశమునకు నీవే అధారుడవు. నీవంశము దెవ్వరెవ్వరి నడవడికలు యెట్లున్నను ఆనడవడికల వలన కలుగు మేలు కీడులు తుదకు నీయందే నిలుచును. గనుక నీవు మంచిభావమును యోచించి మీ వారికి అంతరస్నేహము కలిగింపవలయును. బాహ్యమునకు మంచినడవడిక కలిగి ధర్మనిష్ఠ బుద్ధిచేత ప్రవర్తింపవలయును. జనులచేత స్తుతింపబడవలయును. ఏవిధముచేతనైనను నీవు మీకులస్థుల కందరికిని స్నేహసంబంధములు కలిగించి ఈప్రకారము కీర్తిపొందవలయును. నీకొడుకులగు దుర్యోధనాదులు సధర్ములుగారు. కార్యములను గ్రహింపరు. గొప్పకార్యాలోచన సిద్ధులను యెరుగరు. తమవంశమున కిదిసరియైన నడవడిగాదని తలచరు. క్రూరస్వభావముచేత ప్రవర్తింపుచు బంధువుల మనస్సులను నొప్పింతురు. చెడుగుణములకును చెడుకార్యములను చేయుటకును

కొంచెమైనను భయపడరు. ధృతరాష్ట్రమహారాజా! కౌరవపాండవులు సంధిచేసుకొని శాంతమును పొందినయెడల నాకును నీకును మీ కులమునకును యీ రాజులకును మేలుకలుగును. యుద్ధముజర్గిన యెడల యీ చెప్పిన వారికందరికిని గొప్ప ఆపద కలుగును. గనుక యీ విషయము నీవు చక్కగా యోచించి పాండవ కౌరవులకు సంధిసేయుము. నీవు తలచి పూనుకొనినయెడల సంధి చేయవచ్చును. సంధికార్యము నీ వశములో నున్నది. కనుక యీ కౌరవులకు బుద్ధి చెప్పి సంధిచేయుట నీకు నీతియగును. నీవు అందరికిని బుద్ధిచెప్పి తెలివికలిగించుటకు సమర్థుడవు. ఆ పాండవ పక్షమందుండు భీమార్జునులవంటి వీరులు మీవైపు యెందరుకలరో యోచింపుము. ఈ కౌరవ పక్షమందుగల భీష్మ ద్రోణులవంటి మహావీరులు ఆ పాండవ పక్షమందు యెందరుగలరో లెక్కపెట్టుము. భీష్మ ద్రోణాదులను దిరస్కరించి నిర్లక్ష్యముగాజూచు మహావీరులా పాండవపక్షమందు యెంతమంది గలరో లెక్కింపుము. యుద్ధము జరిగినయెడల రెండు పక్షములవారును యుద్ధమందు చత్తురు. అట్లు యుద్ధమందు చని పోవుటకంటె నీకు భటులైయుండుట వలన యెంతమేలగునో ఆలోచింపుము. వారును వీరును కలిసి నీ సైన్యములై బ్రతుకుట కూడునో కూడదో నీవే యోచింపుము. గనుక యేవిధముచేతనైనను కౌరవ పాండవులకు సంధిగలిగింపుము.

ధృతరాష్ట్రమహారాజా! సంధిజేసితివేని జగత్తుయందుండు సకల రాజులును ప్రీతిపూర్వకముగా నీ పాదపీఠమును కొలుచుచుందురు. నాలుగు సముద్రముల లోపలనుండు సకలభూచక్రమును నీవే పరిపాలించుదువు. అందుకు నీవు సమ్మతింపవా ఏమి? బిడ్డల యందు తల్లికి విరోధము గలిగియుండుటవలన మేలుగలదేమో యోచింపుము. ధృతరాష్ట్రమహారాజా! ఇప్పుడు నీవు సంధిచేయక

ఉపేక్షించినయెడల కౌరవులకును పాండవులకును భూమియందుగల సకల ప్రజలకును కీడుచేసిన వాడవగుదువుసుమా! నీవు యిప్పుడు సంధిచేయనియెడల భూమియందుగల సకల ప్రజలకును నీకును కీడు గలుగును. గనుక యెట్లయినను సంధిచేయుము. కౌరవ పాండవులలో ఎవరికి చావునొప్పులు గలిగిన నీకు క్లేశముగును. ఆ విషయమును నీ చిత్తమందు యోచింపుము. యుద్ధమే చేసినయెడల నీకు మహా దుఃఖము గలుగును. ఈ కౌరవులును ధనుర్విద్యలయందు పండితులు. మహాబలపరాక్రమవంతులు. మహాభుజాబల గర్వవంతులు. ఇటువంటి కౌరవ పాండవులు వ్యర్థముగా యుద్ధము చేయుటకు పూనినయెడల ఘోరముగా యుద్ధమందు చచ్చెదరు. అట్టి చావులకు సహించి నీవిట్లు వుపేక్షించి యుండరాదు. ఈ కౌరవ పాండవుల దేహములు మిగుల సౌందర్యవంతములు. అటువంటి దేహములకు తీక్ష్ణబాణములు గ్రుచ్చుకొని యుద్ధమందు కూలును. అట్లు కూలుటకు మన మోర్వనచ్చునా చెప్పుము. ఇట్లు రెండుపక్షముల వారికిని చావుకలుగనట్లు సంధిజేసి అందరిని రక్షింపుము. నీ ప్రభుత్వ నీతి శాంత్యాది గుణములను అప్పుడు జనులు పొగడగలరు. అని కృష్ణుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. మహారాజా! పాండవులకు బాల్యదశయందే వారితండ్రియగు పాండురాజు చచ్చెను. అప్పటినుండి పాండవులను నీవు పోషించితివి. ఇప్పుడు మధ్యకాలమందుగా పాండవులను నీవు విడువరాదు. గనుక నీవు వారియందు కృపగలవాడవై ప్రీతిపూర్వకముగా వారిని రక్షింపుము. అని యిట్లు అతడు ధృతరాష్ట్రునితో చెప్పి మరల యిట్లనెను.

## శ్రీకృష్ణుడు పాండవులు చెప్పినమాటలు ధృతరాష్ట్రునితో చెప్పుట

ఓ ధృతరాష్ట్రమహారాజా! పాండవులు పరమ భక్తిపూర్వకముగా నీకు నమస్కరించి వారైదుగురును ఒక్కమాటగా నీతో

చెప్పుమని నాకు చెప్పిన విధమును వినుము. ఓ కృష్ణా! మా తండ్రి యగు ధృతరాష్ట్రమహారాజు ఆజ్ఞాప్రకారము మేము పన్నెండు సంవత్సరముల పర్యంతము వనవాసము జేసితిమి. పదుమూడవసంవత్సరమున జనులుగలజానపదమందుండి అజ్ఞాతవాసమును జరిపితిమి. ధృతరాష్ట్ర మహారాజుయొక్క ఆజ్ఞానువర్తులమై యీ పదమూడు సంవత్సరముల అరణ్యాజ్ఞాతవాసములను సక్రమముగా నిర్వర్తించి పిమ్మట మాసగము రాజ్యమును మేము పొందుదమను తలంపుతో నిశ్చయముగా సకలకష్టములను అనుభవించితిమి. మాకు ధృతరాష్ట్ర మహారాజే తల్లి తండ్రి యగును. మాకు సకల బంధుజనులును ఆ ధృతరాష్ట్ర మహారాజేయగును. ఆ మహారాజే మాకు దిక్కు. మావలన తప్పిదమున్న యెడల యిట్లు కాదు. అట్లు వర్తింపుడని మాకు బుద్ధిచెప్పి ఆ మహారాజే చక్క జేయును. ధృతరాష్ట్ర మహారాజు పదివేల సంవత్సరములున్నను అతడే మాకు దిక్కుగాని వేరె వరును మాకు దిక్కు కాజాలరు. మేమెటువంటి వారమైనను దుర్యోధనాదులను మమ్ములను ఒక్కరీతిగా ధృతరాష్ట్ర మహారాజు తలంచవలయునని మేము ప్రార్థించుచున్నాము. ఇట్లు ధృతరాష్ట్ర మహారాజు మా అందరియందును సమబుద్ధి గలిగియుండుటచేత మేమెటువంటి వారమైనను మాలో యెవ్వరు దుర్మార్గులైనను, వంశము ధర్మము దప్పకుండును. అని పాండవులు నీకుచెప్పుమని నాతో చెప్పిరి. అని కృష్ణుడు ధృతరాష్ట్రునకు చెప్పెను.

ధృతరాష్ట్ర మహారాజా! ఆ పాండవులు యీ సభాసదులకు చెప్పుచున్న మాటలను చెప్పెదనువినుము. సారవంతములైన ధర్మసత్యములచేత అసత్య పాపముల గట్టును పొందలేక యీ కార్యము నేసభ్యులుపేక్షింతురో అట్టి వుపేక్ష ఆ సభ్యులనే చెరుచునుగాని దైవమందరికిని సాక్షిగానున్నాడు. దైవము ధర్మస్వరూపుడు. సత్య

శుభ ప్రభుడు. అట్టిదైవము అందరి పాపపుణ్యములకును సాక్షి భూతుడై యున్నాడు. అని సభ్యులకు యిట్లుచెప్పుమని పాండవులు నాతో చెప్పిరని కృష్ణుడు ధృతరాష్ట్రునితో చెప్పెను.

ధృతరాష్ట్రమహారాజా! పాండవులు నీకును యీ సభ్యులకును చెప్పుమనిన మాటలను చెప్పితిని. నీవును యీ సభయందుండు వారును యిందులకేమి చెప్పెదరో యోచించుడు. నేను ధర్మమును నీతిని పురస్కరించుకొని మనోవాగ్దేహము లేకరూపమున సత్యమగునట్లుగా చెప్పితిని. సంధిచేయుటకు మీకు మేలగును. మీరు క్రోధదురహంకార మాత్సర్యములను విడచి నేను చెప్పినట్లు చేయుడు. అని వాసుదేవుడు ధృతరాష్ట్రునితో చెప్పి మరల సభ్యులను కలియజూచి వారితో యిట్లనెను. సభ్యులారా! మీరందరు నీతిమంతులు. కౌరవులు పాండవులకు భూమిపంచి యిచ్చుటకంటె చేయదగిన కార్యమేదియో చెప్పుడు. ధర్మమేదియో చెప్పుడు. తగిన విధమేదియో చెప్పుడు. సత్యమేదియో చెప్పుడు. అని వాసుదేవుడు సభ్యులతో చెప్పి మరల ధృతరాష్ట్రునకు కార్యగతి తెలియునట్లు తనమనస్సునందు కొరతనుంచక యిట్లనెను.

ధృతరాష్ట్ర మహారాజా! పాండవుల తండ్రియగు పాండురాజుయొక్క రాజ్యభాగమును పాండవులకు పంచియిమ్ము. నీ రాజ్యభాగమును నీపుత్ర పౌత్ర సహితముగా నీవు అనుభవింపుము. మీరందరును సౌఖ్యవంతులై యుండుడు. ఇట్లుచేసితివేని నీ బంధుమిత్ర సత్పురుషులందరును మెచ్చుకొందురు. ధర్మరాజు శత్రువులు లేనివాడు. అందులకే అతని కజాతశత్రుడని పేరువచ్చినది. ఆ ధర్మరాజుయొక్క నీతి ధర్మ సత్య నిష్ఠలను నీవు యెరుగవాయేమి? ధర్మరాజు యేవిధముగా మిమ్ములను అనుసరించి ప్రవర్తించెనో నీవును యెరిగియే యున్నావు. ధర్మరాజుయొక్క బలమును నీవుయెరుగవాయేమి?

ధర్మరాజుయొక్క గుణముల నన్నిటిని నీవు యెరిగియే యున్నావు. అయినను యిప్పుడు నీకు తెలియచెప్పెదను వినుము. ధర్మరాజు పూర్వము యింద్రప్రస్థ పట్టణమునందుండి నీకు అభివృద్ధి గౌరవములను కీర్తిని కలిగింపదలచి సకల దేశముల రాజుల నదమునణగించెను. ఆ సకల రాజులచేత నిన్ను సేవింపజేసెను. ధర్మరాజు దిగ్విజయము జేసి మహాదైశ్వర్యమును పొందియుండెను. ధర్మరాజుయొక్క అభివృద్ధికి ఓర్వజాలక నీ పుత్రుడగు దుర్యోధనుడు ధర్మరాజును పిలిపించి శకునిచేత జూదమాడించెను. ఆ మాయజూదమందు ధర్మరాజుయొక్క సర్వసంపదలను నీ దుర్యోధను డపహరించి అంతట నిలువక ద్రౌపదిని మానభంగము చేసెను. ధృతరాష్ట్రమహారాజా! దుర్యోధనుడు చేసిన చెడుకార్యముల కన్నిటికిని నీవు సమ్మతించితివి. ద్రౌపదికి కలిగిన అవమానము నంతయు ధర్మరాజు చూచి సత్యమును పూనెను. భీమార్జునులను ధర్మరాజుయొక్క ఆజ్ఞను అతిక్రమింపక యూరకుండిరి. ఆ సమయమున ధర్మరాజు కన్నీటిని వొత్తికొనుచు ఘోరారణ్యములకు వెళ్ళి మహాదుఃఖములు పొందెను. ధర్మరాజు బహుదైన్యమున పొంది తాను పూనిన అరణ్యవాస అజ్ఞాతవాసములను జరిపి వచ్చెను. అటువంటి మహాకష్టములను దుఃఖములను మీవల్ల పొందినప్పటికిని ధర్మరాజు మరల మీతోకలసి బ్రతుకవలెనని కోరుచున్నాడు. ధర్మరాజువంటి శాంతపురుషుడు వేరొకడులేడు. అతని కతడేసాటి. ధర్మరాజునకున్న అతిశాంత వినయ గౌరవాది గుణములు యేరాజుల కుండెనో చెప్పుము. ధర్మరాజుయొక్కమాహాత్మ్యమును యేమనిచెప్పుటకును సాధ్యముగాదు.

ధృతరాష్ట్రమహారాజా! పాండవులును కౌరవులును నీసంతానమే యగును. నీపుత్రులైన రెండుపక్షముల వారికిని మేలుచేయ గోరి నేను యింతదూరము తరిచి చెప్పితిని. నీ పుత్రుడగు దుర్యో

ధనుని బుద్ధి అతిలోభముగలది. దుర్యోధనుని చెడుబుద్ధిని మాన్పి నీవు పాండవులను దగ్గర జేర్చుము. పాండవులు శాంతస్వభావులు నీ పాదములను కొలుచుటకు పూనియున్నారు. అందుచే నీవు సమ్మతింపనియెడల పాండవు లిప్పుడే యుద్ధమునకు వత్తురు. ఈ రెండు విధములలో నీకిష్టమేదియో దానిని నిశ్చయించి చెప్పుము అని కృష్ణుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. కృష్ణుని వాక్యముల నన్నిటిని సభలోనివారందరును. విని సంతోషించి పులకాంకురిత దేహులై యుండిరి. ఆ సభాసదు లందరును తమ మనంబుల నిట్లనితలంచిరి. ఈకృష్ణు డింత మనోహరముగా నందరికిని ఆనందముగా నుండునట్లు చక్కని వాక్యములను చెప్పెను ఈ కృష్ణునియెదుట మాటలాడుటకు తగిన నీతివంతుడు లేడు. ధైర్యవంతుడు లేడు సమర్థుడును లేడు. అని సభ్యులు తమ మనస్సులందు తలంచుచు చిత్రపు బొమ్మల వలె నిశ్చలముగా నుండిరి. ఆసమయమున జమదగ్ని మహాముని దుర్యోధనునితో యిట్లనెను.

దుర్యోధనరాజా! పూర్వము దంభోద్భవుడను ఒకరాజుగలడు, ఆ దంభోద్భవుడు తనతో సమానబలవంతుడు లేడని గర్వించి క్రొవ్వుచే మదించి యుండెను. అప్పుడు గంధమాదన పర్వతమందు నరనారాయణులను మహా మునిపుంగవులు తపస్సు చేయుచుండిరి. ఆ దంభోద్భవుడు గర్వమతిశయింప నా గంధమాదన పర్వతమందున్న తపస్సుచేసికొను నరనారాయణుల మీదికి పోయి వారిని యుద్ధమునకు పిలిచెను. అప్పు డా నరనారాయణు లిద్దరును నీవు మాతో యుద్ధము చేయరాదని దంభోద్భవునికి చెప్పిరి. ఎంతచెప్పినను దంభోద్భవు డచ్చటినుండి వెళ్ళకుండెను. ఆ సమయమున నరుడను దివ్య మునీంద్రుడు తన పిడికిట దర్భగడ్డిని బట్టి బాణవర్షమును కురిపించెను.

ఆ బాణవర్షముచేత నరుడను దివ్యమునీంద్రుడు దంభోద్భవుని సైన్యమునుచంపి వానినిభంగపరచి పట్టుకొని విడిచెను. ఆ మహాత్ము లగు నరనారాయణులే యిప్పుడు లీలావిలాసముగా అర్జున కృష్ణులుగా పుట్టిరిసుమా! గనుక దంభోద్భవునివలె నీవుగర్వించి నరనారాయ ణులతో యుద్ధముచేయకుము. ఈ నరనారాయణులైన అర్జున కృష్ణు లతో కలహము చేసికొని వారిలో యుద్ధముచేసితివేని నీకుమేలుకలుగ నేరదు. పాండవులతో కలిసిమెలసి యుండుటవలన నీకుమేలుకలు గునుగాని లేకున్న కీడునిశ్చయము. అని జమదగ్ని మునీంద్రుడు దుర్యోధనునితో చెప్పెను. కణ్వమహాముని దుర్యోధనునితో యిట్లు చెప్పెను. దుర్యోధనా! యీజమదగ్ని మహాముని చెప్పినట్లే నీవుచేయ దగుదువు. దానంజేసి నీకుమేలగును. తన యోగ్యతను ఇతరులయోగ్య తను యెరుగక నిగ్రహించి మదించుటవలన చేటుకలుగును. పూర్వము అహంకారమువలన గరుత్మంతుడు పౌరుషహానిని పొందెను. అది యెట్లనగా చెప్పెదవినుము.

## కణ్వుడు దుర్యోధనునితో గరుత్మంతునివృత్తాంతము చెప్పుట

దుర్యోధనమహారాజా! దేవేంద్రుని సారథి మాతలి యని చెప్పబడును. మాతలికి గుణకేశి యనుపేరుగల కూతురుండెను. ఆ గుణకేశికి యౌవనము ప్రాప్తించగా దానికి తగినవరుని మాతలి వెదకి సుముఖుడను నాగకుమారునిజూచి వానిని వరునిగా నిశ్చయిం చెను. ఆసుముఖుడు ఆర్యకుడను నాగేంద్రుని మనుమడు. జికురుడను నాగేంద్రుని కుమారుడు. అట్టి సుముఖుని మాతలి తనకూతునకు వరు నిగా నిశ్చయించెను. అప్పుడు సుముఖుని తాతయగు ఆర్యకనాగేం ద్రుడు దుఃఖించి మాతలితో యిట్లనెను. మాతలీ! యీ సుముఖుని యొక్కతండ్రిని గరుత్మంతుడు చంపినాడు. మరియు కోపమున యిక

నెలదినములలోపల యీసుముఖునికూడ చంపెదనని గరుత్మంతుడు నిశ్చయించి వెళ్ళెను గనుక యీ సుముఖుని వివాహము మాకుసమ్మతముకాదు అని ఆర్యకనాగేంద్రుడు మాతలితో చెప్పెను. ఆమాటలను మాతలివిని ఆర్యకునితో యిట్లనెను. ఆర్యకనాగేంద్రా! నేను దేవేంద్రుని ప్రార్థించి నీమనుమడగు యీసుముఖునకు దీర్ఘాయుష్యమును యిప్పించెదను. ఈసుముఖునకు ఆయుష్సుగలిగించి నీమ్మాట నా కూతురుని యీసుముఖునకుయిచ్చి వివాహము చేసెదను. అనియిట్లు మాతలి ఆర్యకనాగేంద్రునితో చెప్పి వానినితీసికొని దేవేంద్రుని వద్దకు వెళ్ళెను. ఆసమయమున వారిభాగ్యవశమువలన విష్ణుదేవేంద్రులిద్దరును ఒక్కచోటనేయుండిరి. అప్పుడు మాతలి దేవేంద్ర విష్ణువులతో యిట్లనెను. మహాత్ములారా! విష్ణు దేవేంద్రులారా! నాకూతురగు యీ గుణకేశి ఈ సుముఖుడను నాగకుమారుని వరియించినది కనుక ఈగుణకేశి ఈసుముఖునకుయిచ్చి వివాహము చేయగోరియున్నాను. గరుత్మంతుడు ఈసుముఖుని ఒక నెలలో చంపునట్లుగా నిశ్చయించియున్నాడట. మీరుకరుణించి ఈసుముఖుని దీర్ఘాయుష్యమును యివ్వవలయును. అని మాతలి విష్ణు దేవేంద్రులతో చెప్పుకొని ప్రార్థించెను. విష్ణుదేవుడు కృపగలవాడై దేవేంద్రునితో యిట్లనెను.

దేవేంద్రా! ఈసుముఖునకు నీవు ఆయుష్యమునుయిమ్ము. గరుత్మంతుని విషయమై నేనుగనుగొనెదను. గరుత్మంతునివిషయమై నీవుభయపడవద్దు. అని విష్ణుదేవు డా దేవేంద్రునితో చెప్పెను. సుముఖుడను నాగకుమారునికి ఆయుష్యము నిప్పించెను. అప్పుడే మాతలి తనకూతురుని సుముఖునకిచ్చి వివాహముచేసెను. ఈసమాచారమునంతయు గరుత్మంతుడువిని వచ్చి కోపించి చెలరేగి విష్ణుని సన్నిధియందు దేవేంద్రునితో భయంకరముగా యిట్లనెను.

దేవేంద్రా ! నీవు అదితి పుత్రుడవు. నేను వినతాపుత్రుడను. మన యిద్దరికిని కశ్యపమునీంద్రుడు తండ్రియగును. మన యిద్దరము రాక్షసులను శోధించి చంపుదమురమ్ము. నేను యేవిషయమున నీ కంటె తక్కువగుదునో చెప్పుము. నేను ఆ సుముఖుని చంపుటకు పూనుకొని యుండగా నీవు వానికి దీర్ఘాయుస్సును గలిగించి నాకు అడ్డుపడితివి. అని గరుత్మంతుడు విష్ణుదేవుని సన్నిధియందు ఇంద్రునితో చెప్పెను. ఇంద్రుడు గరుత్మంతునితో యిట్లనెను. గరుత్మంతా! ఆ సుముఖునకు ఆయుర్దాయమును యిచ్చు విషయమై యీ విష్ణువు తప్ప యీ మహిమకు మరియొకరు సమర్థులు గారు. ఈ విషయమై నామీద నీవు కోపించుకొనవద్దు. అని యిట్లు ఇంద్రుడు గరుత్మంతునితో చెప్పెను. ఆమాటలకు గరుత్మంతుడు కటకటపడి ఇంద్రునితో యిట్లనెను. దేవేంద్రా ! నీవును యీ విష్ణుదేవుడును మీ యిద్దరును నాగొప్పతనము నెరుగక నాకు నీచభావము గలుగునట్లు చేసిరి. నా సన్నని యీక చేత సకలదేవతలను ధగించుటకు నేను సమర్థుడను. నే నింతటి సమర్థుడనై యుండగా నన్ను యీ ప్రకారముగా నీవు అవమానించితివిగదా ! అని గరుత్మంతుడు ఇంద్రునితో చెప్పి కోపముచేత యెర్రని నేత్రములుగలిగియుండెను. అట్లున్న గరుత్మంతుని విష్ణుదేవుడు చూచి కోపించుకొని పెద్దగా నవ్వుచు గరుత్మంతునితో యిట్లనెను.

గరుత్మంతా ! నీవు నీ బలశక్తిచేత మోసెదనని చెప్పుచున్నావు. నా నేర్పరితనముచేత నిన్ను నేను నడుపగా నీవొక మోతగాడనని గర్వించియున్నావు. ఇంతగర్వమును నీవు పొందరాదు. అని యిట్లు విష్ణుదేవుడు గరుత్మంతునితో చెప్పి తన ముంజేతిని గరుత్మంతుని వీపుమీద పెట్టెను. ఆ విష్ణుదేవుని ముంజేతిని గరుత్మంతుడు మోయజాలక ఆ మహాభారమునకు గరుత్మంతుడు పెద్ద శ్వాసను

విదుచుచు రెక్కలను విదిలించుచు ముక్కు తెరచుచు క్రిందబడి బుద్ధివశము తప్పి పెద్దగా అరచెను. అప్పుడు విష్ణువు కృపగలవాడై భయపడవద్దని గరుత్మంతునితో చెప్పి వానిని లేవనెత్తి రక్షించెను. మరియు పూరడించి యిట్లనెను.

గరుత్మంతా ! ఇక మంచికార్యము విషయమై కోపించకుము. బుద్ధిమంతుడవై బ్రతుకుము. అని యిట్లు విష్ణువు గరుత్మంతునితో చెప్పి విడిపించి పంపగా గరుత్మంతుడు వెళ్ళెను. గనుక గర్వముకూడదు. ఈ చెప్పిన గరుత్మంతుని వృత్తాంతము నంతయు యీ మహానుభావుడైన నారదమునీంద్రుడు ఎరుగును. ఈ మాతలికి యీ నారదుడు సహాయుడై యుండెను. గాన యీ విషయమును నారదుని యడుగుము. అదిగాక విష్ణువు సర్వేశ్వరుడు. ఆ విష్ణుదేవుని మహాత్మ్యమును నారదుడు కరతలామలకముగా నెరుగును. ఈ విష్ణుదేవుడే కృష్ణుడు. పాండవులకు యీ కృష్ణుని సహాయము కలిగియున్నది. పాండవులతో నీవు కలసి స్నేహము కలిగి బ్రతుకుము. ఇట్లుచేయుట వలన నీకు మేలగును. అని కణ్వమహామునీంద్రుడు గరుత్మంతుని చరిత్రమును దుర్యోధనునితో చెప్పెను. అంతట నారదమునీంద్రుడు దుర్యోధనుని జూచి యిట్లనెను.

దుర్యోధనా ! బలవంతుల బలమును గొప్పబలముచేత యెదిరించినను చేటుకలుగును. ఎంతవారికైనను నీతి వినయ సత్స్వభావములు నిలిచియున్నట్లు గర్వమునిలిచి యుండజాలదు. యెంతవారికైనను గర్వమువలన చేటు కలుగక మానదు. అని నారదుడు దుర్యోధనునితో చెప్పి మరల యిట్లనెను.

దుర్యోధనా ! నేను యిదియే చేసెదను. మరియొక కార్యమును చేయను అని యిట్టిపట్టుదలగల తలంపును గలిగియుండరాదు,

అట్టిమూర్ఖులకు కష్టము, అవమానముకూడ కలుగును. ఈవిషయమై గాలవుడు మనకు దృష్టాంతమగును. ఆ గాలవుని వృత్తాంతమును చెప్పెదనువినుము. దుర్యోధనమహారాజా! పూర్వము గాలవుడను ఒక మునికుమారుడుకలడు. ఆగాలవుడు విశ్వామిత్రమహామునిదగ్గర విద్యాభ్యాసముచేసి గురుదక్షిణ యేమిసమర్పించెదవో యానతిమ్మని యడిగెను. అంతట యేమియు అక్కరలేదని విశ్వామిత్రుడు గాలవునితో చెప్పెను. విశ్వామిత్రు డెన్నిమాటలచేత గురుదక్షిణ వద్దని చెప్పినను గాలవు డన్నిటికిఅన్ని చెప్పి గురుదక్షిణ మీకు సమర్పింపక వెళ్ళనని నిర్బధించెను. గాలవుని మూర్ఖతకు విశ్వామిత్రమహామునీంద్రుడు కటకటపడి గాలవునితో నిట్లనెను. గాలవా! అటులైనయెడల తెల్లని శ్రేష్ఠములైన గుఱ్ఱములను యెనిమిదివందలను తెచ్చియిమ్ము. ఆగుఱ్ఱములకు ఒక చెవినల్లగా నుండవలయును. అటువంటి గుఱ్ఱములను తెచ్చి నాకు గురుదక్షిణగాయిమ్ము అని విశ్వామిత్రమహామునీంద్రుండు గాలవునితో చెప్పెను. గాలవుడు వెళ్ళి అటువంటి గుఱ్ఱములను లోకమందెక్కడను పొందజాలక మిక్కిలి చింతాక్రాంతుడై నిద్రాహారములను విడచి దుర్గతికిపోయెదనని భూమియందు తిరుగుచుండెను. అంతట గాలవునకు ఒకచోట గరుత్మంతుడు కనబడెను. గరుత్మంతుడు గాలవునకు బాల్యస్నేహితుడు. గాలవుడు తన వృత్తాంతమంతయు గరుత్మంతునితో చెప్పెను. ఆవృత్తాంతమును గరుత్మంతుడు విని కరుణగలవాడై గాలవునితో యిట్లనెను. గాలవా! నీకు కావలసిన గుఱ్ఱములను దేవతలు నిర్మింతురేగాని మనుష్యలోకమందుగలిగి యుండవు. ఈసకలదిక్కులలో దేవేంద్రునిదిక్కైన తూర్పు దిక్కుయందు అనేకదేవతలు నివసించియుందురు. కనుక మనమా తూర్పుదిక్కునకు వెళ్ళుదమురమ్ము అని గరుత్మంతుడు గాలవునితో చెప్ప, గాలవుని తనవీపునిగిట నుంచుకొని దూర్పుదిక్కువైపు సముద్ర

ముమీఁదుగా ఆకాశమార్గమున వెళ్ళుచుండెను. అంతట గాలవముని బుద్ధివశముదప్పి నిలువజాలక ఒరిగెను. అంతట గరుత్మంతుడు ఒకపర్వతముమీఁద గాలవుని దించెను. ఇట్లు గరుత్మంతుఁడు గాలవునిదించి శ్రమదేర్చుకొనెను అక్కడ ఆపర్వతమందు శాండిలియను ఒక ముని శాపమువలన గరుత్మంతుని రెండు రెక్కలును విరిగిపడెను. తిరిగి మరల ఆముని యనుగ్రహమువలన గరుత్మంతునకు రెండు రెక్కలును వచ్చెను. ఇట్లు గరుత్మంతుడు అక్కడ సుఖమును సంతోషమును కూడ పొంది అచ్చటనుంచి తూర్పుదిక్కునకు బోవుటమాని మరల భూమిమీఁదకు గాలవుని తెచ్చెను. తన స్నేహితుఁడును ప్రతిష్ఠానపురవాసుడునగు యయాతిరాజేంద్రుని దగ్గరకు గరుత్మంతుడు గాలవుని దీసికొనిపోయెను.

గరుత్మంతుడు గాలవుని పద్ధతినంతయు యయాతికి చెప్పెను. యయాతి గరుత్మంతునితో యిట్లనెను. మిత్రుడా! గరుత్మంతుడా! ఒక చెవినల్లగానున్న తెల్లనిగుఱ్ఱములు నావద్దలేవు. నాకు మాధవి యను కూతురుగలదు. ఈమాధవిని గాలవునకిచ్చెదను. ఈ మాధవి నేరాజునకిచ్చినను మీరుకోరిన గుఱ్ఱములనిచ్చెదరు. అని యయాతి గరుత్మంతునితో చెప్పి తనకూతురగు మాధవియను కన్యకను గాలవునకు యిచ్చెను గాలవుడు మాధవినితీసికొని అటువంటి గుఱ్ఱములు గలరాజు లెవ్వరోయని భూమియందు తిరిగి అయోధ్యాపట్టణమునకు వెళ్ళి యిక్ష్వాకుమహారాజుతో ఇట్లనెను.

ఓ యిక్ష్వాకుమహారాజా! నాకు యెనిమిదినూర్లు తెల్లనిగుఱ్ఱములు కావలెను. ఆ గుఱ్ఱములకు ఒక చెవి నలుపుండవలయును. అటువంటి యెనిమిదివందల గుఱ్ఱములను నాకు నీవు యిచ్చినయెడల యీ మాధవిని నీకు యిచ్చెదను. అని గాలవుడు చెప్పగా యిక్ష్వాకు డిట్లనెను. ఓగాలవుడా! బ్రాహ్మణుడా! అటువంటి గుఱ్ఱములు

నాదగ్గర రెండువందలుమాత్రమే కలవు. అంతకంటె అధికముగా లేవు. అని యిక్ష్వాకురాజు గాలవునితో చెప్పగా ఆమాటలను మాధవి విని గాలవునితో యిట్లనెను.

గాలవ మునికుమారా! నేను పుత్రులనుకనినను ఒకమహాను భావుని భార్యవరము వలన నేను సర్వదా కన్యకనై యుందును. నేను పుత్రులను కనినను నాకు కన్యాభావము చెడదు. గనుక నన్ను యిక్ష్వాకునకు యిచ్చి యతనివలన వచ్చు గుఱ్ఱములను రాబట్టు కొనుము. ఇప్పుడే యీ యిక్ష్వాకునకు చెప్పి కొంతకాలమువరకు నన్ను యితనిదగ్గరనుంచి పిమ్మట నన్ను మరల నీవు తీసికొనుము. అని మాధవి గాలవునితో చెప్పెను. అందుకు గాలవుడు సమ్మతించి ఒక పుత్రుడు కలుగు పర్యంతము మాధవిని యిక్ష్వాకునిదగ్గర వుంచు నట్లుగా నిక్ష్వాకునితో యేర్పాటు చేసికొనెను. ఇక్ష్వాకుడును పుత్ర సంతానాపేక్షచేత మాధవిని గ్రహించి ఆయేర్పాటునకు సమ్మతించి రెండువందల గుఱ్ఱములను గాలవునకు యిచ్చెను. ఇక్ష్వాకుడు మాధవితో భోగించి దానియందు మనస్సను కుమారుని కనెను. పిమ్మట యిక్ష్వాకుడు మాధవిని గాలవునకు సమర్పించెను. ఆ విధ మంతయు గరుత్మంతుడు చూచి గాలవునితో యిట్లనెను.

గాలవా! యీ ప్రకారముగానే అన్నిస్థలముల యందును తిరిగి మాధవివలన గుఱ్ఱములను సంపాదించుకొనుము. అని గరుత్మం తుడు గాలవునితో చెప్పి వెళ్ళెను. మునికుమారుడైన గాలవుడు మాధ విని వెంటబెట్టుకొని సర్వదిక్కులయందుతిరిగి గుఱ్ఱములున్న స్థలము లన్నియు విచారించెను. ఆ సమయమందు కాశీరాజగు దివోదాసుని దగ్గర రెండువందల గుఱ్ఱములుండెను. అప్పుడు గాలవుడు మాధవిని ఆ దివోదాసుని దగ్గర ఒక పుత్రుడు పుట్టుపర్యంతమునుంచి దివో దాసుని వలన రెండువందల గుఱ్ఱములను తీసికొనెను. అంతట దివో

దాసుడు మాధవియందు ప్రతర్దనను పుత్రునికని మాధవిని మరల గాలవుని సమర్పించెను. అంతట గాలవుడు మాధవిని భోజపుర నాథుడగు ఔశీనరునకు యిచ్చెను. ఔశీనరుడు గాలవునకు రెండువందల గుఱ్ఱములను యిచ్చెను. ఔశీనరునకు మాధవియందు శిబియను కుమారుడు కలిగెను. ఇట్లు గాలవుడు ఆరునూరుల గుఱ్ఱములను సంపాదించి మరల మాధవిని తీసికొని భూమియందు తిరుగుచు గుఱ్ఱములున్న స్థలములను వెదకుచుండెను. గరుత్మంతుడు దన్నంతట గాలవుని వద్దకు మరలవచ్చి యిట్లనెను.

గాలవమునీంద్రా! ఇక చింతింపవలదు. ఒకానొక కారణము వలన యీ ముగ్గురు రాజుల వద్దను యీ మూడు రెండేసివందల గుఱ్ఱములను పొందగలిగితివి. వేరొకచోట మొత్తముగా ఆరునూర్ల గుఱ్ఱములను నీవు సంపాదింప జాలవు నేను నీకొక్క విషయమును చెప్పెదవినుము. నీవు ఆ విశ్వామిత్రుని వద్దకు వెళ్ళి యీ గుఱ్ఱములను సమర్పింపుము. పిమ్మట ఎట్లయినను ప్రార్థించి యీ ముగ్గురు రాజులకును యీ మాధవిని యిచ్చిన ప్రకారమే విశ్వామిత్రునకు గూడ నీమె నిమ్ము. అట్లుచేసితివేని తక్కిన రెండువందల గుఱ్ఱములను విశ్వామిత్రునకు నీవు యిచ్చినట్లేయగును. విశ్వామిత్రుడును యీ మాధవియందు ఒక పుత్రునిపొంది నప్పుడు నీ వలన రెండు వందల గుఱ్ఱములను తీసికొనినవాడు కాగలడు. అని యీరీతిగా గరుత్మంతుడు గాలవునితో చెప్పి గాలవ మాధవులను వెంటబెట్టుకొని విశ్వామిత్రుని దగ్గరకు పోయెను. అంతట గరుత్మంతుడు గాలవునికి ఆరువందల గుఱ్ఱములు లభించిన విధానమునంతయు విశ్వామిత్రునితో చెప్పి గాలవుని జూపి యిట్లుజెప్పెను.

మహాత్మా! విశ్వామిత్రమునీంద్రా! ఈగాలవుడు బాలుడు. నీవుపరమకృపా సముద్రుడవు. గాన నీవు యీ మాధవినిగ్రహించి

దీనియందు నీవుసంతానమునుపొంది గాలవుని కృతార్థుని చేయుము. అని గరుత్మంతుడు విశ్వామిత్ర మునీంద్రునితో చెప్పి ప్రార్థించెను. అందులకా విశ్వామిత్రుడును అంగీకరించెను. ఇట్లు గరుత్మంతుడు విశ్వామిత్రునకు ఆరువందల గుఱ్ఱములను గాలవునిచేత యిప్పించి మాధవిని విశ్వామిత్రునకు సమర్పింపజేసి గాలవుని కార్యమునుచక్కబెట్టి వెళ్ళెను. విశ్వామిత్రుడును మాధవియందు అష్టకుడను పుత్రునిపొంది పిమ్మట మాధవిని గాలవునకు వప్పగించెను. అటుపిమ్మట మాధవితపస్సు చేసెను. ఆగాలవునకు యిట్టి నీచచరిత్రము కలిగినది. అని యీరీతిగా నారదమునీంద్రుడా దుర్యోధనునితో చెప్పెను.

దుర్యోధనా! ఎంతటివాడైనను నిర్బంధముండరాదు. దురభిమానమువలన మహాపుర్దశకలుగును. యయాతిరాజు దురభిమానము చేత పుణ్యలోకపదభ్రష్టుడాయెను. యయాతి తన దౌహిత్రులగు మాధవీపుత్రులు నలుగురికారణమువలన మరల పుణ్యలోకప్రాప్తిని పొందెను. గనుక దుర్యోధనా! నిర్బంధ దురభిమానములు రెండును దుర్మార్గున కుండునేగాని సన్మార్గునియందుండవు. నీభుజాబలము పాండవులను గెలువజాలదు. కనుక నీవు పాండవులతో సంధిచేయుదువేని నీకుశుభము గలుగును. కృష్ణుడు చెప్పినమాటలను నీవువిని యీ కౌరవవంశమును రక్షించుకొనుము. జనమేజయమహారాజా! ఈప్రకారము జమదగ్ని, కణ్వ.నారదమహామునులు ముగ్గురును దుర్యోధనునకు హితోపదేశమును చేసిరి. ఆమునులమాటలను దుర్యోధనుడు ఆదరింపక కర్ణునిజూచి కర్ణునిచేతినిబట్టి నవ్వి యీ మును లింతటి వెర్రివారలు గదాయని ఆమునులతో యిట్లనెను.

## దుర్యోధనుడు నారదాదిమునులమాటలువిక నిరాకరించుట

ఓ జమదగ్ని కణ్వ నారదమునులారా! ఆ బ్రహ్మదేవుడు పూర్వము నన్నుయేమని పుట్టించెనో అట్లుజరుగును. మీమాటలు

నా చెవులకు సహింపరానివి కావు. మీ మాటలను నేను వినుటవలన కార్యము లేదు. ఇక మీరు అధికముగా సంభాషింపవద్దు. అని దుర్యోధనుడు నారదాది మునులతో చెప్పెను. ఆమాటలను ధృతరాష్ట్రుడు విని ఆమహామునులతో యిట్లనెను. నారదాదిమునులారా! మీరు చెప్పిన కార్యమును చేయుటకు తగినప్రయత్నమును నేను చేయలేను. నా పెత్తనమువలన యే కార్యమును జరుగనేరదు. నేనేమి చేయుదును? మరియొక మాటను చెప్పజాలను. అని ధృతరాష్ట్రుడు నారదాది మహామునులతో చెప్పి కృష్ణునితో యిట్లనెను. మహాత్మా! కృష్ణదేవా! ఇహలోక పరలోక సౌఖ్యములు గలుగునట్లుగా నీవు చెప్పితివి. నాకొడుకులను సమ్మతింపజేసి నీవు చెప్పినట్లు చేయుటకు నేను సమర్థుడనుగాను. నాకొడుకగు దుర్యోధనుడు మందబుద్ధి. నీవు పోరాని చుట్టమవు. మహానుభావుడవు. కృపగలవాడవు. నీవు యెటులైనను వ్రూరడించి యీ దుర్యోధనునకు బుద్ధిచెప్పవేయని ధృతరాష్ట్రుడు కృష్ణునితో చెప్పి ప్రార్థించెను. అంతట కృష్ణుడు దుర్యోధనునితో యిట్లనెను.

దుర్యోధనా! నిర్మలమైన భరతవంశమందు నీవు బుట్టితివి. సర్వగుణములను కలిగియున్నావు నీకు యీ దురహంకారము పనికిరాదు. తులువలగు మూర్ఖులు యిటువంటి చెడుమార్గమందు ప్రవర్తింతురే కాని నీవంటివాడు యిట్లు ప్రవర్తింపరాదు. నీపుత్ర మిత్ర సహోదరులు మొదలగువారు చెడుమార్గమందు ప్రవర్తింపకుండునట్లు అందరికిని నీవు బోధింపుము. ఆ పాండవులకు రాజ్యభాగమును పంచిపెట్టు విషయమున నీతండ్రి మొదలగు బంధు మిత్రులందరును సమ్మతించునట్లు చేయుము. అల్పబుద్ధుల విషయములను విని యీ సంధికార్యమును ఆలస్యమును చేయకుము. అట్లాలస్యము చేసితివేని దోషములు కలుగుటయేగాక చేటుకలుగునుసుమా! దుర్యో

ధనా! పాండవులు ధనుర్విద్యయందు పండితులు. సర్వదా శౌర్య వంతులు. ధృతరాష్ట్ర బాహ్లీక భీష్మ ద్రోణాదులందరును పాండ వులతో సంధిచేసుకొని బ్రతుకవలెనని కోరుచున్నారు. అదియే మంచి కార్యమగునుసుమా! నేను చెప్పుమాటలను వినుము. అసత్యము, లోభము, వీనివలన రాజ్యలక్ష్మి దక్కదు. ఆకలిలేనివాడు విష మును తినినయెడల క్రొవ్వుగలిగి బలవంతుడు కాజాలడుగదా! అటులే కర్ణ శకుని దుశ్శాసనుల కార్యాలోచనవలన నీకు యిష్టసిద్ధి కలుగుట దుర్లభము. భీమార్జునులు నీకు సహోదరులు. మహా భుజా బలవంతులు. అటువంటి వారిని నీవు పరులనుగా జూచితివి. ఇతరు లగు బలహీనులను వెదకి తెచ్చి దైన్యములుగల వాడవై దగ్గరతీసి ఆదరింపుచున్నావు. నీవు పాండవులకు కష్టము కలిగించినను ఆ పాండ వులు సత్యమును, ధర్మమును, న్యాయమును తప్పలేదు. నీయందు కోపించికొనలేదు. అటువంటి పాండవుల బంధుత్వమును నీవు వద లుట యెందులకో తెలియకున్నది.

దుర్యోధనా! పాండవులును మీరును కలిసియున్న యెడల సకలరాజులును మీకు భృత్యులై మిమ్ములను కొలుచుచుందురు. అటులైన యెడల మీకు సమస్త వస్తువులును లభింపగలవు. సంధిచేసిన యెడల మీ కమిత గౌరవ ప్రదమగు బ్రతుకుగలుగును. స్నేహితు లగు కర్ణాదులందరును నీకు బోటుమాటలను చెప్పి నిన్ను యుద్ధము నకు పురికొల్పిరి. ఆ కర్ణాదులు కార్యమును భిన్నము చేతురే గాని అనుకూలము చేయజాలరు. ఆవిధముగా నీకు చెప్పెడి కర్ణాదు లంద రును యుద్ధమునకు వచ్చినయెడల వారు పాండవులయెదుట నిలువ జాలరు. ఈమాటసత్యము. దుర్యోధనా! పాండవులతో యుద్ధము చేయుటకు సకల దేవ రాక్షసులైనను, సమర్థులు కాజాలరు. కర్ణాదు లెంతమాత్రపు వారు నీవే యెరుంగుము. గనుక పాండవులతో నీవు

యుద్ధముచేయుటకు నిర్ణయింపవద్దు. సంధినేచేయుము. నీ పక్షమం దున్న రాజులందరును భీమునకు ఒక్కడైనను. ఆ భీముడు కోపించినయెడల రుద్రుడైనను గడగడ వడకును. కనుక పాండవు లతో యుద్ధము చేయుట మానుము దుర్యోధనా! నేనొక కార్య మును చెప్పెదను వినుము. మీ సకల సైన్యములలో అర్జునుని యెది రించుటకు సమర్థు డొక్కడున్నయెడల పాండవులతో యుద్ధము చేయుటకు పూనుకొనుము. అర్జునుని యెదిరించుటకు సమర్థు డొక్క డును మీలో లేసియెడల పాండవులతో యుద్ధము చేయుటకు పూను కొనకుము. వ్యర్థముగా బహుజనులను చంపుటవలన ప్రయోజనము లేదు. దుర్యోధనా! మీరందరును విరాటుని గోవులను పట్టుకొని వచ్చునప్పుడు అర్జునుడొక్కడే వచ్చి గోవులను మరలించి మిమ్ముల నందరిని జయించెను. ఇది అందరును యెరిగియేయున్నారు. అర్జునుడు సహాయములేకనే ఒక్కడే వచ్చెను. అప్పటి అర్జునుని పరాక్రమ మట్లుండెనుగదా! నీవు కోపించుకొనక నేను చెప్పుమాటలను వినుము. ఇప్పుడు నేను అర్జునునకు సహాయుడనై వచ్చెదను. నేను సహాయముగా నున్నప్పుడు అర్జునుని యెదిరించిన వారికి మిక్కిలి కీడు కలుగును. గనుక అర్జునునితో యుద్ధమును మానుకొనుము. నీకు యుద్ధమందు జయము కలుగుట మిక్కిలి దుర్లభముసుమీ. దుర్యో ధనా! యుద్ధము చేసితివేని నీ నిమిత్తమై నీ పుత్ర మిత్ర బంధుజను లందరు సహోదరులును నీకంటె ముందుగనే చచ్చిపోవుదురు. నీకు కులనాశకుడను బిరుదురాగలదు. అట్టినింద కలుగుట మేలుకాదు గదా! గనుక పాండవులతో సంధిచేసికొని బ్రతుకుము. నీవు పాండ వులతో కలిసి మెలసి సంధిజేసికొని యున్నను రాజ్యభారము ధృత రాష్ట్రుని మీదేయుండును. నీవు యువరాజ్యాభిషిక్తుడవై ప్రకా శించుచుందువు. నీవును, నీబంధుజనులును, ప్రీతిపూర్వకముగా ధృత రాష్ట్ర మహారాజును సేవింపుచుండుటయే సామ్రాజ్యమగును.

దుర్యోధనా ! పాండవులు నీతో కలిసియుండవలెనని కోరు చుండగా నీవు వద్దని చెప్పుచున్నావు. ఈ పద్ధతిని జూడగా లక్ష్మి వచ్చినపుడు రావద్దని మోకాలుఒడ్డిన చందముగానున్నది గనుక ఆ పాండవులు నీతో కలసి యుండవలెనని కోరినప్పుడు అందుకు నీవు సమ్మతింపవలయును. అని భగవంతుడైన కృష్ణదేవుడు దుర్యోధను నితో చెప్పెను ఆ కృష్ణుడు చెప్పిన వాక్యముల నన్నిటిని భీష్ముడు విని దుర్యోధనునితో యిట్లనెను.

## భీష్మ ద్రోణులు దుర్యోధనునకు హితము చెప్పుట

దుర్యోధనా ! నీతండ్రియగు ధృతరాష్ట్రుడు చెప్పిన ప్రకారము వినుము. ఈ మహాత్ముడైన కృష్ణుడు యిక్కడకు వచ్చి హితము చెప్పినందున మన వంశము పరిశుద్ధమాయెను. ఈకృష్ణుడు చెప్పిన మాటను విననియెడల నునకు చేటుకలుగును. ఈ ధృతరాష్ట్రుడును శ్రీకృష్ణుడును నీకు చెప్పిన రీతిని నీవు చేసినయెడల నీకు అభివృద్ధికలుగును. నీవు యీ ధృతరాష్ట్రుడు బ్రతికియుండగా సకలమైన బంధురాజ్యలక్ష్మి మహాకీర్తులను నశింపచేయుటకు చూచుచున్నావు. అయ్యో ! ఇట్లు మన బంధుమిత్రాదు లందరును చచ్చుట వలన ప్రయోజనమేమో చెప్పుము. మన యీ బంధుజనులేగాక లోకమందెవ్వరును గూడ యీ కృష్ణార్జునులతో విరోధమును పెట్టుకొన జాలరు. నీవు యీ కృష్ణార్జునులతో విరోధమును పెట్టుకొంటి వేని నీకు యిహపరలోక సౌఖ్యములు రెండును చెడిపోవును. పాండవులతో కలిసి బ్రతుకుట నీకు మేలగును. అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పెను. పిమ్మట ద్రోణాచార్యుడు దుర్యోధనునితో యిట్లనెను. దుర్యోధన మహారాజా ! ధృతరాష్ట్ర భీష్ములును నేనును మేము ముగ్గురము నీకు పితృపితామహ గురువుల మగుదుము. మేము

ముగ్గురము నీహితమును గోరుచున్నాము. నీకు పరమహితములగు వాక్యములను మేము చెప్పుచున్నాము. మేముచెప్పిన మాటలను విని దుర్మార్గుల మాటలను వినక నీబంధువులైన పాండవులతో కలసి బ్రతుకుము. ఈ మహాత్ముడైన కృష్ణుడు నీకు పరమహిత వాక్యములను చెప్పెను. ఈ కృష్ణునిమాటలు అవశ్యకముగా నీవు వినవలెను. ఈ కృష్ణుడు చెప్పినట్లు నీవు చేసితివేని నీకు ఆయురైశ్వర్యాభివృద్ధి కలుగును. మాకన్నులు చల్లగనుండి నీయభివృద్ధినిచూచుచుందుము. ఈ కృష్ణుని మాటలను వినకుంటివేని పిమ్మట నిన్ను నీవే తెలుసుకొందువు. ఈ నిండుసభలో నీకు మరియొకమాటను మేము చెప్పజాలము. అని ద్రోణాచార్యుడు దుర్యోధనునితో చెప్పెను. ఆమాటలనన్నిటిని ధృతరాష్ట్రుడు విని దుర్యోధనుడున్నవైపు ముఖమునుంచి యిట్లనెను.

దుర్యోధనా! కుమారా! నీవు యీ కృష్ణుని ఆశ్రయింపుము. నీయన్నయగు ధర్మరాజు దగ్గరకుపోయి ధర్మరాజును చూడుము. ఇట్లు చేసితివేని మనకార్యములన్నియు సిద్ధించును. శ్రీకృష్ణుని మాటలు నీవు విననియెడల పిమ్మట నీకు సకలాపదలును కలుగును. అని ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో చెప్పెను. భీష్మద్రోణులు మరియు ఒత్తిచెప్పదలచి యిట్లనిరి. దుర్యోధనా! కృష్ణుడు అర్జునునకు సారథ్యముచేయును. ఆ యర్జునుడు గాండీవమును ధరించి యుద్ధమునకు వచ్చును. ఈ కృష్ణార్జునులు యుద్ధమునకు రాకమునుపే యీ కృష్ణుడు చెప్పిన ప్రకారము సంధిచేసి యీ కురువంశమును కాపాడుము. దుర్యోధనా! నీవు ధర్మరాజు దగ్గరకు వెళ్ళి ధర్మరాజు యొక్క పాదములకు భక్తిపూర్వకముగా నమస్కరింపుము. ఆ ధర్మరాజు నిన్ను రెండుచేతులతో యెత్తి చాలసేపు కౌగిలించుకొనును. భీముడును నిన్ను తన విశాలమైన వక్షస్థలముచే కౌగిలించి

కొనును. అర్జున నకుల సహదేవులు ముగ్గురును నీకు నమస్కరింపగా నీవు వారిని మెత్తికొని కౌగిలించుకొనుము. ఇట్లు మీరును పాండవులును బంధుత్వము కలవారై యుండి తామర సరస్సువలె అభివృద్ధిను కలిగియుండుడు. అట్లుండి మీమీ బంధుమిత్రులతో కలిసియున్న యెడల మన వంశమునకు యెంతకీర్తి కలుగునో నీవే తెలుసుకొనుము. దుర్యోధనా! ఇట్లు సంధిచేసిన యెడల యుద్ధము నిమిత్తమై వచ్చిన రెండుపక్షములవారి సైన్యములును తమతమ పట్టణములకు వెళ్ళుదురు. అట్లు వెళ్ళుచుండగా భూమియందుగల జనులందరును యెంతసంతోషమును పొందుదురో నీవే చూడగలవు. అని యిట్లు భీష్మ ద్రోణులు అనేకవిధములుగా దుర్యోధనునితో నొక్కిచెప్పి మరల యిట్లనిరి. దుర్యోధనా! మీరును పాండవులును భూమిని పంచుకొని సుఖముగానున్న యెడల భూమియందుండు సకల ప్రజలకును పరమానందము కలుగును. గనుక నీవు అట్లుచేసి మాఅందరిచేతను భూమియందుగల సకల జనులచేతను దీవెనలుపొందుము. అయ్యా! మామాటలను వినుము. అని భీష్మ ద్రోణులు అనేక విధములుగా దుర్యోధనునకు హితోపదేశము చేసిరి. అప్పుడు దుర్యోధనుడు కృష్ణునిజూచి యిట్లనెను.

కృష్ణా! ఈ భీష్మ ద్రోణులును నాతండ్రియగు ధృతరాష్ట్రమహారాజును వీరుముగ్గురును నన్ను సర్వదా దూషింపుచుందురు. ఈరీతిగానే నీవును నన్ను దూషించితివేగాని నీవు న్యాయమును యోచింపలేదు. ద్రౌపదిని కౌరవులు అవమానించిరనియు వనములలో కష్టములను పొందితిమనియు పాండవులుతలచి కోపించుకొని నిష్కారణముగా మమ్ములను చంపుటకు పూనియున్నారు. నావలన కొంచెమైనను తప్పులేదు ఆజూదరియైన ధర్మరాజు శకునితో జూదమాడి నాకు రాజ్యమును ఓడిపోయెను. అట్లుఓడిపోయిన ధర్మరాజుమూఢుడై

మరలజూదమందు పందెముఒడ్డి ఓడి వనవాస అజ్ఞాతవాసములు చేసెను, ఇంతవఱకు యిట్లుజరిగినదిగాని నేను ధర్మరాజు విషయమై మోసమును చేయలేదు. ఆపాండవులే మాత్స్యపాంచాల పాండ్యాది దేశముల రాజులను గూర్చుకొని యుద్ధముచేయగోరి యున్నారు. ఇట్టిక్రూరకర్మమైన యుద్ధమునకు మొదట మేము పూనితిమేమో చెప్పుము. మేము రాజధర్మముననుసరించి ఆదేవేంద్రునకైనను మ్రొక్కము. ఇహపరలోక గౌరవముకొరకు మేము రాజధర్మము ననుసరించి మాసైన్యము తలక్రిందైనను దేవతలకైనను చేయొగ్గము. మేము మాశత్రువులైన పాండవులకు మ్రొక్కెదమనుమాటను వీడుము. కృష్ణా! నేను చిన్నవాడనైయున్నప్పుడు రాజనీతిని గ్రహించక భూమిని పాండవులకు పోనిచ్చితిని. ఇప్పుడు నా బలమును యెఱుగక భీష్మ ధృతరాష్ట్రులు భూమిని పంచియిచ్చినను అందుకు నేను సమ్మతింపను. పూర్వము పాండవులు రాజ్యమందుగల రుచినిజూచి యిప్పుడు మరల రాజ్యమేలుటకు జూచుచున్నారు. నేను పాండవులకు భూమిని పంచియివ్వను. ఇకపూర్వపు పద్ధతులు యిప్పుడు జరుగనేరవు. భీష్మ ద్రోణులు నాపక్షమం దున్నారుసుమా! కృష్ణా! ఇకను మేము, ఆపాండవులు భూమినిపంచుకొని రాజ్యమునేలుట కలుగదు. ఇట్టిమాటలను యికనీవు చెప్పవద్దు. మిక్కిలి దీక్ష్ణమైన సూది మోపినంత భూమినైనను నేను పాండవులను పంచియివ్వను. పాండవులైనను, మేమైనను యుద్ధమందు జయమునుపొంది రాజ్యముచేయవలెనని నిశ్చయించితిని. అని దుర్యోధనుడు కృష్ణునితో చెప్పెను.

## శ్రీకృష్ణుడు దుర్యోధనునితో మున్నతడు చేసిన దుర్నయమును చెప్పుట

ఆదుర్యోధనుని మాటలను వినక మునుపు శ్రీకృష్ణుడు తెల్లతామరల రేకులవంటి కన్నులుగలిగి యుండెను. ఆదుర్యోధనుని మాట

లువినిన వెంటనే కోపముచేత కృష్ణుడు యెఱ్ఱతామర రేకులవంటి కన్నులుగలిగి యుండెను. అంతట కృష్ణుడు దుర్యోధనునితో యిట్లనెను. దుర్యోధనా! నీవు చెప్పినట్లు యికయుద్ధమునకు ఆలస్యములేదు. నీవును యీ భీష్మ ద్రోణాదులును బిరుదులుగలవారై యుద్ధమందు నిలువుడు. ఇదిగో యుద్ధము రేపేవచ్చును. ఇక ఊరడింపుమాటలను చూడగలరు. నీవలనతప్పులేదని చెప్పితివి. నీవు పాండవుల కొకనాడు కీడుచేసి మరియొకనాడు కీడుచేయని వాడవుకావు. నీవు పుట్టినదిమొదలు పాండవులకు కీడుచేసితివి నీవు పాండవులకు విషముపెట్టితివి. పెద్దక్రూరసర్పములచేత కఱపించితివి. నీటిలోకట్టి త్రోసితివి. లక్కయింటిలో పాండవులను కాపురముపెట్టించి ఆ లక్కయింటిని కాల్చితివి. ఇట్లనేకవిధములుగా పాండవులను చంపుటకు ప్రయత్నము చేసితివి. ఆ పాండవులు వారిధర్మముచేత రక్షింపబడి నీప్రయత్నమువలన చావక బ్రతికి ప్రకాశించిరి. పాండవులు నీచేత చావునుతప్పించుకొని రాజ్యమును పొందియుండగా నీవు ఓర్వలేక కోపించుకొని జూదమొకటి కల్పించుకొని కపటముచేత పాండవులరాజ్యలక్ష్మిని అపహరించితివి అందువలన పాండవులకు సకలకష్టములు గలుగుటవలన మీకందరికి యింత చేటు కలిగెను.

దుర్యోధనా! అన్నదమ్ములగువారు జూదమాడి భార్యలను సభకుయీడ్చి తెప్పించి ఆస్త్రీల చీరలను వొలిపించినవారు లోకమందెక్కడను కనబడలేదు. నీవొక్కడవే కనబడుచున్నావు నీవంటి పాపబుద్ధిగలవాడు వేరొకడు కానరాడు. ఆసభయందు నీవును కర్ణుడును ఆడినమాటలు చెప్పదగినవిగావు. మహాత్ముల గుణవంతురాలగు ద్రౌపదికి మీరంతటిచేటు ఘటిల్లచేయగా యీసభికులందరును చూచిరి. మరల ఆసభికులే వినుచుండగా నావలన తప్పిద మేమాత్రమును లేదనిచెప్పితివి. ఈపద్ధతి నీకే తగును. దుర్యోధనా! ఆ పాండవులే

యిప్పుడు దండెత్తి యుద్ధమునకు వచ్చుచున్నారని తప్పునంతయు పాండవులపైనుంచితివి. అంతమాత్రముచేతనే నీవు బ్రతుకలేవు. భీష్మ ద్రోణ ధృతరాష్ట్రులు చెప్పినమాటలు నీ చెవులయందు ప్రవేశింప లేదు. సంధిచేయుటవలన నీకును పాండవులకును మిక్కిలిమేలగును. అందునిమిత్తమై నేనుయింత చెప్పుచున్నాను. నామాటలు నీకురుచింప వని తెలిసియు యిట్లుచెప్పవలసి వచ్చెను. అనియిట్లు భగవంతుడైన శ్రీకృష్ణదేవుడు అనేకవిధములుగా దుర్యోధనునితో చెప్పెను. ఆ మాటలకు దుర్యోధనుడు కటకటపడియుండగా దుశ్శాసను డిట్లనెను.

అన్నా! దుర్యోధనమహారాజా! భీష్మ ద్రోణులును, మన తండ్రియగు ధృతరాష్ట్రమహారాజును యీ ముగ్గురును నీకు న్యాయ మును బోధింపుచున్నారని తలంపకుము. వారు చెప్పిన ప్రకారము నీవు సంధిచేయనియెడల నిన్ను పట్టుకొని కృష్ణునకు నప్పగిందురు. ఇది యంతయు నిశ్చయము. ఇక నిక్కడ నీవు వున్నయెడల నీకు కీడు గలుగునుసుమా! అని దుశ్శాసనుడు దుర్యోధనునితో చెప్పెను. ఆమాటలను దుర్యోధనుడు విని బాహ్లీక భీష్మ ద్రోణ కృష్ణాదులను లక్ష్యముచేయక రాజసముచేత సభలోనుండి దిగ్గనలేచి పోయెను. అందుకు సభయంతయు సంచలించెను. ఆ దుర్యోధనుని వెంటనే కర్ణుడును, దుర్యోధనుని తమ్ములగు దుశ్శాసనాదులును శకునియు వారిస్నేహితులగు అనేకరాజులును దిగ్గన సభలోనుండి లేచిపోయిరి. ఆ దుర్యోధనాదు లందరును గుంపులుగాచేరిరి. అట్లున్న దుర్యోధనా దులను చూచి భీష్ము డిట్లనెను. సభికులారా! యీ దుర్యోధనుడు దురభిమానియై తానొక రాజునని తలచి యీ నిండుసభలోనుండి లేచిపోయెను. ఈ దుర్యోధనుడు లోభ మద మోహమాత్సర్య ములచేత దుర్మార్గుడై యిట్లు అక్రమముగా సంచరించెను. వాని వెంటనే వాని స్నేహితులగువారుకూడ యేమితలచిరోగాని లేచి

పోయిరి. ఈ లేచిపోయిన వారందరును గుణవంతులు గారు. మీరంద రేమిచేయదలంచిరో తెలియదు. నేనేమి చేయుదును. అని భీష్ముడు సభయందుండు వారితో చెప్పి కృష్ణునిజూచి యిట్లని పలి కెను. మహానుభావా! కృష్ణదేవా! అయ్యో! యీ రాజుల కందర కును. కాల పరిపక్వమాయెను. అందువు మన మేమి చేయగలము అని భీష్ముడు కృష్ణునితో చెప్పెను. అప్పుడు కృష్ణుడు ఆ సభయం దుండు వారిని కలియజూచి యిట్లనెను.

భీష్మాదులారా! యీ దుర్యోధను డింత గర్విగదా! తాను సభలోనుండి లేచిపోయినయెడల యిక్కడున్న వారందరికిని దైన్యము కలుగునని తలచక దిగ్గన లేచిపోయెను. ఇందులకు వేరువిధాన మున్నదా లేదా! ఈ భరతవంశము పుణ్యకులము. ఈ పుణ్యకుల మును రక్షించుటకొరకు యీనీచుడైన దుర్యోధనుని విడువరాదా! ఈ పాపాత్ముడైన దుర్యోధనుని విడిచి యీ భరతవంశమును నిలుప వలెను. పూర్వము కంసుడు అధర్మమందు ప్రవర్తింపుచు, తండ్రి యగు వుగ్రసేనుని మనస్సును బాధపెట్టెను. అప్పుడు మా యాదవ కులస్థులందరును ఆకంసుని దురాచారమును నాకు తెలిపిరి. అప్పుడు నేను దుర్మాంసమును కోసెడి వైద్యునివలె ఆ కంసుని చంపి వంశ మును వుద్ధరించి వుగ్రసేనునకు సంతోషమును గలిగించితిని. ఆప్రకా రమే మీరును, యీ పాపాత్ముడైన దుర్యోధనుని చంపి మీవంశ మును కాపాడుకొనుడు. ఆదుర్యోధనుని ఒకనిని చంపినయెడల మీకు సకల ఆపదలు నశించును. మీ వంశము మిక్కిలి గౌరవము పొందగలదు. ఈ దుర్యోధను డొక్కడును చచ్చినయెడల కౌరవ పాండవులు కలిసిబ్రతుకుదురు. ఇట్లుచేయుట మీకు మంచిదని తోచ లేదా అని కృష్ణదేవుడు అందరువినునట్లు భీష్మాదులతో చెప్పెను. ఆమాటలను ధృతరాష్ట్రుడు విని అదరిపడి విదురునితో యిట్లనెను.

విదురుడా! ఆ గాంధారి బుద్ధిమంతురాలు. నేర్పుగలిగిన మాటలాడ గలదు. ఆ గాంధారి వచ్చి తన పుత్రుడగు దుర్యోధనునకు తెలిపి గలుగునట్లు చేయగలదు. నీవు శీఘ్రముగా వెళ్ళి ఆ గాంధారి నిటకు దోడితెమ్ము. అని ధృతరాష్ట్రుడు విదురునితో చెప్పెను. అప్పుడే విదురుడు వెళ్ళి గాంధారిని తీసికొని వచ్చెను. అట్లు వచ్చిన గాంధారీ దేవి తనకు తగిన పీఠమందు మరుగున గూర్చుండెను. అప్పుడు ధృత రాష్ట్రుడు గాంధారితో యిట్లనెను.

గాంధారీ! యీ మహాసభయందు యుండదగు పెద్దలుకూర్చుని యుండగా నీ పుత్రుడగు దుర్యోధనుడు దుర్మార్గబుద్ధిచేత యిక్కడ నుండి దిగ్గన లేచిపోయెను. ఇంతకంటె పనికిమాలినవాడు మరి యొకడు కనబడలేదు. నీవైనను ఆ దుర్యోధనునకు బుద్ధిచెప్పి శాంతు నిగా చేయుము. అట్లు చేసితివేని యీ కృష్ణుని కృపవలన యీ కౌరవ వంశము చెడకుండ నుండునుసుమా! అని ధృతరాష్ట్రుడు గాంధారితో చెప్పెను. అప్పుడు గాంధారి ధృతరాష్ట్రునితో యిట్ల నెను. దేవా! ప్రాణనాథా! ధృతరాష్ట్రమహారాజా! నీకుమారు డగు దుర్యోధనుడు దుర్మార్గుడని నీవు యెరిగియుండియు ఆ దుర్యో ధనుని వశమందు నీవు వర్తింపుచున్నావు. అట్లు నీవు ప్రవర్తించుట వలన ప్రయోజనములేదు. నీవు పాండవులకు యేమి యిచ్చినను నీకు అడ్డుపడు వారెవ్వరును లేరు. అని యిట్లు గాంధారీదేవి ధృతరాష్ట్రు నితో చెప్పెను. అంతట ధృతరాష్ట్ర గాంధారు లిద్దరును దుర్యో ధనుని పిలుచుటకు విదురుని పంపించిరి. అప్పుడు విదురుడు వెళ్ళి ప్రార్థించగా ముఖమును జేవురించుకొనుచు దుర్యోధనుడు మరల సభకు వచ్చెను. ఆ దుర్యోధనుని వెంబడి వెళ్ళినవారందరును సభకు రాక వెలుపలనే యుండిరి. దుర్యోధను డొక్కడే సభకు వచ్చి తన పీఠమం దాసీనుడయ్యెను. అప్పుడు గాంధారీదేవి తన చిత్తమందు

దుర్యోధనుని దూషింపుచు ఆ దుర్యోధనునకు ధర్మమార్గమును తెలియ చెప్పెను. నీతిని దెలియ చెప్పెను. బంధుమార్గమును గురించి చెప్పెను. బ్రతుకు భావమును దెలుపుచు చేసెను. తన శక్తిని వివరించి చెప్పెను. సహాయ కార్యములను చెప్పెను. కులజనులగు బాహ్లిక భీష్మాదుల చిత్తవృత్తులను గురించి ముచ్చటించెను. పాండవుల బలపరాక్రమములను విపులీకరించెను. ఇట్లు గాంధారీదేవి దుర్యోధనునకు సకల విషయములను విశదీకరించి బుజ్జగించెను. కోపముతో గద్దించెను. ప్రియభాషణములు పలికెను. ఈ రీతిగా గాంధారీదేవి దుర్యోధనునితో చెప్పినను, ఆమె వాక్యములను దుర్యోధనుడాదరింపక దురహంకారము చేత మరల సభలోనుంచి పోయి కర్ణాదులతో కలిసికొని దురాలోచనకు ప్రవేశించి యిట్లని పలికెను.

## దుర్యోధనాదులు శ్రీకృష్ణునిపట్టుకొని చెరబెట్టదలచుట

స్నేహితులారా! కృష్ణునితలంపు సరియైనదిగాదు. ఆకృష్ణుడు భీష్మ ద్రోణులను పట్టుకొని మనలనుబంధింప జూచుచున్నాడు. ఆకృష్ణుని మాటలపద్ధతి యంతయు తెలిసెను. పూర్వము కృష్ణుడు కంసుని జంపినవృత్తాంత మంతయు భీష్మాదులతో చెప్పుచున్నాడు. కనుక మనలను కృష్ణుడు పట్టకమునుపే మనము కృష్ణునిపట్టుకొందము. అట్లయినయెడల మనకు కార్యానుకూలమగును ఇకమనము మాత్సర్యమును విడువరాదు. మనము ముందుగా యిప్పుడే యీ కృష్ణుని బట్టుకొని చెరబెట్టి పాండవులకు దిగులుకలిగింతము. ఆ దిగులుతో పాండవులు చావక మనమీదికి యుద్ధమునకు వచ్చినను మనము సులభముగా పాండవులను చంపవచ్చును. ఈకృష్ణుని మనముపట్టుకొని చెరబెట్టినయెడల పాండవులు కోరలుతీసిన సర్పములవంటివారై యేమియుచేయజాలరు. అని దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులును

వారిస్నేహితులగు రాజులును ఆలోచించిరి. వారందరును యిట్లు దుష్కార్యాలోచనముచేసి భగవంతుడైన కృష్ణునిపట్టుకొని కొట్టుటకు నిశ్చయించిరి. ఆసమయమందు దుర్యోధన దుశ్శాసనాదు లందరును అడకువలేక యుండిరి. ఒకచోటను చేరకయుండిరి. గుసగుసగా మాటలాడుచుండిరి. పోవుచు వచ్చుచుండిరి. ధ్వనికలుగనట్లు మాటలాడుచుండిరి. ఈసమాచారమంతయు ముందుగా సాత్యకి చూచెను. ఆసమయమందు కృష్ణునిపట్టుటకు దుర్యోధనాదులందరును గుంపులు గూడిరి. ఆవిషయమునంతయు సాత్యకి తెలిసికొని కృతవర్మదగ్గరకు పోయి కృతవర్మతో యిట్లనెను.

కృతవర్మా! నీవు నీసైన్యమును తీసికొనిపోయి వాకిటియందు నిలిచియుండుము. నేను యీలోపముల అన్నయగు కృష్ణునిదగ్గరనుండి అందరిని చక్కబెట్టగలను. పాపాత్ములగు దుర్యోధన దుశ్శాసనాదు లందరును అన్నయగు కృష్ణునివిషయమై పాపకార్యమును చేయదలచిరి. అని యిట్లు సాత్యకి పరమాప్తుడగు కృతవర్మతో చెప్పి కృతవర్మను వాకిలిదగ్గరకు పంపించెను. అంతట సాత్యకి అతి శీఘ్రముగా కృష్ణునిదగ్గరకువచ్చి దుర్యోధనాదుల దురాలోచనమంతయు కృష్ణునకు తెలిపెను. అంతట సాత్యకి కృష్ణునిఅనుమతినిపొంది ధృతరాష్ట్ర బాహ్లీక భీష్మ విదురులతో యిట్లనెను. ధృతరాష్ట్రాదులారా! అదిగో కౌరవులు పాపాత్ములై దుష్కార్యములు చేయదలచి కృష్ణునిమీదకు రాదలచిరియున్నారు. ఇట్లు కృష్ణునిపట్టుటకు ఆ కౌరవులకు సాధ్యమగునా? ఈభగవంతుడైన కృష్ణునిపట్టి బంధించుటకు ప్రయత్నించిరి. అగ్నిహోత్రమును వస్త్రముచేత బంధించుటకు సాధ్యముకాదుగదా! అటువలెనే ఆకౌరవుల దురాలోచనవలన యీకృష్ణదేవుడు చిక్కునా! అని సాత్యకి ధృతరాష్ట్ర బాహ్లీక భీష్మ విదురాదులతో చెప్పెను.

ఆమాటలకు విదురుడు అదరిపడి ధృతరాష్ట్రునితో యిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! భగవంతుడైన కృష్ణదేవుడు పుణ్య

రూపుడు. అపరిమిత పరాక్రమ వంతుడు. ఇటువంటి కృష్ణదేవుని కేవల మనుష్యునిగా నీకుమారులు తలచిరి. నీకొడుకులగు దుర్యోధనాదులు యీ కృష్ణదేవుని స్మృశించినంతమాత్రమున మంట యందు పడిన మిడుతలవలె నశింపగలరు. అయ్యో! యీ కౌరవుల కందరికి ఆయుష్కాలము పూర్ణమైనట్లు తోచుచున్నది. అని యిట్లు విదురుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. అప్పుడు భగవంతుడైన కృష్ణుడు ధృతరాష్ట్రునితో యిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! మీ కౌరవులు కోపముగలవారై క్రూరత్వముచేత నన్ను పట్టవలయుట సంతోషమే. నీవు యిప్పుడు నాకు అనుజ్ఞయిమ్ము. నేను సిద్ధోషముగా యీ కౌరవులనందరిని చక్కబెట్టిపోయి వచ్చెదనుగాక యనుచు కృష్ణుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. అప్పుడు ధృతరాష్ట్రుడు తొందరపడుచు విదురునితో యిట్లనెను. విదురుడా! దుశ్శాసన కర్ణ శకునుల మొదలగు వారితోగూడి యుండెడి ఆదుర్జనుడైన దుర్యోధనుని తీసికొనిరమ్ము; శీఘ్రముగాపొమ్ము. అని యిట్లు ధృతరాష్ట్రుడు విదురునితో చెప్పి పంపించెను. విదురుడు వెళ్ళి దుశ్శాసనాదులతో గూడి యుండు దుర్యోధనుని పిలుచుకొని వచ్చెను. ఆదుర్యోధనుని వెంటనే కర్ణ శకుని దుశ్శాసనులు మొదలగు వారందరును వచ్చిరి. అప్పుడు ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో యిట్లనెను.

ఓరీ! దుర్యోధనా! నీవును, యీ దుర్మార్గులగు కర్ణాదులును మీ తారతమ్యమును యెరుగజాలక యీ రీతిగా కృష్ణునకు కీడు చేయదలచితిరి. గాలిని చేతిచేత పట్టుటకు సాధ్యమగునా! మహా పర్వతమును కదలించుటకు సాధ్యమగునా? అగ్నిహోత్రమును అంటుటకు సాధ్యమగునా? అటువలెనే యీ శ్రీకృష్ణుని పట్టుటకు మీకు సాధ్యముగాదు మీరందరును వినాశమును పొందుటకు

ప్రయత్నించుచున్నారు. అయ్యో! నేనేమి చేయుదును? అని యిట్లు ధృతరాష్ట్రుడు సుయోధనునితో చెప్పెను. అంతట విదురుడు దుర్యోధనునితో యిట్లు చెప్పెను. దుర్యోధనా! బాల్యము మొదలుకొని కృష్ణదేవుడు లీలావిలాసముగా యెవ్వ రెవ్వరిని యేమేమి చేసెనో యెరుగవా యేమి? ఇట్లు వ్యర్థముగా చెడిపోవుటకు ప్రయత్నించుచున్నావు. అని విదురుడు దుర్యోధనునితో చెప్పెను. ఆసమయమున కృష్ణుడు తన కన్నెదుటనున్న దుర్యోధనుని చక్కగా చూచి యిట్లనెను.

దుర్యోధనా! నేనుఒక్కడనే అనితలచి దురహంకారముచేత నన్ను పట్టుకొనుటకు తలంచితివాయేమి? అని కృష్ణుడు దుర్యోధనునితో చెప్పుచు నవ్వెను. ఆనవ్వినకృష్ణుని నొసటియందు బ్రహ్మదేవుడు పుట్టెను. వక్షమందు మూడునేత్రములుగల రుద్రుడు పుట్టెను. నోటి యందు అగ్నిహోత్రుడు పుట్టెను. ఆకృష్ణుని రెండుప్రక్కలయందును దేవేంద్ర యమ వరుణ కుబేరులును, పన్నెండుమంది ఆదిత్యులును సూర్యులును, మరుద్దేవతలును, విశ్వేదేవతలును, అశ్వినీదేవతలును పుట్టిరి. కృష్ణునియెడమభుజమందు నాగేటిఆయుధమును ధరించిన బలరాముడు పుట్టెను. కుడిభుజమందు గాండీవముధరించిన అర్జునుడు పుట్టెను. కృష్ణుని వీపునందు తమతమ ఆయుధములను ధరించిన ధర్మరాజు భీమ నకుల సహదేవులు పుట్టిరి. ఆకృష్ణుని తొడలయందు నానావిధ ఆయుధములను ధరించిన యదువృష్ణి భోజ అంధకవీరులు పుట్టిరి. కృష్ణుని దేహమందు అనేకములగు చేతులుపుట్టెను. ఆచేతుల యందు శంఖ చక్ర గదా ఖడ్గ శక్త్యాయుధ శార్ఙ్గములు మొదలగు సకలాయుధములు ప్రకాశించెను. ఆకృష్ణుని నేత్రములయందును, చెవులయందును ముక్కురంధ్రములయందును పొగలతోగూడిన అగ్నిజ్వాలాసమూహములు గలిగెను. ఆకృష్ణుని దేహమందుగల వెంట్రుక

లుండు రంధ్రములనుండియు, సంధులనుండియు, సూర్యకిరణముల వంటి ప్రభలు ప్రకాశింపుచుండెను. ఇట్లా కృష్ణుని దేహమునుండి విశ్వరూప ప్రపంచమునకనపడి మహా తేజోరూపమై యుండెను. ఆతేజోరూపమును జూచుటకు యెవ్వరికిని శక్యముకాలేదు. ఆసభయందుండు సకలజనులును కన్నులుమూసికొని అద్భుతభయానక రసములనుగలిగి నిశ్చేష్టితులై యుండిరి.

ఆసమయమున భగవంతుడగు కృష్ణదేవుడు నారదాది మహామునులయందును భీష్మ ద్రోణ విదుర సంజయులయందును కరుణాకటాక్షవీక్షణముంచి వారికి దివ్యదృష్టియిచ్చెను. అప్పుడు నారదాది పుణ్యపురుషు లందరును దివ్యదృష్టిచేత భగవంతుని విశ్వరూపమును చూచుచు పరమానందమందు తేలుచుండిరి. జనమేజయమహారాజా! ఆసమయమున ఆకాశమందు దేవవాద్యము లన్నియు మ్రోగెను. కల్పవృక్షసంబంధమైన పుష్పవర్షము కురిసెను. ఆకాశమందు సిద్ధ సాధ్య విద్యాధరు లందరును భక్తిపూర్వకముగా జయజయ శబ్దములను చేయుచుండిరి. ఆ మహాసంకులధ్వని విష్ణుని విశ్వరూపమని ధృతరాష్ట్రుడు తలచి గ్రహించి భగవంతునితో యిట్లనెను.

భగవంతుడా! కృష్ణదేవా! నీభక్తుల భయమును పోగొట్టెడివాడవగుదువు. నా అజ్ఞానకార్యమును నీవు సహింపవలయును. నాయందు కరుణింపుము. నీ శరణమును వేడుచున్నాను. నీ పాదములను చూచుటకు నన్ను అనుగ్రహింపుము అని ధృతరాష్ట్రుడు భగవంతుని ప్రార్థించెను. పరమేశ్వరుడైన కృష్ణదేవుడు ధృతరాష్ట్రునియందు కృపగలవాడై అతనికి దివ్యదృష్టి నిచ్చెను. ధృతరాష్ట్రుడు దివ్యదృష్టిచేత పరమేశ్వరుని విశ్వరూపమును జూచి పరమానంద సముద్రమందు మునిగి తేలినట్లుండి ఆ పరమేశ్వరునితో యిట్లనెను. ఓ పరమేశ్వరా! కృష్ణదేవా! నీకుభక్తిపూర్వకముగా నమస్కరింపు

చున్నాను. నిన్ను జూచినందున నేను కృతార్థుడ నైతిని. ఇక నితరు లను జూచుటకు సమ్మతింపను. గనుక నా నేత్రదృష్టిని పోగొట్టుము. అని ధృతరాష్ట్రుడు భగవంతుని ప్రార్థించెను. ఆ సభయందుండు వారందరుడు ధృతరాష్ట్రుని తెల్లని విశాల నేత్రములరు జూచుచు తమ మనస్సులయందు ఆశ్చర్యములను పొందియుండిరి. పిమ్మట భగ వంతుడైన కృష్ణదేవుడు ధృతరాష్ట్రుని యిష్టప్రకారము అతని కన్ను లకు యెప్పటివలె దృష్టిలేకుండునట్లు చేసి తన విశ్వరూప ప్రపంచ మును పోగొట్టెను. కృష్ణదేవుడు నారదాది మహామునులను పంపిం చగా ఆమహామును లంతర్ధానులైరి. అంతట కృష్ణదేవుడు తాను కూర్చున్న పీఠముమీదనుండి లేచెను. అంతకుమునుపే సాత్యకి కృత వర్మ లిద్దరును కృష్ణునియెదుటకు వచ్చి నిలిచిరి. అప్పుడు కృష్ణుడు వారిద్దరి చేతులను బట్టుకొని ఫూరక బయలువెడలెను. దుర్యోధనా దులను యేమియు చేయకయే కృష్ణుడు వెళ్ళుటకు నిశ్చయించెను. అని యీరీతిగా వైశంపాయనమునీంద్రుడు జనమేజయమహారాజుతో చెప్పగా జనమేజయు డిట్లనెను. ఓ వైశంపాయనమునీంద్రా! ఇట్లు కృష్ణుడు ఆ కౌరవ సభలోనుండి వెళ్ళిన పిమ్మట జరిగిన కథను విన వలెనని నాకు వేడుక గలిగియున్నది. ఆకథను సవిస్తరముగా వివ రించి చెప్పుము. అని జనమేజయుడు వైశంపాయన మునిని అడిగెను.

ఇది శ్రీ మహాభారతమున ఉద్యోగపర్వమునందు
తృతీయాశ్వాసము.

---

## చతుర్థాశ్వాసము

దేవా! హరిహరనాథా! వైశంపాయనమునీంద్రుడు జనమే జయమహారాజును జూచి యిట్లనెను. మహారాజా! కృష్ణదేవుడు

కౌరవ సభలోనుండి వెళ్ళినపిమ్మట గాంధారీదేవి ఆశ్చర్యమునుపొంది అంతఃపురమునకు వెళ్ళెను. అప్పుడు కౌరవు లందరును వారి బంధు మిత్ర సహాయులును అందరును ఆ కృష్ణుని వెంటనే బయలువెడలి వచ్చుచుండిరి. అట్లు కృష్ణుడు బయలువెడలి వచ్చునప్పుడు అతని ముఖము కోపము చేత చిట్లించుకొని యుండెను. అంతట కృష్ణుడు సభాగృహమందలి కక్ష్యాంతరములను దాటివచ్చుచుండెను. కృష్ణుని రథసారథియగు దారుకుడు రథముయొక్క నొగల మీాదనుండి కృష్ణునకు కనబడెను. దారకుడు వినయపూర్వకముగా తనచేతులను ముఖమందుంచుకొనెను. ఆ దారకుడున్న స్థలమందు కృష్ణుడు నిలిచి వెనుకవచ్చు కౌరవులను చూచి యికమీారు నిలువుడని చెప్పెను. ధృతరాష్ట్రుడు కృష్ణుని దగ్గరకు వెళ్ళి తన కొడుకగు దుర్యోధనుని వైపు చూచి కృష్ణునితో యిట్లనెను. మహాత్మా! కృష్ణా! కౌరవ పాండవులు కలిసి బ్రతుకవలెనని తలచి నేను ఆ ప్రకారముగా ఇప్పుడు సభయందు దుర్యోధనునకు బుద్ధులు చెప్పిన విధమును నీవు చూచితివిగదా! కులాచార ధర్మమును నిర్వహింపవలెనని అనేక విధములైన ప్రయత్నములను చేసి దుర్యోధనునకు చెప్పితిని. నాకు గల దుఃఖము నంతయు యిప్పుడు నీ సన్నిధియందు యీా కౌరవ జాతికి తెలిసెనుగదా! నీ బుద్ధికి నేను నిర్దోషుడనని తోచుటయే చాలును. నేను నీకు నిర్దోషుడనని తోచినప్పుడు సకల బంధుమిత్ర గురుజనులకును నిర్దోషుడనైతిని. కనుక నాస్వభావము నీ వెరుంగుటయే నాకు చాలును. అని ధృతరాష్ట్రుడు కృష్ణునితో చెప్పెను. ఆ మాటలను కృష్ణుడు విని బాహ్లీక భీష్మ ద్రోణ కృపాచార్యులు మొదలగు పెద్దలను చూచి యిట్లనెను.

బాహ్లీకాదులారా! ఇప్పుడు యీా సభయందుండు విశేషము లన్నియు మీాకందరికిని స్పష్టముగా తెలిసెనుగదా! ఇప్పుడు యీా

ధృతరాష్ట్రరాజు దేనికిని తాను ముఖ్యుఁడుగాననియు తనయుఁడు తప్పు లేదనియు చెప్పివిడిచెను. ఇప్పుడిట్లు చెప్పుటకు కారణమేమో తెలియలేదు. ఇక్కడనేను ఆలస్యము చేయవలసిన పనిలేదు. పోయి వచ్చెదను. ఈ వృత్తాంతమునంతయు నేను ధర్మరాజునకు తెలుపవలయును. అని కృష్ణుఁడు ఆ బాహ్లీక భీష్మాదులతో చెప్పి వారలను నిలిపెను. కృష్ణుఁడు రథమెక్కి ధృతరాష్ట్రాదులు వెనుక వచ్చుచుండగా కుంతీదేవి గృహద్వారము దగ్గిర రథముదిగెను. పిమ్మట కృష్ణుఁడు గృహములోనికి వెళ్ళి కుంతీదేవియొక్క పాదములకు నమస్కరించెను. ధృతరాష్ట్రాదులందరును కృష్ణుని వెంబడి కుంతీదేవి గృహములోనికి వెళ్ళి కృష్ణునిదగ్గరనుండిరి. అంతట కృష్ణుఁడు తాను కౌరవసభయందు సంభాషించిన గౌరవవాక్యములను సంక్షేపముగా చెప్పెను. దుర్యోధనుఁడు చేయబూనిన దుష్కార్యమును సంక్షేపముగా కృష్ణుఁడు కుంతీదేవికి తెలిపెను. కౌరవసభయందు పుట్టిన విశేషములనన్నిటిని కృష్ణుఁడు కుంతీదేవితో చెప్పి మరల యిట్లనెను. అత్తా! కుంతీదేవీ! కౌరవులు తమయిష్టప్రకారము రాజ్యమును అనుభవించి క్రొవ్వి మీద మెఱుగకున్నారు. అది మీకు మేలే యగును. అర్జునుని దివ్యబాణాగ్నికి కౌరవులందరును ఆహారము కాగలరు. ఇకను నేను పాండవుల దగ్గరకు వెళ్ళెదను. వారికి తగిన బుద్ధులను ఆనతిమ్ము. అని కృష్ణుఁడు కుంతీదేవితో చెప్పెను. కుంతీదేవి పరాక్రమము చేత జీవించిన ముచికుందుండు సృంజయుఁడు అను పూర్వపురాజుల చరిత్రమును కృష్ణునితో చెప్పి ఆ ధర్మరాజు వీరిచరిత్రము వినలేదో యేమి యని మరల ధృతరాష్ట్రాదులందరు వినుచుండగా కృష్ణునితో యిట్లనెను.

అల్లుడా! కృష్ణా! క్షత్రియులకు పరాక్రమ జీవనము తప్ప మరియొక జీవనవృత్తి కూడదని మునులు చెప్పుదురు. మహాబల బుద్ధి

వంతులగురాజులు తమకులధర్మములను జరుపుదురు. బలహీనులగు రాజులు తమకులధర్మములను మాని దైన్యములుగలవారై తేజో హీనమైన కూటికి ఆశపడుదురు. నీ బావమరదులగు పాండవులు సంధినే గోరుచున్నారు. ఈ కౌరవులతో కలసియుండుట కష్టమగును. ఆ సంధిమార్గము తప్పుటయే మనకు మేలైవచ్చును. నీవు అనుమానములు విడిచి వెళ్లుము. అర్జునుడు మనకు ధర్మప్రకారము యుద్ధమున కుత్సహింపనియెడల అయ్యో! దైన్యముకలుగును. మహాభుజాబలవంతుడగు భీమునకు యీసంధి యిష్టమగునా? నీవు సర్వలోకముల చేతను పూజింపదగినవాడవు. నీవు యిక్కడకు రావచ్చునా? కాల వశమువలన జరుగు కార్యములను తప్పించుటకు దైవమునకు సాధ్యముగాదు. కృష్ణా! పూర్వము ఆ సభయందు ద్రౌపదిపొందిన అవమానము యిప్పుడు పాండవులు మరచిరేమో తెలియలేదు. పాండవులు ధర్మమార్గమును తప్పుటకు భయపడి ఆ ద్రౌపదిఅవమానమును సహించిరి. పిమ్మట యిప్పుడైనను పగతీర్చుకొని శాశ్వతమైన కీర్తిని పొందవలయును. అని కుంతీదేవి కృష్ణునితో చెప్పి కృష్ణుని కౌగలించుకొనెను. అప్పుడు కృష్ణుడు నమస్కరింపగా కుంతీదేవి దీవించెను. కుంతీదేవి కృష్ణునితో యిట్లనెను.

కృష్ణా! నేను సుఖముగా బ్రతికియున్నానని పాండవులతో చెప్పుము. చేతులయందుగల బలముచేత బ్రతుకుండని చెప్పుము. నీవు పోయిరమ్ము. అని కుంతీదేవి కృష్ణునితో చెప్పి పంపించెను. కృష్ణుడు సింహగమనమువంటి గమనములచేత బయలుదేరెను. అప్పుడు కృష్ణుని వెనుకనే ధృతరాష్ట్రాదులను కృష్ణుడు పిలిపించి కర్ణునివైపు చూచి యిట్లనెను. ఓ కర్ణా! నన్ను పంపించి వచ్చెదవుగాక రమ్ము. అని యిట్లు కృష్ణుడు కర్ణుని బిలిచి చేయి చాచి కర్ణుని చేతిని పట్టుకొని తన రథముమీద యెక్కించుకొనెను. సాత్యకి మరియొక

రథముమీాద నెక్కి కృష్ణునిరథమునకు ప్రక్కగా వచ్చుచుండెను. కృష్ణుని పంపించుటకు వచ్చిన కృతవర్మను స్నేహ పూర్వకముగా కృష్ణుడు నిలిపెను. ఇట్లు కృష్ణుడు కర్ణుని మాత్రము తన రథము మీాద కూర్చుండ బెట్టుకొని తక్కిన అందరిని పంపించి వచ్చుచుండెను.

## శ్రీకృష్ణుకు కర్ణుని తనరథంబెక్కించుకొని కొన్నిరహస్యోక్తులు చెప్పుట

ఆసమయమున హస్తినాపురమందుగల జనులందరును యిట్లని చెప్పుకొనిరి. అయ్యో! కృష్ణుడు చెప్పిన ప్రకారము యీా కౌరవులు వినలేదు. ఈకౌరవులు బుద్ధిహీనులు, ఈకౌరవులు మహాపాపములను చేసిరి. వీరు చేసిన పాపములవలన వీరికి రెండులోకములయందు సుఖములేదు. ఈదుర్యోధనాది కౌరవులు పెద్దలకు సమ్మతులుగారు. అని హస్తినాపురమందలి జనులందరును అనేకవిధములుగా చెప్పుకొనుచు రెండుప్రక్కలయందు మేడలమీాదనుండి కృష్ణుని జూచుచుండిరి. కృష్ణుడు రాజమార్గముద్వారా హస్తినాపురమును దాటిపోయెను. అదివరకే ధృతరాష్ట్రుడు మరలి సభాగృహమునకువచ్చి అందరిచే తను సేవింపబడుచు కృష్ణునివిషయమైనమాటలను చెప్పుచుండెను. ఆసమయమున భీష్మద్రోణులు దుర్యోధనునితో యిట్లనిరి. దుర్యోధనా! కుంతీదేవి కృష్ణునితో కఠినములైన మాటలనుచెప్పెను. ఆమాటలనువిని మేముచిత్తభ్రమను పొందితిమి. కుంతీదేవియు కృష్ణుడును వీరిద్దరును కార్యవిషయములైన మాటలను పలుకునారగుదురు. ధర్మరాజను మహాసముద్రమునకు యీాకుంతీ కృష్ణుల ఆజ్ఞలు ఒకచెలియలికట్టవలెనుండెను. అట్టి చెలియలికట్ట యిప్పుడు తెగిపోయెను. ఇక మనముచేయవలసిన కార్యమేదియో తెలియలేదు. అని యిట్లు

భీష్మ ద్రోణులు దుర్యోధనునితో చెప్పిరి. దుర్యోధనరాజా! మాకు దోచిన కార్యమును చెప్పెదము. నీవు ధర్మమార్గ ప్రకారము వెళ్ళి పుణ్యాత్ముడైన ధర్మరాజునుచూచి సంధిచేసికొనుము. ఈ కౌరవుల నందరిని రక్షించుకొనుము. ఎప్పటికిని క్రోధముపనికిరాదు. నీవుదుఃఖించక యిప్పుడు శీఘ్రముగా కృష్ణునితో ధర్మరాజుదగ్గిరకు వెళ్ళవేయని భీష్మ ద్రోణులు దుర్యోధనుని ప్రార్థించిరి. వారిమాటలను దుర్యోధనుడువిని ముఖమురాజుచుండగా వూరకుండెను. భీష్మ ద్రోణులిద్దరును దిగ్గునలేచి దుర్యోధనునిజూచి మరల యిట్లనిరి. ఓదుర్యోధనమహారాజా! మేముసంసారపు గట్టునుత్రొక్కితిమి. ఇక మేము యుద్ధమునకు భయపడము. నీకొరకు మేము సంకటపడుచున్నాము. ఇకను యెట్లుకావలసియున్నదో అట్లగును. మేము వెళ్ళెదము అని భీష్మ ద్రోణులు దుర్యోధనునితో చెప్పి వెళ్ళిరి. ధృతరాష్ట్రుడు అంతఃపురమునకు వెళ్ళెను. పిమ్మట బాహ్యపరిజనులను పొమ్మనిచెప్పి దుర్యోధనుడు మితమైన పరిజనులనుగూడి తనగృహమునకు వెళ్లెను. ఇకను కృష్ణునివృత్తాంతమును చెప్పెదనువినుము. జనమేజయమహారాజా కృష్ణుడు కర్ణునివెంటబెట్టుకొనివెళ్ళి అధికప్రీతిపూర్వకముగా కర్ణుని ముఖముచూచి యితరులెవ్వరును వినకుండా యిట్లనెను.

కర్ణా! నీవుపెద్దలను సేవించినవాడవు. ధర్మవేత్తవు. నీకు తెలియచెప్పెదను వినుము. నీవు కుంతీదేవి కన్యకగానున్నప్పుడు కుంతికి సిద్ధమంత్రములచేత సూర్యుని వరమువలన పుట్టితివి అందువలన పాండురాజునకు నీవుపెద్దకుమారుడ వగుదువు. ఇది ధర్మమార్గము. ఈవిషయమును నేనుపాండవులకు తెలిపెదను. నీవిషయమును నావలన పాండవులువిని నీపాదములకు నమస్కరింతురు. సకలబంధుమిత్ర పుత్రసహితముగా ఆపాండవులు నిన్ను సేవింపగలరు. సకలరాజ్యమునకు నీకు పట్టాభిషేకము చేయుదురు, నీవు దేదీప్యమాన

ముగా ప్రకాశింపగలవు గనుక నీవుపాండవుల దగ్గరకురమ్ము. నేను సామ్రాజ్యమునకు నిన్ను అభిషేకించెదను. నీవు సకలరాజ్యమునకు ప్రభుడవై యుండెదవు. అప్పటి నీమహోత్సవమునకు ధర్మరాజు యువరాజై యుండును. ఆధర్మరాజు నీరథముమీదనుండి నీకు తెల్లని చామరములచేత విసరుచుండును. భీముడు నీకు తెల్లని గొడుగుపట్టును. అర్జునుడు నీకు సారథ్యముచేయును పాంచాల యాదవమాత్స్యులు మొదలగు రాజు లందరును నకుల సహదేవులును అభిమన్యుడు మొదలగు కుమారులును నీవెంబడివచ్చును నిన్నుకొలుచుచు నీ ఆజ్ఞాప్రకారము నడచుచుందురు. మేమందరము నిన్నుచుట్టుకొని నీవెంబడివచ్చుచుందుము. ఇట్లు నీవు దేవేంద్రునికిగల విభవమువంటి మహావిభవముచేత మహనీయుడవగుచు సకలభూచక్రమును పరిపాలింపుము. అని కృష్ణుడు కర్ణునితో చెప్పి మరల యిట్లనెను. కర్ణా! నీవు నీతమ్ములగు పాండవులలో కలిసియున్నయెడల ఆరవ వరుసచేత ద్రౌపదియునిన్ను భర్తగా పొందగలదు. నీవు మహాపుణ్య పురుషుడవగుదువు. నీవుకొంచెమైనను భేదముంచక శీఘ్రముగా పాండవులలో కలిసి యుండుము. ఇట్లుచేసితివేని నీతల్లియగు కుంతీదేవికిని సమస్తబంధుమిత్ర జనులకును సంతోషము గలుగును. అని యిట్లు కృష్ణుడు కర్ణునితో చెప్పెను. ఆమాటలను కర్ణుడు విని రహస్యముగా కృష్ణునితో యిట్లనెను.

## కర్ణుడు శ్రీకృష్ణునకు దగిన యుత్తరము లిచ్చుట

శ్రీకృష్ణా! యీ విషయమును నేనును ఇదివరకు కొంచెము కొంచెముగా వింటిని. నన్ను కుంతీదేవి కనినదై నిర్దయురాలై నన్ను నదియందు పడవేసి వెళ్ళెను. అప్పుడు ఆ నదియందు పెట్టెలోనుండెడి నన్ను చూచి సూతుడు కృపచేత తీసికొనిపోయెను. ఆసూతునకు అదివరకు కొడుకులులేనందున నన్ను ప్రీతిపూర్వకముగా తన భార్య

యగు రాధకు యిచ్చెను. ఆరాధ నన్ను యెత్తుకొనినతోడనే దాని చన్నులయందు పాలుచేపెను. అదిమొదలుకొని ప్రయత్నపూర్వకముగా ఆరాధ నన్ను పెంచెను. బాల్యమందు నామూత్రపురీషములు వారి దేహములయందు పడినను అందుకు వారు అసహ్యమును పొందక ఇంతకాలమువరకు నన్ను ప్రీతిపూర్వకముగా పెంచిరి. ఇప్పుడు నేను యెరిగి పరాయివాడనుగదాయని ఆ సూతరాధలను విడిచినయెడల నాకు అపకీర్తి కలుగును. అయ్యయ్యో! అంతకంటె నాకు కీడు మరియొకటి కనబడలేదు. నీవు పెద్దలను సేవించినవాడవనియు ధర్మమును తెలిసినవాడవనియు ఇప్పుడు నన్ను నీవే చెప్పితివి. ఆరాధయు, సూతుడును, నాకు జాతకర్మాది సమస్తసంస్కారములను తగినప్రకారము చేసిరి. గనుక ఆ రాధాసూతులు నాకు తల్లిదండ్రులు. అట్టి తల్లిదండ్రులకు నేను పుత్రకార్యములను చేయక వారిని విడిచివచ్చుట ధర్మమగునా? ఆసూతుని కొడుకులందరును నాకు సహోదరులగుదురు. అతని స్నేహితులందరును నాకు స్నేహితులగుదురు. వారినందరను విడువరాదని తలంచక నన్ను రమ్మని పిలిచితివి. ఇట్లు పిలుచుట నీకు వుచితముకాదు. అదిగాక దుర్యోధనుడు నన్ను సూతపుత్రుడని తలచక తన పుత్ర సహోదరులకంటె నాయందు బహుప్రీతి గలిగియుండును. నానాటికి ఆ దుర్యోధనుడు నాకు తేజోగౌరవములను కలిగించి నన్ను తనయంత వానినిగా జేసెను. ఇప్పుడు పాండవులు యుద్ధమునకురాగా నేను న్యాయమును విడిచి ఆదుర్యోధనుని విడువరాదు. మరియు ఆ దుర్యోధనుడు నన్ను అర్జునుని యెదిరించువానినిగా మిక్కిలి నమ్మియున్నాడు. అయ్యో! ఆదుర్యోధనునినమ్మి కనుబూడిదయగునట్లుచేసి నేను పాండవులలో కలియవచ్చునా? కృష్ణా! నేనును అర్జునుడును యెదిరించి ద్వంద్వయుద్ధము చేయనియెడల భూమియందు గల జనులందరును నవ్వు

మరు. పాండవులలో నేను కలియుటవలన అర్జునునకు అపకీర్తి గలుగును. నాకు అపకీర్తి కలుగువిషయము అడుగవలసిన పనిలేదు, మహాత్మా! కృష్ణా! నీవు మిక్కిలి నిర్మలబుద్ధి గలవాడవైనందున నాకు హితము చెప్పితివి. అయినను నీవు చెప్పినహితము నామనస్సునకు ఒప్పదు. ఈవిషయమును నీవు రహస్యముగా నుంచుము. బయలు పరచవద్దు. అది యెందులకంటె వేని చెప్పెదనువినుము. కృష్ణా! ఆ ధర్మరాజు తాను నాకు తమ్ముఁడైనవిషయ మెఱింగిన యెడల సామ్రాజ్యమును అనుభవించుటకు పూనుకొనఁడు. అటువంటి ధర్మాత్ముఁడైన ధర్మరాజు సకలభూమిని శాశ్వతముగా పరిపాలింపవలయును గదా! ఆధర్మరాజు యుద్ధమను యజ్ఞమును చేయవలయును. ఆ యుద్ధయజ్ఞమునకు అతని తమ్ములగు భీమాదులందఱును ఋత్విజులుగా నుండవలయును. ఈపనిని యిట్లు చేయుమని చెప్పుచు ఆ యుద్ధయజ్ఞమునకు నీవు ముఖ్య ఉపాధ్యాయుడవుగా నుండవలయును. ధృతరాష్ట్రుని కొడుకులగు దుర్యోధనాదులందఱును ఆధర్మరాజు చేయు యుద్ధయజ్ఞమందు పశువులుగా హింసింపబడవలయును. అటువంటి యుద్ధయజ్ఞమును ధర్మరాజు చేయవలెను. అందుచేత పుణ్యభూమి యగు కురుక్షేత్రమందు మావంటివారందఱును యుద్ధమందు చచ్చి పుణ్యగతిని పొందుదురుగాక. అని యిట్లు కర్ణుడు కృష్ణునితో చెప్పెను. ఆ కర్ణునిమాటలను కృష్ణుడువిని యిట్లనెను.

కర్ణా! నేను కృపచేత నీకు హితమును చెప్పితిని. నామాటను నీవు వినలేదు. తుదకు నీకు దుఃఖముకలుగునుసుమా! నీవు అర్జునునితో మాత్సర్యము గలిగియుంటివేని యుద్ధమందు నీకు పరాజయమైనను చావువైనను గలుగును. అర్జునుని నీవు యుద్ధమందు గెలుచుటకు శక్యముకాదు. చాలమంది జనులకు కాలము పూర్తియై యుండగా నీమనస్సు శాంతమును బొందనేరదు. అర్జునునకు గాండీవ

మను దివ్యమహాధనుస్సుగలదు. అక్షయదివ్యబాణములు గల రెండు అంబులపొదులున్నవి. అఖండములైన దివ్యాస్త్రముల సమృద్ధి అర్జునునకు గలదు. అర్జునుని రథముయొక్క నొగలుమీద నేను కూర్చుందును. అర్జును డపరిమితమైన తన భుజాబలముచేత అతి భయంకరముగా యుద్ధమునకు వచ్చును. అటువంటి అర్జునుని యెదిరించుటకు నీతరమగునా? సర్వవిధములచేతను యుద్ధమందు పాండవులు గెలుతురు. ఆవిషయమును అట్లుండనిమ్ము. నీవుపొమ్ము నీవు వెళ్ళి దుర్యోధన భీష్మద్రోణులకును మీకు సహాయముగావచ్చిన రాజులందరికిని యిట్లనిచెప్పుము. ఈమాసము సౌఖ్యమైయున్నది. సమశీతోష్ణము గలిగియున్నది. పుష్పఫలసమృద్ధి గలిగియున్నది. యవధాన్యము, సైంధవలవణము, యీమాసమందు సమృద్ధిగా గలిగియున్నవి. ఇక నెనిమిది దినములకు అమావాస్యవచ్చును. అమావాస్య పుణ్యదినము. అమావాస్యనాడు యుద్ధముజరుగుటకు ప్రారంభము కావలయును. అని మీవారందరితో చెప్పుమని కృష్ణుడు కర్ణునితో చెప్పెను. అప్పుడు కర్ణుడు కృష్ణునితో యిట్లనెను.

కృష్ణా! యుద్ధము జరుగువిషయమై అనేకమైన స్వప్నములు, నిమిత్తములుగ గలుగుచున్నవి. ఆ స్వప్నములను బట్టి చూడగా కౌరవ పాండవులకు అవశ్యముగా యుద్ధము జరుగును. ఆ యుద్ధమందు ధర్మరాజునకు గెలుపు కలుగునని నేను యెరుగుదును. నీవు చెప్పవలసిన పనిలేదు. పాండవులకు జయము కలుగునని నేను యెరిగినందుననే పాండవులలోనికి చేరనని చెప్పితిని. అని కర్ణుడు కృష్ణునితో చెప్పెను. కృష్ణా! యీ యుద్ధమునకు నేనును శకుని దుశ్శాసనులును మేము ముగ్గురమును కారణమగుదుము. కౌరవ పాండవులకు సంధి కలిగినయెడల నేను పాండవులలోనికి రావచ్చును. ఈ భారత యుద్ధమను మహాసముద్రమును నిశ్శేషముగా యీది పిమ్మట నిన్ను జూచె

దను. అట్లు గానియెడల యుద్ధమందు పరలోకమందు నిన్ను చూచెదను. ఇకను నీవు యేమియు చెప్పకుము కార్యమును వినెదను. అని యిట్లు కర్ణుడు కృష్ణునితో చెప్పి కౌగిలించుకొనెను. కృష్ణు డట్లు చేయుమని చెప్పి పొమ్మని కర్ణుని విడిచెను. కర్ణుడు కృష్ణుని రథము మీదనుండి దిగి బంగారు రత్నమయమైన తన రథముమీద నెక్కి హస్తినాపురమునకు వెళ్లెను కృష్ణుడు తన రథముమీద సాత్యకిని యెక్కించుకొని దారుకుని జూచి యిట్లనెను.

దారుకా! పద. పద. శీఘ్రముగా మనరథమును పోనిమ్ము. పోనిమ్ము. అని కృష్ణుడు తన సారథియగు దారుకునితో చెప్పి మనోహరమైన ఆటోపముచేత వెళ్ళెను. జనమేజయమహారాజా! ఆ సమయమందు విదురుడు దుఃఖమనస్సుగలవాడై కుంతీదేవి దగ్గరకు వెళ్ళి కుంతీదేవితో యిట్లనెను. కుంతీదేవీ! అయ్యో! యీ కౌరవ వంశమను మహాసముద్రము యింకిపోవునట్లుగా యేర్పడెను. ఇక్కడ ఒక్కరైనను కృష్ణుడు చెప్పిన హితవాక్యములను వినలేదు. అర్జును డొక్కడే తన దివ్యబాణాగ్నిచేత యీకౌరవుల నందరిని దహింపగలడు. పాండవుల బలపరాక్రమములను యిదివరకు యీ కౌరవులు యెరిగియుండియు సంధికి సమ్మతింపలేదు. పాండవులు సకల కష్టములను పొందియు యుద్ధమందు బంధువులను చంపుటకు సమ్మతింపక సర్వవిధములచేతను సంధిని గోరుచున్నారు. ఈ తులువలగు కౌరవులతో కలిసియుండరాదు. అయ్యో! యుద్ధము జరిగినయెడల పాండవులకు శ్రమగలుగును. అని విదురుడు యుద్ధమందు పాండవుల కాయాసమును గలిగించు మాటలను కుంతితో చెప్పుచు ఆ కుంతికి దుఃఖము కలిగించెను. పిమ్మట కుంతీదేవి దగ్గర విదురుడు కొంత సేపుండి తన నివాసగృహమునకు వెళ్ళెను పిమ్మట కుంతీదేవి తన మనస్సులో యిట్లని వితర్కించెను.

అయ్యో ! దైవమా ! రాజ్యలక్ష్మి నిమిత్తమై నా పుత్రులగు పాండవులు తమ బంధుజనులను చంపుట ధర్మము కాదు. అట్లు చంపుట సౌఖ్యకార్యము కాదు. భీష్మ ద్రోణ కృపాచార్య కర్ణుల భుజాబలములను సులభముగా మాన్పుటకు సాధ్యముగాదు. ఆ భీష్మాదులలో కర్ణుడొక్కడు మాత్రము భీమాదులపై మిక్కిలి కోపముగలిగి యుండును. ఆ కర్ణుని కొక్కనికి తప్ప తక్కినవారికి యుద్ధము చేయుట యందు ఇష్టము లేదు అని కుంతీదేవి తన మనస్సులో చింతించుచు మరల యిట్లని నిశ్చయించెను. నేను కర్ణునివద్దకుపోయి వాడు పుట్టిన క్రమము వానికి చెప్పెదను. వాని తమ్ములగు ధర్మరాజాదులయందు వానికి ప్రేమను గలిగింతును. అట్లు చేసినయెడల యుద్ధమందు కర్ణునకుత్సాహము తగ్గును. అని కుంతీదేవి తన మనస్సులో నిశ్చయించి కర్ణునిదగ్గరకు వెళ్ళవలెనని తలంచి తగురీతి బయలుదేరెను. అప్పుడనుష్ఠానమునకు కర్ణుడు గంగాతీరమునకు వెళ్ళెనని కుంతీదేవికి తెలిసెను. అంతట కుంతీదేవి గంగానదీ తీరమునకు వెళ్ళెను. కర్ణుడు గంగాతీరమున జపము చేయుచుండెను. అట్టి కర్ణుని కుంతీదేవి చూచి, వెనుకవైపున కూర్చుండెను. కొంతసేపునకు కర్ణుడు జపము తీర్చుకొని దిక్కులు కలయజూడగా వెనుకతట్టున కుంతీమహాదేవిని జూచెను. కర్ణుడు తొందరగా వినయముగా కుంతీమహాదేవిదగ్గరకు పోయి యిట్లనెను. అమ్మా ! కుంతీమహాదేవీ ! నేను సూతుని కులమందు బుట్టినవాడను. గనుక నేను శూద్రవంశస్థుడను. నేను రాధాపుత్రుడ నయినందున నాకు రాధేయుడను పేరుకలదు. నీకు నమస్కరింపుచున్నాను. నాకు కర్ణుడను మరియొక పేరుకలదు. నీవు యిక్కడకు విజయము చేసిన కార్యమేమో చెప్పుము. ఏమిపని చేయవలెనో ఆజ్ఞయిమ్ము. అని కర్ణుడు కుంతీదేవికి నమస్కరించి రెండు చేతులను జోడించుకొని వినయపూర్వకముగా నిలిచి యుండెను. అప్పుడు కుంతీదేవి రహస్యముగా కర్ణునితో యిట్లనెను.

## కుంతీదేవి కర్ణునకు నతఁడు తనకు పుత్రుఁడగుట దెలుపుట

కుమారా! కర్ణా! నేను చెప్పుచున్నమాటలను వినుము. నీవుసూతుని కులమందుబుట్టుట అబద్ధము. నేనుకన్యకగానుండి నాపెంపుడుతండ్రి యగు కుంతిభోజుని గృహమందున్నప్పుడు నేను సూర్యదేవునారాధించితిని. అప్పుడు నాసిద్ధమంత్రబలమున సూర్యుడు నాదగ్గరకువచ్చి ప్రీతిపూర్వకముగా నాకు పుత్రదానము చేసెను. ఆసూర్యుని అనుగ్రహమువలన నేను కన్యకగానున్నప్పుడే నాగర్భమందు నీవుపుట్టితివి గనుక ధర్మమార్గప్రకారము నీవుపాండురాజ పుత్రుడవు. అటువంటి పాండవుడవగునీవు అల్పులను కొలువవలసిన పనిలేదు. నాకొడుకులగు ధర్మరాజ భీమార్జున నకుల సహదేవులైదుగురును నీకు తమ్ములగుదురు. ఆ పాండవులను ధృతరాష్ట్రుని కొడుకులగు కౌరవులకును అందరికిని నీవేప్రభుడవు కాగలవు. నీవు నీతమ్ములగు పాండవులతో కలిసి అందరకిని ప్రభుడవై యీలోకమునంతయు పరిపాలింపుము. రాధాపుత్రుడను చిన్నపేరు నీకుగలుగవలసిన పనిలేదు. అని కుంతీదేవి కర్ణునితో చెప్పెను. ఆసమయమున సూర్యబింబములోనుండి ఒకధ్వని యిట్లని వినిపించెను. కర్ణా! యీకుంతి చెప్పినమాట నిశ్చయము. ఈకుంతి చెప్పినట్లు నీవుచేయుటవలన నీకుమేలుకలుగును. అని సూర్యబింబములోనుండి కర్ణునకు వినబడునట్లుగా ధ్వనిచెప్పెను. ఆధ్వనిని కర్ణుడువిని ధైర్యమైన మనస్సుగలవాడై మెత్తబడక ఆకుంతీదేవితో యిట్లనెను. తల్లీ! కుంతీమహాదేవి! నీవుచెప్పినమాటసత్యము. అయినను ఒకవిషయమును చెప్పెదను చిత్తగింపుము. నీవు నన్ను కనియు నాకుక్షత్రియ సంస్కారమును కలిగింపకుండ చేసితివి. నీవు కనినంతమాత్రమున నీకుపుత్రుడనని యిప్పుడు నేను రావచ్చునేమో చెప్పుము అదిగాక సూర్యుని ప్రభావమువలన వరప్రసాదముగావున నాజన్మము నూహింపబడకున్నను పరమరహస్యమైయున్నది. అట్టిపర

మరహస్యమైన జన్మము యిప్పుడు మనము అందరికి తెలుపుటవలన మన కేమాత్రమును మేలు కాదు. అర్జునుని పరాక్రమము లోకప్రసిద్ధమైనది. ఇప్పుడు నేనును కుంతికి సూర్యునివలన పుట్టితినని అర్జునుని తోకలసి యున్న యెడల అర్జునునితో యుద్ధముచేయలేక, భయపడితి నని ప్రజలందురు. మరియు నవ్వుదురు. దుర్యోధనుడు నన్ను గౌరవించి సన్మానింపుచు నన్నునమ్మియున్నాడు. పాండవసైన్యములను నేను జయింతునని దుర్యోధనుడు మిక్కిలిగా నన్నునమ్మియుండును. ఇప్పుడు దుర్యోధనుని చెరచి అతనిని విడువరాదు.

తల్లీ! కుంతీదేవీ! ఆ కౌరవులచేత పోషింపబడువారందరును దుర్యోధనునికి యిప్పుడు యుద్ధమందు సహాయముచేయుటకు మంచి సమయమగును. ఎటువంటివారైనను యుద్ధప్రారంభమందు తమను నమ్మినవారినివిడిచిపోరాదు. ఇప్పుడు నేను దుర్యోధనుని విడిచినయెడల రాజులందరు మనలను తిట్టుదురు. గనుక నేను అవశ్యముగా దుర్యోధనుని నిమిత్తము నీకొడుకులగు పాండవులతో యుద్ధముచేసెదను. నీవు చెప్పినమాట మిక్కిలిమంచిది. అయినను నానిశ్చయ మిట్టిదేగాని వేరుకానేరదు. ఈకార్యభారమునువూని నీవు నావద్దకు వచ్చినందున ధర్మరాజు భీమ నకుల సహదేవులు నాచేతికి చిక్కినను యుద్ధమందు నేను వారిని చంపను. అర్జునునిమీద నాకు మిగులకోపముకలదు. ఆ అర్జునుడు నాకుచిక్కినయెడల నేనతనిని క్రూరముగా చంపుదును. అర్జునునిచేత నేనుచచ్చినను నాకుకీర్తికలుగును నాచేత అర్జునుడు చచ్చినయెడల నాతో నీకయిదుగురు కొడుకులు గలరు. అర్జునునిచేత నేనుచచ్చినయెడల నేనుతప్ప అర్జునునితోకూడ అయిదుగురు కొడుకులుండుదురు. గనుక నీకు ఆర్గురుకొడుకులను మాటను విడువుము. అని కర్ణుడు కుంతీదేవితో చెప్పెను. ఆమాటలను కుంతీదేవి విని మనస్సునయందు మహాదుఃఖముగలదై కర్ణునితో యిట్లనెను.

పుత్రా ! కర్ణా ! నీవు యిట్లుచెప్పుట దైవఘటనయగును. ఆ దైవఘటనతప్పించుటకు యెవరికిని శక్యముగాదు. ధర్మరాజుభీమనకుల సహదేవులను చంపవని నీవు సత్యముగా బలికితివి. అది నీవు మరువకుము. నీతమ్ములగు వారి నలుగురిని యుద్ధమందు చంపక విడువుము. అర్జునుని విషయమై నీవు చెప్పినమాటలకు సమ్మతించితిని. అని కుంతీదేవి కర్ణునితో చెప్పుచు కర్ణుని కౌగిలించుకొనెను. కర్ణుడు నీవు చెప్పినట్లు ధర్మరాజు భీమ నకుల సహదేవులను చంపనని కుంతీదేవితో జెప్పి నమస్కరించెను. కుంతీదేవి తన నివాస గృహమునకు వెళ్ళెను. కర్ణుడును ప్రీతిపూర్వకముగా తన నివాస గృహమునకు పోయెను.

జనమేజయ మహారాజా ! ఇకను కృష్ణుని సమాచారమును వినుము. కృష్ణుడు హస్తినాపురమునుండి బయలుదేరి తగు ప్రయాణములను చేసి వుపప్లావ్య పట్టణమునకు పోయి ధర్మరాజుచేత పూజింపబడెను. అప్పుడు భీమార్జున నకుల సహదేవ విరాట ద్రుపదులు మొదలగు వారువచ్చి కృష్ణునిచూచిరి. కృష్ణుడు వారినందరిని తగు రీతిని గౌరవించి సభయందుండి ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా ! ధృతరాష్ట్రుని కొడుకులగు దుర్యోధనాదులు న్యాయమును మదించియున్నారు. అట్టి పాపాత్ములు తగిన మాటలను వినరు. సంధి జేయుటకు సమ్మతింపరు. ఆ కౌరవులు తమను, పరులను యెరిగిన యెడల యిదివరకు మీ విషయమై అంత చెడుకార్యములను చేయరుగదా ? అని కృష్ణుడు అందరువినుచుండగా తాను పోయి వచ్చిన కార్యమును ధర్మరాజునకు తెలియచెప్పెను. అంతట కృష్ణుడు మార్గాయాసమును తీర్చుకొనుటకు తన నివాస గృహమునకు వెళ్ళెను. ఆ రాత్రి ధర్మరాజు తన తమ్ములను వెంటబెట్టుకొని తగిన ప్రదేశమందుండి కృష్ణుని రప్పించి యిట్లనెను. మహాత్మా ! కృష్ణ

దేవా! నీవు దుర్యోధనునితో మాటలాడిన విధమును చెప్పుము. ఆ దుర్యోధనుడు యేవిధముగా నుత్తర మిచ్చెనో చెప్పుము. అని ధర్మరాజు అడుగగా కృష్ణు డిట్లనెను.

## శ్రీకృష్ణుడు ధర్మరాజునకు కౌరవసభయందు బుట్టిన విశేషములను దెల్పుట.

ఓ ధర్మరాజా! నేను దుర్యోధనునితో యుద్ధము జరుగని విధముగా సంధిస్నేహములను గలిగించు మాటలను చెప్పితిని. అందరికిని యెట్లు శుభముకలుగునో, మేలేదియో ఆ విషయమైన మాటలను సమగ్రముగా నేను దుర్యోధనునికి చెప్పితిని. నేననేక విధములైన సంధిస్నేహములను గూర్చుమాటలను చెప్పితిని. నేను చెప్పిన మాటలనన్నిటిని దుర్యోధనుడు చెవిటివానివలె పెడచెవిని బెట్టెను. దుర్యోధనుడు హెచ్చు తగ్గు మాటలు చెప్పి నాతో బహులు పలుకుచు నన్ను పరిహాసముచేసెను. ఇక వేయిమాటలను చెప్పుటవలన ప్రయోజనములేదు. గనుక ముఖ్యమైన మాటను చెప్పితిని. అని కృష్ణుడు చెప్పగా ధర్మరాజిట్లనెను.

కృష్ణా! నీవు దుర్యోధనునితో మాటలాడు నప్పుడు, ధృతరాష్ట్ర భీష్మ ద్రోణ విదురాదులగు పెద్దలందరును తగిన మంచి మాటలను దుర్యోధనునికి చెప్పిరో లేదో చెప్పుము. అని ధర్మరాజు అడుగగా కృష్ణుడిట్లనెను. ధర్మరాజా! ధృతరాష్ట్రుడును అనేక విధములుగా మంచిమాటలచేత దుర్యోధనుని శోధించెను. ఆమాటలను దుర్యోధనుడు వినలేదు. ఆ సభయందుండు పెద్దలందరును శంతన మహారాజుయొక్క పుణ్యవంశము వృద్ధిబొందిన విధమంతయు దుర్యోధనునితో చెప్పిరి. ధృతరాష్ట్రుడు పుట్టంధుడై యుండగా నీమా తండ్రియగు పాండురాజుసకల సామ్రాజ్యమునుపాలించి ధృతరాష్ట్రుని

కొలిచిన విధమంతయు చెప్పిరి. నీవు దిగ్విజయము చేసి రాజ్య లక్ష్మిని సంపాదించగా కౌరవులు వంచనచేత రాజ్యలక్ష్మిని అపహరించిన విషయమును పెద్దలందరు దుర్యోధనునితో చెప్పిరి.

నీవు సత్యమునుబట్టి వనవాస అజ్ఞాతవాసములను జరిపిన విధమును దుర్యోధనునితో చెప్పిరి. మీ తండ్రియొక్క రాజ్యభాగమును మీకు యివ్వాదగునని పెద్దలందరును దుర్యోధనునితో చెప్పిరి. పెద్దలందరును యెంత చెప్పవలెనో అంతయు దుర్యోధనునితో చెప్పిరి. ఆమాటలకు దుర్యోధనుడు కటకటపడి ఆ సభలోనుంచి లేచిపోయెను. అతని వెంటనే అతని తమ్ములగు దుశ్శాసనాదులు అతని స్నేహితులగు రాజులును కర్ణుడును లేచిపోయిరి. దుర్యోధనుడు మూర్ఖుడై వెళ్ళినపిమ్మట ధృతరాష్ట్రుడు గాంధారిని రప్పించి విదురునిచేత దుర్యోధనుని పిలిపించెను. గాంధారీదేవి దుఃఖ స్నేహ భయములు గలిగెడి వాక్యములచేత అనేక విధములుగా దుర్యోధనునకు బుద్ధి చెప్పి ధర్మ న్యాయ నీతులను బోధించెను. సంధి చేసికొనుమని అనేక విధములుగా గాంధారి దుర్యోధనునితో చెప్పెను. ఎవ్వరెంత చెప్పినను దుర్యోధనుడు వినక తన పక్షపు రాజులందరిని యుద్ధము చేయుటకొరకు కురుక్షేత్రమునకు నడువుడని చెప్పిపంపించెను.

ధర్మరాజా! ఆ కౌరవులు భీష్ముని సేనానాయకునిగా చేసికొని సైన్యములను నడిపించుటకు పూనియున్నారు. ఇదియే ఆ కౌరవుల నిశ్చయమగును. నాకు తెలిసినప్రకారము సంధిని చేయు వాక్యములను చెప్పితిని. నారదాది మునులు దుర్యోధనునకు బుద్ధులు చెప్పినట్లు చేసితిని. ఎన్ని చెప్పినను దుర్యోధనుడు వినకుండగా నేను కోపించుకొని ఆ దుర్యోధనుని ఝంకించితిని, భంగించితిని. ధిక్కరించితిని, తృణీకరించితిని. అట్లు సకల ప్రయత్నములచేత చూచినను కార్యభంగమగుటకు సమ్మతింపక మరల శాంతవాక్యములను దుర్యో

ధనునితో చెప్పితిని. అతడు నున సామర్థ్యముచేత నాకు కీడుకలిగింప దలచగా నేను అమానుషములైన కొన్ని పెద్దమాయలను పన్నితిని. అనేకవిధములైన పెద్ద మాయలను పన్ని నేను పెక్కు పోకలుపోతిని. యేవిధముచేతనైనను సంధి కానలెనని యెట్లు చెప్పి చేయవలెనో అట్లుచెప్పి చేసితిని. నేను యెంతచెప్పి ప్రయత్నించినను ఆ పాపాత్ముడైన దుర్యోధనుడు యెట్లును చక్కబడలేదు ఆ దుర్యోధనుడు అవశ్యముగా యుద్ధము చేయునే గాని రాజ్యభాగమును పంచి యివ్వడు. గనుక కౌరవులయందు దండోపాయము తప్ప మరియొక వుపాయము కనబడలేదు. మీకు తోచినప్రకారము చేయుడు. అని వాసుదేవుడు ధర్మరాజుతో చెప్పెను. ఆ మాటలను ధర్మరాజువిని తన తమ్ములను కలియజూచి యిట్లనెను.

భీమార్జున నకుల సహదేవులారా! ఆ కౌరవసభయందు కలిగిన విధమంతయు ఇప్పుడు వాసుదేవుడు తెలియజెప్పెను. ఇక అనుమానింపక శత్రువులను కొట్టుటకు తగిన ప్రయత్నములచేత బయలువెడలుడు. అని యిట్లు ధర్మరాజు తన తమ్ములతోచెప్పి కరుణాచిత్తముగలవాడై కృష్ణునిజూచియిట్లనెను. మహాత్మా! వాసుదేవా! నా మనస్సు కౌరవవంశమును నశింపజేయుటకు సమ్మతింపక తల్లడిల్లుచున్నది. యేవిధముచేతనైనను సంధిచేయుటకు సాధ్యముకాదుగదా! కృష్ణా! నా మనస్సు నీవు యెరుగుదువు. నా తమ్ముల తలంపును నీవు యెరుగుదువు. దుర్యోధనాదుల పద్ధతి నంతయు నీవు యెరిగి వచ్చి, భీష్మ ద్రోణ విదురాదుల చిత్తవృత్తుల నన్నిటిని నీవు యెరిగి వచ్చితివి. మాకు ధర్మహాని కాకుండునట్టి కార్యమును నిశ్చయింపుము. అని ధర్మరాజు వాసుదేవుని యడుగగా వాసుదేవు డిట్లనెను.

ధర్మరాజా! యుద్ధముచేయుట తప్ప మరియొక కార్యము కనబడలేదు. యుద్ధము తప్ప మరియొక కార్య మున్నయెడల

చెప్పెను. ఆ దుర్యోధనుడు బుద్ధులు వినలేడని చెప్పవలసిన పని లేదు. అట్టి సభయందు నన్ను పట్టుకొని బంధించుటకు దుర్యోధనుడు ప్రయత్నించెను. అటువంటి పాపాత్మునితో సంధి చేయుటకు నా మనస్సునకు యెట్లును వుపాయము తోచుటలేదు. అని వాసుదేవుడు ధర్మరాజుతో చెప్పెను.

విదురుడు యేకాంతమందు చెప్పినమాటలను కృష్ణుడు ధర్మరాజుతో చెప్పెను. భీష్మ ద్రోణ బాహ్లీకాదులకు పెద్దలకు దుర్యోధనాదులయందు పుట్టిన క్షోభమును కృష్ణుడు ధర్మరాజునకు చెప్పెను. కృష్ణుడు ధర్మరాజుతో కుంతీదేవి కౌరవులు వినుచుండగా చెప్పిన మాటలను తక్కుంగలవారి అందరిమాటలను చెప్పి ధర్మరాజుయందు పాపము లేదని తెలిపి అవశ్యముగా యుద్ధము చేయుటయే ధర్మమని నిశ్చయించెను. ఆసమయమందు భీమార్జున నకులసహదేవులు నలుగురును ధర్మరాజునుజూచుచు వూరకుండిరి. ధర్మరాజు భీమాదులను కలియజూచి యిట్లనెను. భీమార్జున నకులసహదేవులారా! కౌరవుల చేత మనము పొందిన కష్టములను తలచి కుంతీదేవి యుద్ధమునకు సమ్మతింపలేదు. మన బంధుజనులను ఘోరముగా చంపుటకు నాబుద్ధి సమ్మతించెను. మీరందరును యుద్ధధర్మమువలన కలిగిన పుణ్యాపాపములను నిర్ణయింపుడు. అని ధర్మరాజు తనతమ్ములతో చెప్పెను. అప్పుడు అర్జునుడు ధర్మరాజుతో యిట్లనెను. అన్నా! ధర్మరాజా! హితధర్మన్యాయము లిటువంటివని నిర్ణయించుటకు మనము సమర్థులముగాము. కృష్ణుడు సర్వధర్మవేత్త. విదురుడును కుంతీదేవియు కృష్ణునితో చెప్పినమాటలవలన సందేహముపోయెను. ఈ కృష్ణుడు యుద్ధముచేయుడని మనతో చెప్పుటచేత యింక మనము చింతింపవలసిన పనిలేదు. అని అర్జునుడు ధర్మరాజుతో చెప్పగా ఆ మాటలను ధర్మరాజు విని అర్జునునితో యిట్లనెను. అర్జునా! నీవు చెప్పినది

నిశ్చయము. ఈ కృష్ణుడు సకలధర్మవేత్త. మనకు యీకృష్ణుడేదిక్కు. ఇటువంటి కృష్ణుడే యుద్ధముచేయుమని చెప్పినప్పుడు మనకు సంశయము లేమియు పనిలేదు. మహాభయంకరమైన యుద్ధపద్ధతిని సిద్ధముచేయుము. అని ధర్మరాజు తనతమ్ములకు చిట్టచివరకు తెగజెప్పి యిట్లనెను. భీమార్జున నకుల సహదేవులారా! మన ఏడు అక్షౌహిణుల సైన్యములకును ఒక సేనాధిపతి కావలయును. ఆ సైన్యములను నడిపి భీష్మునెదిరింపసమర్థు డెవ్వడో తెలియకున్నది. అట్టి సేనాధిపతి సకల వ్యూహాదులను ఎరిగియుండవలయును. మహా భుజబలవంతుడై యుండవలయును. అట్టి సేనాధిపతి యగుటకు తగిన ధనుర్ధరుడు మన యందెవరు గలరో నిశ్చయింపుడు. అటువంటివానికి మన సర్వసేనాధిపత్యము నిచ్చి అభిషేకము చేయవలయును. అని ధర్మరాజడుగగా సహదేవు డిట్లనెను. అన్నా! ధర్మరాజా! విరాటరాజు మన కాశ్రయమై మనలను పోషించెను. అతడు తన పుత్రపౌత్రసహోదరులతో మహాభుజబల పరాక్రమవంతుడై ప్రకాశించుచున్నాడు. ఆ విరాటరాజు మన సర్వసైన్యములకు సేనాధిపతి కావచ్చును. అని సహదేవుడు ధర్మరాజుతో చెప్పగా నకులుడు ధర్మరాజుతో యిట్లనెను. అన్నా! ధర్మరాజా! మన ద్రుపదరాజు మహాబలగౌరవ తేజోవంతుడు. కార్యాఖడ్గములకు తగిన మార్గముల నెరిగినవాడు. భీష్మ ద్రోణులయందు మిక్కిలి కోపముగలవాడు. అమోఘపరాక్రమశాలి. గనుక నీ సర్వసైన్యములకు ద్రుపదరాజును సేనాధిపతిగా జేయుము. అని నకులుడు ధర్మరాజుతో జెప్పెను.

## ధృష్టద్యుమ్నాదులకు సేనానాయకత్వము నిర్ణయించుట

అర్జునుడు ధర్మరాజుతో నిట్లనెను. అన్నా! ధర్మరాజా! మన ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుని సంహరించునిమిత్తము అగ్ని

కుండమందు బుట్టెను. రథము, గుర్రములు, ధనుర్బాణములు, కవచ ఖడ్గాదిసాధనములు అన్నియు ధృష్టద్యుమ్నునకు అతను పుట్టినప్పుడే అగ్నికుండమందు బుట్టెను. ధృష్టద్యుమ్నుడు అగ్నిజ్వాలవంటి మహా తేజోవంతుడు. మహాభుజబలపరాక్రమవంతుడు. అటువంటి ధృష్ట ద్యుమ్నుడు మన సర్వసైన్యములకు అధిపతి కాగలడు. అతడు తప్ప యితరులు భీష్మని ఉత్సాహము ఎదుట నిలువజాలరు. శిఖండి భీష్మునకు మృత్యువుగా బుట్టినవాడు. ధైర్యముగల భయంకరమగు మహావీరుడు, ఆశిఖండిని మనసైన్యమునకు అధిపతిగా జేయవచ్చు నని అర్జునుడు ధర్మరాజుతో జెప్పెను. ధర్మరాజు కృష్ణునిజూచి తన తమ్ములతో యిట్లనెను. భీమాదులారా! ఈమహాత్ముడైన కృష్ణ దేవుడు సకలచరాచరభూతముల తారతమ్యమును చక్కగా యెరిగిన వాడు. ఈకృష్ణునిమాట మనకు విశేషముగా విజయకారణమగును. ఈకృష్ణదేవుడు నిశ్చయించినవాడు మనకు సర్వసేనాధిపతి కాగలడు. అని ధర్మరాజు తనతమ్ములతో జెప్పెను. ఆ మాటలను కృష్ణుడు విని ధర్మరాజుతో యిట్లనెను.

ఓధర్మరాజా! మీ సర్వసైన్యములకును సేనాధిపతి యగుటకు ధృష్టద్యుమ్నుడు తగినవాడు గాన నీవు గొప్పసభయందు సర్వ సేనాధిపత్యమును ధృష్టద్యుమ్నున కిచ్చి అభిషేకము చేయుము. ధృష్టద్యుమ్నుడు వీరశ్రేష్ఠుడు. దేవగంధర్వ గరుడ కింపురుషాది సకలదివ్యభూతముల మహావ్యూహ విధుల నన్నిటిని యెరుగును. ధర్మరాజా! నీపక్షమందుండు రాజులందరును మహాబల బుద్ధిమంతులు అయినను విశేషముగా యోచించక నీ సకలసైన్యమును ధృష్టద్యు మ్నున కప్పగించి అభిషేకము జేయుము. అని కృష్ణుడు ధర్మరాజుతో జెప్పగా ధర్మరాజిట్లనెను. మహాత్మా! కృష్ణదేవా! నీవు జెప్పినట్లు ధృష్టద్యుమ్నునకు సర్వసేనాధిపత్యము నిచ్చి యభిషేకించెదను. మన

ఏడుఅక్షౌహిణుల సైన్యమునకు ప్రత్యేకముగా సేనాపతులను నీవే నిర్ణయించిచెప్పుము. అని ధర్మరాజడుగగా కృష్ణుడిట్లనెను. ధర్మరాజా! సైన్యముకలవారనియు, లేనివారనియు తలచక సకలయుద్ధములందు పండితులగువారిని ఒక్కొక్క అక్షౌహిణీ సైన్యమునకు ఒక్కొక్క సేనాపతిని ప్రత్యేకముగా జెప్పెదను. నేను జెప్పు ఏడుగురికిని నీ ఏడుఅక్షౌహిణుల సైన్యములను అప్పగించి అభిషేకమును జేయుము అని కృష్ణుడు జెప్పగా ధర్మరాజట్లనెను. కృష్ణా! నీవు చెప్పువారిని సేనాపతులుగా జేసెదను, ఆ ఏడుమంది ఎవ్వరో చెప్పుము. అని ధర్మరాజడుగగా కృష్ణు డిట్లనెను

ధర్మరాజా! ద్రుపదరాజు మహాపరాక్రమనిధి యగును. 2 విరాటరాజు అసమాన తేజోవంతుడు. 3 సాత్యకిశత్రుభయంకరుడు. 4 జరాసంధుని పెద్దకుమారుడగు మాగధ సహదేవుడు మహాశౌర్యవంతుడు. 5 యాదవ శ్రేష్ఠుడగు చేకితానుడు మహాధైర్యవంతుడు. 6 శిశుపాలుని కుమారుడగు ధృష్టకేతుడు మహాభుజబలవంతుడు. 7 శిఖండియుద్ధసమర్థుడు. ఈ ఏడుగురును మహోపాయ బలవంతులు. నీయందు అనురక్తిగలిగి యున్నారు. వీరందరు నుగొప్పవారు, వీరు ఏడుగురు తమ శరీరబలముచేత ఎదిరించి యుద్ధమందు నటింపగలరు గనుక ఈ ఏడు అక్షౌహిణీసైన్యములకు ఏడుగుందిని సేనాపతులనుగా జేయుము. అని వాసుదేవుడు సేనాపతులను నియమించి చెప్పి మరల ధర్మరాజుతో యిట్లు చెప్పెను.

ధర్మరాజా! నాబుద్ధిచేత యోచించగాకౌరవసైన్యము నిస్సారముగా తోచుచున్నది. నీసైన్యములన్నియు మిక్కిలి దృఢములై సారవంతముగా నున్నవి. నీవు వెనుదీయక సర్వసైన్యములను నడుపుము. నీసైన్యములకు నీకును పురోభాగమున సహాయముగా నిలిచియుందును. నీతమ్ములగు భీమార్జున నకుల సహదేవులు నల్వురును

దేవతలచేతనైనను జయింపబడరు. అటువంటి నీతమ్ములు కౌరవులను చెరచుట గొప్ప కార్యముగాదు. తామర తూండ్లను విలాసముగా మదపుటేనుగు హరించినట్లు నీతమ్ములు కౌరవులను అనాయాసముగా నశింపజేయగలరు. గనుక యుద్ధమునకు దండెత్తినడుపుము, అని కృష్ణుడు ధర్మరాజుతో నిర్ణయించి జెప్పి ఆ రాత్రియందే తన నివాసగృహమునకు వెళ్ళెను ఆరాత్రికాలమున ధర్మరాజును అతని తమ్ములును సంతోషించి సుఖముగా నిద్రించిరి. ఆమరునాటి ప్రాతఃకాలమున ధర్మరాజు సహోదరపుత్ర మిత్ర బంధు సామంత కృష్ణాదులను జేర్చుకొని గొప్ప సభయొనర్చుండెను. ధర్మరాజు సకల పరిజనులు వినుచుండగా తాను యుద్ధముజేయుటను నిశ్చయించి జెప్పి తగినవారితో తగిన సంభాషణలను జేసెను. అంతట ధర్మరాజు మహావిభవముతో కృష్ణుడు జెప్పిన ద్రుపదుడు మొదలగు ఏడుగురికిని ఒక్కొక్కరికొక్కొక్క యక్షౌహిణీ సైన్యమును నప్పగించి ఏడు అక్షౌహిణులకును ఏడుమందిని సేనాపతులుగా యభిషేకముజేసెను. ధృష్టద్యుమ్నుడు శ్వేతవంశమందు పుట్టినందున శ్వేతుడని ప్రసిద్ధి జెందెను. ధర్మరాజు మిక్కిలి విభవముతో ధృష్టద్యుమ్నునకు యభిషేకించి సర్వసేనాధిపత్యమునకు పట్టముగట్టెను. ధర్మరాజు యీ విధముగా ఎనిమిదిమంది సేనాపతులను తక్కినరథికులను కలియ జూచి మాధుర్యవాక్యములచేత వారినందరిని బొగడెను. పిమ్మట వారినందరిని అర్జునునకు జూపి మనము కౌరవులతో యుద్ధము చేయుటకు కురుక్షేత్రమందు దిగుటకు వెళ్ళుదమని వారందరితో జెప్పి అర్జునునితో యిట్లనెను. తమ్ముడా! అర్జునా! నీవు సర్వదా మన పక్షపు రథికులనందరిని రక్షింపుచు కంటికిరెప్పవలె నుండవలయును జుమా! సకలకార్యములు విచారించి శిష్యులకుపాధ్యాయుని వలె వీరికందరికిని కార్యములను జెప్పుచుండవలెను. వీరందరును జెప్పినట్లు

నీవును చేయుచుండవలయును. ఈ పరమేశ్వరుడైన కృష్ణదేవుడు నన్ను రక్షించుచు నీకు కార్యసహాయుడై శుభమునిచ్చును. అని ధర్మరాజు అర్జునునితో జెప్పి అతనికి కృష్ణుని జూపెను. ఈ రీతిగా మహాగాంభీర్యవంతుడగు రాజు గొప్పరాజుల చిత్తములను బూజించి సర్వజనసన్నుతముగా యుద్ధోత్సాహముగలవాడై ప్రయాణ భేరిని ధ్వనింపజేయుటకు యాజ్ఞాపించెను. ఆ ప్రయాణభేరి మోగు నప్పుడు మహాభయంకరమైన ఘోర కర్కశ మహాఝాంకార ధ్వని కలిగియుండెను.

## పాండవులు కౌరవులతో యుద్ధమునకు వెడలుట

ఆ భేరీఝాంకార మహాధ్వని మ్రోగునప్పుడు పెద్దయెండకు బీటలుగా పగిలిన పచ్చిగోడలవలె దిక్కులు పగిలినట్లుండెను. ఆ ధ్వనికి కాగినయెసరులవలె సముద్రములన్నియు ఉప్పొంగి పొరలు చుండెను. ఓడమీదయెత్తిన తెరచాపవలె మహాధ్వని కాకాశ మంతయు భేదింపబడినట్లుండెను. ఆధ్వనిచేత వజ్రాయుధమోయని భయపడి కులపర్వతము లన్నియు బెదరి అరచినట్లు ప్రతిధ్వనిగలిగి యుండెను. కుమ్మరిసారివలె భూమి దిర్దిర తిరిగెను. సర్వభూతములును చిత్రపుబొమ్మలవలె నిశ్చేష్టితులైనవి. ఇట్లు పాండవుల ప్రయాణ భేరీ మ్రోగునప్పుడు సర్వలోక భయంకరముగా నుండెను. ఆసమ యమున పాండవుల సకల సైన్యములును ఆయాసైన్యాధి పతులతో యుద్ధసన్నద్ధులాయెను. జనమేజయ మహారాజా! ఆ మరునాడు పాండవులైదుగురును వారి పుత్రులగు అభిమన్యాదులును. కృష్ణు నును సాత్యకియు పెండ్లికి బోయెడు విధమున శృంగారించుకొనిరి. వారందరును వీరమద గర్వముచేత ప్రకాశించుచు ద్రౌపదియున్న స్థలమునకు వెళ్ళిరి. అచ్చట ఆ ద్రౌపదీ మహాదేవిని నిలిపి ద్రౌపదీ

మొదలగు పుణ్యస్త్రీలవలన అక్షతలను పొంది బ్రాహ్మణుల మహాశీర్వాదములను తీసికొని భద్రపాఠకుల స్తోత్రశ్లోకములను వినుచు బహుశుభ పదార్థములను జూచుచు శుభ చిహ్నములను బొందుచు ఆ పాండవులు యుద్ధమునకు బయలువెడలిరి. అట్లు వెడలినప్పుడు శంఖ కాహళాది మంగళ వాద్యములు గంభీరముగా మ్రోగెను. ధర్మరాజు ముందర ఆమంగళవాద్యధ్వని గంభీరముగా మ్రోగినప్పుడు ఆకాశము భేదిల్లినట్లుండి ధర్మరాజునకు జయమును తెలుపుచుండెను. అప్పుడు ధర్మరాజునకు పట్టిన తెల్లగొడుగు పరిపూర్ణమైన నిర్మల చంద్రునివలె ప్రకాశించుచుండెను. ఆ గొడుగు ప్రకాశమును జూడగా తన మనుమడైన ధర్మరాజుయొక్క జయ ప్రయాణమునకు చంద్రుడు సంతోషించివచ్చి ధర్మరాజువద్ద నుండినట్లుండెను. ఆ సమయమున ధర్మరాజు తగిన ప్రకారము నడచివచ్చి వందిజనులు కీర్తింపుచుండగా వజ్రములుచేత చెక్కబడిన రథముమీదయెక్కెను. అర్జునుడు దివ్యరథముమీద యెక్కెను. అర్జునుని రథముయొక్క నొగలు మీద కృష్ణుడు కూర్చొనియుండెను. కృష్ణుని వక్షస్థలమందు వనమాలయను పుష్పహార ముండెను. అర్జునుని దివ్యరథమునకు పూన్చిన దివ్యములగు తెల్లని గుఱ్ఱములకు కట్టిన పగ్గముల వాగెలను కృష్ణుడు ధరించియుండెను. అర్జునుని దివ్యరథమునకు ఎత్తియుండిన దివ్యకపిధ్వజము జీవము గలదియై మొఱయుచు మిక్కిలి ప్రకాశింపు చుండెను.

అర్జునుని దివ్యరథముయొక్క కాంతులు అర్జునుని శిరస్సుయందుండు దివ్యకిరీటముయొక్క కాంతులు భూమ్యాకాశములందు దట్టముగావ్యాపించి ప్రకాశించుచుండెను. అర్జునుని గాండీవమును రెండు అమ్ములపొదులు తూర్పుపడమర దిక్కులకు సూచనములైన ఆభరణముగా ప్రకాశించుచుండెను. ఇటువంటి యర్జునుడు ఒకా

నొకవిధమైన తెల్లనికాంతిగల ముఖమునుగలిగి యుండెను. అట్టి అర్జునుడు తిన్నగావచ్చి ధర్మరాజునకు కనబడి నమస్కరించెను. ఆసమయమున కృష్ణుడు పాంచజన్యశంఖమును పూరించెను. వెంటనే అర్జునుడు దేవదత్తశంఖమును పూరించెను. పిమ్మట భీమ నకుల సహదేవులును, అభిమన్యాది కుమారులును పరమసంతోషముగా గదాద్యాయుధములను ధరించివచ్చిరి. వారి ఆయుధముల కాంతులు అధికముగా ప్రకాశించుచుండెను. వారు ఎక్కిన రథములసమూహములు కాంతులచేత ఆకాశమును వ్యాపింపజేయుచుండెను. వారందరును శంఖములను పూరించిరి. మరియు ధర్మరాజునుజూచి అతనియెదుట నిలిచియుండిరి. తక్కినరాజులందరును తక్కిన యుద్ధశూరులును మహాభయంకరమైన యుద్ధసవరణను జేసుకొని ధర్మరాజు చుట్టును వచ్చినిలబడియుండిరి. వారి దేహములయందలి భూషణములకాంతులు అమితముగా ప్రకాశించుచుండెను. ఆసమయమున ధర్మరాజు అందరి చేతను చుట్టబడి అలంకరింపబడినట్లుండెను. అప్పుడుధృష్టద్యుమ్నుడు ధర్మరాజున కెదురుగావచ్చి సాష్టాంగనమస్కారము జేసెను. ధృష్టద్యుమ్నుడు యుద్ధఅవష్టంభము గలిగియుండెను. ఆదివ్యరథము నెక్కి మిక్కిలి అధికమైన విభవముచేత ప్రకాశించుచుండెను. అతడా పాండవసైన్యములకు ముందుగా నడచుచుండెను. ఈరీతిగా ధర్మరాజు శత్రువులకు భయంకరముగా యుద్ధసన్నద్ధుడై బయలు వెడలి శుభశకునములను బొందుచునడిచెను. ఆసమయమున పాండవసైన్యముయొక్క పరిచారకులును బండ్లు మొదలగు సకలసాధనములును వస్త్రనిర్మితమైన గృహములను మొదలగు సమస్తవస్తువులను తయారుచేసుకొని బయలువెడలెను; అట్లుబయలుదేరిన మహాసైన్యములు గొప్ప సముద్రమువలె కనబడుచుండెను. ధర్మరాజు సైన్యసమేతముగా వెళ్ళి కురుక్షేత్రములో ప్రవేశించి ఋష్యాశ్రమములకును, దేవబ్రాహ్మణ

గృహములకును ఉపద్రవము గలుగకుండునట్లు పరిహారముచేయుచు వెళ్లెను. ధర్మరాజు ఈరీతిగా సైన్యములను తీసుకొని గడ్డి, కట్టెలు, జలము, ఈమూటను సమృద్ధిగాగల ఒకతగినప్రదేశమందు హిరణ్వతి యను పుణ్యానదీతీరమందు విడిదలగా దిగెను. ఆసమయమున అక్కడ దిగిన సంగతిని సూచించుచు కృష్ణుడు తన పాంచజన్యశంఖమును పూరించెను. ఆవెంటనే ధర్మరాజార్జునులు మొదలైన తక్కినరాజులును తమతమ వీరశంఖములను పూరించిరి ఆమహాశబ్దము ఆకాశమునకు తూట్లుపడినట్లు మ్రోగెను. అక్కడ ఒకమనోహరప్రదేశమందు రాజగృహమును ఏర్పరచిరి. తగిన స్థలములయందు సమస్త జనులకు నివాసగృహములను ఏర్పరచుకొనిరి. ఆగృహములు మనోహరముగను దృఢముగను ఏర్పరచబడినవి. మరియు తగిన స్థలములందు ఏనుగుల శాలలును. గుర్రపుశాలలును, బారులుతీర్చి మనోహరముగా ఏర్పరచిరి. పాండవు లీరీతిగాతమశిబిరముల నేర్పరచుకొని తమసైన్యముల నన్నిటిని ఆశిబిరములకు జేర్చిరి. ఈవిధముగా పాండవులు కురుక్షేత్రమును దాటిపోయి హిరణ్వతీ నదీతీరమందు తను సైన్యసమూహములతో శిబిరమేర్పరచుకొని అన్నిటిని అచ్చటనిలిపిరి. పిమ్మట ధృష్టద్యుమ్నుడు సైన్యములచుట్టునుతిరిగి సైన్యములను సురక్షితముగా నుంచెను. శిబిరమందు ధర్మరాజు తక్కిన రాజులును. ధర్మజునియొక్క తమ్ములగు భీమాదులును, సకల పరిజనులును తగురీతిని నివసించియుండిరి. నానావిధ వస్తుసంభారసామాగ్రులచేత పాండవశిబిరము మహనీయమగు ఆ కారముచేత ప్రకాశించుచుండెను. అని వైశంపాయనుడు జనమేజయునితో చెప్పెను.

ఓజనమేజయమహారాజా! పాండవులు కౌరవులతో యుద్ధము జేయునిమిత్తము పాండవులు బయలుదేరివచ్చిన వృత్తాంతమును నీకు జెప్పితిని. ఇపుడు హస్తినాపురమందుండు కౌరవుల వృత్తాంతమును

చెప్పెదను వినుము. పాండవులు దండెత్తివచ్చి కురుక్షేత్ర సమీపమందుగల హిరణ్వతీనదీతీరమందు శిబిరమేర్పాటు చేసుకొని సైన్యసమూహములు నిలిచినవను విషయము చారులవలన దుర్యోధనుడువినెను. అట్లువినియు వినని వానివలెనుండి దుర్యోధనుడు సభామందిరమున సభయందుండు కర్ణాదులతో నిర్వికారచిత్తముగలవాడై యిట్లనెను. కర్ణాదులారా! కృష్ణుడువచ్చిన సంధికార్యమును మనమనుకూలము జేయలేదు. అందులకాతడు కోపించుకొని వెళ్లెను. అట్లువెళ్ళిన కృష్ణుడు పాండవులకు కోపముకలిగించుమాటలను చెప్పును. ఆ పాండవులును పూర్వము మనచేత భంగపడియున్న కారణమున దండెత్తివత్తురు. ఏమైనను మనకును వారికిని యుద్ధముజరుగును. కనుక రేపటిదినమందు సకలసైన్యములును బయలుదేరునట్లు మనపట్టణమందును, మన పక్షపురాజులకు తెలియునట్లును చాటింపుచేయింపుడు. మనసైన్యము విడుచుటకు కురుక్షేత్రమే విడిదిస్థలమగును. అని దుర్యోధనుడు కర్ణాదులతోజెప్పి దుశ్శాసనునితో యిట్లనెను.

తమ్ముడా! దుశ్శాసనా! నీవును కర్ణశకునులును యుద్ధమునకు కావలసిన సకలపరికరములను తయారుచేయింపుడు. అని దుర్యోధనుడు దుశ్శాసనునితో చెప్పెను. అంతట దుశ్శాసన కర్ణశకునులు ముగ్గురును సంతోషముతో బోయి సైన్యము బయలుదేరుటకు చాటింపుచేయించిరి. తగినరాజులందరికిని కురుక్షేత్రమునకు కదలి వెళ్ళుడని తెలియజేసిరి. ఆసమాచారములను విని కౌరవుల సకల పరివారమును పరమసంతోషమును బొందిరి. దుర్యోధనుడు తనను సేవింపుచుండెడివారలను పంపించి తగినచోటికివెళ్ళి తగిన కార్యములందు ప్రవర్తింపుచుండెను. ఆసమయమున దుర్యోధనుని పక్షపురాజులందరును ప్రయాణమునకు తగిన బహువిధ వ్యాపారములందు ప్రవర్తించుచున్నందున గొప్పధ్వని చెలరేగుచుండెను. చాతుర్యవంతు

లగు పరిచారకులు రథములను, ఏనుగులను, గుఱ్ఱములను సవరణలు చేయుచున్నందున గొప్పదైన సంకులధ్వని గలుగుచుండెను. పదాతి జనులు నానావిధఆయుధములను సిద్ధపరచుచు ప్రవర్తింపుచున్నందున గొప్పదైన ధ్వని బయలుదేరెను ఆయాసరకులను ప్రయాణమునకు తయారుచేయు జనులసందడులు మిక్కిలి అధికముగానుండెను. ఈ ప్రకారము ఆహస్తినాపురము యుద్ధోత్సాహములచేత చంద్రోదయ కాలమున మహాసముద్రమువలె ఘూర్ణిల్లుచుండెను. ఆ మరునాడు దుర్యోధనుడు తొందరపడుచు ప్రాతఃకాలవిధులను జరిపి మనోహర మైన అలంకారశాస్త్రమును ఆదరించుచు సభకువచ్చెను.

## దుర్యోధనుడు ద్రోణప్రభృతులను సేనాపతుల జేయుట

దుర్యోధనుడు దుశ్శాసనుడు మొదలగు సహోదరులతో కూడియుండి తన మనస్సులో నిట్లనితలంచెను. ద్రోణాచార్యుడు శత్రువులకు మహాభయంకరుడు. 2 కర్ణుడు యుద్ధమహోత్సాహములు గలవాడు. 3 అశ్వత్థామ సకలదివ్యాస్త్రవేత్త. 4 బాహ్లికుడు మహాభుజాబలవంతుడు. 5 శల్యుడు మహాశౌర్యవంతుడు. 6 కృపాచార్యుడు మహాధైర్యవంతుడు. 7 భూరిశ్రవుడు మహాబలపరాక్రమ శౌర్యసారవంతుడు. 8 శకుని మహాగర్వవంతుడు. 9 కృతవర్మ మహాభయంకర తేజోవంతుడు. 10 కాంభోజుడు మహా ప్రతాపవంతుడు. 11 సైంధవుడు మహాపరాక్రమవంతుడు. ఈ పదునొకండురును నాపదునొకండు అక్షౌహిణుల సైన్యములకును సేనాధిపతులగుటకు సమర్థులు. అని దుర్యోధనుడు తన మనస్సులో నిశ్చయించి అందరిని సభకు పిలిపించెను. వారందరితో ఆసభయందు యుద్ధవిషయములైన మాటలను మాట్లాడి వినయముచేత ప్రార్థించి ఆ పదునొకండు మందితో యిట్లనెను.

ఓ ద్రోణాదులారా! మీరు పదునొకండుమందియు నా పదునొకండు అక్షౌహిణులకును సేనాపతులు గావలయును. అట్లయిన యెడల మిక్కిలి అనుకూలముగా నుండును. అందువలన నాకు సకలమును చక్కబడును. మీపదునొకండుమందికిని మహావైభవముతో అభిషేకము చేసెదను. యిందుకు మీరు సమ్మతింపుడు. అని దుర్యోధనుడు ద్రోణాదులతో చెప్పెను. అందుకు ద్రోణ కర్ణాదులు అందరును అట్లవుగాకయని అట్లు చేయుమని సంతోషించిరి. దుర్యోధనుడు ద్రోణ కర్ణాదులగు పదునొకండుమందికిని అభిషేకము చేసెను. అట్లు అభిషేకము మహావిభవముతో జరిగెను. జనులందరును పరమ సంతోషమును పొందిరి. ఇట్లు దుర్యోధనుడు మహావైభవముతో తన పదునొకండు అక్షౌహిణుల సైన్యములకును పదునొకండుమందిని సేనాపతులను ఏర్పరచి వారిని వెంటబెట్టుకొని భీష్మునిదగ్గరకుపోయి వినయపూర్వకముగా దుర్యోధనుడు భీష్మునకు నమస్కరించెను. పిమ్మట ఆద్రోణ కర్ణాదులను పదునొకండుమందిని ఆభీష్మునకు చూపి అతనితో దుర్యోధనుడు యిట్లనెను.

తాతా! మహాత్మా! భీష్మా! యీపదునొకండుమందిని మన పదునొకండు అక్షౌహిణుల సైన్యములకును సేనాపతులనుగా చేసితిని. ఈ సైన్యములన్నియు ఒక ప్రజాబలముచేత ప్రవర్తించు విధముగా చూచుకొనవలయును. అని దుర్యోధనుడు చెప్పుచు రెండుచేతులను జోడించుకొని భీష్మునితో యిట్లనెను. మహాత్మా! భీష్మా! యీసైన్యములనన్నిటిని రక్షించుటకు ముఖ్యసేనాపతి ఒకడు లేనియెడల యీ సైన్యములు యుద్ధమందుకూడి సంచరింపజాలవు. వీరి మనస్సులన్నియు ఒక్కవిధముగా నుండకతప్పిపోవునుగదా. ఈసైన్యములయందుండువారందరును బహుదేశవాసులగుదురు. అటువంటివారందరును యుద్ధము చేయునప్పుడు నేర్పును తప్పకుండునట్లు ప్రవర్తింపజాలరు. ఈవిషయము

ములన్నియు చక్కబడుటకు ఒక ముఖ్యసేనాధిపతి కావలయును. పూర్వము దేవసైన్యములు తమంతటతాము ప్రవర్తింపనేరకుండగా కుమారస్వామిని ముఖ్యసేనాధిపతిగా చేయవలసివచ్చెను. కనుక మన సర్వసైన్యములను నీవే విచారించుచు నీవే సర్వసేనాధిపతివై నడుప వలయును. భీష్మా! నక్షత్రములకు చంద్రుడు గతియైనట్లు కౌరవులకు నీవే దిక్కుకాగలవు. కనుక యీభారమును నీవుపొంది యేవిధము చేతనైనను మమ్ములను కడతేర్పవలయును. సర్వసేనాధిపత్యము నిర్వహించుటకు నీవే తగుదువు. అట్లుకానియెడల మరియొక తగు మనుష్యుని నీవేనిశ్చయింపుము. నీవే నాసర్వసైన్యములకు అధిపతివై రక్షింపుము. శత్రువులను గెలువుము. సర్వసేనాధిపత్యమునకు పట్టము గట్టుకొనుము. అని దుర్యోధనుడు భీష్మునితో చెప్పెను. ఆమాటలను భీష్ముడువిని దుర్యోధనునితో యిట్లనెను. దుర్యోధనా! మీరును అ పాండవులును నాకు సమానమే. వాస్తవముగా చెప్పవలయును. యుద్ధము జరుగుపక్షమున నేను మీవైపు చేరెదను. నేను యిదివరకు మీదగ్గరయున్నందున మీకు సహాయముగా యుద్ధము చేసెదనని తెలిసికొనుము. నేను నీకు సర్వసేనాధిపతి నయ్యెదను. నాతో సమానముగ యెదిరించి యుద్ధముచేయగల పురుషులు భూమియందు లేరు. ఒక అర్జునునిమాత్రము నేను గెలువజాలను. అర్జునుడు నా కంటె అధిక దివ్యాస్త్రములను యెరిగియున్నాడు. నేను తక్కినవారి నందరిని వరుసపెట్టి తరతరముగా నరికెదను. పాండవుల నైదుగురిని చంపుటకు నాకు చేతులాడవు, పాండవులును క్రూరముగా నామీదికి తరిమి రాజాలరు. అప్పటికి తగినట్లు జరుగును. ఆవిషయ మట్లుండ నిమ్ము అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పెను. దుర్యోధనా! మొదట కర్ణునైనను, నన్నైనను యుద్ధముచేయుటకు పంపుము. నీవు యిట్లు చేయనియెడల నేను సర్వసేనాధిపత్యమును పూననుసుమా! అని

భీష్ముడు దుర్యోధనునితో చెప్పగా ఆమాటలను కర్ణుడువిని దుర్యోధనునితో యిట్లనెను.

దుర్యోధనమహారాజా! యిప్పుడీ విషయమును క్రొత్తగా చెప్పవలసిన పనిలేదు. భీష్ముడు యుద్ధమునందెప్పుడు పడునో అప్పుడు నేను యుద్ధమునకు వచ్చెదనని పూర్వము నేను సభలో చెప్పియున్నాను. అని కర్ణుడు దుర్యోధనునితో చెప్పెను. ఆ మాటలను భీష్ముడు విని అట్లు చేయుదునని చెప్పి సర్వసేనాధిపత్య భారమునకు పట్టముగట్ట సమ్మతించెను. అందుకు దుర్యోధనుడు సంతోషించి భీష్ముని ప్రభుత్వ గౌరవాతిశయమును కొనియాడెను. అప్పుడు భేరీ మృదంగము శంఖాదులు మ్రోయించుటకు దుర్యోధనుడు ఆజ్ఞాపించెను ఆహాస్తినాపట్టణ మందంతటను పతాకాదిఉత్సవములను జరిపించెను. దుర్యోధనుడు పట్టణమును అలంకరింపజేయించి నవరత్నఖచితములైన బంగారు వెండి మయములగు కలశములచేత తీర్థజలములను తెప్పించెను. రత్న సమూహ పుష్ప సమూహ మంగళ వృక్షపత్ర సమూహ మహౌషధిసమూహ విహితమంత్ర తంత్రములచేత ఋత్విక్పురోహిత సహితుడై దుర్యోధనుడా కలశజలములను సంస్కారము చేసెను. ద్రోణ కృపాచార్య బాహ్లీకాది వృద్ధజనులందరును సంతోషించుచుండగా దుర్యోధనుడు భీష్మునకు అభిషేకము చేసెను. దుర్యోధనుడు భీష్ముని అభిషేకించి పరమభక్తిచేత తన అక్షౌహిణీ సేనాపతులను పదునొకండు మందిని ఆ భీష్మునకు జూపి యిట్లు అనెను.

భీష్మా! యీ ద్రోణాది సేనాపతులకును సకల సైన్యములకును నీవే అధిపతివి. ఈసర్వసైన్యములకును నీవు సర్వసేనాధిపతివై యీ సర్వసైన్యములను రక్షింపుచుండుము. అని దుర్యోధనుడు చెప్పుచు సర్వసేనాధిపత్య పట్టమును భీష్మునకు కట్టెను. ఆ సమయ

మందు ఆకాశములోనుండి రాళ్ళవర్షము కురిసెను. రక్తవర్షము కురిసెను. ఆరక్తవర్షమందు దుముకలుండెను. ఆకాశము భయంకరముగా మ్రోగుచు హస్తినాపురమందంతటను పిడుగులు పడెను. ఇట్లు హస్తినాపురమందు మహోత్పాతము లుత్పన్నములై యుండెను. జనులందరును నుత్సాహములేక నిరుత్సాహులై యుండిరి. దుర్యోధనుడు యుద్ధప్రయాణము చేయదలచి మహోత్పాతములకు దానాది విధులచేత శాంతిచేసెను. ఆ మహోత్పాతములు ధృతరాష్ట్ర గాంధారులు విని తల్లడిల్లుచుండిరి. అప్పుడు వారిదగ్గరకు దుర్యోధనుడు వెళ్ళి ఆలస్యముచేయుటకు సమ్మతింపక యుద్ధప్రయాణ విషయముల నన్నిటిని ధృతరాష్ట్ర గాంధారులతో చెప్పి మరల గాంధారితో దుర్యోధను డిట్లనెను.

తల్లీ! గాంధారీ మహాదేవీ! నన్ను గెలువుమని నీవు దీవింపవలయును అని దుర్యోధను డతని తల్లియగు గాంధారితో చెప్పి నమస్కరించి వినయపూర్వకముగా వంగియుండెను. ఏపక్షమందు ధర్మముండునో ఆపక్షమువారికి జయము గలుగునని గాంధారీదేవి దుర్యోధనునితో చెప్పెను. ఆమాటలను దుర్యోధనుడు విని అక్కడ నుండి బయలువెడలివచ్చి తానును అతని తమ్ములును తగిన భటులును భీష్మునిదగ్గరకు పోయిరి. దుర్యోధనుడు భీష్ముని ముందుపెట్టికొని సకల సైన్యములను నడిపించుకొని దిక్కులు వణకునట్లుగ నడచిపోయెను. అట్లు నడచిపోయిన కౌరవసైన్యములు కురుక్షేత్రమునుదాటి ఆ కురుక్షేత్రమందొక మనోహర స్థలమందు దిగెను. అక్కడ దుర్యోధనుడు కర్ణుని వెంటబెట్టుకొని ఆ ప్రదేశమందు తిరిగి అందరిని దిగునట్లు చేసెను. ఆ ప్రదేశమున నడుమను దుర్యోధనుడు తన నివాసగృహమును యేర్పరచెను. కురుక్షేత్రమందు దుర్యోధనుని శిబిరమందు హస్తినాపురమం దెవ్వరెవ్వ రెచ్చట నివసించిరో అదే

రీతిగనే ఆ శిబిరమందును గృహములను యేర్పరచుకొనిరి. ఆ దుర్యోధనుని శిబిరము మనోహరముగా నుండెను.

జనమేజయమహారాజా! యీ ప్రకారముగా పాండవ కౌరవులు యుద్ధముచేయుటకు పూనుకొని రెండుపక్షముల సైన్యములును యుద్ధసన్నద్ధములై కురుక్షేత్రమందు యుద్ధము చేయబూని శిబిరములను యేర్పరచికొని యుండెను. ఆసమయమున బలరాముడదివరకే తన మనస్సునందు యిట్లని తలంచి వచ్చెను. కృష్ణుడు పాండవ కౌరవులకు సంధిచేయదలచి హస్తినాపురమునకు వెళ్ళి సంధి కలుగకుండగా మరల ధర్మరాజు దగ్గిరకు వచ్చెనని వింటిని. పాండవ కౌరవులు తమతమ బంధుమిత్రుల సైన్యములను చేర్చుకొని లోకభయంకరముగా యుద్ధము చేయుటకు పూనియున్నట్లు వింటిని. పాండవ కౌరవులు లోకమందుగల సకల సైన్యములను చేర్చుకొని యుద్ధసన్నద్ధులై కురుక్షేత్రమునకు వెళ్ళదలచి యున్నట్లుగా తెలియుచున్నది. అని బలరాముడతని మనస్సులో తలచి కొంతమంది పరిజనులను తీసికొని శీఘ్రముగా తీర్థయాత్రకు వెళ్ళుచు కురుక్షేత్రము దగ్గర శిబిరమందుండు ధర్మరాజును జూచెను.

## బలరాముడు పాండవుల వీడ్కొని తీర్థయాత్రకు పోవుట

అప్పుడు ధర్మరాజు తగిన ప్రకారము మహాసభయందుండెను. అట్లున్న ధర్మరాజు తోడరపక్షి లేచివచ్చి బలరాముని కౌగిలించుకొని పీఠమువేసి అర్ఘ్యపాద్యములచేత పూజించెను. కృష్ణ భీమార్జున నకుల సహదేవులు బలరామునకు నమస్కరించిరి. బలరాముడు ద్రుపద విరాటాదిరాజులతో అప్పటికి తగినట్లు మితసంభాషణముచేసి పిమ్మట వారితో యిట్లనెను.

ద్రుపద విరాటాది రాజులారా! యీ పాండవ కౌరవులు మిక్కిలి క్రూరబుద్ధిగలవారలై తమ బంధుజనులకును సకల రాజుల

కును కీడుకలుగునట్లుగా యుద్ధముచేయుటకు ప్రారంభించుయున్నారు. ఇట్టి ఘోరకార్యమును చేయరాదు. ఇట్టి యుద్ధమునకు నేను సమ్మతింపక యిదివరకే నేను కృష్ణునితో యిట్లని చెప్పితిని. కృష్ణా! నీవు కోపించుకొని ఆ పాండవ కౌరవులకు తగిన మాటలనుచెప్పి రెండుపక్షముల వారికిని సంధికలిగింపుము. యుద్ధము జరుగనివ్వవద్దు అని యిట్లు నేను కృష్ణునితో చెప్పితిని. నేను యెంతచెప్పినను యీ కృష్ణుడు సంధి చేయలేదు. ఆ కౌరవులు మాటలపొందు యెరుగరు. ఆ కౌరవులకు పూజ్యవాక్యములచేత కృష్ణుడు తెలుపవచ్చును. ఈ కృష్ణుడు సంధి చేయుటకు వెళ్ళి కోపముచేత సంధిచెరచి యేమని మరలివచ్చెనో తెలియలేదు. ఈ పాండవులును కౌరవులును సంబంధ విషయ బంధుత్వముచేత కృష్ణునకు సమానులేయగుదురు. అట్లుండగా కృష్ణుడు అర్జునునకు పక్షపాతము చేయుచు సర్వదా పాండవులవెంబడి తిరుగుచుండును. కృష్ణుడు పాండవ పక్షమందున్నందునసర్వవిధములచేతను పాండవులకు జయము కలుగును. ఇది నిశ్చయమగును. కౌరవులకు చావునిశ్చయము. ఇందుకు సంశయములేదు. ఈ యుద్ధమును వినుటకైనను, చూచుటకైనను ఓర్వజాలను. భీమ దుర్యోధనుల నిద్దరిని యింత యుద్ధ సమర్థులనుగా నేనే చేసితిని. ఆ భీమ దుర్యోధనులు ఒకరినొకరు చంపుటకు పూని యుద్ధము చేయుచుండగా నేను చూడజాలను. ఈ కృష్ణుడెరుగని ధర్మన్యాయ పురుషార్థములను నే నెరుగను. ఈ క్రూరకార్యమును నేను వినజాలక చూడజాలక సరస్వతీ నదీతీరమునకు వెళ్ళవలెనని మీకుచెప్పి పోవచ్చితిని. పోయివచ్చెదను. అని బలరాముడు ద్రుపదాది రాజులతో చెప్పెను బలరాముడు తీర్థయాత్రకు వెళ్ళువిషయమై కృష్ణ ధర్మరాజు లిద్దరు సమ్మతించి పంపగా బలరాముడు తీర్థయాత్రకు వెళ్ళెను.

జనమేజయమహారాజా! అట్లు బలరాముడు వచ్చి వెళ్ళిన పిమ్మట కృష్ణుని భార్యయగు రుక్మిణీదేవికి అన్నయగు రుక్మియను

రాజు వచ్చెను. ఆ రుక్మియనురాజు బలపరాక్రమవంతుడు. మరియు ప్రపంచమందు శార్ఙ్గమనియు, గాండీవమనియు, విజయమనియు, మూడు దివ్యధనుస్సులు గలవు ఆ మూటిలో విజయమనుధనుస్సును రుక్మిధరించి యుండును. ఆ రుక్మిరాజు తన సైన్యములను తీసికొని కురుక్షేత్రమునకు వచ్చి ధర్మరాజును జూచెను. ధర్మరాజు ఆ రుక్మిరాజును పూజించి తగినపీఠమందు కూర్చుండునట్లు చేసెను. అప్పుడు ఆ సభయందుండు వీరులందరునువినుచుండగా రుక్మిరాజు అర్జునునితో యిట్లనెను.

అర్జునా! నీవు యుద్ధమునకు భయపడు పక్షమందు నాకు చెప్పుము. ఈ జగత్తుయందు నన్ను యెదిరించు వీరులు లేరు. నీకు నేను సహాయుడనై యెటువంటి శత్రువునైనను జయింపగలను. అని రుక్మిరాజు అర్జునునితో చెప్పెను. పూర్వము కృష్ణుడు రుక్మిని ఆక్రమించి అవమానించి వీనిచెల్లెలగు రుక్మిణీదేవిని తీసికొనివచ్చెను. అట్టిరాజు యిప్పుడు సిగ్గులేక కృష్ణుని సన్నిధియందే అర్జునునితో యిట్లు చెప్పగా వానిమాటలకు అర్జునుడు చిరునవ్వు నవ్వుచు వాని ముఖమును జూచి యిట్లనెను.

రుక్మిరాజా! పూర్వము నేను గంధర్వసైన్యమును చంపునప్పుడును విరాటుని గోవులను మరలించునప్పుడును నీసహాయమునాకు తప్పిపోయెను. యిదివరకు నీపరాక్రమమును నేనుయెరుగను. ఇక నాకాకయని మరియొకనికి నీవుసహాయుడవుగమ్ము అని అర్జునుడు రుక్మియొక్క యోగ్యతకు తగినట్లుచెప్పి మరలయిట్లనెను. ఓ రుక్మిరాజా! పూర్వము నేను అసహాయుడనై యుద్ధమునకు వెళ్ళినట్లు యిప్పుడు నేనువెళ్ళను. ఇప్పుడు నాకు కృష్ణుడు సహాయముగా నున్నాడు. నాకెప్పటికియుద్ధవిషయమైనభయము లేదు. ఎంతఆపద కలిగినను మేము శత్రువులకు భయపడము. నేను భయపడితిననియు

నాకు నీవుసహాయుడవుగమ్మనియు నిన్ను వేడుకొనినప్పుడు నాకు సహాయుడవగుము. నాకుభయము గలిగియున్న యెడ నాభయమును ఈ రథికవీరులు పోగొట్టగలరు. నీసహాయమును నేను కోరను. నీవు మరి యొకనిదగ్గరకువెళ్ళి యితరులకు సహాయుడవుకమ్ము. అని అర్జునుడు ఆరుక్మిరాజుతో చెప్పెను. అంతట రుక్మిరాజు తనసైన్యమును దీసికొనిపోయి అర్జునునితో చెప్పినట్లే బడాయిగా దుర్యోధనునితో చెప్పెను. అతనిమాటలను దుర్యోధనుడువిని అతనితో యిట్లనెను.

రుక్మిరాజా! నీవిట్లు బడాయిమాటలను చెప్పరాదు. నీసహాయమును నేనుకోరను. వెళ్ళుము. అని దుర్యోధనుడు రుక్మిరాజుతో చెప్పెను. అంతట రుక్మిరాజు వ్యర్థములైన రాకపోకలచేత వృథాయాసముగలవాడై దుఃఖించిన చిత్తముతో తనసైన్యసమేతముగా తనపట్టణమునకు పోయెను. జనమేజయమహీరాజా! బలరాము రుక్మిలిద్దరును మాత్రము భారతయుద్ధమందు చేరలేదు. లోకమందున్న తక్కిన రాజులందరును కౌరవపాండవుల పక్షములయందు చేరియుండిరి. ఆసమయమున రాత్రికాలములో హస్తినాపురమందుండు ధృతరాష్ట్రుడు సంజయునిరప్పించి యిట్లనెను. సంజయా! యుద్ధమువలన కీడుగలుగునని నేనుయెఱుగుదును. నాకొడుకగు దుర్యోధనుడు వినడు వేక. ఆ దుర్యోధనుని అదలించి యుద్ధమునుమాన్పుటకు నాకునోపడదు. ఇది దైవాధీనము. ఈయుద్ధవిషయమై ఇకమనము చింతించుట వలన ప్రయోజనములేదు. ఏదియెట్లు జరుగవలసియున్నదో అది అట్లుజరుగక మానదు. దైవాధీనకార్యమును తప్పించుటకు యెవ్వరికిని సాధ్యముగాదు. రాజులగువారికి యుద్ధమందు మరణమే మేలగును. ఆవిషయ మట్లుండనిమ్ము. రెండుపక్షములవారి సైన్యములును కురుక్షేత్రమందు దిగునుగదా! అట్లు దిగినపిమ్మట యేమైనను విశేషములున్నయెడల నాకుచెప్పుము. అని ధృతరాష్ట్రుడు అడుగగా సంజయుడిట్లనెను.

## సంజయుడు ధృతరాష్ట్రునితో వులూకుడు పాండవుల నాడినమాటలు చెప్పుట

ధృతరాష్ట్రమహారాజా! అయ్యో! నీకొడుకగు దుర్యోధనునిమీద తప్పిదమునంతయు మోపుచున్నావు. ఆదుర్యోధనునిమీద తప్పిదముంచుటవలన ప్రయోజనము లేదు. నీతప్పిదమునీకు తెలియదు! నీవు యెరుగకుండగా దుర్యోధనుడు పాండవులకు కీడు చేయలేదు. ఆ కార్యముగడచిపోయెను. ఇకను నీవు వార్తలను వినగోరినయెడల చెప్పెదను వినుము. అట్లు రెండుపక్షములవారును కురుక్షేత్రమునకు వెళ్ళియున్నప్పుడు దుర్యోధన దుశ్శాసన కర్ణ శకునులతో యోచించి వులూకునిపిలిపించి యిట్లనెను. వులూకుడా! నీవు పాండవులదగ్గరకు పోయి కృష్ణునిసన్నిధియందు ద్రుపద విరాటాదిరాజులు వినుచుండగా చులుకని కఠినవాక్యములచేత ఆపాండవులను దూషింపుము. శీఘ్రముగా వెళ్ళుము. అని యిట్లు దుర్యోధనుడు వులూకునితోజెప్పి ఆ వులూకునకు కొన్నిమాటలను నేర్పి పంపించెను. అంతట వులూకుడా పాండవ శిబిరమునకు వెళ్ళి సభయందుండెడి ధర్మరాజునుజూచి యిట్లనెను.

ధర్మరాజా! దుర్యోధనుడు మీతో కొన్నిమాటలను జెప్పుటకు నన్ను నియమించి పంపెను. ఆ మాటలను చెప్పెదను. నీవు కోపించుకొనకుము. వినుము. అని వులూకుడు చెప్పగా ధర్మరాజు యిట్లనెను. వులూకుడా! నీవు భయపడవద్దు. ఆ బుద్ధిమంతుడగు దుర్యోధనుడు యెన్ని తులువమాటలను మాతోజెప్పుమని నీకు జెప్పి పంపించెనో ఆమాటలను అన్నిటిని చెప్పుము. అని ధర్మరాజు చెప్పగా వులూకుడు యిట్లనెను.

ధర్మరాజా! నీవు బహుకాలమునకు యుద్ధమునకు కోరి వచ్చితివి. మిక్కిలి తెంపు చేసితివి. మీరు నిశ్శంకగా సంజయునితో

చెప్పిన మాటలు చాలగలవు. నీవు రాజ్యమును పోగొట్టుకొంటివి. మీ భార్యయగు ద్రౌపది నిండు సభయందు మిక్కిలిగా అవమా నింపబడెను. ఈ రెండుకష్టములకును నీవు కోపముగలవాడవై మంచి బంటువైన భుజాబల దివ్యాస్త్ర ప్రభావములను చూపుటకు ఇప్పుడు మంచిసమయము వచ్చెను. నీకు గల వారినందరిని యుద్ధమునకు పిలిచి కొనివచ్చి నీవు యుద్ధమందు నిలిచి యుండవలయును. మీవారినంద రిని తీసికొని యుద్ధమున నడుపుము. ఇకను నీవు భయపడుటవలన యుద్ధముతప్పదు. ఇకను నీవు తప్పించుకొని పారిపోవుటకు శక్యము గాదు. ధైర్యమును తెచ్చుకొని మీవారినందరిని ప్రేరేపింపుము. మహాబలవంతుడగు భీష్ముని భుజాబలము మాకుసహాయమైయున్నది. ద్రోణుని దివ్యబాణ వర్షము మీమీద వర్షింపగలదు. ఆ భీష్మ ద్రోణుల బల పరాక్రమములను మీరు చూడగలరు. ఈ రెండు విష యములను మీరు సర్వమును కృష్ణునిచేతనే చక్కజేసికొనుడు. ఆ భీష్మ ద్రోణుల బాణములయెదుట బడినయెడల అర్జునుడు బ్రతుక జాలడు. భీష్మ ద్రోణుల దివ్యాస్త్రసమూహములను మీరందరును ఎరిగియేయున్నారు. అని వులూకుడు ధర్మరాజుతో చెప్పి భీముని జూచి యిట్లనెను. యుద్ధమందు దుశ్శాసనుని రక్తమును త్రాగెదనని యీ భీముడు పూర్వము చెప్పియున్నాడు. ఆదుశ్శాసనుని రక్తము త్రాగుటకు శక్యమైనయెడల త్రాగుమని చెప్పవచ్చును. ఇక ఆల స్యము చేయవద్దు,

భీమా! బావిలోనున్న కప్పవలె నిన్ను నీవే పొగడుకొందువు గాని అన్యులను పొగడవు. నీవు గర్వముచేత పరుల బలమును ఎరు గవు. నీవు యుద్ధమందు ఒకసారియైనను పట్టుబడక పోజాలవు. అని వులూకుడు భీమునితో చెప్పి అర్జునునిజూచి యిట్లనెను. అర్జునా! పెద్దతాటిచెట్టంత పొడవుగల గాండీవ మను ఒకధనుస్సు నీకు కలిగి

యున్నది. నీకు కృష్ణుడు సహాయుడై నీకు సారథ్యముచేయుచు నీ వెంబడివచ్చును. ఈ రెండువిషయములను మేము యెరిగియేయున్నాము. వీటికన్నిటిని మేము భయపడి మీకు రాజ్యభాగమును పంచిఇవ్వము. ఆవిషయ మటులుండనిమ్ము. పూర్వము ద్రౌపదిని సభకుయీడ్చి తెచ్చి అవమానించితిమి. ఆసమయమున భీముని గదాయుధము నిగాండీవము యీ రెండును యే అంగడికిపోయెనో చెప్పుము. మేము ద్రౌపదిని అవమానించుటను నీవు చూచియు నెంటనే బడాయి మాటలను చెప్పుచున్నావు. ఆభీముడు వలలుడని పేరుపెట్టుకొని విరాటునిదగ్గర వంటలవాడై యుండెను. నీవు బృహన్నలయను పేరు పెట్టుకొని నపుంసకుడవై కొంచెమైనను సిగ్గులేక ఆ విరాటుని దగ్గర యుంటివి. నీవు మిక్కిలి దైన్యమును పొంది బహుకష్టములను అనుభవించితివి. భూమిని యేలవలెనను ఆశచేత యిన్నికష్టములను పొందితివి. ఇట్లు కష్టములను పొందుట శౌర్యమో భుజాబలమో నీవే చెప్పుము. అర్జునా ! యీకృష్ణుడు మాకౌరవసభకు వచ్చి కొన్ని మాయలును యింద్రజాలములును చేసి వచ్చెను. ఈ కృష్ణుడు యెన్నిమాయలను పన్నినను యితనిని కట్టుటకు యేర్పరచియుండు పగ్గములు యెప్పుడును సిద్ధముగా నున్నవి. నీవు యేమిచెప్పినను యెన్ని బడాయిమాటలాడినను మేము భయపడము. వేయిమాటలను జెప్పుటవలన ప్రయోజనములేదు. ముఖ్యమైన మాటను చెప్పెదను వినుము. నీవంటి అర్జునులును, యీ కృష్ణునివంటి విష్ణుదేవులును వేయి పదివేలమంది వచ్చినను మేము యుద్ధము చేయుదుమె గాని భూమిలో ఒక చీలికయైనను పంచి యివ్వము. అని వులూకుడు అర్జుననునితో చెప్పి నకులుని జూచి యిట్లనెను. నకులుడా ! నీవు దామగ్రంథి యను పేరుపెట్టుకొని విరాటుని గుర్రములను పట్టుచు ఆప్రకారము నీచస్థితిని పొందియుంటివి. అట్లుండుటవలన నీకు రాజ్య

మందు ఆశయున్నట్లు తోచుచున్నదేగాని నీకు పొందనుండదు. అని వులూకుడు నకులునితో చెప్పి సహదేవుని జూచి యిట్లనెను. సహదేవుడా! నీవు తంత్రిపాలుడని పేరుపెట్టుకొని [illegible] నీచస్థితిగా ఆ విరాటుని పసువులను కాచితివి. భూమి లభించునను ఆశచేత అంతకష్టమునకు ఓర్చితివేగాని నీకు శౌర్యములేదు. అని వులూకుడు సహదేవునితో చెప్పెను. భీమార్జున నకులసహదేవులు పలుకకుండను మొగములు చలింపుచుండగా ఒకరినొకరు చూచుచు క్రోధయుక్తులై యుండిరి. అట్టి భీమాదులను కృష్ణుడు జూచి నవ్వుచు వులూకునితో యిట్లనెను. వులూకుడా! నీవు పోయి అందరు వినుచుండగా మీ దుర్యోధనునితో యిట్లని చెప్పుము. దుర్యోధనా! రేపె యుద్ధమగును. నీవు ధైర్యవంతుడవై, బిరుదవై యుద్ధమందు పారిపోక నిలువుము. నీవు చావక తొలగిపోరాదు. కృష్ణుని సారథ్యముగల అర్జునుని దివ్య రథము నీవు యెందులో ప్రవేశించినను నిన్ను తరుముకొని నీవెంటనే వచ్చును.

దుశ్శాసనుని రక్తము త్రాగెదనని పాడిమాటలను చెప్పిన భీముడే పదివేల మదపుటేనుగుల బలవంతుడగును. నీవు చూచు చుండగా యీభీముడు దుశ్శాసనుని రొమ్ముచీల్చి రక్తమును త్రాగ గలడు. అని దుర్యోధనునితో చెప్పుమని కృష్ణుడు ఉలూకునితో చెప్పెను. అంతట అర్జునుడు ఉలూకునితో యిట్లనెను. ఉలూకుడా! యుద్ధమునకు వారు గలరనియు వీరు గలరనియు నీవు చెప్పుచున్నావు. ఆ భీష్మాదులు గలరని పొంగుచున్నావు. వారిని మిమ్మును రేపు యుద్ధమందు స్పష్టముగా జూచెదను. తనకు భుజశక్తి లేక అన్యుల భుజాబలమును నమ్మి పరాక్రమింపరాదు. భీష్ముడు కౌరవకుల శ్రేష్ఠు డగును. మంచి వ్రతనియమము గలవాడు; మహాత్ముడు. అటువంటి భీష్ముని పురికొల్పి నీవు సర్వసేనాధిపతివని వుబ్బించి మీదుర్యోధనుడు

విరోధముచేత అభీష్ముని చంపుకొనుచున్నాడు. ఇక నేమని చెప్ప వచ్చును? భీష్మునివంటి గొప్పవాడు లోకమందు లేడనియు యీభీష్ముని అండవలన చావు తప్పించుకొనవలెననియు దుర్యోధనుడు తలచి యున్నాడు. ఆదుర్యోధనుని తలంపును మేము యెరిగి అభీష్ముని మొదటిముద్దగా మ్రింగెదము. పిమ్మట ద్రోణాచార్యులను చంపె దము. అంతట కర్ణుని చంపబోలెదము. దుశ్శాసనుని ముగించి పిమ్మట దుర్యోధనుని ఆశపెదను. సహోదర పుత్రమిత్రాదుల చావులను చూచి పిమ్మట దుర్యోధనుడు భీముని గదాయుద్ధముచేత క్రింద కూలును. అప్పటికైనను దుర్యోధనుడు తాను చేసిన దుష్కార్యము లను మనస్సునందు తలచకపోడు. ఈవిషయమును అట్లుండనిమ్ము. నీవు శీఘ్రముగా వెళ్ళి రేపు ఉదయకాలమందు దుర్యోధన రాజును యుద్ధభూమికి నడిపింపుము. అని యిట్లు అర్జునుడు ఉలూకు నితో చెప్పెను. అప్పుడు ధర్మరాజు ఉలూకునకు తాంబూల ఆభర ణములిచ్చి పంపించెను. ధర్మరాజు ధృష్టద్యుమ్నునితో యిట్లనెను. ధృష్టద్యుమ్నుడా! రేపటిదినము యుద్ధము ప్రారంభమగునని మన సైన్యముల కన్నిటికిని తెలియజేయుము. సర్వసన్నాహములను తయారుచేయింపుము. అని ధర్మరాజు ధృష్టద్యుమ్నునితో చెప్పి పంపించి సభలోనుంచి వెళ్ళెను. ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యులతో యుద్ధముచేయుటకు సమయము లభించెనని ఉబ్బుచు వెళ్ళెను. అది వరకు భీష్మునితో యుద్ధముచేయుటకు యెప్పుడెప్పుడు సమయము ప్రాప్తించునోయని శిఖండి తలచుచు ఉబ్బుచుండెను. వాని తలంపు నకు తోడుగా ధర్మరాజు ఆజ్ఞాపించెను. ధృతరాష్ట్రమహారాజా! అంత ఉలూకుడు వచ్చి పెద్దసభయందున్న దుర్యోధనుని శిబిరమునందు జూచి కృష్ణార్జునులు చెప్పినమాటలను దుర్యోధనునితో చెప్పెను. అప్పుడు దుర్యోధనుడు కర్ణునిజూచి యిట్లనెను. కర్ణా! రేపు యుద్ధ

మని మన సకలసైన్యములకును చెప్పి పంపించుము. యుద్ధమునకు కావలసిన సకలసాధనములను సిద్ధము చేయుము అని యిట్లు దుర్యోధనుడు కర్ణునితో చెప్పి పంపించెను. కర్ణుడును దుర్యోధనుడు చెప్పిన ప్రకారము చేసెను. రెండుపక్షముల సైన్యములను యుద్ధమునకు వుత్సహించి విజృంభించి చెలరేగుచుండెను. అని యిట్లు సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను. ఓ సంజయా! కృష్ణుని సహాయముగల అర్జునుని గెలుచుటకు భీష్మునకు సాధ్యము గాదు. ఆవిషయమును అట్లుండనిమ్ము. వృకోదరుడు దుర్యోధనునితో చెప్పిన కృష్ణార్జునుల మాటలకు మనసభలో నుండెడివారు యేమనిరో చెప్పుము. అని ధృతరాష్ట్రుడు సంజయుని అడుగగా సంజయుడు యిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా? ఆ వృకోదరుడు చెప్పినమాటలను విని నీకొడుకగు దుర్యోధనునితో భీష్ము డిట్లనెను. దుర్యోధనా! నే నుండగా నీవు పాండవులకు భయపడవలసినపనిలేదు. నేను నీ సైన్యములను కాపాడుదును. నీవు మెచ్చునట్లు చేసెదను. మనసైన్యములను నడిపించుటకును మన సైనికులచేత శత్రువులను చంపుటకును మన సైన్యములు చెదిరినప్పుడు కూడ్చుటకును నేను మిక్కిలి సమర్థుడ నగుదును. నాభుజాబలము నీసైన్యములకు గవిసెనవంటిది అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పెను. అప్పుడు దుర్యోధనుడు భీష్మునితో యిట్లనెను.

మహాత్మా! భీష్మా! నీవును ద్రోణాచార్యులును దివ్యాస్త్రవేత్తలని ప్రసిద్ధిని జెందియున్నారు. మీరాయిద్దరును నాకు కలిసి యుండగా నేను భయపడవలసినపనిలేదు. నేను గరుడగంధర్వ కిన్నరరాక్షసాది దివ్యభూతములకును భయపడను. ఆపాండవులకు నేను భయపడుచున్నానని తలచవలసినపనిలేదు. వడసపెట్టి ఆపాండవులను నశింపజేసెదను. అని దుర్యోధనుడు భీష్మునితో చెప్పెను.

తాతా! భీష్మా! మనపక్షమందుండువారి బలాతిశయములను చక్కగా చెప్పుము. సకల జనుల బలతారతమ్యములను నీవు యెరిగియే యున్నావు. నీవు యెరుగనివిషయములు లేవు. అని యిట్లు దుర్యోధనుడు అడుగగా భీష్ము డిట్లనెను.

## భీష్ముడు దుర్యోధనునితో గౌరవులలో నతిరథ మహారథాదుల నిరూపించి చెప్పుట

దుర్యోధనా! నీవు యిట్లు అడుగగా నేను విని పూరకుండ రాదు. ఉన్నవాస్తవమును చెప్పెదను. మనపక్షమందుండు రథికుల బలప్రమాణములను చెప్పెదను. ఆపాండవుల పక్షమందుండు రథికుల బలప్రమాణములను చెప్పెదవినుము. దుర్యోధనా! నీవు యుద్ధమునకు అతిరథుడవు. నీతమ్ములగు దుశ్శాసనాదులు తొంబదితొమ్మిదిమందియు సమరశ్రేష్ఠులు. నీతమ్ములందరును పాంచాలసైన్యమును కొట్ట గలరు. నన్ను నేను చెప్పుకొనరాదు. నాబలాతిశయమును మీరు యెరిగియేయున్నారు. భోజవంశశ్రేష్ఠుడగు కృతవర్మ అతిరథుడు. ఆకృతవర్మ దృఢ వేదియగును. ఆకృతవర్మ యెంతపనినైనను తీర్చ గలడు. శల్యుడు అతిరథుడు శల్యుడు కృష్ణునితో విరోధముగలిగి యుండును. శల్యుడు తన మేనయల్లుండ్రగు నకులసహదేవులను విడిచి నీతోకలిసి పరాక్రమమును చూపదలచియున్నాడు. మరియు భూరిశ్రవసు డతిరథుడగునుజుమా! దుర్యోధనా! సైంధవుడు మహా రథుడగును. ఆసైంధవుడు యుద్ధమందువోక వెనగడు. పూర్వము పాండవులు వనమందున్నప్పుడు సైంధవుడు ద్రౌపదిని అపహరించి తీసికొనిపోయెను. అప్పుడు పాండవులు ద్రౌపదినిమిత్తము సైంధవుని పట్టుకొని అవమానించిరి. అందుకు సైంధవుడు కోపముగలవాడై పాండవులను యెదిరించుటకు రుద్రునిగురించి తపస్సుచేసెను.

దుర్యోధనా! కాంభోజరాజగు సుదక్షిణుడు సమరథుడు. ఆ సుదక్షిణుని దగ్గర మంచి రథసమూహములున్నవి. ఆ సుదక్షిణుడు పాండవుల బలములను చెదరగొట్టును మాహిష్మతీరాజగు నీలుడు అతిరథుడగును. ఆ నీలునకును సహదేవునకును వైరము గలిగి యుండును. గనుక ఆనీలుడు యుద్ధమందు ప్రాణములను లెక్కింపడు. అవంతీదేశపు రాజులగు విందానువిందులు అర్ధరథులగుదురు. వారిద్దరును అన్యోన్యము స్నేహముగలవారై సాహసించి ఒకరి నొకరు విడువక శత్రువులతో యుద్ధముచేయుదురు. త్రిగర్తదేశపు రాజులగు సుశర్మ మొదలగుఅయిదుమందియు మహారథులగుదురు. వారు యిదుగురును సహోదరులు. వారైదుగురును విరాటుని గోవులను పట్టుకొనునప్పుడు పాండవులు విరాటుని గెలిపించి త్రిగర్తులకు అవమానము కలిగించిరి. ఆ అవమానమును యిప్పుడు వారు తీర్చుకొనగలరు. ఆ త్రిగర్తరాజు లైదుగురికిని భుజబల సంపదము గలదు. దుర్యోధనా! నీకొడుకగు లక్ష్మణకుమారుడు సమరథుడు. బిరుదుగలవాడు. ఆలక్ష్మణకుమారుడు శత్రుసైన్యములను చీకా-పెట్టగలవాడు. భుజబలమందు మీఅందరికంటె అధికుడు, మదము గలవాడు. శత్రువులను లక్ష్యపెట్టడు. బృహద్బలుడు, సమరథుడు. బృహద్బలుడు కోసలబలముతోవచ్చి అగ్నినైనను పట్టుకొందమని తలచుచుండును. దండధారుడనురాజు అర్ధరథుడగును. అధిక సైన్యము కలవాడు. ఆ దండధారుడు మిక్కిలి క్రూరముగా యుద్ధముచేయును.

దుర్యోధనా! మన సైన్యములోనుండు అతిరథులకంటె కృపాచార్యు డతిరథశ్రేష్ఠుడగును. ఆకృపాచార్యుడు తనభుజబలముచేత శత్రువుల చతురంగ బలములను గెలుచును. వారిని చంపును. కొంచెమైనను వెనుకదీయడు. శకుని సమరథుడగును పాండవులతో సర్వదా విరోధము గలిగియుండును.

ఆ పాండవులకు కీడు కలిగించుటకు ప్రయత్నించు చుండును. ఆశకుని యొక్క భటులందరును మహా బలవంతులగుదురు. దుర్యోధనా! అశ్వత్థామ శ్రేష్ఠుమైన దివ్యాస్త్రములను యెరిగినవాడగును. మహాభుజ బలవంతుడు. అర్జునునితో యెదిరించి యుద్ధము చేయుటకు సమర్థుడు. ఈ అశ్వత్థామతో సమానరధికులు యీ భూమియందు లేరు. ఈ అశ్వత్థామ బ్రాహ్మణుడగు నేగాని యుద్ధములయందు యమధర్మరాజువంటి వాడు. ఇతనితోసరి సాహసికులను మన మూహి. కాలము. ద్రోణాచార్యుడు రధికశ్రేష్ఠుడు. ఆ పాండవుల తట్టున గల రధికులను మన వైపునగల రధికులకును అందరికిని యీ ద్రోణుడు ధనుర్విద్యను నేర్పినగురుడు. నీకు మిక్కిలి హితుడు. ఈ ద్రోణుని యెదురించిన సైన్యములును శత్రువులను ములుముపెట్టి చంపును. ద్రోణుడు వృద్ధుడని తలచరాదు. యుద్ధమునందితని దేహమునకు మహోత్సాహము గలిగి వృద్ధాంగును. ఈ ద్రోణుడు అర్జునుని యందుగల స్నేహముల చేత అర్జునుని నోర్పింపడు. సురాసుర సకల ప్రపంచము నంతయు ద్రోణుడు చిక్కపరచును. యుద్ధమందు యీ ద్రోణుడు ప్రాణములను దాచడు. ఈ ద్రోణునివంటి రధికవీరుడు మహాబలవంతుడు నగు సోమదత్తుడు అతిరధుడు. మహా బలవంతుడగు సోమదత్తునకు యుద్ధము పెండ్లివంటిది. ఈ రాక్షస శ్రేష్ఠుడైన హాలాయుధుడు సమరధశ్రేష్ఠుడు అపరిమిత బలవంతుడు. పాండవులయందు యీ హాలాయుధునకు కోపము గలిగి యుండును. హాలాయుధుడు అపరిమితములై మాయాబలముల చేత మనుష్యులను చిక్కపెట్టును. ప్రాగ్జ్యోతిషపు పట్టణపు రాజగు భగదత్తుడు అపరిమిత శక్తివంతుడు, సురరక్షకుడగును భగదత్తుడు తన యేనుగుమీద యెక్కి యుద్ధముచేసిన యెడల ఆ దేవేంద్రునితో సమానుడుగా నుండునని చెప్పవచ్చును. గాంధారరాజులగు వృషభుడునుఅచలుడును

వీరిద్దరు సమరథులగుదురు. వీరును వృద్ధులైనప్పటికి సమర్థులగుదురు. వీరి యుద్ధోత్సాహమును శోధింపరాదు.

## భీష్ముడు కర్ణుని నర్ధరథుడని చెప్పుట

దుర్యోధనా! నీకు కర్ణుడు మంత్రియై ప్రియమైన స్నేహితుడై సర్వదా యుద్ధమునకు కాలుద్రవ్వుచుండును. కర్ణుడు నిన్ను పాండవులతో కలహమునకు పురికొల్పి సభయందు బడాయిమాటలను నోటికి వచ్చినట్లు చెప్పుచుండును. అట్టి యీ కర్ణుడు అర్ధరథుడు. వీ డర్ధరథుడగుటకు కారణములను చెప్పెదను వినుము. ఈ కర్ణునకు గల సహజకవచకుండలములను దేవేంద్రుడు వంచించి తీసికొని పోయెను. పరశురాముని శాపమువలన కర్ణునకు అస్త్రశక్తి చెడి పోయెను. ఈ కారణములవలన కర్ణు డర్ధరథుడగును. వీడు అర్జునుని యెదిరించి మానప్రాణములను దక్కించుకొనజాలడను విషయము అందరికిని స్పష్టముగా తెలిసియున్నది. అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పగా అప్పుడు ద్రోణుడు దుర్యోధనునితో యిట్లనెను. దుర్యోధనమహారాజా! కర్ణుడు యోచించక ముందుగా అనవసరపు కలహమునకు ప్రవేశించును. యుద్ధమందు పనుని యోగ్యతను యెరుగడు. కనుక ఆలోచించగా యీకర్ణు డర్ధరథుడే యగును. అని ద్రోణుడు దుర్యోధనునితో చెప్పెను. ఆ భీష్మద్రోణుల మాటలకు కర్ణుడు కోపించుకొని యెర్రని నేత్రములు గలవాడై భీష్మునితో యిట్లనెను.

భీష్మా! శత్రుత్వము లేకనే నీవు యెక్కువ నిష్ఠురముగా మాటలాడుచున్నావు. ఇట్లు చెప్పుట నీకు వుచితముగాదు. నన్ను అర్ధరథుడని చెప్పితివి. నాయందు యేమితక్కువగలదో నీవు చూచిన విషయములు చెప్పుము. నీవు యుద్ధము చేయుటకు సమ్మతింపక నిందు

సభలో నేను కష్టపడునట్లుగా మాటలను చెప్పుచుండెదవు. నేను దుర్యోధనుని జూచి నీమాటలకు సహించి పోవుచుందును. నీ బల శౌర్యములను బట్టి సూటిగా నీవు అర్ధరథుండవని తోచుచున్నది. అని కర్ణుడు భీష్మునితో చెప్పి ఆ సభయందుండు వారి నందరిని కలియ జూచి ఆ సభ్యులతో యిట్లనెను.

సభ్యులారా! యీ భీష్ముడు మనకు హితుడని నమ్మరాదు. ఈభీష్ముడిటువంటి కార్యభంగపు మాటలను చెప్పుచున్నాడు. దుర్యోధన మహారాజుయందు నాకు గల స్నేహమును తగ్గించుటకు యీ రీతిగా హెచ్చుతగ్గు మాటలను భీష్ముడు చెప్పుచున్నాడు. పెద్దమనుష్యులగు రాజులు రథికుల బలాబలములను నిశ్చయింప వలయును. ఈ భీష్మునివంటివాడు తండ్రికిని కొడుకులకును విరోధమును కలిగింతురు: ఇటువంటి ముసలిరాజులను మనము దోసుకొనవచ్చును. అని కర్ణుడు సభ్యులతో చెప్పి దుర్యోధనుని జూచి యిట్లనెను. దుర్యోధన మహారాజా! భీష్ముడు న్యాయము తప్పి నామనస్సు నొచ్చునట్లుగా మాటలాడెను. ఇతని మాటలను నేను ఓర్వజాలను యీ దుర్మార్గుడైన భీష్ముని భుజాబలము యెంతమాత్రమగును? ఈభీష్ముని ఒక్కని విడుచుటవలన మనకు లోపములేదు. ఇతని మాటలవలన రాజులందరును బాధపడుచున్నారు. ఇతనిని విడుచుటవలన యీ రాజుల మనస్సులు చక్కబడును. ఈభీష్ము డర్జునునకు పక్షపాతి. ఈ భీష్ముడు వంచనలేక పాండవులతో యుద్ధమును చేయడుసుమా! మిక్కిలి ముసలివాండ్రుకూడా చాతుర్యవంతులగువారి మాటలను వినవలెను. గాని పెద్దవాడైనను యీ భీష్ముని మాట వినరాదు. భీష్ముడు మిక్కిలి ముసలివాడు. ముసలివాండ్రకు బుద్ధి తప్పియుండును. ముసలివాండ్రు పిచ్చివాండ్రువలె నోటికి వచ్చినట్లు మాటలను చెప్పుచుందురు. ఆ ముసలివాండ్ర మాటలను నిశ్చయముగా గ్రహింపరాదు. భీష్ముడు

సభలో నేను కష్టపడునట్లుగా మాటలను చెప్పుచుండెదవు. నేను దుర్యోధనుని జూచి నీమాటలకు సహించి పోవుచుందును. నీ బల శౌర్యములను బట్టి చూడగా నీవు అర్ధరథుడవని తోచుచున్నది. అని కర్ణుడు భీష్మునితో చెప్పి ఆ సభయందుండు వారి నందరిని కలియ జూచి ఆ సభ్యులతో యిట్లనెను.

సభ్యులారా! యీ భీష్ముడు మనకు హితుడని నమ్మరాదు. ఈభీష్ముడిటువంటి కార్యభంగపు మాటలను చెప్పుచున్నాడు. దుర్యోధన మహారాజుయందు నాకు గల స్నేహమును తగ్గించుటకు యీ రీతిగా హెచ్చుతగ్గు మాటలను భీష్ముడు చెప్పుచున్నాడు. పెద్దమనుష్యులగు రాజులు రథికుల బలాబలములను నిశ్చయింప వలయును. ఈ భీష్మునివంటివారు తండ్రికిని కొడుకులకును విరోధమును కలిగింతురు; ఇటువంటి ముసలిరాజులను మనము రోయుమనవచ్చును. అని కర్ణుడు సభ్యులతో చెప్పి దుర్యోధనుని జూచి యిట్లనెను. దుర్యోధన మహారాజా! భీష్ముడు న్యాయము తప్పి నామనస్సు నొచ్చునట్లుగా మాటలాడెను. ఇతని మాటలను నేను ఓర్వజాలను యీ దుర్మార్గుడైన భీష్ముని భుజాబలము యెంతమాత్రమగును? ఈభీష్ముని ఒక్కని విడుచుటవలన మనకు లోపములేదు. ఇతని మాటలవలన రాజులందరును బాధపడుచున్నారు. ఇతనిని విడుచుటవలన యీ రాజుల మనస్సులు చక్కబడును. ఈభీష్ము డర్జునునకు పక్షపాతి. ఈ భీష్ముడు వంచనలేక పాండవులతో యుద్ధమును చేయడుసుమా! మిక్కిలి ముసలివాండ్రుకూడా చాతుర్యవంతులగువారి మాటలను వినవలెను. గాని పెద్దవాడైనను యీ భీష్ముని మాట వినరాదు. భీష్ముడు మిక్కిలి ముసలివాడు. ముసలివాండ్రకు బుద్ధి తప్పియుండును. ముసలివాండ్రు పిచ్చివాండ్రువలె నోటికి వచ్చినట్లు మాటలను చెప్పుచుందురు. ఆ ముసలివాండ్ర మాటలను నిశ్చయముగా గ్రహింపరాదు. భీష్ముడు

సేనానాయకుడై ముందునిలిచి యున్నయెడల మన పక్షపు రాజులు యుద్ధమందు శత్రువులను చంపజాలరు. భీష్ముడు మదహంకారి యని తలచియే నేను యితనితో యుద్ధమునకు నడచుటకు సమ్మతింపలేదు. అని కర్ణుడు దుర్యోధనునితో చెప్పెను. ఆమాటలను భీష్ముడు విని కర్ణునకు యిట్లనెను.

కర్ణా! నేను ముసలివాడనైనను నా బలమాత్సర్య నానాస్త్ర శస్త్ర సమృద్ధిని నీ గురువైన పరశురాముని దగ్గరకు బోయి వినుము. ఇదివరకు యుద్ధభూమిలో నన్నెదురుకొనిన వారేమైపోయిరో లోకమంతయు యెరిగియున్నది. నాముసలితనమును నీ కుమారత్వమును యిదివరకు మూడుమార్లు అర్జును డెరిగియున్నాడు. కర్ణా! యింత సభలో అనుమానింపక నన్ను నేను చెప్పుకొనవలసి వచ్చెను. దుర్జనుడవగు నీయందు నాకుగల కోపముచేత యీప్రకారము కీడుమాట చెప్పవలసి వచ్చెను. దుర్యోధనుని కార్యఖడ్గములకు నీవు ప్రధానివై యున్నందున యీ కౌరవులకు చేటుగలిగెను. యీ కీడును మాన్పుటకు మావంటివారికి సాధ్యముకాలేదు. నీవు మంచిబంటువే యగుదువు. ఇక చక్కపడుము. కర్ణా! నామీద కోపించుకొని అలిగి యీ నెపముచేత నీవు యుద్ధము చేయక తొలగిపోయితివి. ఇట్లు నీవు తొలగినను అర్జునునిచేత నీకు చావుతప్పదు. అర్జునుడు కోపించి క్రమముగా యీ కౌరవ సైన్యముల నన్నిటిని చంపును. పిమ్మట నీవు యుద్ధము నెట్లుచేసెదవో ఆ పద్ధతిని చావగామిగిలిన సైనికులును యీ దుర్యోధనుడును చూడగలరు. అని భీష్ముడు కర్ణునితో చెప్పి దుర్యోధనుని జూచి మరల కర్ణునితో యిట్లనెను. ఓరి కర్ణా! దుర్యోధనుడు నాతలమీద పెద్దమోపును యెత్తినట్లు సర్వసేనాధిపత్యమును నామీద పెట్టి నమ్మియున్నాడు. ఇట్టి స్థలమందితనికి యేదుప్పను గలిగింపరాదని నేను సహించినందున యిప్పుడు నీవు బ్రతికితివి. ఇకను

వ్రూరకుండుము. అని భీష్ముడు కర్ణునితో జెప్పి ముఖము చిట్లించుకొని కోపమును గలిగియుండెను. అప్పుడు దుర్యోధనుడు భీష్మునివైపు మళ్ళి భీష్మునితో యిట్లనెను.

తాతా! భీష్మా! నీవు ఇప్పుడు కోపించుకొనరాదు. నన్నును కార్యభారమును చూచి నాబ్రతుకునకై నీవు సర్వమును సంహింపవలయును. అని దుర్యోధనుడు భీష్మునితో చెప్పి అతని కోపమును పోగొట్టి కర్ణునిజూచి యిట్లనెను. కర్ణా! యీ భీష్ముడును నీవును ఒక్కటిగానుండి కష్టపడియైనను యీ కార్యమును చక్కచేసికొనక మీలో మీరు యిట్టి భేదపుమాటలను చెప్పరాదు. మీరిద్దరును కలిసి అనుకూలముగా నుండవలయును. అని దుర్యోధనుడు వారిద్దరికి కలిపి చెప్పి పిమ్మట భీష్మునితో మరలయిట్లనెను. తాతా! భీష్మా! పాండవులపక్షమందు రథికుల బల తారతమ్యములను చెప్పుము. నేను వినవలయును. అని దుర్యోధను డడుగగా భీష్ముడిట్లనెను. దుర్యోధనా! పాండవుల పక్షమందుగల రథికుల బల తారతమ్యమును నేను నిజముగా చెప్పినయెడల కర్ణుని మనస్సు నొచ్చును. నీమనస్సెట్లగునో తెలియదు. నేను వ్యర్థముగా నడుమ నుండి వారివారి బలాబల తారతమ్యములను చెప్పవలసిన పనిఏమి? అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పెను. అప్పుడు దుర్యోధనుడు మరల తరిమి యడిగెను. భీష్ముడు దుర్యోధనునితో యిట్లనెను.

## భీష్ముడు పాండవవీరులయందు అతిరథ మహారథాదుల నిరూపించి చెప్పుట.

దుర్యోధనా! ఇదివరకు నీ పక్షమందుండు రథికుల యొక్క బలాబల తారతమ్యములను చెప్పితినిగదా! ఇకను పాండవుల పక్షమందుండు రథికులబలతారతమ్యములను చెప్పెదను వినుము. దుర్యో

ధనా! ధర్మరాజు యుద్ధమందు అతిరథుడగును. అతడు యుద్ధమందగ్నిహోత్రము వంటివాడు. భీముడు అతిరథశ్రేష్ఠుడు. ఎదురులేనివాడు. ఆ భీముడు మహాబలవంతుడు. అమానుషమైన అమితమగు పరాక్రమము గలవాడు. నకుల సహదేవులు సమరథులు. మహాభుజాబల గర్వ పరాక్రమవంతులు. వారిమనస్సు లతి నిర్భయములు, ఆ నకుల సహదేవులు తమసైన్యములకు మించి క్రూరముగా మన సైన్యములను యెదిరింతురు. ఆ పాండవులైదుగురును ధర్మవైభవముచేతను తపస్సంపదచేతను సకల జనులకంటె అధికులగుదురు. ధనుర్విద్య యందును యుద్ధమందును మిక్కిలి సమర్థులు. పాండవులు శత్రువులతాకిడికి ఓర్వగలరు. పరులకు ఓర్వరాని విధముగా యెదిరించి యుద్ధముచేయుదురు, ఆ పాండవులైదుగురును ఒక్కొక్కడు డనేక పర్యాయములు సకలరాజులను గెలిచి తమ పరాక్రమములను చూపిరి. అట్టి పాండవులైదుగురును ఒక్కటే యుద్ధమునకు వచ్చినప్పుడు మన సైన్యము భయపడకమానదు. ఇదివరకు పాండవులు నీవలన అవమాన దుఃఖపాటులను పొంది యిప్పుడు యుద్ధమునకు వచ్చినందున సులభముగా పోజాలరు. వారు ప్రాణములను ఆశింపక తమ శక్తికొలది యుద్ధముచేయుదురు. ఆ పాండవుల పరాక్రమమును సహించి నిలుచుట మనకు కష్టము.

దుర్యోధనా! పాండవులలో అర్జునుడు యింతమాత్రపు రథికుడని చెప్పుటకు నాకు శక్యముకాదు. అర్జునునివంటి రథికుడు మూడు లోకములందును గూడ నాకు కనుపింపలేదు. అర్జునునివంటి రథికుడు యికపుట్టడు. అటువంటి అర్జునునకు భగవంతుడైన కృష్ణదేవుడు సహాయుడై యుండును. ఆ యర్జునుని బలపరాక్రమములను నేను యేమని చెప్పను? అర్జునుడు గాండీవమును ధరించి తమ సైన్యముల నన్నిటిని రక్షించును. ఆ అర్జును డొక్కడే నీ సైన్యములనన్నిటిని

చంపును. అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పగా ఆమాటలను విని ఆ సభయందుండు రాజుల మనస్సులు ధైర్యములులేక చెడెను. అప్పుడు భీష్ముడు మరల దుర్యోధనునితో యిట్లనెను. దుర్యోధనా! ద్రౌపదీ పుత్రులైదుగురును మహారథులు, ఉత్తరుడు మహారథుడు, అభిమన్యు డతిరథ శ్రేష్ఠుడు, అభిమన్యుడు కృష్ణార్జునులతో నైనను యుద్ధమందు సమానుడని చెప్పవచ్చును. కరలాఘవ చిత్రములను నేర్చినవాడు. బలపరాక్రమ శౌర్యసాహసవంతుడు. ఓర్పుగల వాడు. అభిమన్యుడు దన తండ్రులగు పాండవులకు గలిగిన అవమాన దుఃఖములను తలచుచుండును గనుక మనసైన్యములమీదికి కఠోరముగా వచ్చి పిడుగువలె దూకును. సాత్యకి అతిరథ శ్రేష్ఠుడు, మహాశౌర్యవంతుడు. పాండవులయందు స్నేహము గలిగియుండును, గనుక ఆ సాత్యకి మనమీద మిక్కిలి కోపము గలవాడై యుద్ధము చేయును. ఈ చెప్పిన వారందరును క్రూరులై మన యోధవీరుల నందరిని యుద్ధభూమియందు కూల్చింతురు. ద్రుపద విరాటరాజు లిద్దరును మహారథులు, సామాన్యముగా వెనుక దీయరు మహా భుజాబల శౌర్యవంతులు, ఆ ద్రుపద విరాటులిద్దరును పాండవులతో స్నేహ బంధుత్వములు గలిగియున్నందున పాండవుల సైన్యముల నిమిత్తమై నొచ్చియైనను చచ్చియైనను పాండవులను గెలిపించవలె నని తలచియున్నారు. ద్రుపద విరాటులిద్దరును యుద్ధమందు ఒక్క రూపమైన మనస్సును గలిగియుందురు.

శిఖండిమహాబలధైర్యవీరగుణములుగలవాడు. ఆశిఖండి మహారథుడు. ఆశిఖండికి తమ్ముడగు ధృష్టద్యుమ్నుడు అతిరథుడు. మహాబలగర్వవంతుడు. యుద్ధమందు భయంకరమైన తేజస్సు గలవాడై భయమును కలిగింపుచుండును. ఆ ధృష్టద్యుమ్నుని కుమారుడగు ధృష్టకేతుడు బాల్యమందు ఆటపాటలయందు తిరిగి శస్త్రాస్త్రములను

అభ్యసింపక సోమరియై యుండెను. గనుక ఆధృతవర్మ అర్ధరథుడు. శిశుపాలుని కుమారుడగు ధృష్టకేతుడు మహారథుడు. అధికధైర్యవంతుడు భోజుడను రాజుయొక్క తమ్ములందరును మహారథులే యగుదురు. మంచి బలసాహసవంతులు ఉత్తమౌజుడును యుధామన్యుడును, క్షత్రదేవుడును, జయంతుడును, అమితౌజుండును, విరాజుండును, సత్యజిత్తుడును అను పాంచాలకులస్థులందరును మహారథులు. వారందరు మదపుటేనుగులవలె గుంపుగా శత్రుసైన్యము మీదపడి కోలాహలముగా శత్రుసైన్యములను చెదరగొట్టగలరు. కేకయరాజులగు అయిదుగురును మహారథులు. ఆ అయిదుగురును అన్నతమ్ములగుదురు. మంచి మొనగాండ్రు; సాహసగుణవంతులు. రథసమూహముల మొత్తముతో కార్చిచ్చువలె మన సైన్యములను ఆక్రమింతురు.

కాశీరాజును, నీలుడును, సూర్యదత్తుడును, మదిరాస్యుడును శంఖుడును విరాటుని జ్ఞాతులును వీరందరును మహారథు లగుదురు. నానాయుద్ధ విద్యలయందు సమర్థులు వారి యుద్ధము ఘోరమై యుండును. చిత్రాయుధుడును, చేకితానుడును, వీరిద్దరును మహారథులు. అర్జునునకు స్నేహితులై యుందురు. యుద్ధమునకు సహింతురు. అతి భయంకరముగా యుద్ధము చేయుదురు. చంద్ర దత్తుడును, వ్యాఘ్రదత్తుడును వారిద్దరు మహారథులు. సేనాబిందుడనురాజు అతిరథశ్రేష్ఠుడు సమర విద్యావిశారదుడు; శూరుడు ఆ సేనాబిందుడు భీమునితో సమాన బలపరాక్రమవంతుడు. ఆసేనాబిందు డొక్కడే మనసైన్యములను చిక్కుపరచగలడు. పాండ్యరాజు అతిరథుడు. బలవంతుడు; కాంస్యుడుసమరథుడు. అమితబలవంతుడు; కుంతిభోజుడు అతిరథుడు; యుద్ధపండితుడు. కుంతిభోజుని భటులందరును అధికబలవంతులు. రోచమానుడు మహాబలవంతుడు, మహారథుడు.

దేవసమానుడు రాక్షసశ్రేష్ఠుడగు ఘటోత్కచుడు అతిరథశిఖామణి. ఆఘటోత్కచుడు మాయాబలముచేత మన సైన్యములను చిక్కు పెట్టి ఆక్రమించును. ఆఘటోత్కచునివద్ద రాక్షససైన్యము మెండుగా నున్నది. ఈ చెప్పినవారందరును పాండవపక్షపు రథికులు అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పెను. దుర్యోధనా! నాకు తోచిన వారిని చెప్పితిని కాని రెండుపక్షములయందును మంచిరథికులు అనేకులు కలరు. ఓదుర్యోధనా! పాండవపక్షపు రథికులు అఖండ బల పరాక్రమవంతులు అయినను వారు నాయెదుటబడినయెడల తమ భుజాబలమును చూపలేరు. నేను శిఖండిని ఒక్కనిమాత్రము చంపను గాని తక్కినవారిని చీల్చి చెండాడెదను. అని భీష్ముడు చెప్పగా దుర్యోధను డిట్లనెను. మహాత్మా! భీష్మా! ఆశిఖండిని మీరు చంపకుండుటకు కారణమేమో తెలియదు. మేమందరము వినతగిన యెడల ఆ కారణమును చెప్పుము. అని దుర్యోధను డడుగగా భీష్ము డిట్లనెను.

## భీష్ముడు దుర్యోధనునకు అంబోపాఖ్యానమును చెప్పుట

దుర్యోధనా! నేను ఆ శిఖండిని చంపకుండుటకు కారణము చాలగలదు. ఆ కారణము నంతయు వివరించి చెప్పెదను వినుము. దుర్యోధనా! మాతండ్రియగు శంతనమహారాజు స్వర్గస్థుడైన పిమ్మట సత్యవతీదేవియొక్క అనుమతిని పొంది నాతమ్ముడైన చిత్రాంగదునకు సామ్రాజ్య పట్టముగట్టితిని. అంతట స్వల్పకాలములోనే ఆ చిత్రాంగదుడు చచ్చెను. పిమ్మట చిత్రాంగదుని తమ్ముడగు విచిత్రవీర్యునకు పట్టాభిషేకము చేసి రాజునుగా జేసితిని. ఆ విచిత్రవీర్యునకు పెండ్లి చేయదలచితిని. ఆ సమయమున కాశీరాజు కూతురులు అంబ, అంబిక, అంబాలిక అను ముగ్గురు కలరు. ఆ ముగ్గురికిని కాశీ

రాజు వివాహము చేయదలచి స్వయంవరము చాటించి ఆ స్వయం వరమునకు సకలదేశపురాజులను పిలిపించెను. ఆ విషయమును నేను యెరింగి మా తల్లియగు సత్యవతీదేవికి తెలిపి నేను రథమెక్కి ఒంటరిగా ఆ కాశీరాజు పట్టణమునకుపోతిని. అచ్చట అంబ, అంబిక, అంబాలిక అను ముగ్గురు కన్యలను పట్టుకొని నా రథముమీద పెట్టు కొని వచ్చుచుంటిని. అప్పుడు ఆస్వయంవరమునకు వచ్చిన రాజు లందరును తమ తమ చతురంగ బలములతో వచ్చి నారథమును చుట్టుకొనిరి. అప్పుడు నేను నా బాణాగ్నియొక్క నేర్పిమిని వారికి చూపి ఆ రాజులందరిని నిలిపివచ్చితిని. ఆ కన్యకల ముగ్గురిని అట్లు తీసికొనివచ్చి సత్యవతీదేవికి సమర్పించితిని. సత్యవతీదేవి ఆ ముగ్గురు కన్యకలను విచిత్రవీర్యునకిచ్చి వివాహము చేయుటకు నిశ్చయిం చెను. ఆ సమయమున ఆ ముగ్గురిలో పెద్దదైన అంబ యను కన్యక నాతో యిట్లనెను.

మహాత్మా! భీష్మా! సౌంభపట్టణపు రాజైన సాల్వునిమీద నాకు కోరిక గలిగియున్నది. ఆ సాల్వుడును నా మీద కామము గలిగి యుండును. నీవు ధర్మమూర్తివి. గనుక నన్ను ఆ సాల్వుని దగ్గరకు బంపుము. అని అంబ యను కన్యక నాతో చెప్పెను. ఆ మాటలను నేను విని సత్యవతికి చెప్పితిని. అందుకు సత్యవతిని సమ్మ తింపజేసి వృద్ధస్త్రీలను సహవాసముచేసి అంబను సాల్వుని పట్టణము నకు పంపించితిని. ఇట్లు అంబ యను కన్యకను పంపించి తక్కిన అంబికాంబాలిక లిద్దరిని విచిత్రవీర్యున కిచ్చి వివాహము చేసితిని. అంతట అంబయను కన్యక సాల్వునిదగ్గరకు పోయినన్ను వివాహము చేసికొమ్మని ఆ సాల్వునితో చెప్పెను. అప్పుడు సాల్వరాజు అంబతో యిట్లనెను. అంబా! నిన్ను భీష్ముడు తీసికొని పోయెను. అందుచేత నీకు కన్యాత్వము చెడెను, ఇక నిన్ను కన్యకగా గ్రహించుట

ధర్మము కాదు. ఇకను నిన్ను నేను భార్యనుగా వరించుట తగదు, అని సాళ్వుడు అంబయను కన్యకతో చెప్పెను. అప్పుడు అంబ మన్మథ బాణములచేత పీడింపబడుచు సాళ్వునితో యిట్లనెను. సాల్వరాజా! భీష్ముడు తన తమ్ములగు విచిత్రవీర్యుని కొరకు భయంకరముగా కన్యకలను తీసికొని పోవుచుండెను. గనుక భీష్ముడు బలవంతముగా నన్నును నా చెల్లెండ్రగు అంబికాంబికలను తీసికొని పోయెను. అంతట నేను సాళ్వరాజును వివాహము చేసికొందునని భీష్మునితో చెప్పితిని. అట్లు చెప్పగా భీష్ముడు తగిన ప్రకారము యిక్కడికి నన్ను పంపించెను. కనుక నన్ను నీవు దూషింపవలదు. మా తండ్రియగు కాశీరాజు తెలియక నాకు స్వయంవరాలంకారములను చేసెను. ఆ కారణమువలన యింతకేడు కలిగెను. నా చెల్లెండ్రగు అంబికాంబాలికల నిద్దరిని ఆ భీష్ముడు తన తమ్మునికిచ్చి వివాహము చేయదలచెను. నన్ను నీ దగ్గరకు తగు మర్యాదప్రకారము పంపించెను. ఇందువలన యేమియు తప్పులేదు. అని అంబ అనేక విధములుగా సాళ్వునితో చెప్పి తనను వివాహము చేసుకొనుమ్మని యేడ్చుచు ప్రార్థించెను. దాని ప్రార్థనను సాళ్వుడు వినిఅంబను గ్రహింపక ఆమెతో యిట్లనెను.

అంబా! నీవు పొమ్ము. ఇక నిక్కడ నిలువకుము. అని సాళ్వుడు అంబతో చెప్పి తనగృహములోనుండి బయటకి నెట్టి వెళ్ళగొట్టెను. అంతట అంబ యేడ్చుచు వెళ్ళి వెళ్ళి తన మనస్సులో యిట్లని తలంచెను. దైవమా! అయ్యో! ఆ సాళ్వుడు నన్ను ఒల్లనప్పుడే నేను సంసార సుఖములేని దాననైతిని. ఇకను నేను భీష్ముని దగ్గరకు వెళ్లుటవలన ప్రయోజనములేదు. నాకుకలిగిన యీ చేటుకంతకును ఆభీష్ముడే మూలము. గనుక నే నాభీష్ముని సాధింపవలయును. ఎవ్వరును యుద్ధమందు భీష్ముని గెలువజాలరు. గనుక నేను తపో

బలముచేత భీష్ముని గెలిచెదను. అని అంబ తన మనస్సులో యోచించి కొందరు మునులుండు పుణ్యభూమికి వెళ్ళెను. అట్లు వెళ్ళిన అంబ తన వృత్తాంతమంతయు మునులకు చెప్పెను. మునులు అంబతో యిట్లనిరి. చిన్నదానా! బలవంతులగు రాజులగు వారు ఆభీష్ముని చంపవలయును. నీవంటి సాధువులచేత ఆభీష్ముడు చచ్చునా? అని చెప్పగా వారితో అంబ యిట్లనెను. మునులారా! నేను తపస్సు చేత ఆ భీష్ముని చంపనెంచితిని. అందునిమిత్తమై తపస్సు చేయుటకు యిక్కడకు వచ్చితిని. అని యిట్లు అంబ చెప్పగా మునిలిట్లనిరి. అంబా! నీవు సుకుమారివి గనుక నీవు తపస్సు చేయజాలవు. నీతండ్రి దగ్గరకు నీవు వెళ్ళుటయే పరమధర్మము. అని మునులు చెప్పగా ఆ మునులతో అంబ మరల యిట్లనెను. నాతండ్రి మొదలగు బంధుజను లెవ్వరును యెరుగకుండునట్లు యీవనమందు నేను తపస్సుచేసెదను. ఇది నిశ్చయమైన యభిప్రాయము. ఇక నెవ్వరిదగ్గరకు యేప్రకార ముగా యేమనిపోదును? ఇకను నాకు నాబంధుజనులతో ప్రయోజ నము లేదు. అని యిట్లు అంబ మునులతో చెప్పుచుండెను. ఆసమయ మందు ఆ ఆశ్రమమునకు హోత్రవాహనుడను ఒక రాజర్షి వచ్చెను. అప్పుడు మునులందరును ఆహోత్రవాహనునకు అభ్యాగత పూజలు చేసిరి. అంతట హోత్రవాహను డంబను చూచి మునులతో యిట్ల నెను. మునులారా! యీకన్యక యెవ్వరికన్యకయో చెప్పుడు. ఈ కన్యక దుఃఖించుటకు కారణమేమో చెప్పుడు. అని యిట్లు హోత్ర వాహను డడుగగా నామునులు అంబయొక్క జన్మవృత్తాంతమును, దుఃఖకారణము నంతయు సవిస్తరముగా ఆ హోత్రవాహనునకు తెలిపిరి. అంబ ఆ హోత్రవాహనునకు దౌహిత్రియగును. (కూతురు నకు కూతురు దౌహిత్రి.) అప్పు డాహోత్రవాహనుడు ఆయంబ తనకు దౌహిత్రియని అక్కడిమునులతో చెప్పి అంబను తనతొడ

మీాద నుంచుకొని మరల అడుగగా నంబ హోత్రవాహనునితో సవిస్తరముగా నంతయు వివరించెను. అప్పు డాయంబయొక్క వృత్తాంతమంతయు హోత్రవాహనుడు విని మిగుల విచారించి విశేషముగా చింతించెను. పిమ్మట హోత్రవాహనుడు అంబతో యిట్లనెను.

ఓ మనుమరాలగు అంబా! నీవు పరిశుద్ధురాలవు. నీవు తపస్సుచేయవలసిన పనిలేదు. నిన్ను నేను దగ్గంతీసి రక్షించెదను. ఒక వుపాయమును చెప్పెదను వినుము. పరశురామదేవుడు ఆశ్రితులయందు కృపగలవాడు. నీవా పరశురామదేవుని ఆశ్రయింపుము. నీవతనిని ఆశ్రయించినయెడల నీకు ఆపదలను కలుగనివ్వడు. నీవు దుఃఖింపకుము. అని హోత్రవాహనుడు చెప్పగా అంబయిట్లనెను. తాతా! హోత్రవాహనుడా! పరశురామదేవుని దర్శనము ఎక్కడ కలుగునో చెప్పుము. అని అంబ అడుగగా దానికి హోత్రవాహనుడిట్లనెను. మనుమరాలా! అంబా! ఆ పరశురామదేవుడు మహేంద్రమను పర్వతమందు పరమతపస్సు చేయుచుండును. ఆపరశురాముడు నాయందు కృపగలిగియుండును. గనుక నీవు నాకు దౌహిత్రివని ఆపరశురాముడు వినిన యెడల ఆవశ్యముగా నిన్ను రక్షించును. నీ వా మహేంద్ర పర్వతమందుండు పరశురామదేవుని దగ్గరకు వెళ్లుము. అని హోత్రవాహనుడు అంబతో చెప్పుచుండెను. ఆసమయమందే పరశురాముని శిష్యుడగు అకృతప్రవణుడను ముని యొకడు అక్కడకు వచ్చెను. అప్పుడు హోత్రవాహనుడా అకృతప్రవణుని పూజించి అతిథి సత్కారములచే పిమ్మట ప్రీతిపూర్వకముగా యిట్లనెను.

ఓ అకృత ప్రవణమునీంద్రా! మీాగురువగు పరశురామదేవుడు ఇప్పుడు యెక్కడుండునో చెప్పుము. అని యడుగగా అకృత

శ్రవణుడిట్లనెను. హోత్రవాహనా! ఆ పరశురామదేవుడు నీవు తనకు ప్రియస్నేహితుడవని సంతోషముగా మునులతో చెప్పు చుండును. ఆ పరశురామదేవుడు నినుజూచునిమిత్తము అనేక శిష్య సంఘములతో రేపు యిక్కడకువచ్చును. అని అకృతవ్రణుడు చెప్పగా హోత్రవాహనుడును, అంబయు అక్కడుండు మునులును అందరును సంతోషించిరి. అంతట పరశురామదేవుడు మరునాడు అక్కడకు వచ్చెను. అక్కడుండు మునులందరును పరమభక్తిపూర్వకముగా పరశురామదేవునిపూజించిరి. అప్పుడు హోత్రవాహనుడా పరశురామదేవుని జూచి గౌరవ సంభాషణములను పొంది ఆ అంబను పరశురామునకు జూపి యిట్లనెను. మహాత్మా! పరశురామదేవా! యీ కన్యక పేరు అంబ. ఇది కాశీరాజుయొక్క కూతురు. ఈ అంబనాకు దౌహిత్రి. దీని వృత్తాంతమునంతయు వినుమని హోత్ర వాహనుడు అంబనుపరశురామునకుచూపెను. అప్పుడు అంబ కన్నీరు గార్చుచు పరశురాముని పాదములమీదపడి నమస్కరించెను. పరశు రామదేవుడు అంబతో యిట్లనెను. అంబా! నేను నీకు యీ హోత్ర వాహనునివంటి వాడనే యగుదును. నీ మనస్సునందుగల దుఃఖము నంతయు నేను పోగొట్టెదను. నా దగ్గర నీవు చేరితివి. ఇక నీవు దుఃఖ మును పోగొట్టుకొని నీ దుఃఖమునకు మూలకారము నంతయు నాకు తెలియచెప్పుము. అని పరశురామదేవుడు అడుగగా అప్పుడు అంబ తన వృత్తాంతమునంతయు సవిస్తరముగా పరశురామునితో చెప్పి యిట్లనెను.

మహాత్మా! పరశురామదేవా! నీవు పరమ కృపా సముద్రు డవు. నిన్ను ఆశ్రయించిన వారి దుఃఖములను పోగొట్టి రక్షింతువు. నాకు గలిగిన అవమానమును పోగొట్టి నన్ను రక్షింపుము. అని అంబ పరశురామునితో చెప్పి ప్రార్థింపగా పరశురాము డిట్లనెను.

అంబా! నీకు గలిగిన అవమానము రెండు విధములుగా దోచు చున్నది. నేను సాళ్వునకు బుద్ధిచెప్పి నీకు ఆ సాళ్వుని అనుకూలింప జేయవలెనో చెప్పుము. లేక నేను భీష్మునకు బుద్ధిచెప్పి నిన్నుగ్రహించెడి విషయమై భీష్ముని సమ్మతింప జేయవలెనేమో చెప్పుము. ఈ రెండువిధములలో నీకు మిక్కిలి యిష్టమేదియో చెప్పినయెడల అట్లు చేసెదను. అని పరశురాముడు అనగా అంబయిట్లనెను. మహాత్మా! పరశురామదేవా! ఇకను నన్ను సాళ్వరాజు గ్రహింపడు. అతనికి నీవు బుద్ధిచెప్పవద్దు. ఆ భీష్మునియందు నాకు అధికకోపము గలిగి యున్నది. ఆ భీష్ముని చంపవలెనని నేను తపస్సు చేయుటకు యీ వనమునకు వచ్చితిని. ఇక్కడ నిన్ను జూచి నా అవమానమును పోగొట్టుకొనుట నిమిత్తము శరణాగత నైతిని. అని అంబ పరశు రామునితో చెప్పగా పరశురామదేవు డిట్లనెను.

## పరశురాముడు అంబను దోడ్కొని భీష్మునియొద్దకు వచ్చుట

అంబా! భీష్ముడు నా శిష్యుడు. నేనుచెప్పినట్లు భీష్ముడు చేయ గలడు. నేను చెప్పినట్లు భీష్ముడు చేయనియెడల నా క్రూరబాణముల చేత భీష్మునిపడగొట్టెదను. ఇకను నీవు దుఃఖింపవద్దు. నీ దేహము శుష్కించినట్లుగా నీవు తపస్సుచేయవలసిన పనిలేదు. అని పరశురాముడా అంబతో చెప్పి అంబను వెంటపెట్టుకొని అనేకమునులతో అతి భయంకరముగ కురుక్షేత్రమునకు వచ్చెను. అట్లు వచ్చిన పరశురాముడా కురుక్షేత్రమందు సరస్వతీ నదీతీరమున దిగెను. పరశురామ దేవుడు తన రాకను నా కెరింగించెను. అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పెను. దుర్యోధనా! అట్లు నాకు తనరాకను పరశురామదేవుడు తెలిపెను. అంతట నేను ఋత్విక్పురోహితులు మొదలగు పెద్దలైన బ్రాహ్మణోత్తములను వెంటపెట్టుకొని పూజావస్తువులను తీసికొని

సరస్వతీనదీతీరమునకు వెళ్లి పరశురామునిజూచి నమస్కరించితిని. ఆమహాత్ముడగు పరశురామదేవుడును నావినయభక్తిసంభ్రమములకు సంతోషించి ప్రీతిపూర్వకముగా నేనుచేసిన పూజలను గ్రహించెను. అంతట పరశురాముడు అంబను నాకుచూపి నాతోయిట్లనెను. భీష్మా! నీవు మొదట బలవంతముగా యీఅంబను యొందుకు తెచ్చితివి? అట్లు తెచ్చి మరలదీనిని యెందుకు పంపించితివి? ఇట్లుపంపించుటతగదు. ఇట్లు యీఅంబను నీవుపంపుటచేత నీకునీచవృత్తివచ్చెను. ఇకనైనను యీఅంబను నీతమ్ముడైన విచిత్రవీర్యునకిచ్చి వివాహముచేయుము. ఈఅంబను విడుచుట నీకునుచితముగాదు. అని యిట్లు పరశురాముడు నాతోచెప్పెను. అంతట నేనుపరశురామునితో యిట్లంటిని. మహాత్మా పరశురామదేవా! దీనిని నేను తెచ్చి నాతమ్మునకుయిచ్చి వివాహము చేయదలచితిని. అంతట యీ అంబ నాతో యిట్లనెను. భీష్మా! నేను సాళ్వరాజును వివాహముచేసికొనవలెనని యిదివరకే నేను తలచియున్నాను. సాళ్వరాజునందు నాకు కామముగలిగియున్నది. సాళ్వరాజును నామీద కామము గలిగియున్నాడు. కనుక సాళ్వరాజుదగ్గరకు నన్ను పంపుము. అని యిట్లు అంబ నాతో చెప్పినందున నేను దీనిని సాళ్వరాజుదగ్గరకు పంపించితినేగాని మరియొకటికాదు. ఇకను దీనిని నాతమ్మునకిచ్చి వివాహముచేయరాదు. అని యిట్లు నేను పరశురామునితో చెప్పితిని. దుర్యోధనా! పరశురాముడు నాతో యిట్లనెను భీష్మా! నేనుచెప్పినట్లు నీవు చేయనియెడల నిన్నును నీస్నేహితులను నీబంధుజనులను అందరినిచంపుదును గనుక నేను చెప్పినట్లు యీ అంబను నీతమ్మునికిచ్చి వివాహము చేయుము. అని పరశురాముడు నాతో చెప్పెను.

దుర్యోధనా! అప్పుడు నేను వినయమును వదలక నమస్కరించుచు నానావిధ వాక్యములచేత ఆపరశురామునకు విన్నపముచేసికొం

టివి. అంతకంతకుపరశురామ దేవునకు నాయందుఅధికకోపముగలిగెను. అంతట నేను పరశురామునితో మరలయిట్లంటిని. మహాత్మా! పరశురామ దేవా! నీవు నాకుగురుడవై సమగ్రమైన ధనుర్విద్యామాహాత్మ్యమును నాకుయిచ్చితివి. అటువంటి నీవునిష్కారణముగా నాయందు యీర్ష్యగలిగి కోపించుకొనుటకు ధర్మముకాదు. అని యిట్లు నేను చెప్పగా పరశురాము డాగ్రహముచేత నాతోయిట్లనెను. భీష్మా! నీవు నన్ను గురుడనియెరుగుదువు. నీవుపుణ్యపురుషుడవు. నామాటను నీవు ఆదరింపలేదు. మరియు నీవుభక్తితో ఇన్నివిధములుగా నాతోమాట లాడుచున్నావు. ఇకను యీవిసయములను మానుము. అంబను శీఘ్రముగా నీతమ్మునకిచ్చి పెండ్లిచేసితివేని నాకోపాగ్ని మానును. నేను చెప్పినట్లుచేయక మరివేయికార్యములను చేసినను నాకోపా[గ్ని] నశింపదు. అని పరశురాముడు నాతో చెప్పెను. అంతట నేనుయిట్లంటిని. మహాత్మా! పరశురామదేవా! యీఅంబను నాతమ్మునకిచ్చి వివాహము చేయుట అధర్మము. ఈఅధర్మకార్యమును చేయుటకై మీరు యింతపూనికతో నాతోపెనగరాదు. పరపురుషునియందు కోరికగల స్త్రీని యిల్లాలును చేయుమని యెవ్వరును చెప్పరు. ఇట్టి అధర్మకార్యమును చేయుటకంటె నీచేత నేను యెట్లయినను మంచిదే యగును. పూర్వము పెద్దలుచెప్పినపద్ధతిని చెప్పెదను చిత్తగింపుము. గురువైనను కార్యాకార్యములను తెలియక గర్వముచేత లోకవిరుద్ధమార్గమందు ప్రవర్తించినయెడల అట్టివాడు గురుడైనను వానిని దండింపవలెనని పెద్దలు చెప్పుదురు. అని నేను పరశురామునితో చెప్పితిని. ఈమాటలకు ఆపరశురామదేవుడు ప్రళయకాలాగ్నిహోత్రమువలె కోపముచేతమండిపడి భయంకరముగా నాతో ఇట్లనెను.

ఓరీ! భీష్మా! నీవు శీఘ్రముగా యుద్ధసన్నద్ధుడవై సైన్యములను తీసికొని నాతో యిద్ధము చేయుటకు యిక్కడికి రమ్ము.

శీఘ్రముగా పొమ్ము. అని పరశురాముడు నాతో చెప్పగా నేను ఇట్లంటిని. మహాత్మా! పరశురామదేవా! చులుకతనముచేత బ్రాహ్మణునియందు కోపించుకొనరాదనియు నీవు నాకు గురుడవై యుంటి వనియు నేను తలచి కోపించుకొనక యింతదూరము చెప్పి నిన్ను ప్రార్థించితిని. నీవు యుద్ధమే చేయదలచినయెడల ఇక్కడ చక్కగా నిలిచియుండుము. పూర్వము నీవు కోపించుకొని వెదకివెదకి యిరువది యొక్కమార్లు భూమియందు తిరిగి రాజుల నందరిని చంపితివట. అప్పుడు బలవంతుడగు భీష్ముడు పుట్టనందున నీ పూనిక కొనసాగెను. నేనే అప్పు డున్నయెడల నీవు రాజులను చంపజాలవు. నీవు నా పరాక్రమ శౌర్యములను యెరుగవాయేమి! నేను ఒక్కడనే నీతో యుద్ధము చేయుటకు ఇప్పుడిక్కడికి వచ్చెదను. నేను బలములను తీసికొనిరాను. నీవు నాకు నేర్పి యిచ్చిన నానావిధ శస్త్రాస్త్రవిలాసమే నాకు సైన్యమగును. అని నేను పరశురామునితో చెప్పి అతనికి నమస్కరించి హస్తినాపురమునకు వచ్చితిని. అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పెను.

దుర్యోధనా! అట్లు నేను హస్తినాపురమునకు వచ్చి యీ వృత్తాంతము నంతయు సత్యవతీదేవికి విన్నవించి ఆ సత్యవతియొక్క అనుమతిని బొంది సర్వ సన్నాహముతో గూడియున్న రథమెక్కితిని. అప్పుడు బ్రాహ్మణుల యాశీర్వాదధ్వనులు మ్రోగుచుండగా బయలువెడలి కురుక్షేత్రమునకు వచ్చుచుంటిని. అప్పుడు నా తల్లి యగు గంగానది స్త్రీరూపముచేత వచ్చి తనను నాకు తెలిపెను. అప్పుడు నేను భక్తి వినయపూర్వకముగా ఆ గంగాదేవికి నమస్కరించితిని. నా భక్తికి గంగాదేవి సంతోషించి నేను యుద్ధసన్నద్ధుడనై వెళ్ళుటకు కారణమును నన్ను అడిగెను. నేనును పరశురామునితో యుద్ధము చేయుటకు వెళ్ళు కారణమును గంగాదేవితో చెప్పి

తిని. అప్పుడు గంగాదేవి నామీద కోపించుకొని పరశురాముని దగ్గరకు బోయి యిట్లనెను.

మహాత్మా! పరశురామదేవా! భీష్ముడు నీకు శిష్యుడు. నీకు అపరాధము చేయనివాడు. నాకు కుమారుడు. అటువంటి భీష్ముని యందు నీవు కోపించుకొనరాదు. అని గంగాదేవి పరశురామునితో చెప్పెను. అందుకు పరశురాముడు పలుకకుండెను. అంతట గంగాదేవి మరల నాదగ్గరకు వచ్చి నావలన మెత్తపాటును గానక వెళ్ళెను. అంతట సిద్ధవిద్యాధర మునిగణము లందరును వుల్లాసముచేత జూచుచుండగా నేను పరశురాముని దగ్గరకు పోయి కొంతదూరమందు దిగితిని. అట్లు దిగి పరశురామునకు నమస్కరించి వినయపూర్వకముగా నిలిచి యిట్లంటిని. మహాత్మా! పరశురామదేవా! మీరు భూమియందు పాదచారులై యున్నారు. నేను రథముమీదనుండి మీతో యుద్ధముచేయరాదు. అని నేను పరశురామునితో చెప్పితిని. పరశురాముడు దివ్యములైన రథమును, గుర్రములను, దివ్యశస్త్రాస్త్రములను పొంది అకృతవ్రణమునిని సారథిగా చేసికొని నాకు కనబడెను. నేను మరల నారథముమీద యెక్కి శంఖము పూరించి వింటినారిని సవరించి నాసారథిని పొగడి పరశురామునకు నమస్కరించి అతనిని యెదిరించితిని.

## ౫౮ భీష్మునకు పరశురామునితో యుద్ధముచేయుట

అని యీ విధముగా భీష్ముడు దుర్యోధనునితో చెప్పెను. దుర్యోధనా! అంతట పరశురామదేవుడు నామీద బాణవర్షమును కురిపించెను. అప్పుడొక బాణమైనను నారథము దగ్గరకు రాకుండునట్లుగా ఆబాణముల నన్నిటిని ఆకాశమున తెగయునట్లు చేసితిని. అంతట పరశురాముడు నా దేహమందును గుర్రముల దేహము

లందును నాసారథి దేహమందును నాటునట్లుగా ఇరువది బాణము లను వేసెను. అందుకు నేను నవ్వుచు ఒక భల్లాయుధమును సంధించి ప్రయోగించితిని. అప్పుడు నావింటినారియొక్క ధ్వని భూమ్యాకాశ ములయందు నిండియుండెను. నా భల్లాయుధముచేత పరశురాముని ధనస్సు తునుకలుగా విరిగెను. అందుకు పరశురాముని ముఖమందు కోపాగ్నిజ్వాలలు మండుచున్నట్లు కనబడెను. అప్పుడు పరశు రాముడు మరియొక ధనస్సును తీసికొని నూరు క్రూరబాణములచేత నారథమును మునుగునట్లు చేసెను. అందుకు ఆకాశమందుండు దివ్య భూతములన్నియు పరశురాముని పొగడెను. అంతట పరశురాముడు నా దేహమందు అనేక బాణములను గ్రుచ్చెను. అందుకు నేను కోపిం చుకొని అనేకప్రకార తీక్ష్ణబాణములను పరశురాముని దేహమందు గ్రుచ్చితిని. నాబాణములు ఆ పరశురాముని దేహమందు గ్రుచ్చు కొనిన స్థలములలోనుంచి విశేషముగా రక్తము కారుచుండెను. ఆ రక్తముచేత అతని దేహమంతయు తడిసెను. అప్పుడు అతని దేహము కెంపువంటి యెర్రనిఛాయగలదై చిగురించిన క్రొత్తమామిడి చెట్టు వలెనుండెను. అట్లు దేహమందు రక్తములు కారగా పరశురాముడు మూర్ఛపొందెను. అప్పుడు నేను అతనిని చూడగా క్షత్రియకుల ధర్మము మంచిదికాదని నాకు తోచెను. అప్పుడు నన్ను నేనే నా మనస్సునందు దూషించుకొనుచుంటిని.

దుర్యోధనా! అంతట పరశురాముడు మూర్ఛ తెలిసికొని లేచి కోపముగలవాడై నదీప్రవాహము ప్రవహించినట్లుగా అపరిమిత బాణపరంపరలను నామీద ప్రయోగించెను. ఆ సమయమున నేను అతి శీఘ్రముగా అతనిబాణముల నన్నిటిని చెదరగొట్టి వాయవ్యాస్త్ర మును ప్రయోగించితిని. పరశురాముడు పర్వతబాణమును ప్రయో గించి నా వాయవ్యాస్త్రమును మరలించెను. అంతట నేను ఆగ్నే

యాస్త్రమును ప్రయోగించగా పరశురాముడు వారుణాస్త్రముచేత నా ఆగ్నేయాస్త్రమును మరలించెను. ఈ ప్రకారమే పరశురాముడు అనేక దివ్యాస్త్రములను నామీద ప్రయోగించగా వెంటనే నేనును ఆదివ్యాస్త్రముల నన్నిటిని చెరచితిని. అప్పుడు మాయుద్ధమును చూచి ఆకాశమందుండు దేవజాతులందరును మమ్ములను పొగడిరి. అంతట పరశురాముడు ప్రళయకాలాగ్నిహోత్రునివలె మండిపడుచు ఒక క్రూరాస్త్రమును నా వక్షస్థలమందు నాటెను. అందుకు అతని దగ్గర నన్ను మునులును అంబయు సంతోషించి సింహనాదము చేసినట్లు అరచి పరశురాముని పొగడిరి.

దుర్యోధనా! ఆ క్రూరాస్త్రమెట్టిదో నాకు తెలియదు. ఆ క్రూరాస్త్రము పిడుగువలె క్రూరముగా వచ్చి నా వక్షస్థలమందు నాటుకొనెను. ఆ దెబ్బకు నేను బాధపడి రథముమీద పడితిని. అప్పుడు నా సారథి నా రథమును తొలగించి యివతలకి తోలుకొని వచ్చెను. అంతట నేను మూర్ఛ తెలిసి లేచి నా సారథియందు కోపించుకొని మరల పరశురాముని యెదుటకు రథము తోలించి బాణ పరంపరలను ప్రయోగించి పరశురాముని రథమును ముంచితిని. అందుకు అంబ భయపడెను. దుర్యోధనా! యీ ప్రకారము అనేక విధములుగా పరశురామునితో నేను యుద్ధము చేయుచు సూర్యుడస్తమించినప్పుడు యుద్ధము చాలింప హస్తినాపురమునకు పోవుచు మరల వుదయకాలమందు వచ్చి యుద్ధము చేయుచుంటిని. ఇట్లు యిరువదిరెండు దినముల పర్యంతము పరశురామదేవునకును నాకును ఘోరయుద్ధము జరిగెను. అంతట యిరువదిమూడవ దినమందు నేను యుద్ధమునకుపోయి మిక్కిలి భయంకరముగా పరశురాముని యెదిరించి అతని గుర్రములను నొప్పించి ధనుస్సు నరికి సారథిని నొప్పించి పరశురాముని దేహము చీలునట్లు కొట్టితిని. అప్పుడు పరశు

రాముడు మిక్కిలి కోపించుకొని ఒక శక్త్యాయుధమును వేయగా దానిని నేను నరికితిని. పిమ్మట పది శక్త్యాయుధములను వేయగా ఆ పదిశక్తులను నేను నడుమనే నరికితిని. అంతట పరశురాముడు అనేక శక్త్యాయుధములను ప్రయోగించగా ఆ శక్త్యాయుధములను నేను నరికితిని. అప్పుడు నా హస్తలాఘవమునకు పరశురాము డాశ్చర్యమును పొందెను. ఆ సమయమందు నేను నెమళ్ళవంటి మిక్కిలి ప్రకాశములైన తీక్ష్ణబాణములను ప్రయోగించి ఆ పరశురామునకు మూర్ఛకలిగించితిని. ఇట్లు పరశురాముడు మూర్ఛిల్లగా అతని శిష్యులగు మునిజనులును అంబయును అధికదుఃఖమును పొంది హాహాధ్వని కలుగునట్లుగా యేడ్చిరి. అంతట పరశురాముడు మూర్ఛ తెలిసి అతి వేగముగ దృఢ తీవ్ర క్రూర బాణపరంపరలను ప్రయోగించి నాకు మూర్ఛకలిగించి భూమిమీద పడునట్లు చేసి నా సారథియొక్క శిరస్సు నరికెను.

ఆసమయమున యౌవన రూపవంతులైన యెనమండ్రు బ్రాహ్మణులు భూమిమీద పడియుండెడి నన్ను లేవనెత్తి నాకు మూర్ఛ తెలిపి రథముమీద కూర్చుండబెట్టి ఆకాశమార్గమందు వెళ్ళిరి. అంతకుముందే నాతల్లియగు గంగాదేవి మొదటిదినమందు కనపడిన స్త్రీరూపముతో వచ్చి నా నొగలమీదనుండి నా గుర్రముల పగ్గములను పట్టుకొని యుండెను. అప్పుడు నేను గంగాదేవిని జూచి నమస్కరించితిని. ఆ గంగాదేవి నన్ను దీవించి వెళ్ళెను. నేను ధైర్యమును తెచ్చుకొని నేనే సారథ్యము చేసికొనుచు క్రూరాస్త్రములచేత పరశురామదేవునితో చాతుర్యముగా పోరుచుంటిని. అప్పుడు నన్ను దేవత లందరును మెచ్చుకొనిరి. ఇట్లు యిరువది మూడు దినములు పరశురామునితో పోరితిని. అంతట యిరువది మూడవదినమందు సూర్యు డస్తమించెను.

## భీష్మునకు వసువులు స్వప్నసాక్షాత్కారమున మోహ నాస్త్రము యిచ్చుట

దుర్యోధనా ! అంతట యెప్పటివలె నేను హస్తినాపట్టణము నకు వెళ్ళి ఆరాత్రియందు యేకాంతముగా దర్భశయనమందుండి దేవ బ్రాహ్మణ వర్గములను దలచి భక్తిచేత నమస్కరించి యిట్లని ప్రార్థించితిని. మహాత్ములగు దేవ బ్రాహ్మణులారా! యిరువది మూడు దినములనుంచి పరశురామునితో పోరుచున్నాను. నేను ఆ పరశురాముని జయింపజాలకున్నాను. నేను యుద్ధమందు పరశు రాముని జయింప దగినవాడనైనయెడల మీరు నాకు కనబడి నన్ను ఆదరించవలయును. అని యిట్లు నేను దేవబ్రాహ్మణులను ప్రార్థించ తిని. ఆదినమందు పగలు నన్ను యెత్తి రథముమీద పెట్టిపోయిన యెనమండ్రు బ్రాహ్మణులును తెల్లవారునప్పుడు నాకు స్వప్న మందు కనబడి నాతో యిట్లనిరి. భీష్మా ! నీకును మాకును భేదము లేదు. మేమును నీవును ఒక్కరూపమే యగుదుము. నీవు భయపడ వలసిన పనిలేదు. పరశురాముని నీవు జయించు బాణము యిదిగో యిదియేసుమా ! అని యా బ్రాహ్మణులు యెనమండుగురును నాతో జెప్పి సమ్మోహనాస్త్రమును నాకు యిచ్చి దాని ప్రయోగ ఉపసం హార మంత్రస్వరూపమును నాకు జెప్పిపోయిరి. అప్పుడే నేను మేలు కొని సంతోషించి ఆ సమ్మోహనాస్త్ర మంత్రస్వరూప ప్రయోగోప సంహార పద్ధతి నంతయు చిత్తమందు నిలిపికొంటిని. అంతట నేను ప్రాతఃకాల విధులను తీర్చుకొని ఒక సారథిని యేర్పరచికొని రథము పూన్పించి యుద్ధసన్నద్ధుడనై శీఘ్రముగా యుద్ధమునకు వెళ్ళితిని. అప్పుడు పరశురామదేవుడు నన్ను జూచి నాతో యిట్లనెను.

భీష్మా ! నిన్నటిదినమందు నీవు సగము చచ్చిపోతివి. తక్కిన సగమును యీదినమందు తీర్చి నీరూపు మాపెదను. నీ గర్వము

నేను నశింపగలను. ఇకను నీవు తప్పించుకొని పోజాలవు. నేను యము వంటి వాడనని నీవు యెఱుగవాయేమి? అని యిట్లు ఆ పరశురామ దేవుడు నాతో జెప్పుచు అతిభయంకరముగా నామీదికి వచ్చెను. అప్పుడు నేనును పరశురామునిమీద బాణవర్షమును కురిపించితిని. ఆ పరశురాముడును మిక్కిలి క్రూరముగా క్రూరబాణములను నా దేహమందు గ్రుచ్చి నన్ను నొప్పించెను. అందుకు నేను కోపించుకొని ఒక క్రూరబాణమును పరశురాముని నొసటియందు నాటించి ఘోర శక్త్యాయుధమును అతని వక్షస్థలమందు వేసితిని. ఆ రెండు దెబ్బలకు పరశురాముడు నొచ్చి రథముమీద వాలెను. అప్పుడతని సారథియగు అకృతవ్రణుడు పరశురాముని పట్టుకొని మూర్ఛ తెలిపెను. పరశురాముడు తెప్పరించుకొని లేచి కన్నులయందు నిప్పులు రాలునట్లుగా నన్ను నిశ్చలముగా జూచి కొంచెము నవ్వుముఖము గలవాడై బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. నేనును ఆ బ్రహ్మాస్త్రము మీద బ్రహ్మాస్త్రమును ప్రయోగించితిని. ఆ రెండు బ్రహ్మాస్త్రములును ఆకాశమందు పోరుచు, నాకాశమంతయు ప్రజ్వలింప జేయుచు దేవరాక్షసులకు భయము గలిగించెను సకల భూతములును సంక్షోభింపు చుండెను. ఆ సమయమందు యిది మంచి సమయమని తలచి, నేను సమ్మోహ నాస్త్రమును ఆవాహించి ప్రయోగింప బూనితిని. అట్లు పూనగా చరాచర భూతములన్నియు అరచెను. పిమ్మట సమ్మోహనాస్త్రమును విడువవద్దు. మానుము మానుమని చెప్పుచు ఆ వాక్యధ్వని తోడనే నారదమునీంద్రుడు అక్కడికివచ్చి నాతో యిట్లనెను.

భీష్మా! యీ పరశురాముఁడు నీకుగురువు. నీవు క్రూరబుద్ధిచేత నీగురువునకు నీవే అవమానమును చేయుటకు పూనితివి. యీ పద్ధతినంతయు మేము చూచితిమి. నీవు కురువంశమందు పుట్టితివి.

అంత గొప్పవంశమందు పుట్టి యీ రీతిగా గురువునకు అవమానము కలిగింపరాదు. భీష్మా! యిదిగో యెనమండ్రు వసువులును నీకు బుద్ధిచెప్పెడి కొరకు వచ్చి ఆకాశమందున్నారు. అని యిట్లు నారద మునీంద్రుడు నాతో చెప్పి ఆ యెనిమిదిమంది వసుదేవతలను నాకు కండ్లారాజూపెను. ఇట్లు నాకుకలలో కనబడిన యెనమండ్రు బ్రాహ్మణులును నాదగ్గిరకు వచ్చి నన్ను జూచి నవ్వుముఖము గలవారై యేమియు యెరుగనివారివలె నాతో యిట్లనిరి; భీష్మా! యీనారద మహాముని మూడులోకములచేత పూజింప దగినవాడు. ఈ నారదుని వాక్యములు వేదవాక్యములవంటివి. ఈ నారదుడు చెప్పిన మాటలను వినుము. నీకు పరశురాముడు గురువు. గురువిషయమై క్రూర భావము గలిగియుండరాదు. అని యిట్లు వసుదేవులు యెనమండు గురను నాతోచెప్పిరి. అప్పుడు నేను సమ్మోహ నాస్త్రమును ప్రయోగించుట మానుకొని అదివరకు ప్రయోగించిన బ్రహ్మాస్త్రమునే విశేషముగా ప్రజ్వలింప జేసితిని. ఈ వృత్తాంతము నంతయు అప్పుడు పరశురాముడు యెరిగి అధికరోష మాత్సర్యములు గలిగియుండెను. ఆసమయమందు పరశురాముని తండ్రియగు జమదగ్నియు అతని పితృదేవతలును వారందరును పూర్వలోకములో నుంచి అక్కడికివచ్చి పరశురాముని వేడుకొని శాంతి వాక్యములచేత అతని కోపమును మాన్పి యిట్లనిరి.

పరశురామా! యీభీష్ముడు అష్టవసువులస్వరూపుడు ఈభీష్ముడు యుద్ధమందపరిమిత తేజస్సుగలవాడు ఈభీష్ముని గెలుచుటకు మనకు శక్యముగాదు. బ్రాహ్మణునకు రోషమాత్సర్యము లుండరాదు. నీవు యీభీష్మునితో యుద్ధముమానుకొనుము. నారాయణుని స్నేహితుడైన నరుడను దివ్యమునీంద్రుడు డింకొకజన్మమందు అర్జును డైపుట్టి యీ భీష్ముని చంపును. ఆ అర్జునునితప్ప యితరజనులు

యుద్ధమందు యీ భీష్ముని గెలువజాలరు. అని ఇట్లు జమదగ్ని మొదలగు పితృదేవతలందరును పరశురామునకు చెప్పిరి. అట్లుచెప్పినను పరశురాముడు వెనుదీయక నాతో యుద్ధము చేయుచుండెను. జమదగ్ని మొదలగు పితృదేవతలందరును అనేకవిధములుగా పరశురామునకు చెప్పిరి. అంతట జమదగ్ని మొదలగు మునులందరును నాదగ్గిరకువచ్చిరి. నాకుశాంతవాక్యములనుచెప్పి తాము పరశురామునితో చెప్పిన మాటలను నాకు దెలిపిరి. నాతల్లియగు గంగాదేవి అంతటనాకు కనబడెను. ఆ గంగాదేవియు ఆ మునులును నాకు బహువిధములైన శాంతవాక్యములను చెప్పిరి. జమదగ్ని మొదలగు మునులందరును గంగాదేవిని వెంటపెట్టుకొని పరశురామునిదగ్గరకు పోయి మాటలాడి మరల శీఘ్రముగా నాదగ్గిరకువచ్చిరి. ఇట్లు గంగాదేవియు జమదగ్ని మొదలగుమునులును కష్టించి తిరిగి తుదకు మా యిద్దరి కోపములను మాన్పిరి. ఓ దుర్యోధనా! అంతట పరశురాముడును నేనును దివ్యాస్త్రములను నుపసంహరించి యుద్ధము చాలించితిమి. అవసువులు యెనమండుగురు నాదగ్గరకువచ్చి నాతో యిట్లనిరి. భీష్మా! నీగురువైన యీ పరశురాముడు పరబ్రహ్మవేత్త. మహాతేజోవంతుడు నీవిప్పుడతని దగ్గరకువెళ్ళి భక్తిచేత అతనికి నమస్కరించి అతని అనుగ్రహమును పొందవలయును. అని బ్రాహ్మణరూపులగు వసువులు యెనమండుగురును నాతో చెప్పిరి. అట్లు వారును నారదమునియు జమదగ్ని మొదలగు మునులును గంగాదేవియు వీరందరును పరశురాముని దగ్గరకుపోయి యిట్లనిరి. పరశురామా! నీశిష్యుడైన యీభీష్ముడు దేవవ్రతుడు. వానివిషయమై నీవుకోపించరాదు. అతడధర్మకార్యమును చేయజాలక నీతో పోరుచున్నాడు. ఇంతమాత్రమేగాని వాడు నీకు విరోధికాడు. నీవు వానిని కరుణింపుము. అని యిట్లు వసువులు మొదలగువారందరును పరశురాము

నితో చెప్పి నన్ను పిలిచిరి. అంతట నేను వెళ్ళి ఆమహాత్ముడైనపరశు రామదేవునకు సాష్టాంగదండ ప్రణామము చేసితిని. ఆ పరశురామ దేవుడునన్ను దీవించి లేవనెత్తి నన్ను కౌగిలించుకొనినాతో యిట్లనెను.

భీష్మా! నీశక్తికిని భక్తికిని నేనుసంతోషించితిని. అని నాతో చెప్పి స్నేహపూర్వకముగా నాతోసంభాషించెను. అంతట పరశు రాముడు అంబనుజూచి యిట్లనెను. అంబా! నన్ను యుద్ధమందు యీ భీష్ముడే గెలిచెను. నావలనఅయ్యెడి కార్యము యింతమాత్రమే యగును. ఇకను నీవుయిష్టమైనచోటికి వెళ్ళుము. అని యిట్లు పరశు రాముడాఅంబతో చెప్పగా ఆ అంబ పరశురామునితో యిట్లనెను. ఓమహాత్మా! దేవా! నీవు చెప్పినదంతయు నిశ్చయమే యగును. నీశక్తియున్నంతవరకు నానిమిత్తమై నీవు మిక్కిలి శ్రమజెందితివి. నీ చేతకానప్పుడు అందుకు నేనేమిచేయుదును? నేనే తపస్సుచేసి తపో మాహాత్మ్యమువలన భీష్ముని చంపెదను. మరియొకజన్మమందైనను నాపగను తీర్చుకొందును. నీవు చూచుచుండుము. అని యిట్లు అంబ పరశురామునితో చెప్పి పోయెను. దుర్యోధనా! అంతట ఆ నారదా దులును ఆ పరశురాముని పితృదేవతలును నాకును పరశురామునకు జెప్పి అంతర్థానులైపోయిరి. అంతట పరశురామదేవుడే నన్ను పం పించి తానును అదివరకు తనవెంటవచ్చిన మునులును మహేంద్ర పర్వతమునకు వెళ్ళిరి. దుర్యోధనా! అంతట నేను హస్తినాపురము నకు వచ్చుచుండగా బ్రాహ్మణులు నన్ను దీవించుచుండిరి. స్తుతింపు చుండిరి. అందరును నన్ను పొగడిరి. ఆవాక్యములన్నియు నాచెవులకు మనోహరములుగా నుండెను. అంతట నేను హస్తినాపురము ప్రవే శించి సత్యవతీదేవికి నమస్కరించి జరిగినవృత్తాంతము నంతయు ఆ సత్యవతికి తెలిపితిని. అంతట నావిజయమునకు సత్యవతి సంతోషించి అంబయొక్క వృత్తాంతమును విచారించుటకు తగినజనులను పంపిం

చుచు భయపడుచుండెను. అదిమొదలుకొని నేను చింతచేత గ్రుక్కి-యుండియు రాజులగర్వమును అణచుచుంటిని. అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పెను.

57

## నారదుడు భీష్మునకు అంబ వృత్తాంతమును అంతయుచెప్పుట

దుర్యోధనా! అంతట కొంతకాలమునకు ఒకానొక దినమందు నేను వేదవ్యాస నారదమహామునులను చూచి యిట్లంటిని. వ్యాస నారదులారా! అంబయొక్క వృత్తాంతమును తలచగా నాకు భయము గలుగుచున్నది. ఆ అంబయొక్క వృత్తాంతము మీకు తెలిసినయెడల నాకు చెప్పుడు. అని యిట్లు నేను అడుగగా వారిద్దరును నాతో యిట్లనిరి. భీష్మా! దైవాధీనమువలన జరుగు కార్యమును మనుష్య ప్రయత్నమువలన మాన్పుటకు శక్యముకాదు. గనుక యీచింతను నీవు విడువుము. అని వ్యాసనారదమునులు నాతో చెప్పిరి. అప్పుడు వారిద్దరిలో నారదుడు అంబవృత్తాంతమును వినుమని నాతో యిట్లనెను. భీష్మా! నీవు పరశురామునితో యుద్ధముచేసి గెలిచినపిమ్మట ఆయంబ యమునానదీతీరమునకు వెళ్ళి అతి ఘోరతపస్సు చేసెను. అంత అక్కడనుంచి కౌశికాశ్రమము మొదలగు సకల సిద్ధాశ్రమములకు పోయిపోయి ఆయా ఆశ్రమములయందు కఠినమైన వ్రతములను జరుపుచుండెను, నీతల్లియగు గంగాదేవి స్త్రీరూపముతో వచ్చి అంబతో యిట్లనెను. చిన్నదానా! నీవు స్త్రీవగుదువు. స్త్రీలకు అతి దుష్కరములైన బహు నియమములతో ప్రయోజనములేదు. నీవు యింత దుష్కరములైన బహునియమములను అనుష్ఠించుటకు కారణమేమో చెప్పుము. అని గంగాదేవి అడుగగా అంబ యిట్లనెను, చిన్నదానా! నేను భీష్మునిచేత మిక్కిలి అవమానమును పొందితిని. నేను మరియొక జన్మమందైనను, భీష్ముని చంపుటకు సమర్థురాల

నగుటకై యిట్టి వ్రతనియమములను జేయుచు తపోవృత్తియందు చరింపుచున్నాను. అని అంబ గంగాదేవితో చెప్పెను. అప్పుడు గంగాదేవి అంబతో యిట్లనెను.

చిన్నదానా! నీవు కుటిలస్వభావము గలిగి ప్రవర్తింపుచున్నావు. గనుక నీవు యీదేహమును విడిచి నదివై ప్రవహింపగలవు. ఇంతమాత్రమే కాని మరియొకవిధము కాజాలవు. అని గంగాదేవి అంబతో చెప్పెను. ఆమాటలకు అంబ నవ్వుచు, ఆమాటను లక్ష్యముచేయక ముందుకంటె ఘోరతపస్సును చేయుచు, మత్స్యదేశమందు నివసించియుండెను. అంతట ఒకనాడు అంబ తన తపఃఫలములో అర్ధభాగముచేత అంబయను పేరుగల నదియై ఆమత్స్యదేశమందు ప్రవహించెను. తక్కిన అర్ధభాగ తపఃఫలముచేత అంబ తన రూపమును చెడకుండునట్లు చేసికొని గంగాదేవి ప్రభావమును తన తపఃప్రభావముచేత గెలిచెను. గంగాదేవి ప్రభావమును ఆ అంబ గెలిచి మరల పుణ్యాశ్రమ ప్రదేశములందు అతి ఘోరతపస్సు చేసెను. ఆతపస్సునకు రుద్రదేవుడు సంతోషించి దానియందు కృప గలిగి ప్రత్యక్షమై యిట్లనెను.

అంబా! నీతపస్సునకు నేను సంతోషించితిని. నీకు కావలసిన వరమును కోరుము అని రుద్రుడు చెప్పగా అతనితో అంబ యిట్లనెను. మహాత్మా! రుద్రదేవా! నేను భీష్ముని చంపునట్లుగా నాకు వరమిమ్ము. ఇదియే నాకోరిక. అని అంబ రుద్రుని వర మడిగెను. అక్కడుండు మునులందరును రుద్రదేవుని జూచి ఆశ్చర్యమును పొందిరి. రుద్రదేవుడు నీవు కోరినప్రకారము భీష్ముని చంపగలవని అనుగ్రహించి చెప్పగా అంబ మరల యిట్లనెను. మహాత్మా! రుద్రదేవా! నేను భీష్ముని చంపుట యే ప్రకారముగా నాకు యెప్పుడు సిద్ధించునో చెప్పుము. అని అంబ యడుగగా రుద్రదేవు డిట్లనెను.

అంబా ! నీవు యీ శరీరమును విడిచిన పిమ్మట ద్రుపదరాజునకు మొదట కూతురవై పుట్టి పిమ్మట పుత్రాకారమును పొందుదువు. అప్పుడు నీవు శిఖండియను పేరుగలవాడవై మహాభుజాబల పాండిత్య ధనుర్విద్యా మహాశౌర్యములచేత ప్రసిద్ధి కెక్కియుండెదవు. నీవు యుద్ధమందు భీష్ముని చంగలవు. నామాట తప్పదు. నీవు చింతింపకుము. అని రుద్రదేవుడు అంబతో చెప్పిపోయెను. ఆదినమందే అంబ చాలా కట్టెలనుచేర్చి అందులో అగ్నిపెట్టి ప్రజ్వాలింపజేసి మహాకోపముచేత భీష్ముని చంపెదనని తలచుచు అగ్నిలో ప్రవేశించి ప్రాణములను విడిచెను. అందుకు మునులందరును జూచి ఆశ్చర్యమును పొందిరి. అని నారదుడు భీష్మునితో చెప్పి మరల యిట్లనెను;

భీష్మా ! ఆ సమయమున ద్రుపదునిభార్య పుత్ర సంతానము లేక దుఃఖించుచుండెను. ఆ ద్రుపదుడును నీ మీద రోషము గలిగి యుండెను. ద్రుపదరాజు శివు నుద్దేశించి తపస్సుచేయగా అతనికి శివుడు ప్రత్యక్షమై వరమును వేడుమనెను. ద్రుపదరాజు శివునితో యిట్లనెను. దేవా ! భీష్ముని చంపుటకు సమర్థుడైన ఒకపుత్రుని నాకు యిమ్ము. ఇదియే నాకోరిక. అని ద్రుపదుడు వరమడుగగా శివుడు యిట్లనెను. ద్రుపదరాజా నీకు మొదట కూతురుపుట్టి పిమ్మట ఆ కూతురు పురుషత్వమొంది యుద్ధమందు భీష్ముని చంపగలదు. అటువంటి తేజోరూపమైన బిడ్డ నీకు పుట్టును. నా మాట తప్పదు. అని యిట్లు రుద్రదేవుడు ద్రుపదునితో చెప్పి పోయెను. అప్పుడు ద్రుపదుడు సంతోషించి ఆవరమును తన భార్యకు తెలిపెను. పిమ్మట అంబయొక్క చైతన్యము ద్రుపదుని భార్యగర్భమందు ప్రవేశించెను. ద్రుపదునిభార్య గర్భము ధరించి యెవ్వరికి తెలియకుండునట్లుగా కూతురిని కనెను. ద్రుపదుడును అతనిభార్యయువంచన గలవారై తమకు కొడుకు పుట్టెనని అందరు వినునట్లుగా చెప్పిరి. ఇట్లు

పుట్టిన కూతురునకు పుత్రునకువలె జాతకర్మాది కార్యములను చేసి శిఖండి యను పేరు పెట్టిరి. ఆ కూతురునకు పురుష వేషము వేసి పెంచి రహస్యపద్ధతి నంతయు పిమ్మట ఆ కూతురునకు తెలిపిరి. ద్రుపదు డా కూతురునకు అక్షరాభ్యాసము మొదలగునవి చేయించి ద్రోణా చార్యునివద్ద శస్త్రాస్త్ర విద్యాభ్యాసము చేయించుచుండెను. అంతట కూతురునకు యౌవనము ప్రాప్తించెడు కాలము వచ్చెను. అప్పు డా కన్యకను జూచి ద్రుపదుడును అతని భార్యయు దుఃఖించి యిట్లని ఆలోచించిరి. దీనికి శీఘ్రముగా వివాహము చేయవలయును. శివుడు యిచ్చిన వరము ఫలించుకాలమందు ఫలించగలదు. అని ద్రుపదు డును అతని భార్యయు నిశ్చయించిరి. అంతట దశార్ణ దేశపు రాజగు హేమవర్మయొక్క కూతురును మాటలాడి దానిని శిఖండికిచ్చి వివా హము చేసిరి. అంతట ఆ కోడలిని తెచ్చి తన గృహమందు ద్రుపదు డుంచుకొనెను. ఆ కోడలు చాతుర్యము గలదగుటవలన శిఖండి యొక్క ప్రవర్తనను ఒకనాడు పొరపాటున చూచి స్త్రీయని తెలిసి కొనెను. అప్పు డా కోడలు శిఖండియొక్క స్త్రీస్వరూపమును పరు లకు చెప్పజాలక యెరుగనిదానివలె నుండి వూరక మనస్సునందు నొచ్చుకొనెను. దశార్ణ దేశపురాజుయొక్క కుమార్తెయగు నామె యెరింగి శిఖండి పురుషుడు కాడని తన దాదితో చెప్పెను. ఆ దాది వెంటనే యీ సంగతిని దశార్ణ దేశాధిపునికి యెరింగించెను. అందుకు దశార్ణ దేశరాజు దుఃఖరోషములు గలవాడై ఒక దూతను పంపగా నాదూత ద్రుపదునివద్దకు వచ్చి యిట్లనెను.

ద్రుపదరాజా! నీ కూతురును కొడుకని తెచ్చి మారాజు కూతురును యిప్పించి వివాహము చేసితివి. అందువలన నవ్వుబాటా యెనేగాని నీవు పొందిన లాభమేదియో చెప్పుము. మా శిఖండికి పురుషత్వము కలదో లేదో తెలుసుకొనుటకు నిజముగా నన్ను మా

రాజు పంపినాడు. మారాజగు హేమవర్మడు శత్రుభయంకరుడు. మహాశౌర్యవంతుడు. అటువంటి హేమవర్మను నీవు మోసగించి కష్టమును కలిగించితివి. నీకు బలపరాక్రమములున్న యెడల చూపుము. ఆదూత చెప్పగా ద్రుపదుడు నవ్వుచు ఆదూతతో యిట్లనెను.

దూతా! నీవు యిట్టిమాటలను చెప్పరాదు. కూతురును కుమారుడని చెప్పి యెవ్వరును పెండ్లిచేయరు. ఇటువంటి వెఱివా రుండరు. ఎంతటి మూఢులకైనను యిట్లు చేయరాదని తెలిసి యున్నది. అని ద్రుపదుడు నేర్పుచేత బహువిధములైన తీర్పుమాట లను ఆదూతతో చెప్పెను. ఆదూత శిఖండియొక్క పురుషత్వమును పరీక్షింపవలెనని కోరగా వారికి ద్రుపదు డవకాశమీయక పంపిం చెను. ఆదూత హేమవర్మదగ్గరకు పోయి ఆవృత్తాంతము నంతయు విన్నవించెను. దశార్ణదేశరాజగు హేమవర్మ మిక్కిలి కోపముగల వాడై సైన్యములను తీసికొనివచ్చి ద్రుపదుని పట్టణమును ముట్ట డించెను. ద్రుపదుడు పట్టుపడిన దొంగవానివలె తనకు తానే చేటు తెచ్చుకొంటినని తలచుచు వ్యసనమును పొంది యేకాంతస్థలమం దుండెను. అప్పు డతని భార్యయొక్కతయే అతని ప్రక్కన వుండి సేవింపుచుండెను. ద్రుపదుని సేనానాయకులు హేమవర్మని సైన్యము లతో యుద్ధముచేయుటకు ప్రయత్నించి వుత్సాహము గలిగియుండిరి. ఆదినమున సూర్యాస్తమయమయ్యెను. రెండుపక్షముల సైనికులును తెల్లవారినతోడనే యుద్ధముచేయవలెనని వుత్సాహముగలిగియుండిరి. శిఖండి యిట్లనితలచెను. అయ్యో! దైవమా! యీఆపదయెట్లునివర్తిం పదు. కనుక నేనుమరణమునుపొందెదను. అని శిఖండి తనమనస్సులో నిశ్చయించి యితరులకు చెప్పక పట్టణము వెంబడే అడవికి వెళ్ళెను.

### శిఖండి యక్షునివలన పురుషత్వమును పొందిన వృత్తాంతము

59 ఆరాత్రి సమయమున శిఖండి అడవికి వెళ్ళగా అచ్చట అడవియందు స్థూలకర్ణుడను ఒక యక్షుని నివాసగృహముండెను.

ఆప్రదేశము జనశూన్యమై యుండుననని శిఖండి యెరిగియున్నందున ఆస్థూలకర్ణుని వుద్దేశించి ఆవనములో ప్రవేశించెను. అంతట ఆశిఖండి స్థూలకర్ణుని గృహమునకు వెళ్ళి అక్కడ ప్రాణములను విడుచుటకు తగిన ప్రయత్నములో నుండెను. ఆప్రయత్నమును స్థూలకర్ణుడు యెరిగి శిఖండిదగ్గరకువచ్చి యిట్లనెను. చిన్నదానా! నీవు యిట్లు బలాత్కారముగా చావవలసిన పనియేమియని చెప్పుము. నీమనో వ్యాధికి నేను ఔషధమును కల్పించి యీ మనోవ్యాధిని పోగొట్ట గలను. అని యక్షుడు చెప్పగా శిఖండి ఇట్లనెను.

యక్షుడా! నాకోరికను దీర్చుటకు ఆపరమేశ్వరుడగు శివుడు తప్ప మరియొకడు సమర్థుడుగాడు. నేను పురుషత్వమును పొందక మానను. అని యిట్లు శిఖండి యక్షునితో చెప్పి తన వృత్తాంతము నంతయు యక్షునకు తెలియచెప్పెను. యక్షుడు కరుణగలవాడై శిఖండితో యిట్లనెను. చిన్నదానా! నీకు పురుషత్వమిచ్చుట గొప్ప పనిగాదు. ఒక యేర్పాటుచేసికొని నాపురుషత్వమును నీకు యిచ్చె దను. నీవు నాపురుషత్వమును తీసికొనుము. నీస్త్రీత్వమును నాకు యిమ్ము. నాపురుషత్వమును నీవుపొంది వెళ్ళి దశార్ణదేశపురాజు వలన మీకు కలిగిన ఆపదలను పోగొట్టుకొనుము. మరల పది దిన ములనాటికివచ్చి మరల నాపురుషత్వమును నాకుయిచ్చి నీ స్త్రీత్వ మును నీవు తీసికొనిపొమ్ము. ఈ పదిదినముల పర్యంతము నీవు పురు షత్వమును పొంది నేను పురుషుడనని దశార్ణదేశరాజునకు తెలు పుము. అని స్థూలకర్ణుడను యక్షుడు శిఖండితో చెప్పి తన పురుషత్వ మును శిఖండికిచ్చి తాను స్త్రీరూపమును ధరించియుండి శిఖండిని పంపించెను. శిఖండి తనగృహమునకు వెళ్ళి తన తల్లిదండ్రులకు నమస్కరించి తనకు పురుషత్వము గలిగిన వృత్తాంతమునంతయు వారికి తెల్పియచెప్పెను. అందుకు ద్రుపదుడును అతనిభార్యయు

అద్భుతసంతోషములను పొంది శిఖండిని పొగడిరి. అంతట సూర్యోదయమయ్యెను. ద్రుపదరాజు ప్రాతఃకాలవిధులను దీర్చికొని తన వియ్యంకుడగుచు హేమవర్మతో తగినట్లు మాటలాడుటకు తగినవారిని పంపించి ఆ హేమవర్మరాజును రప్పించి తొందరపడక నాగరిక ప్రకారము శిఖండియొక్క పురుషత్వమును అతనికి తేటపరచెను. ఇట్లు ద్రుపదరాజు హేమవర్మయొక్క తలంపును అసత్యముచేసి అతనిని సంతోషింపజేసి ఆ హేమవర్మ రాజునకు అతని పరిజనులకును స్నానభోజనములను చేయించి వస్త్రభూషణములను యిచ్చెను. హేమవర్మరాజు తగిన శాంతవాక్యముచేత ద్రుపదుని మనస్సునకు సంతోషము గలిగించెను. ద్రుపదుడు హేమవర్మరాజును అతని దేశమునకు సంతోషముగా పంపించెను. ఆ హేమవర్మరాజు తనను తానే నిందించుకొనుచు తన దశార్ణదేశమునకు పోయెను. అట్లు స్థూలకర్ణుడను యక్షుడు తన పురుషత్వమును శిఖండికిచ్చి శిఖండియొక్క స్త్రీరూపమును తాను ధరించియుండెను. ఒకనాడు కుబేరుడు విమానము మీదయెక్కి క్రీడార్థము స్థూలకర్ణుని వనమునకువచ్చి స్థూలకర్ణుని స్త్రీరూపసౌందర్యమును జూచి దానిని పొగడుచు అక్కడ నిలిచి కొంచెముసేపునకు తనచుట్టును గల యక్షులతో యిట్లనెను.

యక్షులారా! మనము ఇచ్చటనిలిచియుండగా స్థూలకర్ణుడు స్త్రీరూపమును ధరించి శంకింపక ఇక్కడికిరాక దాగియున్నాడు. ఇంతగర్వము వానికెందుకుగలిగెనో తెలియలేదు. వాడిక్కడికి రాని విషయమునకు మనము క్షమింపరాదు. అని కుబేరుడు తనచుట్టునుగల యక్షులతో చెప్పి కోపముగలముఖముచేత ముఖము చిట్లించుకొనియుండెను; కిన్నరులుస్థూలకర్ణుడను యక్షుని వెదకివచ్చి వానివృత్తాంతమునంతయు కుబేరునకుచెప్పి యిట్లనిరి. దేవా! కుబేరుడా! స్థూలకర్ణుడు తనపురుషత్వమును శిఖండికిచ్చి శిఖండియొక్క స్త్రీరూపమును తాను

ధరించియున్నాడు, అందువలన అధికమగు సిగ్గుగలవాడై మీయెదుటకు రాజాలకున్నాడు. అనియిట్లు కిన్నరులు కుబేరునితో విన్నవించగా కుబేరు డిట్లనెను.

## స్థూలకర్ణునకు కుబేరునివలన స్త్రీత్వముగలుగుట

కిన్నరులారా! స్థూలకర్ణుని పిలిచి, ఇక్కడికి తీసికొనిరండు. అని కుబేరుడు కిన్నరులతో చెప్పి స్థూలకర్ణునిపిలిపించెను. అంతట స్త్రీ రూపధారియై స్థూలకర్ణుడువచ్చి కుబేరునకు మ్రొక్కియుండెను. అంతట స్త్రీయైయున్న స్థూలకర్ణునిజూచి కుబేరు డిట్లనెను. కిన్నరులారా! యికను యీస్థూలకర్ణుడు జీవించియుండు పర్యంతము యీ ప్రకారమే స్త్రీయైయుండుగాక. అని కుబేరుడు చెప్పగా ఆ మాటకు స్త్రీయైయున్న స్థూలకర్ణుడు భయపడి కుబేరునకు దండప్రణామము చేసెను. అప్పు డాకుబేరునిసేవించియుండు యక్షులుకొందరు కుబేరునకు కృపగలునట్లు సరియైనపద్ధతిగా శిఖండియొక్క వృత్తాంతమును అంతయు తెలిపిరి. కుబేరుడు కృపగలవాడై యక్షులతో యిట్లనెను. యక్షులారా! అటులైనయెడల శిఖండిబ్రతికియుండు పర్యంతము యీస్థూలకర్ణుడు ఆప్రకారమే స్త్రీయైయుండి పిమ్మట యెప్పటివలె యక్షరూపమును ధరించును అని కుబేరు డనుగ్రహించిచెప్పి వెళ్ళెను. స్థూలకర్ణు డంతట దుఃఖించుచుండెను. పదదినములు పూర్తియైన పిమ్మట యేర్పాటుప్రకారము శిఖండి తనతల్లిదండ్రులతో చెప్పి స్థూలకర్ణుని పురుషత్వమును స్థూలకర్ణునకు యిచ్చునిమిత్తము వనమునకు వచ్చెను. స్థూలకర్ణుడు శిఖండినిజూచి యిట్లు చెప్పెను. శిఖండీ! నీవలన తప్పు లేదు. మాప్రభువగు కుబేరుడు నన్నుజూచి కోపించుకొని నన్నీ ప్రకారమే స్త్రీరూపమునుధరించి యుండునట్లు ఆజ్ఞాపించెను. కనుక నీవు జీవించియుండు పర్యంతము నేను స్త్రీనై యుండవలసివచ్చెను.

నీవుమరల నీగృహామునకు వెళ్ళుము. నీకు యీపురుషత్వమును దైవ మిచ్చియున్నాడు. అని స్త్రీయైయున్న స్థూలకర్ణుడను యక్షుడు శిఖండితో జరిగిన వృత్తాంతము నంతయు స్పష్టముగా తెలియజెప్పి పంపెను. శిఖండి అత్యంత సంతోషముతో తనతండ్రియగు ద్రుపదునికడకువచ్చి స్థూలకర్ణుని వృత్తాంత మంతయు అతనికి తెలియ చెప్పెను. ద్రుపదరాజుసంతోషించి తనకు శివుడిచ్చినవరముఫలించెనని తలచి దేవగురు బ్రాహ్మణులను పూజించెను. అంత ద్రుపదుడా శిఖండిని ద్రోణాచార్యులువద్ద శిష్యునిగా నప్పగించెను. అని యీరీతిగా నారదుడు భీష్మునితో చెప్పినట్లు భీష్ముడు దుర్యోధనునితో చెప్పి యిట్లనెను.

దుర్యోధనా! అంబవృత్తాంతమునంతయు నారదుడు నాతో చెప్పి వ్యాస నారదలిద్దరును వెళ్ళిరి. శిఖండిజన్మ వృత్తాంతమునంతయు పరంపరగా జనులందరును యెరిగియున్నారు. దుర్యోధనా! యీ ప్రకారముగా కాశీరాజు కూతురగు అంబ సిద్ధస్వరూపియైన శిఖండియై యున్నది. నేనును యుద్ధమందు అంగనాపూర్వులను జంపను. స్త్రీలపేర్లుగలవారిని చంపను. స్త్రీ వేషధారులను చంపను. ఈ ప్రకారముగా నేను వ్రతమును ధరించి యున్నాను. గనుక ఆ శిఖండి అంగనాపూర్వుడని చెప్పబడును. ఆశిఖండి యుద్ధమందు తన ధనుర్విద్యాపాండిత్యమునుజూపి నన్ను చాపుటకును నొప్పించుటకును పూని నామీదకు నచ్చినను నేను ఆశిఖండిమీద బాణమును వేయను. నేనాశిఖండిని యెదిరించి యుద్ధముచేసినయెడల అంతకంటె నాకధికమైన కీర్తి వేరొకటిలేదు. నేను చావునకైనను సమ్మతింతునుగాని భగ్నవ్రతుడనగుటకు సమ్మతింపను. ఇది నాపద్ధతి. అని భీష్ముడు శిఖండి వృత్తాంతము నంతయు దుర్యోధనునితో చెప్పెను. ఆ భీష్ముని గొప్ప వాక్యములను దుర్యోధనుడు విని చాలా చిత్తవ్యాకులతను పొంది కొంచెము [illegible] భీష్ముని [illegible] క్షీవ్రతములు

తగియున్నవని చెప్పెను. పిమ్మట సభయందుండు వారందరును యుద్ధ విషయములైన మాటలను చెప్పుకొనుచుండిరి. ఆ మాటలను కొంత సేపు దుర్యోధనుడు వినుచుండి పిమ్మట భీష్మునితో యిట్లనెను.

మహాత్మా! భీష్మా! పాండవుల పక్షమందుగల సకల బలములను నిశ్శేషముగా చంపుటకు నీకు యెన్ని దినములు పట్టునో చెప్పుము. ద్రోణాచార్యుడును కృపాచార్యుడును అశ్వత్థామయు కర్ణుడును యెంతెంత కాలమునకు పాండవుల సైన్యముల నన్నిటిని నిశ్శేషముగా జంపగలరో చెప్పుము. అని దుర్యోధను డడుగగా భీష్ముడు యిట్లనెను. దుర్యోధనా! మేము పాండవులబలమును చంప నొంపదగిని కాలపరిమాణమును అడిగితివి. నీ మనస్సునందుగల అనుమానము నశించుటకొరకు యిట్లు నీవు అడుగుట మంచిచేయగును. ఆ విషయములను వినుము. పాండవ బలములను చంపుటకు నాశక్తికి తోచిన కాలమును చెప్పెదను వినుము. తక్కినవారు తమ శక్తి కొలది చెప్పగలరు. వారి మాటలనన్నిటిని పిమ్మట నీవు విందువుగాని యిప్పుడు నేను ఒక ప్రతిజ్ఞ యిచ్చెదను వినుము. దుర్యోధనా! ఒక్కదినమునకు మంచిమొనగాండ్రైన రథిక శ్రేష్ఠులను వేయిమందిని యుద్ధమందు నేను చంపెదను. అర్జునుని క్రూరబాణములు నాదేహమందు నాటుకొని నన్ను పడవేయు పర్యంతము పాండవ పక్షమందుండు వీరులనందరిని మృగములను వేటాడినట్లు కొట్టెదను. నేను పదిదినముల పర్యంతము యుద్ధముచేసెదను. యీ పది దినములలోపల పాండవ పక్షమందుగల వీరులలో పదివేలమంది మొనగాండ్రను చంపెదను. నేను యుద్ధముచేయు పర్యంతము నీపదునొకండు అక్షౌహిణుల సైన్యములను మిక్కిలి చాతుర్యముగా నడిపి శత్రువులకు భయము కలిగించెదను. అని యిట్లు భీష్ముడు దుర్యోధనునకు ప్రతిజ్ఞ యిచ్చి మరల యిట్లనెను.

దుర్యోధనా ? నీవు అడిగిన విషయమును చెప్పెదను వినుము. నాకుగల నానావిధ దివ్యాస్త్రభుజాబలమువలన పాండవుల బలముల నన్నిటిని చంపుటకు నాకు ఒక నెలపట్టును. అని యిట్లు భీష్ముడు దుర్యోధనునితో చెప్పెను. అప్పుడు దుర్యోధనుడు ద్రోణ కృపాచార్య అశ్వత్థామ కర్ణులను జూచి మీరు పాండవుల బలములను యెంత కాలమునకు చంపుదురో చెప్పుడని అడిగెను. అప్పుడు ద్రోణాచార్యుడు చిరునవ్వునవ్వుచు దుర్యోధనునితో యిట్లనెను.

దుర్యోధనరాజా ! నేను ముసలివాడను గనుక నేను యెటులైనను కష్టపడి భీష్మునివలె వొక నెల కాలమునకు పాండవ బలములను చంపుటకు శక్తుడను కావచ్చునని తోచుచున్నది. అని యిట్లు ద్రోణాచార్యుడు దుర్యోధనునితో చెప్పగా కృపాచార్యుడు యిట్లనెను. దుర్యోధనరాజా ! నేను రెండుమాసముల కాలమునకు పాండవ బలములనన్నిటిని చంపుటకు సమర్థుడనగుదును. అని కృపాచార్యుడు దుర్యోధనునితో చెప్పగా అశ్వత్థామ యిట్లనెను. దుర్యోధనరాజా ! నేను పదిదినములకు పాండవ బలముల నన్నిటిని చంపగలను. అని అశ్వత్థామ దుర్యోధనునితో చెప్పగా అందరి మాటలను విని కర్ణుడిట్లనెను. దుర్యోధన మహారాజా ! బడబాగ్నివంటి నానావిధ శస్త్రాస్త్రములను ప్రయోగించి అయిదుదినములకే నేను పాండవ సేనయను సముద్రమును నశింప జేయగలను. అని కర్ణుడు దుర్యోధనునితో చెప్పి ప్రతిజ్ఞ చేసెను. ఆకర్ణుని ప్రతిజ్ఞావాక్యములను భీష్ముడు విని కలకలనవ్వి కర్ణునితో యిట్లనెను.

ఓరీ ! కర్ణా ! మన దుర్యోధనరాజు దగ్గర యెన్ని మాటలైనను కొరతలేనట్లు అతనికి తృప్తికలుగునట్లుగా చెప్పవచ్చును. నీ మాటలకు మారుమాటలకు చెప్పువారులేరు. అర్జునుని గాండీవ దీప్తులను నీవు చూచినప్పుడు నీ కన్నులు మిడ్కిగుడ్లు పడియుండును.

ఆ అర్జునుని వింటినారివలన కలిగిన మహాభయంకర ధ్వనిచేత నీ చెవులు పగులును. ఆ సమయమందు నీ మాటలను వినకుండుట కలుగునేగాని అంత పర్యంతము నీ మాటలను నీరందరును వినుచు వూకొట్టుచుందురు. అని భీష్ముడు అందరు వినుచుండగా కర్ణునితో చెప్పెను. అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను.

ధృతరాష్ట్రమహారాజా! యీ ప్రకారము నీ పుత్రుడగు దుర్యోధనుని దగ్గర కలిగిన విశేషములను చారులవలన ధర్మరాజు విని తన తమ్ములగు భీమాదులను నలుగురిని రప్పించి వారితో యిట్లనెను. భీమార్జునాదులారా! కౌరవశిబిరములోనుండి మన చారులు యిప్పు డిక్కడికి వచ్చి నాతో చెప్పిన మాటలను వినుడు. ఆ దుర్బుద్ధియైన దుర్యోధనుడు భీష్మ ద్రోణ కృపాచార్య అశ్వత్థామలను సభయందు చూచి మీరు యెంతెంత కాలములో పాండవ బలముల నన్నిటిని చంపెదరో చెప్పుడని యడిగెను. అప్పు డొక నెలకు పాండవబలములను చంపెదనని భీష్ముడు చెప్పెను. ఒక నెలలో పాండవ బలములను చంపెదనని ద్రోణుడు చెప్పెను. రెండు నెలలలో పాండవ బలములను చంపెదనని కృపాచార్యుడు చెప్పెను. పదిదినములలో పాండవ బలముల నన్నిటిని చంపెదనని అశ్వత్థామ చెప్పెను. కర్ణుడు మహా భుజాబలవంతుడగుటవలన అయిదు దినములలో పాండవ బలముల నన్నిటిని చంపెదనని దుర్యోధనునితో ప్రతిజ్ఞ చేసెను. భీష్మాదులందరును దుర్యోధనునితో చెప్పిరని ధర్మరాజు భీమాదులతో చెప్పి అర్జునుని జూచి యిట్లనెను. తమ్ముడా! అర్జునా! భీష్మాదులు తమశక్తికి తగినట్లు దుర్యోధనునితో చెప్పిరి. నీవు యెంత కాలమునకు కౌరవ బలములను నిశ్శేషముగా చంపగలవో నాకు చెప్పుము. అనియిట్లు ధర్మరాజు అడుగగా అర్జును డిట్లనెను. అన్నా! ధర్మరాజా! ఆ కర్ణాదులు నీ బలములను చంపుటకు సమర్థులగుదు

రని చెప్పిరిగదా! వాని కంత భుజాబల సమర్థత్వములు వున్నవని చెప్పిరేగాని ఆ దుర్యోధనునితో వారు చెప్పిన ప్రతిజ్ఞ తప్పవచ్చునా? అని అర్జునుడు ధర్మరాజుతో చెప్పి నవ్వుచేత వుల్లాస ముఖముగలవాడై మరల యిట్లనియెను.

అన్నా! ధర్మరాజా! నీవు అనుమానింపవద్దు. నా భుజాబలమును చెప్పెదను. సంతోష గర్వచిత్తముచేత వినుము. నేను యీ కృష్ణుని సహాయముగలవాడనై యుద్ధమునకు పూనితినేని ఒక నిమిష కాలములో సమస్తప్రాణికోటితో గూడియున్న యీ మూడు లోకములను నాశనము చేయగలను. ఎట్లనగా చెప్పెదను వినుము. ఎరుకలవేషముచేత వచ్చి నాతో యుద్ధముచేసి సంతోషించి తాను ప్రళయకాలమందు సర్వజగత్తులను లయమొనరించిన పాశుపతాస్త్రమును దివ్యమూర్తియగు రుద్రుడు నాకొసంగెను. ఆ మహాపాశుపత దివ్యాస్త్రము నాదగ్గర యున్నది. గనుక మన మవలీలగా శత్రువులను చంపవచ్చును. ఆ మహాపాశుపత దివ్యాస్త్ర ప్రభావమును భీష్మ ద్రోణ కృపాచార్యాశ్వత్థామ లెరుగరు. కర్ణుడెరుగడని చెప్పవలసిన పనిలేదు. అట్టి మహాపాశుపతాస్త్రముచేత సర్వలోకములను సంహారింపరాదు. మనకున్న ఆయుధములచేత యుద్ధము చేసి శత్రువులను చంపినయెడల మన పౌరుషము ప్రకాశించునని తలచుచున్నప్పటికి తగినట్లు జరుగును. ఆ విషయమందరికిని తెలియును. పాండవ పక్షపువారు కౌరవ పక్షపువారికంటె తక్కువవారు కారు. భీమ నకుల సహదేవ అభిమన్యు ద్రౌపదీపుత్ర సాత్యకి విరాట ద్రుపద దృష్టద్యుమ్న శిఖండి ఉత్తమౌజ యుధామన్యు ఘటోత్కచులు మొదలగు జగజ్జెట్లు నీ పక్షమందున్నారు. అందరిని చెప్పవలసిన పని లేదు. ఏనుగువలెనున్న నీబలమును నీవెరుగవు. నిన్ను దేవతలైనను జయింపజాలరు. మూడులోకములను అయినను నీ వొక్కడవే

జయింపగలవు. నిశ్చయముగా నీకు కోపము గలుగదుగాని నీకు కోపము గలిగినయెడల యెవ్వ రెవ్వ రెట్లు నశించెదరో యిటు జూడుము. నీ సైన్యములను యెవరును గెలువజాలరు. మనకు విజయానందము సులభముగా గలుగును. అని యిట్లు అర్జునుడు ధర్మరాజుతో చెప్పినని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పినట్లు వైశంపాయనుడు జనమేజయ మహారాజుతో చెప్పెను.

ఇది శ్రీ కాశ్యపస గోత్రపవిత్ర మంత్రి వంశ పయః
పారావార పరిపూర్ణ సుధాకర లక్ష్మణామాత్య
పుత్ర లక్ష్మీనారాయణామాత్య ప్రణీతంబైన
తెనుగువచన కావ్యంబగు శ్రీ మహా
భారతమందు ఉద్యోగపర్వము
ముగిసెను.



శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి.